# కృతజ్ఞత

ఆంధ్రప్రదేశ శాసనసభాపతియు, శాస్త్రవిజ్ఞానము, చరిత్ర అకాడెమీ. అధ్యక్షులును అగు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారి ప్రోత్సాహమునలన నే నీ గ్రంథమును రచించితిని. ఈ చరిత్ర రచనలో నాకు తోడ్పడిన గ్రంథములతో చాలా పుస్తకములను వారే శాసనసభా గ్రంథాలయమునుండి యిచ్చిరి. కొన్ని గ్రంథములను క్రొత్త ఢిల్లీలోని ఘనరాజ్య హైకమిషనరు కార్యాలయమువారిచ్చిరి. మరికొన్నిటిని చెన్నపట్టణములోని బ్రిటీషుసమాచారశాఖా కార్యాలయము వారిచ్చిరి. ఇటీవలి చరిత్రాంశములను న్యూస్టేట్సుమన్, హిందూ, మెయిలు మొదలగు పత్రికలలోని వ్యాసములనుండి గ్రహించితిని. నా కీ విధముగా తోడ్పడిన శాసనసభాపతిగారికిని, ఆయా అధికారులకును, గ్రంథకర్తలకును, ప్రచురణకర్తలకును, వ్యాసరచయితలకును, పత్రికాధిపతులకును కృతజ్ఞుడను.

దిగవల్లి వేంకట శివరావు

# ఈ గ్రంథకర్త ఇతర రచనలు

## ముద్రితములు

పోతన వేమనల యుగము (1924)
దక్షిణాఫ్రికా చరిత్ర (1928) (విజ్ఞానచంద్రికాప్రచురణము)
నీలాపనింద (1929)
సత్యాగ్రహచరిత్ర (1930)
అధినివేశ స్వరాజ్యము (1933) విజ్ఞానచంద్రికా ప్రచురణము.
సహకారవస్తునిలయోద్యమము (1933)
వ్యవహారకోశము; శాస్త్రపరిభాష (పారిభాషిక నిఘంటువు 1934)
భారతదేశమున బ్రిటిష్ రాజ్యతంత్రము; బ్రిటిష్ ఇండియా చరిత్ర (1938)
ఫెడరేషన్ నిజస్వరూపము (ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ ప్రచురణ) (1939)
కథలు-గాథలు (నాలుగు భాగములు)
1857 పూర్వరంగములు
సన్యాసుల స్వాతంత్ర్యసమరములు (1763-1775)
ఆదివాసుల యుద్ధములు - (1958) ఇత్యాదులు.

## అముద్రితములు

1757–1857 స్వాతంత్ర్యసమరములు.
ఆంధ్రప్రదేశ చరిత్ర; నిజాం రాజ్యయుగము;
కథలు - గాథలు (5, 6 భాగములు); జీవితగాథలు ;
—ఇత్యాదులు.

# BIBLIOGRAPHY

The Encyclopaedia Britannica.

Races of Africa - C. G. Seligman M.D.F.R.S.

An African Survey - Lord Hailey.

Africa, Africa ! - Derek Kartun. Lawrence & Wishart (1954)

Africa Emergent - W. H. Macmillan.

Defeating Mau Mau - Leaky. L.S.B.

The New Ghana - J. C. Amamoo, Pan Books Ltd. 1958.

The South African way of Life - (Volume prepared under the auspices of International Studies Conference at the request of Unesco) - Edited by G. H. Calpin, William Heinmann. (1953)

Racial Separation in South Africa - Edgar P. Dvorin (University of ChicagoPress)

The Treason Cage - Anthony Sampson, Heinmann (1958)

The Bantu Past and Present - Dr. S. M. Molema.

The Bantu Speaking tribes of South Africa - Schapera.

Bantu Boer and Briton; The making of South African Native

Problem - William Miller.

Introducing Ghana - (Ghana High Commission, New Delhi)

Ghana and India. ,,

Commonwealth Survey 1951 - 1958.

The Commonwealth in Brief – Central Office of Information (London)

Plans for developing Unions - Native Reserves. Weekly News Letter No. 457 (6.9.1948)

## సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 16 | 11 | దహోరు | దహోమే |
| 24 | 10 | ఫ్రెంచి | పెంచి |
| 35 | 21 | heating | beating |
| 40 | 23 | సంపాదించు | పరిపాలించు |
| 101 | 25 | డాన్ క్వాష్ | డాన్ క్వాహ్ |
| 102 | 15 | „ | „ |
| 136 | 10 | మొనొటపా | మొనోమొటపా |
| 215 | 27 | places | Plans |
| 224 | 26-27 | గృహనిర్మాణముల కొరకు మునిసిపాలిటీ | గృహనిర్మాణములకొరకు ఖర్చుపెట్టవలెనను నిబంధనవలన అందుకొరకు మునిసిపాలిటీ |
| 295 | 7 | 18 | 156 |
| 349 | 27 | యూవోతా | యూవోలా |
| 350 | 6 | „ | „ |
| 353 | 15 | జాంజిబారు (ఫ్రెంచి) | జాంజిబారు; పెంబ |
| 354 | 5 | ఫెడర్ (ముఖ్యపటణము) | (ఫెడరల్ ముఖ్యపట్టణము) |

షరా : 313 వ పుటకుముందు 311, 312 పుటల సంఖ్యలు 309-310 అని పొరబాటుగా అచ్చుపడినవి. ఇట్లే 346 పుటనుండి 352 పుటల సంఖ్యలు పొరబాటున 348-354 గా అచ్చుపడినవి.

# విషయసూచిక

## ప్రథమ భాగము


1. పాశ్చాత్యుల దురాక్రమణము
2. పాశ్చాత్య వలసరాజ్యములు 25
3. ఆఫ్రికా దేశీయుల పిల్లలు 37
4. ఆకలిబాధ 44
5. ఆఫ్రికా దేశీయులలో చైతన్యము 51
6. కెన్యా వలసరాజ్యము 58
7. కెన్యా జాతీయోద్యమము 72
8. కెన్యా రాజకీయములు 92
9. స్వతంత్ర ఘనరాజ్యము 96
10. ఘనరాజ్య స్వాతంత్ర్యోద్యమము 107
11. బెల్జియన్ కాంగో 118
12. అఖిలాఫ్రికా దేశీయుల విమోచనోద్యమము 128
13. రొడీశియా న్యాసాలాండ్ ఫెడరేషన్ 134
14. ఫ్రెంచి ఇక్వెటోరియల్ ఆఫ్రికా 152
15. కెమెరూన్సు 158


## ద్వితీయ భాగము


1. దక్షిణాఫ్రికా చరిత్ర సమీక్ష 162
2. బాంటూ జనులు 172

| | | |
|---|---|---|
| 3. | మిశ్రమజాతిరంగుజనము | 183 |
| 4 | వర్ణభేదము | 192 |
| 5. | 'అపార్తీడ్' విధానము | 213 |
| 6. | గాంధిమహాత్ముడు చూపినదారి | 226 |
| 7. | ఆఫ్రికా జాతీయ కాంగ్రెసు | 247 |
| 8. | రాజద్రోహ కేసు | 288 |
| 9. | 'అపార్తీడ్' విధానఫలితములు | 305 |
| 10 | "నల్ల" విశ్వవిద్యాలయములు | 317 |
| 11. | బాంటూ "స్వపరిపాలన" చట్టము | 322 |
| 12. | "తెల్లరిపబ్లికు" | 327 |
| 13. | జులూగాంధి | 332 |
| 14. | పిల్లవాగ్ని | 345 |
| | పరిశిష్టము | 352 |


## చిత్రపటములు


| | | |
|---|---|---|
| 1. | దిగవల్లి వేంకటశివరావు | 2 |
| 2. | ఆఫ్రికాఖండపటము | 9 |
| 3. | క్వామే న్క్రుమా | 129 |
| 4. | జాన్ లుథూలీ | 339 |

# ఆఫ్రికా ఖండము



మధ్యధరా సముద్రము
మురాకో
అల్జీరియా
లిబియా
ఈజిప్టు
కైరో
ఫ్రెంచి పశ్చిమ ఆఫ్రికా
ఫ్రెంచి ఈక్వటోరియల్ ఆఫ్రికా
నైజీరియా
అక్రా
సూడాను
అబిసీనియా
ఉగండా
కెన్యా
అంగోలా
బెల్జియన్ కాంగో
టాంగనీయికా
జాంజిబారు
మడగాస్కర్
నైరుతి ఆఫ్రికా
దక్షిణ రొడీషియా
ఉత్తర రొడీషియా
డర్బన్
కేప్‌టవున్
అట్లాంటిక్ మహాసముద్రము
హిందూ మహాసముద్రము

# ఆఫ్రికా జాతీయోద్యమము

## ప్రథమ భాగము

## మొదటి ప్రకరణము: పాశ్చాత్యుల దురాక్రమణము

### 1. ఆఫ్రికా ఖండము

ఆఫ్రికా భూమండలములోని గొప్పఖండములలో నొకటి. దీని కీశాన్యదిక్కున ఆశియాఖండముతో కలుపు సూయజుభూసంధి లేక సన్నని భూభాగముతప్ప చుట్టును అన్నివైపులను సముద్రమున్నది. పడమర అట్లాంటికుమహాసముద్రము, తూర్పున హిందూమహాసముద్రము నున్నవి. దక్షిణమున ఆఫ్రికాఅగ్రముదగ్గర నీ రెండు సముద్రములును కలియుచున్నవి. ఉత్తరమున మధ్యధరాసముద్రమున్నది. ఈశాన్యభాగమున ఎర్రసముద్రమున్నది.

ఇది ఉత్తరమునుండి దక్షిణమునకు ఐదువేలమైళ్ళు పొడవున్నది. దీనివైశాల్యము రమారమి 11500000 చదరపుమైళ్ళున్నది. దక్షిణాఫ్రికాకు తూర్పున దగ్గరగా మెడగాస్కర్ అను నొక గొప్ప ద్వీపమున్నది. ఈ ఖండముయొక్క సముద్రతీరము ఎట్టి చీలికలునులేక తిన్నగా వ్యాపించియుండుట దీని నైసర్గికస్వరూపములో నొక విశేషలక్షణము.

ఈ దేశములో ఉత్తరభాగమున సహారాయను గొప్పయెడారి వ్యాపించియున్నది. ఇది ఆఫ్రికాలోని మధ్యధరాసముద్రతీరప్రాంతములను తక్కిన ప్రాంతములనుండి వేరుపరచుచున్నది.

ఈ ఖండమునందు విక్టోరియా, ఛాడ్, టంగనీయికా, న్యాసా లేక నయాసా అను గొప్ప సరస్సు లున్నవి. ఇవి చిన్న సముద్రములవలెనే విశాలములై యున్నవి. ఇంకను ఇట్టిసరస్సులు చాలా కలవు. వానిలో ఎడ్వర్డు సరస్సు, ఆల్బర్టుసరస్సు ముఖ్యమైనవి.

ఈదేశములోనినదులలో ముఖ్యమైనది నైలునది, కాంగోనది,నైగరు జంబేజీనదులు.ఇవిగాక ఇంకను పొడుగైననదులు చాలా కలవు. ఎడారిప్రాంతమున తప్ప మిగిలినదేశమును సస్యశ్యామలముగా చేయుచున్న జలాధారములు చాలా ఉన్నవి. ఆఫ్రికాఖండమున మహోన్నతములైన పర్వతములు లేవుగాని. ఎత్తయినపర్వతములు, కనుమలు మనదక్షిణాపథమునందువలెనే యున్నవి. ఉత్తరమున అట్లాసుపర్వతములు,దక్షిణమున పీఠభూములున్నవి. డ్రాకెన్సుబర్గుపర్వతములలో పదివేలఅడుగులఎత్తుగల పర్వతముకూడా ఉన్నది. తూర్పుననున్న ఉత్తుంగశిఖరములు పూర్వము అగ్నిపర్వతశిఖరములే. కిలిమంజరోశిఖరము 20 వేల అడుగుల ఎత్తున్నది.

ఆఫ్రికాదేశములోనిజనులలో అధికసంఖ్యాకులు నీగ్రోజాతి నల్లవారే. ఇదిగాక బాంటూజాతులవారు, అరబ్బిజాతివారు, బర్బరులు, హాటెంటాటులు, బుష్‌మెన్ లేక పొదలవారు మొదలైన ఇతరజాతులవారు నున్నారు.ఈదేశములోని జనుల భాషనుబట్టి శాస్త్రజ్ఞులు వీరిని బాంటూ, సెమెటికు, హెమెటికు, సూడాను తెగలుగా విభజించుచున్నారు.

ఈదేశమునందు పెద్దపులులుతప్ప సింహములు, ఏనుగులు, ఖడ్గమృగములు, ఎలుగులు మొదలైన గొప్ప వనమృగము లున్నవి. మనదేశములోని ఆటవిక మృగజాతులు, సర్పజాతులు, పక్షిజాతులు నున్నవి. ఆఫ్రికాలో ననేకవిధములైన అమూల్యవృక్షజాతులు, ఖనిజములు నున్నవి. అక్కడి గనులలో వజ్రములు, బంగారము, రాగి, అల్యూమినియము,యురేనియము,రాక్షసిబొగ్గు మొదలైన వెలగలఖనిజలోహములు ఇతరద్రవ్యములు దొరుకును. వ్యవసాయోత్పత్తులలో కోకో, నూనెచెట్లు, ఆలివ్‌చెట్లు, కాఫీ. వేరుశనగ మొదలైన వ్యాపారపు దినుసులు, మొక్కజొన్న, గోధుమ మొదలైన ఆహారధాన్యము విరివిగా పండును.

ఆఫ్రికాఖండముయొక్కవిస్తీర్ణమును, జనసంఖ్యనుగూర్చి యునైటెడ్‌నేషన్సువారు 1951 లో ప్రకటించిన డెమోగ్రాఫిక్ యియర్‌బుక్కు అనబడు వార్షికప్రచురణమునం దిట్లు వివరింపబడినవి. ఆఫ్రికాఖండవిస్తీర్ణము 30140,000 చదరపు కిలోమీటరులు. (ఇంగ్లీషుగ్రంథకర్తలు 11462000 చ॥ మైళ్ళనిరి.) దీనిజనసంఖ్య 198000000; ఇందులో ఆఫ్రికా

లోని వలసరాజ్యములేర్పరచుకొనిన అల్పసంఖ్యాకులగు పాశ్చాత్యజాతులవారు కూడా చేరియున్నారు.

ఆఫ్రికాలో 1850లో పదికోట్లుగానుండినజనసంఖ్య 1950 లో 19 కోట్ల 90 లక్షలకు పెరిగినదని యునైటెడ్‌నేషన్సువారి జనాభాబులెటిన్‌లో వ్రాయబడినది. పూర్వము మొదటిప్రపంచయుద్ధానంతరము స్థాపింపబడిన "లీగ్ ఆఫ్ నేషన్సు"లేక నానారాజ్యసమితివారు 1927లో తయారుచేసిన లెక్కలప్రకారము ఆఫ్రికాజనసంఖ్య 145000000 ఉండెను.

## 2. ఆఫ్రికా దేశీయుల పూర్వనాగరకత

పాశ్చాత్యులు ఆఫ్రికాఖండమును కనుగొని, అక్కడ వలస నెలకొను నాటికి అందలిజనులు నల్లనివారైనను వారు అడవిమనుష్యులుగాని, కేవలము అనాగరికులుగాని కారు. బ్రిటిష్‌సామ్రాజ్యముయొక్క సంగ్రహచరిత్రను రచించిన విలియం హెచ్. వుడ్‌వర్డ్‌గారు, ఆఫ్రికాదేశములోని నీగ్రోజాతి వారి దుఃస్థితికి ప్రత్యక్షకారణము ఐరోపాజాతులవారు వారిని పట్టుకొని బానిసలుగా విక్రయించుట ప్రారంభించుటయేయని వ్రాసినారు. ఈదేశమున క్రీస్తుశకము పదునొకండవశతాబ్దమునుండి వర్ధిల్లుచుండిన నాగరకతలను పదునారు పదునేడవశతాబ్దములలో పాశ్చాత్యులు నాశనముచేసిరి.

ఆఫ్రికాదేశపు అనాగరకపు అడవిమనుష్యులకు తెల్లవారు నాగరకత నేర్పిరని పాశ్చాత్యజాతులవారు చేయు ప్రచారము కేవలము అసత్యమైనది. "సివిలైజేషన్ ఆఫ్రికెనెయ్"అను గ్రంథమునందు ప్రొబెనియస్‌గా రిట్లు వ్రాసిరి. "మధ్యయుగములనాటి పాశ్చాత్యవర్తకులు, ఆఫ్రికాలోని గినియా అఖాతములోనికి పోయినప్పుడా తీరప్రదేశమున రెండుప్రక్కలను నీడ కొఱకు నాటబడినచెట్లవరుసలమధ్య చాలామైళ్ళపొడవుగల విశాలమైన రాజబాట యుండుట, చాల్లాశ్రద్ధతో నా దేశీయులు దానిని మంచిస్థితిలో నుంచుటయు చూచి ఆశ్చర్యపడిరి.... అక్కడ కన్నులపండువు కలిగించు పొలములుకనబడినవి....ఆ దేశమునందలిజనులు కండ్లుచెదురునట్టి ముదురు రంగులుగల దుస్తులను ధరించియుండిరి. ఆ దుస్తులు వారునేసిన వస్త్రములతో తయారుచేయబడినవే. పట్టుబట్టలు, మొఖమలువస్త్రములు ధరించిన

జనులు క్రిక్కిరిసియుండిరి. క్రమపరిపాలనముగల గొప్పరాజ్యములు, బల వంతులైన రాజులు ధనవంతములైనపరిశ్రమలు, ప్రజలఎముకలకు కూడ అంటియున్న నాగరకతయు అక్కడ కనబడినవి.

సూడానుకుపడమర తొమ్మిదవశతాబ్దమునుండి పదమూడవశతాబ్దము వఱకును చాలా గొప్పదైన 'ఘన' రాజ్యము వర్ధిల్లి విరివియగు భారీవ్యాపారముచేయుచు లలితకళలకు,శిల్పమునకు సంబంధించిన అపూర్వవస్తువులను తయారుచేయుచు, గొప్పసైన్యముతోను, మంచి కేంద్రపరిపాలనముతోను ప్రఖ్యాతిచెందెను. మధ్యధరాసముద్రప్రాంతమునుండి వెళ్ళిచూచిన వర్తకులు అక్కడివిభవమును చూచి ఆశ్చర్యపడిరి. అక్కడ మలి, సొంఘరాజ్యములు కూడా ఐశ్వర్యముతోతులతూగుచు మంచి నాగరకతకలిగియుండెను."

లియో ఆఫ్రికేనస్ అనునతడు క్రీ.శ. 1513లో పశ్చిమఆఫ్రికాలో నీగ్రోజాతివారివి పదునైదురాజ్యములను చూచినాడు.అక్కడ వర్తకము, లలితకళలు అభివృద్ధిచెందియుండెను. క్రీస్తుకుపూర్వము కొన్నివేలయేండ్ల క్రిందట ప్రసిద్ధిచెందిన ఈజిప్టుదేశపు ప్రాచీననాగరకతకు చెందిన సంస్కృతి సంప్రదాయములయొక్కచిహ్నములు తూర్పుననున్న ఎతియోపియా (నేటి అబిసీనియా) దేశములో కనబడినవి.

"ఇంగ్లాండుదేశములో పనికిమాలినమనుష్యులను వలసరాజ్యముల కంపిరి. కేసులులేనిబారిష్టరులు, దివాలాతీసినవర్తకులు, వ్యభిచారము వలన త్రాగుడువలన పతితులైనదరిద్రులు ప్రతివృత్తిలోనుగల దుర్మార్గులును వలసరాజ్యములందలి వివిధప్రాంతములందు ప్రవేశించిరి.పందొమ్మిదవశతాబ్దారంభమునకూడా ఇట్లే జరిగెను. తరువాత వలసరాజ్యములందు గనులు బయల్పడి పారిశ్రామికవిప్లవము కలిగినపిమ్మటనే పాశ్చాత్యదేశములలో తెలివితేటలు,శక్తిసామర్థ్యముగలవారును పెద్దమనుష్యులును మంచియుద్యోగులును బయలుదేరివెళ్ళిరి" అని సర్ జి.కారన్‌వాల్ లూయిస్‌గారు 18॰7లో వ్రాసిరి.

## 3. బానిసల వ్యాపారము

ఇప్పటికి కొన్నిశతాబ్దములక్రిందట ఐరోపాదేశములవారు ఆఫ్రికా దేశీయులనుపట్టుకొని బానిసలుగాఅమ్మి. విశేషలాభములనార్జించువ్యాపారము నా రంభించిరి. క్రీ. శ. 1442 నుండి పోర్చుగీసుజాతివా రీ వ్యాపారము

చేయుచు అమితలాభము నార్జించిరి. పదునారవశతాబ్ది మధ్యలో నింగ్లీషు ప్రముఖుడైన సర్ జాన్ హాకిన్సుగారు ఆఫ్రికాలోని గినీతీరమున 400 మంది ఆఫ్రికాదేశీయులను పట్టుకొని, అమెరికాఖండముదగ్గరనున్న "పశ్చిమ ఇండీసు" దీవులకు తీసికొనిపోయి, అక్కడ వారిని తల 1కి 25 నవరసుల చొప్పున విక్రయించెను. అప్పటినుండి బ్రిటిషు, పోర్చుగీసు, డచ్చి, ఫ్రెంచి, అరబ్బి, స్పెయినుదేశీయులు ఈ వ్యాపారమును విరివిగాచేసి లాభముపొంద సాగిరి,

1680 నాటికి ఇంగ్లాండుదేశములో బ్రిస్టలు, లివర్‌పూల్, లండన్ నగరములలోని ధనవంతులగువర్తకులు సాలుకు 15000 మంది ఆఫ్రికాదేశీయులను బానిసలుగా చేయుచు విక్రయింపసాగిరి. తరువాత నీ సంఖ్య యింకను పెరిగినది. బ్రిటీషువారొక్కరే 1680 సంవత్సరమునుండి 1786వ సంవత్సరమువఱకు పదిలక్షలమంది ఆఫ్రికాబానిసలను అమ్మినారన్నచో తక్కిన పాశ్చాత్యదేశములవారందరు కలిసి ఎంతమంది నిట్లు బానిసలుగా అమ్మిరో ఊహింపవచ్చును. ఈ వ్యాపారము ముమ్మరముగా సాగుచున్నతరుణమున 192 ఇంగ్లీషుఓడలు సబురుఒకటింటికి 47,000 మందిబానిసలను తీసికొనిపోవుచుండెను. 1791లో ఆఫ్రికా పడమటితీరముననే బానిసలనుపట్టుకొని ఎగుమతిచేయు వర్తకస్థానములు నలుబది యుండెను.వీనిని 'ప్యాక్టరీ'లనిరి। ఈ దుర్మార్గవ్యాపారమును అరికట్టవలెనని ధర్మాత్ములుచేసిన ప్రయత్నములు విఫలములయ్యెను.

ఇంగ్లాండుదేశమున 1770లో వలసరాజ్యముల కార్యదర్శిగా నుండిన లార్డు డార్టుమౌత్‌గారు మాట్లాడుచు "మనజాతి కత్యంతలాభకరముగానున్న ఈ వ్యాపారమును మానవలసినదని మన వలసరాజ్యములవారిని కోరజాలము" అనెను. ఈ వ్యాపారమునుచేయుటలోని అన్యాయము నటులుండనిచ్చి, ఈ వ్యాపారముజరుపుటలోనిపద్ధతులను పరికించిచూచినను కూడా అది చాలా ఘోరముగా కనబడుచుండెను. అమెరికాదగ్గరనున్న 'పశ్చిమఇండీసు' దీవులలో జెమెయికాకు బ్రిటిషువారు బానిసలను ఎగుమతి చేయుటలో నౌకాశ్రయముదగ్గరనే నూటికి $12\frac{1}{2}$ వంతులమంది చనిపోవుచుండిరి. వారిని విక్రయించులోపల నూటికి $4\frac{1}{2}$ వంతులమంది చనిపోవుచుండిరి. వీరిని

బాధించి బానిసలుగా వంచుటలో (Seasoning) నూటికి 33 మంది చచ్చి పోవుచుండిరి. ఇట్లు నూటికేబదిమంది చనిపోగా మిగిలినవారు మానవ మాత్రులుభరించలేని కాయకష్టమునుచేయు బానిసచాకిరి . చేయుచుందురు. తరువాత కొంతకాలమునకు బ్రిటిషువారు బానిసత్వమును రద్దుచేయవలసి వచ్చెను. అప్పుడు వారు ఆఫ్రికాదేశములో ఇతరవిధముగా అన్యాయము చేసి లాభములార్జించుట ప్రారంభించిరి. తక్కిన పాశ్చాత్యజాతులవారినికూడా అట్లుచేయుడని ప్రోత్సహించిరికాని, వారు వెంటనే అట్లుచేయక బానిసవ్యాపారమునే సాగించుచుండిరి. బానిసత్వము రద్దుచేసినట్లు ప్రకటించినను, అన్ని ఐరోపాదేశములలోను దళారీలు బయలుదేరి దొంగవ్యాపారమును సాగించుచుండిరి. ఎగుమతివిధానములు మరింత అధ్వాన్నస్థితిలోనికి దిగినవి. బానిసలను తీసికొనిపోవుఓడలను తనిఖీచేసి పట్టుకొందురనుభయముతో నౌకా గర్భములందు పంజరములను నిర్మించి, పురుషులను, స్త్రీలను, పిల్లలను కోళ్ళగంపలందు కోళ్ళను క్రుక్కినట్లు క్రుక్కి తీసికొనిపోవుచుండిరి. ఆ యోదలు తుపానుతాకిడికి గాలిపటములవలె కొట్టుకొనుచుండగా డెక్కునకును డెక్కునకునుమధ్య పదునెనిమిదిఅంగుళములస్థలములో నిర్బంధింపబడిన ఈ దురదృష్టవంతులు దుర్భరమైనబాధ లనుభవించుచుండిరి. ఆ బల్ల కూర్పుల పైన అందఱును ఒత్తిగిలినగాని, ఒక్కడు ఒత్తిగిలుటకు వీలులేకుండ గొలుసులతో కట్టివేయుచుండిరి. వీరి అల్పాచమాన అధికాచమానములతో నా యోదలు దుర్గంధభూయిష్టములై క్రుళ్ళిపోయి, సబురు పూర్తికాగానే ఆ యోడలబల్లకూర్పులను శుద్ధిచేయుట కెవ్వరు నంగీకరింపనందున, ఆ యోడలను తగులబెట్టవలసివచ్చుచుండెను! అమెరికాచేరిన బానిసల కెన్నోరెట్లమంది దారిలో మరణించుచుండిరి. ఇట్లు 20వ శతాబ్దప్రారంభమువఱకును జరుగుచుండెను.

## 4. పాశ్చాత్యుల దురాక్రమణ

ఆఫ్రికాలో బ్రిటీషువారిస్వాధీనమునందు పదునాలుగురాజ్యములున్నవి. వీనివిస్తీర్ణము 40 లక్షలచదరపుమైళ్ళు. ఇందలి జనసంఖ్య 5 కోట్ల 60 లక్షలు. ఈ రాజ్యములు వివిధ ప్రతిపత్తులుకలట్టివిగా నున్నవి. ఇందు

వలసరాజ్యములు (Colonies), సురక్షితరాజ్యములు (Protectorates) ధర్మకర్తృత్వరాజ్యములు మొదలైనవి కలవు.

ఈ వలసరాజ్యముల ప్రాముఖ్యమును గమనించి, బ్రిటిషుప్రభుత్వము వారు వలసరాజ్యములకార్యదర్శిశాఖ నొకదానిని 1854లో స్థాపించిరి. అంతకుపూర్వ మీ రాజ్యవ్యవహారముల నింగ్లండుప్రభుత్వములోని ఇతరశాఖల మంత్రులు చూచుచుండిరి. ఆఫ్రికా దేశభాగముల నాక్రమించి, వానిని కట్టుదిట్ట పరచుకార్యము పందొమ్మిదవశతాబ్దిలో చివర ఇరువదియైదుసంవత్సరములలో జరిగినది. తూర్పునుండియు, పడమరనుండియు, దక్షిణదిక్కునుండియు ఇంగ్లీషు వా రా దేశము నాక్రమింపసాగిరి. ఆఫ్రికా యొక్క ఉష్ణమండలములోని భాగములు చాలా విలువకలవని ఇతరపాశ్చాత్యదేశీయులుకూడా గ్రహించి, దాని నాక్రమించుటకు పరుగులిడసాగిరి. 1874లో జనరల్ వూల్సీ ఆరవ అషాంటి యుద్ధముచేసి "కుమాసిని" కొల్లగొని, అషాంటిజాతి ఆఫ్రికావారివలన దండనక్రింద కొంతసొమ్మును వసూలుచేసెను. దిగువ, దక్షిణమున 1877లో బ్రిటీషువారు ట్రాన్సువాలుదేశమును తమరాజ్యమున గలుపుకొనిరి. 1879 నాటికి జూలూజాతివారిని రెచ్చగొట్టి వారితో యుద్ధమునారంభించిరి. 1880 నుండి కొన్నిసంవత్సరములు బ్రిటీషు, ఫ్రెంచి, జర్మను, పోర్చుగీసువారందరు నొకేప్రదేశములపైన కన్నువేసి, ఆక్రమించుటకై పెనగులాడసాగిరి. 1884లో జర్మనీవారు నైఋతి (South west) ఆఫ్రికా తమదని ప్రకటించిరి. అంతలో ఆ సంవత్సరాంతమున బెర్లినునగరమున జరిగిన ఒక సంధిసమావేశములో నేదోవిధముగా పంపిణీచేసికొనిరి. ఆకాలమున నిర్ణయించుకొనబడిన సరిహద్దులు రాజకీయనాయకులు కేవలము సౌకర్యముకొఱకు దేశపటములో గీచికొనినగీతలేగాని, ప్రజలలోగల జాతివిభేదములనుగాని, నైసర్గికపరిస్థితులనుగాని గమనించి చేసికొనినవికావు. కొన్ని సరిహద్దు లొకేఆఫ్రికాజాతిని, ఒకేగ్రామమును తుదకు ఒకేపొలమును రెండుగా చీల్చునట్టివిగా నుండెను. ఇట్లు పడమర పదిలక్షలజనసంఖ్యగల ఇవ్ (Ewe) జాతిప్రజలు మొదట బ్రిటీషు బంగారుకోస్తా(Gold Coast)కును, జర్మను టోగోలాండునకును పంచిపెట్టిరి. జర్మనీరాజ్యమునకును ఇతర పాశ్చాత్యరాజ్యములకును కలిగిన ఐరోపాసంగ్రామమునందు జర్మనీరాజ్య మోడిపోవగా, 1918లో నీ దురదృష్ట

వంతులైన 'ఇవ్'జాతివారిని ఇంగ్లీషువారును, ఫ్రెంచివారును కలిసి మటల కోడిపిల్లలనుపంచుకొనినట్లుగా పంచుకొనిరి. చరిత్రను, భాషను, సంప్రదాయములను, మానవత్వమునుకూడా ఆలోచింపక చేసికొనిన ఇటువంటి పంపిణీలెన్నో ఇంకను గలవు. 1884-85 సంవత్సరములలో జరిగిన బెర్లినుసంధి ఆఫ్రికాదేశముయొక్క పంపిణీలో కొంత స్థిరపరిస్థితి నేర్పరచెను గాని, బ్రిటీషువారికిని ఫ్రెంచివారికినిమధ్యగల స్పర్థమాత్రము ఎప్పటివలెనే సాగుచుండెను. ఆఫ్రికాలోనిపడమరనున్న గినీ (Guinea )తీరమున నీ రెండుజాతులవారికిని రెండు చిన్నపీలికలవంటి రాజ్యభాగము లుండెను. ఫ్రెంచివారు తమరాజ్యభాగములను క్షేత్రములను కలిపి ఏకముచేసికొనవలెనని బ్రిటీషువారినిచుట్టి ముందుకుపోయిరి. త్వరలోనే వారికి అల్జీరియా, సెనిగల్, ఐవరీకోస్టు, డహోము, ఫ్రెంచికాంగోదేశభాగము, పడమటిసూడానుదేశముతో కలిసి గొప్ప ఫ్రెంచిసామ్రాజ్యమయ్యెను. తరువాత వారు ఆఫ్రికాఖండముమధ్య స్త్రీ తన నడుమునకుపెట్టుకొను యొడ్డాణమువలె వెడల్పుగల రాజ్యమునొకదానిని ఆక్రమించుటకు ప్రయత్నించిరి. అయితే, ఫషోడాదగ్గర ఇంగ్లీషుసేనలు వారిని ప్రతిఘటించుటవలన వారు మనస్సునుమార్చుకొనిరి.

మటబెల్ జాతివారిరాజ్యభాగములను సిసిల్‌రోడ్సు అను ఇంగ్లీషువాడు కేవలము మోసముచేసి యాక్రమించగా, అతని నా దుర్మార్గపునేరమునకై శిక్షించుటకుబదులుగా నారాజ్యమున కతనిపేరుపెట్టి గౌరవించిరి. దీనినిగూర్చి పోర్చుగీసువారితోవచ్చిన తగవు నింగ్లీషువారు రాజీగా పరిష్కరించుకొనిరి.

ప్రస్తుతము బెల్జియన్‌కాంగో అని పిలువబడురాజ్యము 1884లో బెర్లిను సంధిసమావేశమునందు అంతర్జాతీయప్రదేశముగా నిర్ణయింపబడి, బెల్జియంరాజైన లియోపాల్డుగారిఅధికారముక్రింద నుంచబడెను. 1890నాటికి బెల్జియమువా రా ప్రదేశమునెల్ల తమరాజ్యములో కలుపుకొని, అక్కడ మానవచరిత్రలో కనివినియెరుగని ఘోరకృత్యములను గావింపసాగిరి.

అడవులలోని రబ్బరుచెట్లనుండి మానవమాత్రులు తీయవీలులేనంత పరిమాణముగల రబ్బరును తెచ్చి వప్పగించవలసినదని బెల్జియమువా రా పరిసరగ్రామములందలి ఆఫ్రికాదేశీయులను నిర్బంధించి, అట్లు తెచ్చియివ్వని

గ్రామవాసులను వర్ణనాతీతములైన క్రూరశిక్షలకు లోనుచేయుచుండిరి. స్త్రీలను పురుషులను, పిల్లలను వధించి, తమదండయాత్రలు జయప్రదముగా జరిగినందులకు నిదర్శనముగా వారిచేతులను ఖండించితెచ్చి, బెల్జియమురాజ్యప్రతినిధికి వప్పగించుట సర్వసామాన్యకృత్యముగ నుండెను. కాంగోలో నుద్యోగిగానుండిన అమెరికాదేశపు బాప్టిస్టుమిషనరీ జోసెఫ్ క్లార్కుగారు 1895 జూన్ 5వ తేదీన నిట్లు నివేదించెను. "న్కాకేశావలివారినిగూర్చి నేను మీకొకసంగతిని నివేదింపదలచినాను. కొలదికాలముక్రిందట వారు పదునొకండు చిన్నదోనెలను తీసికొని ఐకోకోజాతివారిని కొందఱిని తుపాకులతో కాల్చినసంగతి మీకు జ్ఞాపకమున్నదని తలచెదను. దానికినిదర్శనముగా వారు ఖండించితెచ్చిన చేతులను తీసికొని మాదగ్గరకు వచ్చియుండిరి. అందులో మూడు చిన్నపిల్లలచేతులు. ఒక చిన్నపిల్ల చేతిని ఖండించునప్పటికా పిల్ల ఇంకను జీవముతోనేయుండెనని ఆ దోనెకుతెడ్లువేసినవారు చెప్పిరి. గాని మేము నమ్మలేదు. మూడుదినములతరువాత ఆ చిన్నపిల్ల ఇంకను ఒక పొదలో కొనయూపిరితోనున్నదని తెలిసి, నేను, నా మనుష్యులనునలుగురిని పంపి, ఆ చిన్నబాలికను తెప్పించితిని. దానికుడిచేతిని ఖండించి చావుమని వారు పారవేసినట్లు కనబడినది."

రెండుదినములతరువాత రబ్బరునిమిత్తము ఇక్లెందరిప్రాణములను దీసిరో చెప్పమని క్లార్కుగారు అడుగగా ఆ సంగతి చెప్పజాలననియు, చాలామందినిమాత్ర మట్లు చంపిరనియు చెప్పిరి. ఇట్లు జిల్లాలకుజిల్లాలనే జనవిహీనములుగచేసిరి. వందలకొలది గ్రామములను నేలమట్టముచేసిరి. అక్కడికుటుంబములను ముందుగా చిత్రహింసలుపెట్టి వధించిరి. మగవారి వృషణములను చిదుకగొట్టి వారిమగతనమునుహరించుటయు, వారిరహస్యావయవములను గ్రామములఆవరణదడిపైన ప్రదర్శించుటయు ఆనాటి బెల్జియమువారికి చాలా ప్రీతికరమైనక్రీడగా నుండెను.

1894లో ఈ. జే. గ్లేవ్ (Glave)అను నొక ఇంగ్లీషు ప్రయాణికుడు ఇట్లుచెప్పెను. "ఇరువదియొక్కశిరములను స్టాన్లీజలపాతముదగ్గరకు తెచ్చి, కెప్టెన్ రోమ్ (Rom) అనునతడు తనఇంటిముందు పూలచెట్ల మడులచుట్టును అలంకారముగా పేర్పించినాడు. 1898లో అన్వెర్‌సోయిస్

ట్రస్టుయొక్క ఏజెంటుఅయిన లెక్రోయిక్స్ (Lacroix) 160 మంది స్త్రీ పురుషులను, పిల్లలను చంపినట్లును, పురుషులఅంగములను ఛేదించినట్లును, స్త్రీలను, పిల్లలను కొరతవేసినట్లును, అరువదిచేతులను ఖండించినట్లును అంగీకరించినాడు. కొన్నిమారులు సరిగా తయారుచేయని రబ్బరును తెచ్చిన ఆఫ్రికాదేశీయులనోటిలో నా రబ్బరునుక్రుక్కి. వారు దానిని మ్రింగునట్లు నిర్బంధించిరి. ఒకమారు బెల్జియమువారి న్యాయస్థానమునెదుట నిట్టికేసు వచ్చినప్పుడు, అట్లు బలవంతముగా రబ్బరునుతినిన ఆఫ్రికాదేశీయులు కొందఱు తరువాత జబ్బుపడి చనిపోయిరని రుజువైనను, అది యే వ్యాధి వలననో సంభవించియుండునుగాని, రబ్బరుతినినందువలన కాదనియు, రబ్బరునుతినుటవలన మనుష్యులకు వ్యాధిరాదనియు ఆ న్యాయస్థానమువారు తీర్మానించిరి.

బెల్జియంకాంగోరాజ్యములోని ఘోరములు చాలాకాల మట్లు జరుగు చుండగా ఇంగ్లాండులోని ప్రజలుకొందఱు ఆందోళనముచేసిరి. అంతట నది యంతమొందెను.అయితే,బెల్జియందేశీయులను సమర్థించినవారు దేశాంతరము లందు లేకపోలేదు. రాక్‌ఫెల్లరు, మోర్గన్ మొదలైన అమెరికాదేశపుకోటీశ్వరులు, బెల్జియంకాంగోలో చాలా పెద్దమొత్తములు పెట్టుబడిపెట్టియున్నందున, లియోపాల్డురాజును సమర్థించిరి. తరువాత చాలాసంవత్సరములకు జర్మనీ చక్రవర్తియైన కెయిజరును, ఆయనప్రతినిధులను టంగనీయికాలో 1,20,000 మంది స్త్రీపురుషులను, పిల్లలను వధించినప్పుడును, 1948లో దక్షిణాఫ్రికా దగ్గరనున్న మెడగాస్కర్ ద్వీపములో వేలకొలది ఆఫ్రికాదేశీయులను ఫ్రెంచి వారు చంపినప్పుడును, కెన్యాలో బ్రిటీషుపోలీసువారును పైనికదళములును ఘోరకృత్యములుచేసినట్లు రుజువైనప్పుడును ఈ యన్యాయములను సమర్థించినవారును లేకపోలేదు. తూర్పుఆఫ్రికాలోని పాశ్చాత్యవలసరాజ్యములవా రవలంబించినపద్ధతులు పడమటితీరమున జరిగినవిధానములకు నకలుగనే యుండెను. 1880 వ సంవత్సరమునుండి జర్మనీవారిప్రతినిధి కార్ల్ పీటర్సు ఈ ప్రాంతములందు పర్యటనముచేయుచు దేశీయులనుమోసగించియు, వారికి లంచములిచ్చియు, భయపెట్టియు,తాను వ్రాయించిన రకరకములసంధిపత్రము లను తనజేబులలోపెట్టుకొని తిరుగుచుండెను. ఇంగ్లీషువారు నిట్లే మోసపు

సంధిపత్రములను మొంబాసానుండి విక్టోరియాసరస్సువఱకునుగల ఆఫ్రికా జాతులవారిచే వ్రాయించుకొనిరి. జర్మనీవారును బ్రిటీషువారును తమమధ్య సరిహద్దులను 1890లో స్థిరపరచుకొనిరి. ఉగండాదేశములో ఫ్రెంచివారికిని బ్రిటీషువారికినిమధ్యగల పోటీలు పీటర్సు తెచ్చిన సంధిపత్రములవలన మఱింత చిక్కులలోనికిదిగెను. తుదకు ఫ్రెంచివారిని జర్మనీవారినికూడా బ్రిటీషువారు తలదన్నగలిగిరి. న్యాసాలాండులోనికి బ్రిటీషువారు చొచ్చుకొనిపోవుట 1860నుండి ప్రారంభమై, పోర్చుగీసువారితో 1891లో జరిగినసంధివలన ముగిసెను.

1895నుండి ఆఫ్రికాలోని వివిధభాగములందు పరిస్థితులు కొంతవఱకు స్థిరరూపముదాల్చెను. అయితే, బ్రిటీషువా రప్పటి కింకను అషాంటీజాతితో యుద్ధముచేయుచునేయుండిరి. దక్షిణాఫ్రికాలోనియుద్ధము తరువాత కొలది కాలములోనే జరుగనై యుండెను. నిజమునకు ఆఫ్రికాఖండములోని చాలా భాగముల నీ యైరోపాజాతులవారు దొంగతనముగనే సంపాదించిరి. ఈ దొంగలు తమలోతా మా దేశములను పంచుకొనిరి. రైళ్ళునిర్మింపబడుటతో దేశమును ఆర్థికముగా స్వప్రయోజనముకొఱకు వినియోగించుటకు వీలుకలిగెను. ప్రేమతత్వమును సర్వమతసామరస్యమును బోధించు పాశ్చాత్యజాతులవా రుత్తరమునుండివచ్చి ఆఫ్రికాదేశములోని వివిధజాతులవారిని మోసగించియు, తుపాకులతోకాల్చియు, దేశాక్రమణముచేసి ఈ జాతులపురుషులను, వీరిస్త్రీలను పిల్ల లను తిండిలేక మాడ్చిచంపు ఘోరమైనవిధానమును ప్రారంభించిరి.

1898 జూన్ 14వ తేదీన ఆఫ్రికాఖండవిభజనమువిషయమై పాశ్చాత్యరాజ్యములవారు చేసికొనిన సంధిపత్రముపైన ఇంగ్లీషు ఫ్రెంచిప్రతినిధులు సంతకముచేయుటవలన నా దేశ మీ క్రిందివిధముగా విభజింపబడెను.

| | | |
|---|---|---|
| బ్రిటిష్ ఆఫ్రికా · | 201411 | చదరపుమైళ్ళు |
| ఈజిప్టురాజ్యభాగము | 1600000 | „ |
| ఫ్రెంచిఆఫ్రికా | 3866950 | „ |
| జర్మనీఆఫ్రికా | 910150 | „ |

| | | |
|---|---|---|
| ఇటలీవారిఆఫ్రికా | 200000 | చ. మె. |
| పోర్చుగీసువారిభాగము | 787500 | |
| స్పెయినువారిది | 79800 | |
| బెల్జియమువారిది | 900000 | |
| టర్కీవారిది | 400000 | |
| స్వతంత్రభాగము | 613000 | |
| | 11458811 | |

ప్రపంచములోని రాజకీయపరిస్థితులలో కలిగిన మార్పులఫలితముగా 1910-1925 సంవత్సరములమధ్యకాలమున ఆఫ్రికా దేశపటము మారిపోయి నది. 1910లో దక్షిణాఫ్రికాసమితిరాజ్యము స్థాపింపబడినది. 1911లో ఫ్రెంచివారును జర్మనీవారును తమ రాజ్యభాగములను మార్పుచేసికొనిరి. 1912లో ఫ్రెంచివారికిని తురుష్కసుల్తానుకును సంధిజరిగినది. స్పెయినువారితోను రాజీ జరిగినది. 1914లో ఈజిప్టు ఇంగ్లీషువారిసంరక్షితరాజ్యముగా ప్రకటింపబడెను. ఇంతలో ఐరోపామహాసంగ్రామము వచ్చినది. 1919లో జరిగిన సంధివలన ఆఫ్రికాలోని జర్మనువారిరాజ్యము వివిధ పాశ్చాత్యజాతుల వారివశమొనర్పబడినది. తరువాత నింకను కొన్నిమార్పులు జరిగినవి. 1925 నాటికి ఆఫ్రికాఖండ మీ క్రిందిరాజ్యములక్రింద నుండెను.

| | | |
|---|---|---|
| ఫ్రాన్సు | 4200000 | చ. మైళ్ళు |
| ఇంగ్లాండు | 3984000 | ఇందులో ఆంగ్లోఈజిప్టు సూడాను రాజ్యములు కలిసినవి |
| బెల్జియము | 9౦0000 | |
| పోర్చుగల్లు | 788000 | |
| ఇటలీ | 680000 | |
| ఈజిప్టు | 350000 | |
| అబిసీనియా | 350000 | |
| స్పెయిను | 140000 | మొరాకోలో స్పెయినువారిరాజ్య భాగముసహా |
| లెబేరియా | 40000 | |

# ౫. ఆ ఫ్రి కా ఖం డ సం ప ద

ఆఫ్రికాఖండమునం దిప్పు డొక గొప్పపోరాటము సాగుచున్నది. అందులో రెండుపక్షములవారు మాత్రమే గాక మూడవపక్షవారొకరు వచ్చి చేరిరి. ఒకవంక కొన్నికోట్లమంది ఆఫ్రికా దేశవాసులైన నల్లజాతులవారు తమస్వాతంత్ర్యముకొరకు పెనగులాడుచున్నారు. ఇంకొకవంక ఆఫ్రికాఖండమును పంచుకొని, వలసరాజ్యముస్థాపించిన ఐరోపాజాతులవారు తమఅధికారమును నిలువబెట్టుకొనుటకు పెనగులాడుచున్నారు. మఱియొకవంక ఆఫ్రికా వలనవచ్చులాభమును తామే కబళింపవలెనని కాచికొనియున్న అమెరికా దేశపు ధనవంతులైనతెల్లవారు పెనగులాడుచున్నారు.

ఈ పెనగులాటయంతయు దేనికొఱకు? ఆఫ్రికాఖండమునందుగల లెక్కగట్టుటకువీలులేనంత సంపదకొఱకే.

గత అరువదేండ్లలోనే అంటిమనీ, అజ్‌బెస్టాస్, రాక్షసిబొగ్గు,కోబాల్టు, రాగి, క్రోము, వజ్రములు, బంగారము, ఇనుము, సీసము, మాంగనీసు, ప్లాటినము, తగరము, యురేనియము, వనాడియమ్, తుత్తునాగము 4300,000000 నవరసులవిలువగలట్టివి ఆఫ్రికాదేశపుగనులనుండి త్రవ్వియెత్తబడినవి.

లండన్, ప్యారిస్, బ్రుసెల్సు, న్యూయార్కునగరములందలి దనికులు కొంద ఱింకను దనికులగుటకై ఆఫ్రికాదేశీయులగు నల్లకూలీలకు దినమునకు మనుష్యునికొకనికి కొన్నిపెన్నీలకూలి నిచ్చి, ఈ సంపదను గనులనుండిత్రవ్వించి బయటకుతీయించిరి. దీనికితోడు కాఫీ, సిసల్ (Sisal) ఆఫ్రికాతైలవృక్షములనూనె, కోకో, పొగాకు....ఇంక ననేకవిధములైన పంటదినుసులును పండించిరి.

యావత్తుప్రపంచములో నుత్పత్తియగు రాగిలోను, తగరములోను అయిదవవంతు ఆఫ్రికాలోనే యుత్పత్తియగుచున్నది. ప్రపంచములోని యావత్తుమాంగనీసులో నాలుగవవంతు ఆఫ్రికాలోనిదే.బంగారములో సగమువంతు. కోబాల్టులో నూటికి 80 వంతులు, పారిశ్రామికవజ్రములలో నూటికి 98 వంతులు ఆఫ్రికాలోనివే. ఆఫ్రికాప్రజల నణచియుంచి లాభమునుపొందుచున్న పాశ్చాత్యులకు అటంబాంబులయుత్పత్తికొఱకు కావలసిన "యురే

వియం"అను మూలధాతుపదార్థము ఆఫ్రికాలో ననేకప్రదేశములందు కను గొనుటతో వారికాంక్ష మఱింత హెచ్చినది. ఈసమయముననే ఆఫ్రికాదేశీయులును మేల్కొని స్వాతంత్ర్యముకొఱకై పెనగులాడుట ప్రారంభించిరి. అంతట అమెరికావారుకూడ ఆఫ్రికాయొక్కసంపదపైన కన్నువేసి, దాని కొఱకు మాయోపాయములనుపన్నిరి.

ఆఫ్రికాఖండమునగలసంపద అపారమైనది. అందు వివిధములైన ఖనిజములు చెప్పలేనంతపరిమాణముగలట్టివి కలవు. కేవలము రెండు ఉదాహరణములుమాత్రముగైకొని చూచినచో అది ఎంత విలువగలసంపద యైనది తెలియగలదు. ఆఫ్రికాలోని ముడియినుము భూమండలములోని ఇతరఖండములన్నిటికన్నను హెచ్చుగా నున్నది. దక్షిణరొడీషియాలోని వాంకీ (Wankie) బొగ్గుగనినొక్కదానిని పరిశీలించినచో నది ప్రపంచములోని అన్నిపెద్దగనులకన్నను గొప్పదని తెలియును.

ఆఫ్రికాఖండమునందు విస్తారమైన జలశక్తికూడా ఉన్నది. అది ఐరోపాఖండములోనిదానికన్న మూడురెట్లు అధికముగా నున్నది. అయితే ఆ శక్తిలో నూటికి ౦౮ వంతులు అనగా మూడువందలవభాగముమాత్రమే ఇంతవరకు నుపయోగింపబడుచున్నది. ఆఫ్రికాలోని దేశీయులు పూర్వకాలపుపద్ధతులతోనే వ్యవసాయముచేయుదురు, అయినను ప్రపంచములో ఒక సాలున యుత్పత్తియగు వ్యవసాయపుఫలితమువిలువతో పోల్చిచూచినచో నిక్కడియుత్పత్తి దానికిసమానమైనదని తెలియగలదు. అందువలన ఆఫ్రికావారుత్పత్తిచేసి ఎగుమతిచేయు వ్యవసాయపుపంటలకు సరియైన ధరవచ్చినచో, అట్లు లభించినసొమ్మంతయు ఆఫ్రికాదేశీయులక్రింద వినియోగింపబడినచో ప్రస్తుతపు ప్రపంచధరలనుబట్టి దేశములోనినల్లవారందరును సుఖజీవనముచేయుటకవసరమగు అన్నివస్తువులును, పదార్థములును కొనగలుగుదురు. అయితే ఆ ఫలితము వారికి దక్కుటలేదు.

ఆఫ్రికాఖండములో సాగుచేయతగినభూమియంతయు సాగుచేయబడుటలేదు. అందుకొఱకు వలసిన ప్రయత్నమైనను జరుగుటలేదు. అక్కడ కొన్నిభాగములలో పశువులకును మానవులకును ప్రాణాపాయముకలిగించు

చున్న ట్సెట్సీ (Tsetse) ఈగను నిర్మూలనముచేయుటకు తగినప్రయత్న మైన చేసినచో, అమెరికాసంయుక్తరాష్ట్రములలో సాగులాయఖభూమికి రెట్టింపుభూమి ఆఫ్రికాలో అదనముగా లభింపగలదు. అప్పుడు ఆర్జెంటినా దేశములోనున్న పశుసంపదకు సమానమైనపశువులసంఖ్యను ఆఫ్రికాదేశము భరింపవీలుకలుగును.

యునైటెడ్ నేషన్సు ఉత్తరఅట్లాంటికు కవున్సిలువారు, ఆర్థికముగా వెనుకబడినదేశములయభివృద్ధికొఱకేదో సహాయముచేయుటకని యు. ఎన్. ఫుడ్ అండ్ అగ్రికల్చరల్ ఆర్గనైజేషన్‌నిమిత్తము నిర్ణయించిన బడ్జెటు అంచనా 50 లక్షల డాలర్లు మాత్రమే. ఇది పాశ్చాత్యులుతయారుచేయు మారణాస్త్రములలో నొక్క 'ఆటంబాంబరు' ఖరీదుకన్నకూడా చాలా తక్కువ మొత్తముగా నున్నది.

ఆఫ్రికాఖండమునకు విదేశీయులపెట్టుబడి అవసరమే. ఆఫ్రికాలో విదేశీయులుకొందరు పెట్టుబడినిపెట్టుచునేయున్నారు. అందులో అమెరికా వారిపెట్టుబడిమొత్తము రెండువేలలక్షల నవరసులై యున్నది. ఇది అక్కడ ప్రయివేటువ్యక్తులగు తెల్లవారియొక్కపెట్టుబడులతో సమానమైనదిగా నున్నది. ఇప్పుడు చాలా వలసరాజ్యములలో కొన్నిప్రాజెక్టులు ప్రారంభింప బడినవి. ముఖ్యముగా అల్యూమినియముకరిగించుపని, రాగిగనులపని, మాంగనీసు, ముడియినుము త్రవ్వకము, జలప్రవాహములఉపయోగము మొదలైన కార్యములు కొన్ని జరుగుచున్నవి. అయితే, ఈ ప్రణాళికలన్నియు ఆఫ్రికా దేశీయులగు నల్లవారిలాభముకొరకుగాని, అభివృద్ధికొరకుగాని జరుగుటలేదు. బ్రిటను, ఫ్రాన్సు, బెల్జియము, అమెరికాసంయుక్తరాష్ట్రములరాజ్యములవారి లాభముకొరకే జరుగుచున్నవి.

ఇప్పుడు అధోగతిలోనున్న ఆఫ్రికావారి జీవనసౌఖ్యప్రమాణమును సంవత్సరమునకు నూటికి రెండువంతులచొప్పున హెచ్చుచేయదలచినను, చాలా తక్కువగా అంచనావేసిననుకూడా ప్రతిసాలున వేయిలక్షలనవరసులు విదేశీయులపెట్టుబడిసొమ్ము కావలసియుండును. అయితే ఇప్పుడు సాలుకు 160 లక్షల నవరసులుమాత్రమే బ్రిటీషువారు పెట్టుబడిక్రింద వినియోగించు

చున్నారు. దీనికి ప్రతిఫలముగా వందలకొలదిలక్షల నవరసులు ప్రతియేటను బ్రిటిషువారికి లాభముగా తిరిగి చేరుచున్నది. ఇందులోనుండి ఆఫ్రికావారియభివృద్ధికొఱకు కావలసినపెట్టుబడిని వినియోగింపనచ్చునుగాని వా రట్లు చేయరు.

ఆఫ్రికావలనవచ్చులాభములను స్థిరముగా పొందుటకు అవలంబింపబడువిధానములవిషయమున ఇంగ్లాండులోని రాజకీయపక్షములవారిలో నెట్టియభిప్రాయభేదమును లేదు. వారందఱును ఆఫ్రికావారిని స్వప్రయోజనముకొఱ కుపయోగించుకొనజూతురు. ఆఫ్రికావారిక్షేమలాభములకొఱ కావంతయైన ప్రయత్నింపరు. "స్టర్లింగుబ్యాలెన్సు" లనుపేరుతో బలవంతపు ఋణములను పెంచి బ్రిటిషుసామ్రాజ్యమువారిలాభములకొఱకు ఆఫ్రికావారిని దరిద్రులుగాచేయుచున్నారు.

నిజమునకు ఆఫ్రికాదేశీయులకు స్వేచ్ఛ, స్వాతంత్ర్యముల నొసగినచో బ్రిటిషుకార్మికులకు ఎట్టినష్టమును కలుగదుసరికదా, వారికి లాభమే కలుగును. ఆఫ్రికాలో నవీన పారిశ్రామికవిధానములను ప్రవేశపెట్టినచో ఆఫ్రికాదేశ మభివృద్ధిచెందిః ఇంగ్లీషువారియొక్క యాంత్రికపరిశ్రమలందు తయారగుసరుకులను ఎగుమతిచేయవచ్చును. ఇంకను ఇతరవిధములైన వ్యాపారము అభివృద్ధిచెందును. దానివలన ఇంగ్లాండుదేశములోని కార్మికులకు లాభముకలుగును. ఇంగ్లాండులోని పారిశ్రామికులచేత కాయకష్టముచేయించి అమితలాభముపొందు ధనికవర్గమువారే ఆఫ్రికాలోని నల్లవారిని అణచియుంచి, వారినిపీడించి అమితలాభమును పొందుచున్నారు. అందువలననే వారు అక్కడిజనసామాన్యమును, పారిశ్రామికులను పైకిరానివ్వరు. పూర్వకాలపు బ్రిటిషులేబరుపక్షమువారినాయకులు ప్రారంభములో స్థాపింపదలచిన సామ్యవాదసోషలిజంపద్ధతియే అమలుజరిగినచో ఆఫ్రికాలో స్వాతంత్ర్యముకొఱకు పెనగులాడు పారిశ్రామికులకు ఆంగ్లేయులు పరమమిత్రులుగనే యుండగలరని సామ్యవాదులనుచున్నారు.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## రెండవప్రకరణము

### పాశ్చాత్యవలసరాజ్యములు.

క్రీ.శ.16వ శతాబ్దిమధ్యమున నింగ్లీషుప్రముఖుడగు సర్ జాన్ హాకిన్సు 400 మంది ఆఫ్రికా దేశీయులనుపట్టుకొని తల 18 25 నవరసులచొప్పున బానిసలుగా అమ్మినకాలమునుండి పరిస్థితులు మారిపోయెను. అటుతరువాత గడచిన నాలుగుశతాబ్దములలో ఆఫ్రికాఖండమునుండి ఎంతలాభమును ఇంగ్లీషువారు తీసిరో ఎవ్వరును చెప్పజాలరు. అయితే ఆఫ్రికానుండి లాభముతీయువిధానమును చూచినచోమాత్రము కొన్నిసంగతులు తెలియ గలవు. ప్రతిసంవత్సరము గొప్ప గాలివానలతో దుఃస్థితిననుభవించు నైజీ రియాదేశమును మొదటియుదాహరణముగా తీసికొనవచ్చును. నైజీరియా ఇంగ్లాండు, స్కాట్లాండు, వేల్సుదేశములుకలిసిన గ్రేటుబ్రిటనురాజ్యమునకు మూడురెట్లు వైశాల్యముకల దేశము. దానిజనసంఖ్య మూడుకోట్లు. ఆ దేశ ములో మంచి ఖనిజసంపదయు, వ్యవసాయసంపదయు నున్నవి. అవి అనేక రకములైనవి. అందులో ముడిఇనుము, తగరము, బంగారము, లిగ్నైటు, టంగ్స్టన్ అను మూలధాతువునొసగు ఖనిజరజము, రాక్షసిబొగ్గు, తుత్త నాగము, ప్రత్తి, కోకో, రొట్టెలనుచేయుపిండినిచ్చు "కస్సావా"(Cassava) దుంపలు, కాఫీ, వేరుశనగ, కొబ్బెరచెట్లవంటి తైలవృక్షములు(Oilpalm), కలప మొదలైన యుత్పత్తులున్నవి.

నైజీరియాతగరముసంగతి చూతము; 1914 నుండి 1939 వరకు 26 సంవత్సరములలో ఆ దేశపు తగరపుగనులనుండి 370 లక్షలనవరసుల లాభము వచ్చినది. అందులో ప్రతిపెన్నీయును దేశాంతరములకు తరలింప

బడినది. ఒక్క 1937వ సంవత్సరములోనే బ్రిటీషువారికంపెనీలు 1249000 నవరసులు లాభము సంపాదించినవి.

ఆ గనులలోపనిచేయు తెల్లవారికి జీతములక్రింద 1700000 నవరసులు ఖర్చుపెట్టిరి. ఇందులోసగము నైజీరియాదేశపుసరిహద్దువెలుపలనే ఖర్చుచేయబడెను. ఆ కంపెనీలు నైజీరియారాజ్యప్రభుత్వమువారికి రాయల్టీలక్రింద 200000 నవరసులు చెల్లించిరి. అందులోసగముసొమ్ము నా ప్రభుత్వమువారు యునైటెడ్ఆఫ్రికాకంపెనీవారికి చెల్లించిరి. సాక్షాత్తుగా గనులను త్రవ్వి తగరము నెగుమతిచేసిన 36000 మంది ఆఫ్రికాదేశీయులైన నల్లవారికి కూలిక్రింద 329000 నవరసులు మాత్రము ఖర్చుపెట్టిరి. అనగా ఆఫ్రికాదేశీయుడైననల్లవాడు ఆ సాలున తల 1కి 69 నవరసుల విలువగల తగరమును త్రవ్వియెత్తుగా, వానికష్టమునకు ప్రతిఫలముగా తొమ్మిదినవరసుల 2షిల్లింగులుమాత్రము కూలిగా నిచ్చిరన్నమాట. ఇది వారమునకు మూడు షిల్లింగుల ఆరుపెన్నీలకూలి యగును. ఇదియే ఆఫ్రికాలోని వలసరాజ్యముల లాభసంపాదనవిధానము. ఈ కథ యింతటితో పూర్తికాలేదు. నైజీరియాప్రభుత్వమువారు యునైటెడ్ఆఫ్రికాకంపెనీవారికి 100000 నవరసులు చెల్లించిరి కదా; ఆ కంపెనీవా రేదైన సేవచేసినందులకా సొమ్ము నిచ్చిరా? లేదు. పూర్వము పందొమ్మిదవశతాబ్దమున బ్రిటీషువారికి లాభమునార్జించుటకై నైజరుమండలమున వారికి ప్రవేశముకలిగించిన రాయల్ నైజర్కంపెనీవారికి ఈ యునైటెడ్ ఆఫ్రికాకంపెనీవారు అనంతరప్రతినిధులు (Sucesessors) ఆ లాభసంపాదనము అభివృద్ధిగాంచగా ఆ కంపెనీవారు పొందిన ప్రత్యేకహక్కుల ఇజారాపట్టాను 1899 లో వారు ప్రభుత్వమునకు వదలివేసిరిగాని, ఆర్థికలాభముపొందు హక్కులను మాత్రము తమ క్రింద నుంచుకొనిరట. అందులకుప్రతిఫలముగా ప్రభుత్వమువా రా కంపెనీకి 865000 నవరసులు రొక్కముగానిచ్చుటయేగాక, ప్రతిసాలునను వలసరాజ్యములోని గనులవలనవచ్చు ఆదాయములో సగమువంతు 99 సంవత్సరములవఱకు ఆ కంపెనీకి చెల్లించుటకు అంగీకరించిరి. ఆ కంపెనీలోనివాటాదారులందరును తెల్లవారేగనుక ఆలాభము మొత్తముమీద తెల్లవారికే పూర్తిగా చెందుచున్నది. నైజీరియాలోనే ఆలాభమును వినియోగించినచో నది దేశాభి

వృద్ధికరములైనపనుల క్రింద వినియోగపడి, నల్లవారికి లాభముకలిగియుండును. అట్లుగాక పెట్టుబడిధనమునెల్ల వేలకొలదిమైళ్ళదూరమునగల ఇంగ్లాండుకు గొనిపోయి, అక్కడ ఖర్చుపెట్టుచున్నందువలన నా దేశము బాగుపడుచుండెను. దానిఫలితముగ నక్కడ గొప్పసౌధములు, ఎస్టేటులు, ఫ్యాక్టరీలు, స్మృతిచిహ్నములు, చిత్రవస్తుప్రదర్శనశాలలు నిర్మింపబడినవి, ఆసొమ్ము నైజీరియాలోనే వినియోగింపబడినచో లాగోస్, బెనిన్, కానోలు పట్టణములు ప్రజలకు కావలసినసౌకర్యములు లేక అనారోగ్యకరములైన గ్రామములవంటి చిన్నచిన్నపట్టణములుగ నుండక, మహానగరములైయుండును. ఇట్టి వలసరాజ్యలాభవిధానమువలన ఆఫ్రికాదేశీయులఆర్థికస్థితి క్షీణించి, వారు దుఃస్థితిలోనుండుట తటస్థించినది.

నైజీరియారాజ్యమునందేగాక ఇతరవలసరాజ్యములందుకూడా ఇట్లే జరుగుచున్నది. పరిస్థితులు నిట్లేయున్నవి. ఒక్కొకప్రాంతమునుండి ఒక్కొకముడిపదార్థము ఎగుమతియగును. దానిఫలిత మొకేవిధముగ నుండును. ఉత్తరరొడీశియానుండి రాగి, కెన్యానుండి కాఫీ, గోల్డుకోస్టు లేక బంగారుకోస్తా (నేటిఘనరాజ్యము)నుండి కోకో, ఇట్లే తరలింపబడుచున్నవి. ఈ చిత్రము నింకకొంచెము స్ఫుటీకరించి చూడవచ్చును. 1951 లో బ్రిటీషు వారు తమవలసరాజ్యభాగములనుండి దామాషాగా ప్రతినెలలోను 460 లక్షల నవరసులవిలువగలసరకులను తమదేశములోనికి దిగుమతిచేసికొనిరి. అయితే, ఇంగ్లాండునుండి ఈ వలసదేశములకు 280 లక్షల నవరసులవిలువ గల సరకులుమాత్రమే ఎగుమతిచేసిరి. అనగా బ్రిటీషుసామ్రాజ్యమువారు సంవత్సరములతరబడిని వలసరాజ్యములలోని ముడిపదార్థములను పీల్చివైచుచు, ఆ దేశములోనిప్రజలు తమక్రింద వినియోగించు కొన్ని ముఖ్యమైన సరకులను, తాము లాభముసంపాదించుటకవసరములగు కొలదిపాటి యంత్ర సామగ్రిని, పరికరములను మాత్ర మా దేశములకు పంపుచున్నారన్నమాట.

ఈ దిగుమతి ఎగుమతి విలువలకుగలతేడా క్రింద బ్రిటీషువారీ వలసరాజ్యభాగముల కేమైన సొమ్ముచెల్లించిరా? ఎన్నడును చెల్లింపలేదు. ఆబాపతు క్రింద చెల్లించవలసినసొమ్ము బాకీలను చెల్లించుటకు ఇంగ్లీషుప్రభుత్వము వారు ఏరాజకీయపక్షమునకుచెందినవారైనను, అభ్యంతరములు చెప్పుచు

కాలహరణముచేయుచువచ్చిరి. దీనిని తాము చెల్లించవలసినబాకీయని చెప్పక, దీనికి "స్టర్లింగు బ్యాలెన్సు"లని నామకరణముచేసిరి. అనగా వలసరాజ్యములకాతాక్రింద ఇంగ్లాండులోనున్న నవరసులనిలువలని దీనిఅర్థము. ఆ సొమ్ముక్రింద వలసరాజ్యములు ఇంగ్లాండుకుచెల్లించవలసినబాపతు సొమ్మేదైన ఉన్నచో జమాఖర్చుచేయుదురట. భారతదేశమువిషయములోకూడా వారీ పద్ధతితోనే వ్యవహరించియుండిరని చదువరులకు జ్ఞాపకముండవచ్చును. దీనిఫలితముగా క్రమక్రమముగా దరిద్రులగుచున్న ఆఫ్రికాదేశపురైతులును వారికుటుంబములవారును ఆ దేశమునేలు తెల్లవారిప్రభుత్వములు లండననగరమునందు జరుపువ్యవహారములకు పెట్టుబడిక్రింద తమసొమ్మును శాశ్వతముగా వినియోగింపవలసినవారైరి.

ఇంకొకవింత యేమనగా, ఈ ఆఫ్రికాదేశప్రజలు తమను అణచియుంచి పీడించుచు పైనచెప్పిన అన్యాయపు ఆర్థికపరిస్థితులకు కారణభూతమైన ప్రభుత్వయంత్రమును నడపుటకైన వ్యయమంతయు తామే భరింపవలసినవారైరి. ఈ వలసరాజ్యప్రభుత్వవిధానము క్రమక్రమముగా అభివృద్ధిచెంది ఆఫ్రికావారి జవసత్వములను హరింపసాగెను. 1948లో బ్రిటీషువలసరాజ్యముల స్టర్లింగుబ్యాలెన్సులు 6700 లక్షల నవరసులుగనుండెను. అనగా బ్రిటీషువారు వలసరాజ్యములలోని దేశీయులకు అంతసొమ్ము నిజముగా బాకీయుండిరి. ఈ సొమ్ము ఆఫ్రికాఖండములోను,మలయాద్వీపకల్పములోను, పశ్చిమఇండీసుదీవులలోను జీవించు దేశీయులకందరికిని సంబంధించినదైయున్నది. ఆఫ్రికాకుచెందవలసిన మొత్తమును వారు విడదీసి చూపించలేదు. ఇట్లే 1952 లో నీ స్టర్లింగుబ్యాలెన్సు మొత్తము 12220 లక్షల నవరసులయ్యెను. ఇది క్రమక్రమముగా నిట్లుపెరుగుచు ఇంగ్లాండువారికి లాభకరమైయీ వలసరాజ్యప్రజలకు నష్టకరమైయుండెను. దీనినిగూర్చి బ్రిటీషురాజ్యనీతిజ్ఞు లెట్టిజవాబును చెప్పరైరి.

ఈ వలసరాజ్యములం దింగ్లీషువా రెన్నో పాఠశాలలు, ఆసుపత్రులు రోడ్లు, రైళ్ళు నిర్మించినారనియు, ఆ దేశముల ఆర్థికాభివృద్ధికి తోడ్పడు ప్రాజెక్టులు మెల్లమెల్లగా సాగుచున్నవనియు, ఆఫ్రికాదేశములోనినల్లజాతులవా రొండొరులతో పోరాడుకొనకుండ శాంతిభద్రతలను కాపాడి, వారికి

క్రైస్తవమతమును, నాగరకతను నేర్పిరని, వారిజీవనసౌఖ్యప్రమాణముల నభివృద్ధిచేసిరని, ఈ వలసరాజ్యపరిపాలనావిధానమును సమర్థించువారు చెప్పుచుందురు.

వలసరాజ్యముల యభివృద్ధియని చెప్పబడుకృషినిగూర్చి పరిశీలించినచో దీని యథార్థము కొంత తెలియగలదు. ఇంగ్లాండులో ఉదారభావములు కలవారని అనుకొనబడు లేబరుపక్షమువారు ప్రభుత్వమువహించియున్న ఐదుసంవత్సరములలో 1945 లో ప్రారంభింపబడిన అభివృద్ధికార్యక్రమము లను చూతము: ఆ యైదుసంవత్సరములలో 8 కోట్ల 10 లక్షల నల్లప్రజలున్న నలుబదియారు బ్రిటీష్ వలసరాజ్యములందును కలిపి నాలుగుకోట్ల 15 లక్షల నవరసులు ఖర్చుపెట్టిరి. అనగా సాలుకు మనిషి1కి రెండుషిల్లింగుల అరపెన్నీ చొప్పున నీ యభివృద్ధికార్యక్రమమునకు ఖర్చుపెట్టిరన్నమాట. ఈ యైదుసంవత్సరములలోనే వలసరాజ్యములనుండి వచ్చిన సరుకులవిలువ బాపతు స్టర్లింగుబ్యాలెన్సులు ఈ నాలుగుకోట్ల 15 లక్షల పౌనులకు పంద్రెండురెట్లు అభివృద్ధిచెందియుండెను. అందువలన నీ యభివృద్ధికార్యక్రమ ప్రణాళిక ఎంత హాస్యాస్పదమైనదో తెలియగలదు. వలసరాజ్యములలోని దేశీయులక్షేమలాభములకు వలసిన వ్యయముచేయకపోవుట అటులుండగా, ఆ రాజ్యమువలన వచ్చినసొమ్మునైనను వారి కివ్వరైరి: వలసరాజ్యాభివృద్ధి సంఘము (Colonial Development Corporation) సభ్యుడగు ఆర్థర్ లూయిస్‌గారు 1952 జనవరిలో మాట్లాడుచు, "బ్రిటీషువారు వలసరాజ్యాభివృద్ధినిగూర్చి చెప్పుచుందురుగాని, నిజమునకు ఆఫ్రికా, మలయా రాజ్యముల వ్యవసాయకులే ఇంగ్లాండుకు పెట్టుబడిపెట్టి, అభివృద్ధిగావించుచున్నారు. అట్లుచేయుటకుగాను వారు వారమునకు కొన్నిషిల్లింగులతో జీవనము గడుపుకొనవలసినవారగుచున్నారు. వారిపిల్లలకు కడుపునిండ తిండియైనలేదు" అనిరి.

దక్షిణాఫ్రికా రాండ్ అనగా నదికిరుప్రక్కలనుండు పీఠభూమిలోని బంగారుగనులవలన చాలాసంవత్సరములనుండి లక్షలకొలదినవరసుల లాభమువచ్చుచున్నదని అందఱు నెరుగుదురు. ఆ గనులలోపనిచేయువారిలో అధికసంఖ్యాకులు ఆఫ్రికాదేశీయులైన నల్లవారే. ఈ గనులవలన ఆఫ్రికావా

రిదివరకటికన్న హెచ్చు సుఖజీవనప్రమాణమును కలిగియున్నారని కొందఱు చెప్పుచుందురు. 300000మంది ఆఫ్రికాదేశీయు లా గనులలోపల కష్టపడి పనిచేయుచుందురు అందులో చాలామంది తూర్పుఆఫ్రికా, బసూటోల్యాండు, అంగోలా మొదలగు బ్రిటీషువలసరాజ్యములనుండి అక్కడికిపోయి, కూలిపనిచేయు నల్లవారు. వారు తమకుటుంబమునువదలి, అక్కడకుపోయి ఒకసంవత్సరముపాటు కూలిపనిచేసి తిరిగిపోవుచుందురు. ఈ వలస కూలి విధానములో నవలంబింపబడిన అన్యాయపుపద్ధతులనుగూర్చి అక్కడి దుర్భర పరిస్థితులనుగూర్చి విని, దీనినిగూర్చి విచారించుటకై బ్రిటీషుధర్మకర్తృత్వ ట్రస్టురాజ్యమగు న్యాసాల్యాండుయొక్క గవర్నరుగా రొక ప్రత్యేక విచారణ సంఘమును 1936 లో నియమించిరి. ఆ సంఘమువారి ప్రథమనివేదికలో నిట్లు వ్రాయబడియున్నది.

"నాగరకప్రపంచపరిస్థితుల నెదుర్కొనుటకు అసమర్థులుగానున్న ఆఫ్రికాదేశపు నల్లజాతులవారిక్షేమమునకు ధర్మకర్తలుగానుండు ఉన్నతా శయములకు భంగకరములైన అన్యాయపుపరిస్థితులను తొలగించుటకు తక్షణమే ఏదోఒకచర్య జరుపవలెను. ఈ ప్రాంతములనుండి కూలిచేయు టకుపోవు యువకులప్రవాహమును అరికట్టనిచో, .... దేశీయజాతులనైతిక, సాంఘికజీవితమునకును ఆరోగ్యమునకును భంగముకలుగును.

"మిషనరీలుగాని ప్రభుత్వముగాని ఇతరసంస్థలుగాని ఈదేశీయుల జీవనసౌఖ్యమునుఆరోగ్యమును అభివృద్ధిచేయదలచినఉద్దేశము నిష్ప్రయోజన మగును. కుటుంబసంసారపద్ధతి నాశనమగును. వివాహసంస్కారము యొక్క పవిత్రత యడుగంటును. వ్యభిచారము వృద్ధియగును. జనసంఖ్యలో నూటికి నూరుమందికి సుఖరోగములు సంక్రమించును. జననములసంఖ్య క్షీణించును. దేశములోని చాలాప్రాంతములు నివసించుట కనుపయోగము లగును. న్యాసాలాండులో జన్మించిన దేశీయజాతులవా రిట్లు జీవనముకొఱకు అన్యదేశములోనుండి అక్కడితెల్లవారు అవలంబించిన అన్యాయవిధానము లను చూచి అసహ్యించుకొని, తెల్లవారిని నమ్మరాదనుభావము కలిగియుం దురు."

ఈ సంఘమువా రీవిషయమై ఏదో కొంత సంస్కరణముగావింప

వలెనని 1936లో చెప్పియున్నను. ఇంతవఱ కేమియు జరుగలేదు. పరిస్థితు లప్పటికి నిప్పటికి నొకేతీరున నున్నవి.

వివిధప్రాంతములనున్న దేశీయులు దక్షిణాఫ్రికాలోని గనులకు పోవలెనను శాసననిర్బంధము లేకున్నను, ఆర్థికముగా వా రట్లు పోయి జీవింపవలసిన నిర్బంధావశ్యకత కలిగియున్నారు.

వారికి తామునివసించుప్రాంతమునందు కడుపునింధ తినుటకు ఆహారము లభింపదు. వారిపైన అనేకవిధములైనపన్నులు విధింపబడుచుండును. వానినిచెల్లించుట కేదో కాయకష్టమునుచేసికొని సొమ్ము ఆర్జించితీరవలెను. నిర్బంధసేవ లేదనుపేరేకాని, ఇంతకన్న నిర్బంధసేవ బానిసత్వము ఏది యుండును ?

తెల్లవా రీ గనులను, ఫ్యాక్టరీలను నడుపనిచో నీ నల్లవా రీమాత్రపు కూలిడబ్బులనైన ఎట్లార్జింతురు? అని కొంద ఱనుచుందురు. ఇది సరియైన వాదముకాదు. ఈగనులలో 1890 నాటికి ఆఫ్రికా దేశీయులగునల్లవారికి నెలకు 63 షిల్లింగులకూలి యిచ్చుచుండిరి. 1943 లో నీ గనులందు భూగర్భమున పనిచేయువారికి దామాషాగా నెలకు 68 షిల్లింగు లిచ్చుచుండిరి. ఆ కూలి వారిలో మూడవవంతుమందికి 61 షిల్లింగులు నంతకన్న తక్కువకూలిని యిచ్చుచుండిరి. ఇతరవిధములైన సంపాదనములో నెల 1కి 30 షిల్లింగులు కూలి వచ్చుచుండెను. మొత్తము నూరుషిల్లింగులు సంపాదించువానికికూడా ఈ యేబదేండ్లలో సరుకులధరలు విపరీతముగా హెచ్చుచుండగా ద్రవ్యము విలువ తగ్గిపోవుచుండగా 1890 నాటి కూలికన్న 1943 నాటికూలి తక్కువ గిట్టుబాటు అగుచున్నదని వేరుగా చెప్పవలెనా ? ఈ యేబదిమూడుసంవత్సరములలో గనులనునడుపుటకు కంపెనీవారుచేయువ్యయములు తగ్గినవి. దీనికి కారణము వారు ఆధునికపరికరములను, విధానములను అవలంబించుట, రవాణా సుకరమగుట. పూర్వము గనినుండి ఒక టన్ను బంగారముతీయుటకు 20 షిల్లింగుల 6పెన్నీలు ఖర్చుఅగుచుండగా, ఇప్పుడు 18 షిల్లింగులు మాత్రమే ఖర్చుఅగుచున్నది. ఇట్లు గనులకంపెనీవారికి నానాటికి అధికలాభములువచ్చి తెల్లవాటాదారులు ధనవంతులగుచుండగా కాయకష్టముచేయు నల్లపనివారు నానాటికి దరిద్రులై బాధపడుచున్నారు. న్యాసాలాండు విచారణ

సంఘమువారి నివేదికలోచెప్పిన దుఃస్థితి క్రమక్రమముగా పెరిగి దేశమంత టను వ్యాపించుచున్నది.

ఆఫ్రికాదేశీయులస్థితిలో నీషణ్మాత్ర మేదైన అభివృద్ధిజరిగినచో నది మహాసముద్రమున కాకిరెట్టవంటిది. ఎక్కడనైనను ఆరోగ్య శౌచవిధు లలో కొంత అభివృద్ధి కనబడినచో నది యా పరిశ్రమల యావశ్యకతను బట్టియు, తెల్లవారి వ్యవసాయకృషిక్షేత్రముల కవసరమగుటనుబట్టియు చేయ బడినదేగాని, నల్లవారి లాభముకొరకుగాని వారిఅవసరములనాలోచించిగాని చేయబడినదికాదు. ఒకటిరెండు విశ్వవిద్యాలయములు, కొన్నిపాఠశాలలును స్థాపింపబడినవన్నచో నవి సామ్రాజ్యనీతిజ్ఞుల అవసరమునుబట్టి వానికికావ లసిన ప్రవీణపారిశ్రామికులను (Skilled labour) తయారుచేయుటకై స్థాపింపబడినవేగాని, విజ్ఞానాభివృద్ధిచేసి నల్లవారినుద్ధరించుటకు స్థాపింపబడ లేదు. ఎక్కడనైనను నల్లజాతివారు కొంత విద్యాభివృద్ధినిపొందినారన్నచో అది వారిస్వయంకృషివల్లనేగాని, తెల్లవారిసహాయమువలన కాదు. నల్లవారి అభివృద్ధికి తెల్లవా రాటంకముకలిగించుచుండగా, వారిప్రతిఘటనమును విగ్రహించి యీ నల్లవారు కష్టపడి స్వశక్తివలన నభివృద్ధిచెందిరనుసంగతి స్పష్టముగా తెలియగలదు.

వలసరాజ్యవిధానము కేవలము వలసవచ్చినతెల్లవారికే అమిత లాభ కరముగా నున్నది. వారికే ధనము చేకూర్చినది. వారికే సౌఖ్యములు కలిగించి నది. తెల్లవారనుభవింపగా మిగిలిన ఉచ్ఛిష్టమునే నల్లవా రనుభవింపవలెను.

ఆఫ్రికాలోని పరిశ్రమలవలన వచ్చినలాభమును నిజముగా ఆఫ్రికా లోనే వినియోగించినచో నీ దేశీయులజీవితమునందు మంచి మార్పు కలిగి యుండును. ఇందుకువిరుద్ధముగా నా ధనమెల్ల దేశాంతరములకు తరలింప బడినది. ఇంతకన్న ఘోరమైనసంగతి యేమనగా, ఆఫ్రికాదేశీయుల పూర్వ నాగరికతను సంప్రదాయములను ఈ క్రొత్తవిధానము నాశనముచేసినది. దానిస్థానమున ప్రజలక్షేమలాభములకు తోడ్పడు క్రొత్త నాగరికతనుగాని, మంచి సంప్రదాయములనుగాని తెల్లవారు స్థాపింపలేదు. తెల్లవారి కా యాలో చనయే లేదు. అధినవ పారిశ్రామిక ఆర్థికవ్యవస్థకన్న పురాతన ఆఫ్రికా గ్రామజీవనవిధానమే శ్రేష్ఠమని ఎవ్వరు చెప్పరు. అయితే తెల్లవా రీ దేశ

ములో స్థాపించిన అభినవ పారిశ్రామికవిధానము దేశీయులకు క్షేమలాభము కలిగింపలేదనిమాత్రము చెప్పకతప్పదు. ఆఫ్రికా దేశములో ప్రవేశపెట్టబడిన నూతనవిధానములు ఆ దేశముయొక్క ఆర్థికవ్యవస్థలో చేయబడినమార్పులును. పాశ్చాత్యులు తమస్వలాభముకొఱకే ప్రవేశపెట్టిరి. దానిఫలితముగా దేశములోని నల్లవారిలోకూడా కొన్నిమార్పులు కలిగినవి. కొన్ని నాగరిక సంస్థలు, సంప్రదాయములు చొచ్చుకొనివచ్చినవి. అయితే అవి తెల్లవారు హృదయపూర్వకముగా పరోపకారచింతతో సక్రమముగా జరుగనిచ్చుటలేదు. అవి సకృత్తుగా అప్పుడప్పుడు, అసంపూర్ణముగా, అసమర్థముగా అమలు జరుగనిచ్చుచున్నారు. ఆఫ్రికా దేశములోనిగనులు, కృషిక్షేత్రములు, తోటలు ఆఫ్రికా దేశీయుల నుద్ధరించుటకుగాక, అవి లండనునగరమును ఇంకను ధనవంతముగాచేయుటకే స్థాపింపబడినవి. ఆఫ్రికాలోప్రవేశించిన ఆధునిక పారిశ్రామికవ్యవస్థ కడుపునిండతిండిలేక శుష్కించిన నల్లవారిపిల్లల ఆయురారోగ్యముల నింకను క్షీణింపజేసియు, దీనిని ప్రతిఘటించిన నల్లజాతివారి స్త్రీపురుషులప్రాణములను దీసియు వర్ధిల్లినది.

ఈ వలసరాజ్యవిధానము ఇంగ్లాండుదేశప్రజలకు చాలా లాభకరముగానున్నందువలన ఆ దేశములో ఏ రాజకీయపక్షమువారు ప్రభుత్వము వహించినను ఈ విధానమును మార్చరైరి. అయితే, ఇటీవల కొంతకాలము నుండియు నీ విధానము పూర్వమువలె ఒడుదుడుకులులేకుండా నెమ్మదిగా సాగుటలేదు. పూర్వ మెంత అన్యాయముజరిగినను సహించిపడియున్న ఆఫ్రికాదేశీయులు మెల్ల మెల్లగా కన్నుతెరచి అక్కడి అక్రమములనుగూర్చి తమఅసమ్మతిని ప్రకటింపసాగినారు. అందువలన ఈ నల్లజాతులవారు తిరుగుబాటుచేయకుండా వీరిని అణచిపెట్టియుంచి ఎప్పటివలెనే తాము లాభములనార్జించుటకై బ్రిటీషువా రనేక మాయోపాయములను ప్రయోగించి, అందుకొఱ కెన్నో క్రొత్తపద్ధతుల నవలంబించవలసివచ్చెను. ఇది చాలా ధనవ్యయకారణమయ్యెను. అందువలననే 1946 నుండి 1951 మధ్యభాగము వఱకుగల 6½ సంవత్సరములమధ్య బ్రిటీషువా రీ వలసరాజ్యములనుండి లాభముక్రింద వాటాలలాభము పంపిణీడివిడెండ్లక్రిందను ౽0000 లక్షల నవరసులు ఆర్జించినను దానినార్జించుటకు 961 లక్షలనవరసులు ఖర్చుపెట్టవల

సినవారైరి. అనగా తాముసంపాదించినధనములో సమాసమి సగము ఖర్చు పెట్టవలసివచ్చెను. అయితే, దీనిచిత్రమేమనగా ఆఫ్రికాలో నీ లాభసంపాద నముకొఱకు ఆఫ్రికావారిని తుపాకులతోకాల్చుటకై భుజమున .తుపాకినివేసి కొనిపోయిన ప్రతిబ్రిటీషువాటాదారునికిని ప్రతిగా నీ వలసరాజ్యములోని వేరుశనగవలనగాని కోకోవలనగాని వచ్చినలాభములో నొక్కరాగిపైస నైన కన్నులచూడని పనివాండ్రు నూరుమంది ఆ లాభసంపాదనముకొఱకు తమప్రాణములకుతెగించి పాటుపడవలసియుండిరి. అందువలననే ఈ వలస రాజ్యవిధానములోని అన్యాయములను చేయించినవారికే దానిలాభము చెందు చున్నదిగాని, అది చేతులారచేయు సామాన్యజనమునకు చెందుటలేదు.

ఆఫ్రికాలోని దారిద్ర్యమునకు కారణము పాశ్చాత్యులఅన్యాయపువిధా నము కాదనియు, ఆ దేశములోని భూమి సారవంతమైనది కాదనియు, దేశీ యులు సోమఱులనియు, నల్లవారు అనాగరికులైయున్నారనియు ఆఫ్రికాలో నికి వలసవచ్చినతెల్లవారు చెప్పుచుందురు. అయితే,ఈ తెల్లవారు నీడను తమ ఇండ్లవరండాలలో చల్లనిపానీయములను త్రాగుచు సుఖముననుభవించు చుండగా వారిగృహకృత్యములనన్నిటిని నిర్వహించువారు నల్లవారే. వారి గనులను త్రవ్వి వ్యవసాయముచేసి లాభమునార్జించిపెట్టినది నల్లవారే. దక్షిణరొడీశియా రాజ్యములో నేటివువ్యవహారముల కార్యదర్శి 1950 లో నొక నివేదికయం దీ సంగతినిగూర్చి యిట్లువ్రాసెను. "ఆఫ్రికాదేశములోని నల్లవారు తమహక్కులకొరకు గట్టిగా గోలచేయుచున్నారు. నీ కిది శ్రేయ స్కరము, నీ విట్లు చేయవలెనని తనకు తెల్లవారు చెప్పుటకు తాను శిశువును కానని, నా కిది కావలె నది కావలెనని నల్లవారు కోరుచున్నారు. అయితే వారు బాధ్యతలనువహించుట నేర్చుకొనలేదు. ఇప్పటికిని వారు చాలా తక్కు వగా పనిచేయుదురు. అందువలన తెల్లవారు దయతో నొసగునది తమకు చాలదని వారు గ్రహింపవలెను. తమసేవలను తమఅవసరములను ఇతరులు గమనించి గౌరవింపవలెనన్నచో తాముచేయుపనియందు తమకు గౌరవ ముండవలెను. తమకు తగినకూలి రావలెనన్నచో దానికితగినపనిని కనబరుప వలెను. తమకు బాధ్యతలు కలుగవలెనన్నచో దానికి అర్హతచూపవలెను"

ఈ నివేదిక ప్రకటింపబడిననాటికి దక్షిణరొడీశియాలో ఆఫ్రికాదేశీయునికి దామాషాగా సాలుకు 28 పౌనులు అనగా వారమునకు 10 షిల్లింగుల తొమ్మిదిపెన్నీలు వచ్చుచుండెను. నిర్ణీతమైన ఈ కూలిడబ్బుల కొ నల్లవాడెంతపని చేయవలెనో యనునది మాత్రము అందు వివరింపబడలేదు. ఈ నల్లవా రొకవారమునకు సంపాదించుసొమ్ము లేదా అంతకన్న హెచ్చు సొమ్మును తెల్లవా రొకగంటన్నరలో సంపాదింపగలుగుచున్నారనుసంగతి కూడా అందులో వివరింపబడలేదు. "ఆఫ్రికాలోనినేటివులు లేక నల్లజాతులవారికి విద్యాభిలాష చాలా అధికముగా నున్నదనియు, నిజమునకు అన్న వస్త్రములకన్నను, సుఖజీవనముకన్ననుకూడా విద్యాభివృద్ధినిగూర్చియే నల్లవారు బాధపడుచుందురనియు ఈ నివేదిక బయల్పరచినది.

ఆఫ్రికాలోని ఇతరవలసరాజ్యములలో ప్రకటింపబడిన నివేదికలందు కూడా ఇట్టిసంగతులే వివరింపబడియున్నవి. ఆఫ్రికాదేశీయులెల్లరును విజ్ఞానమును ప్రావీణ్యమును అవకాశములను వాంఛించుచున్నారు. అయితే వారికవి లభించుటలేదు. ఆఫ్రికాదేశీయులగునల్లవారికి అవకాశమిచ్చినచో చాలా నైపుణ్యము ప్రావీణ్యము కావలసిన వ్యాపారములను వృత్తులను అతిసమర్థతతో చేయగలరనుసంగతికూడా దక్షిణరొడీశియా నివేదికవలన బయల్పడినది.

సెకండరీఅనుగతపరిశ్రమల యభివృద్ధియగుటవలన వేలకొలది సామాన్యకూలిజనము జీవనముకొరకు వచ్చిరి. ఆ పరిశ్రమలలో పనిచేసిన నల్లవారు ఆయాపనులందు ప్రావీణ్యము (Skill) సంపాదించిరి. (Panel heating) గుడ్డపుజీనులు వగైరాలు చేయువృత్తిని, బ్రష్షులు, కుంచెలు తయారుచేయుట, కొయ్యసామానులు (Furniture) గృహోపకరణములు,గుఱ్ఱపు (కోచి) బండ్లనిర్మాణము, నేతపరిశ్రమ, మిల్లులు, ప్లాస్టిక్సు, కొయ్యసామానులలో మెత్తలను స్ప్రింగులను అమర్చి గుడ్డతోగాని, చర్మముతోగాని సోఫాలను తయారుచేయుట, తివాచీలను తెరగుడ్డలను గదులలో అలంకరించుట మొదలగుపనులు చేయు "Upholstery" అనువృత్తిని, నూలునేతపరిశ్రమ, వల్కనైజింగు అనగా రబ్బరుమకరగించి గంధకితము చేసి దానితో అనేకవస్తువులను తయారుచేయుపరిశ్రమ, దుస్తులుతయారీ

పాదరక్షలనుతయారుచేయుట, లోహపు రేకులను తయారుచేయుట మొదలైన చేతిపనులందు నల్లవారు ప్రావీణ్యమును, మంచి పనితనమును చూపుచున్నారు.

ఇంగ్లాండులో గుఱ్ఱపుజీనులుతయారుచేయుపనినిగాని అప్‌హోల్స్టరీ (Upholstery) పనినిగాని అనాగరికజాతులవారు చేయగలరాయని అటువంటిపని నింగ్లాండులో చేయువారి నడిగినచో అట్టిపనులను అనాగరికులు చేయజాలరనియు, అట్టిపనులను చేయువా రనాగరికులు కాజాలరనియు వారు జవాబుచెప్పుదురు.

ఆఫ్రికాదేశీయులకు విద్యయు ప్రావీణ్యమును లేని సందర్భములందు వారియజమానులు వారి కట్టి అవకాశములుకలుగకుండ ఆటంకపరచినారనుసంగతి స్పష్టము. ఆఫ్రికాదేశీయుడు గట్టిగా కాయకష్టముచేయలేనియుదాహరణ మెక్కడనైన కనబడినచో వానికి కడుపునిండ ఆహారము లేనందువలన బలహీనుడైనందువల్లనే అనుసంగతి తెలియగలదు. నల్లవారికి తగినంత పుష్టికరమైనఆహారము లభింపదు. వారిఆహారములో మాంసకృత్తులు (Proteins) చాలా తక్కువగా నుండును. దానిని వారు కొనుటకు వారికి డబ్బుఉండదు. అందువలన వారు చాలా నీరసించియున్నారు. ఇటువంటి వారు సరిగా పనిచేయలేకపోయినచో ఆశ్చర్యమేమున్నది?

# ఆఫ్రికా జాతీయోద్యమము

## మూడవ ప్రకరణము

### ఆఫ్రికా దేశీయుల పిల్లలు

ఆఫ్రికా ఖండములోని పాశ్చాత్యుల వలసరాజ్యవిధానమువలన ఆఫ్రికా దేశీయులపిల్లల ఆయురారోగ్యములకు భంగముకలిగినది. బ్రిటీషుప్రభుత్వమువారు 1949లో ఆఫ్రికన్ లేబర్ ఎఫిషెన్సీ సర్వే అనగా ఆఫ్రికా పారిశ్రామికుల శక్తిసామర్థ్యములనుగూర్చి విచారించి ఒకనివేదికను ప్రకటించియున్నారు. అందులో కెన్యాలోను ఉగండాలోను గల రైల్వేలలోపనిచేయు ఆఫ్రికాపారిశ్రామికులస్థితినిగూర్చి విచారించి కొన్నివివరములను వ్రాసిరి. అది అధికారరీత్యా ప్రకటింపబడినది. నిజముగా కనబడిన స్థితిగతులలోని దుఃస్థితియొక్క తీవ్రతను చాలవరకు తగ్గించి వ్రాయబడిన నివేదికే యది. అది ఆఫ్రికాపనివారిచేత వీలైనంత హెచ్చుగా చాకిరిచేయించగలందులకు మార్గముల నన్వేషించుటకు చేయబడిన విచారణగాని, పరమార్థచింతతోను వారిపైనదయతోను చేయబడినదికాదు.

ఈ సర్వేలో డాక్టరు హెచ్. సి. ట్రోవెల్‌గారు ఈ నల్లపనివారికి పుష్టికరమైనతిండి లేనందువలన కలుగుచున్న అనర్థకమునుగూర్చి వివరించియున్నారు. ఆఫ్రికాస్త్రీలకు చిన్నతనములో పుష్టికరమైనఆహారము లేనందువలన వారిశ్రోణిచక్రము అనగా పొత్తికడుపుచుట్టునుండు ఎముకలగూడు చాలా చిన్నదిగానుండును. మఱియు విరూపముచెందియుండును. అందువలన శరీరములోని ఇతర అవయవములుకూడా సరిగా అభివృద్ధిచెందక దానివలనిబాధలను గర్భోత్పత్తియందు వారిశిశువులు అనుభవించుచుందురు.

శిశువుపుట్టినపిమ్మట ఆరునెలలవఱకును తల్లిపాలవలన శిశువునకు చాలా పుష్టికలుగును. అప్పుడు చూచినచో నల్లవారిశిశువులు తెల్లవారిశిశువులవలెనే మిసమిసలాడుచుందురు. ఎట్టితేడాయు ఉండదు. అయితే ఆరునెలలు

దాటగానే తెల్లవారిచంటిపిల్లలకువలె నల్లవారిపిల్లలకు ఇతరవిధములైన ఆహారములెవ్వియు లభించనందువలన నల్లవారిపిల్లలు చాలాకాలమువఱకును తల్లిపాలు విడువరు. తల్లిపాలు వారికి చాలవు. అందువలన వారికి పుష్టి చేయక క్షీణింతురు. ఉండవలసినంతబరువు ఉండరు. ఆ శిశువుతలవెండ్రుకలనలుపు విరిగిపోవును. మామూలుగా బిరుసుగా ఉన్నివలె చుట్టలుచుట్టుకొనియుండు జుట్టు మెత్తనై నిడుపుగా మారిపోవును. చర్మముకూడా పాలిపోవును. అందువలన దేశీయు లీ రోగలక్షణమును సులభముగా తెలిసికొని "క్వాషియోర్కర్" పాండువ్యాధి వచ్చినదని దుఃఖింతురు ఈ వ్యాధిసోకిన పిల్లలరక్తములో మాంసకృత్తులరసిలో జీర్ణశక్తిలో మార్పుకలిగి పైత్యరసముచేత రక్తశుద్ధిచేయవలసిన కార్జము(లివరు)లోను జీర్ణకారిరసమును చేపవలసిన అగ్న్యాశయము (Pancreas) లోను మూత్రమును శుద్ధిచేయవలసిన మూత్రపిండములు (Kidneys) లోను జబ్బు యేర్పడును.

ఆధునిక పరిశోధనలఫలితముగా ఆఫ్రికాదేశీయులలో చాలామందికి దుఃస్థితి కలుగుచున్నదనియు వారిలో చాలామంది అనారోగ్యమువలన చనిపోవుచున్నారనియు, జీవించినవారిలో జవసత్వములు హరించి, శాశ్వతముగా శారీరక మానసికదౌర్బల్యముచేత బాధపడుచుందురనియు కనిపెట్టబడియున్నది ఆఫ్రికాదేశీయులనుగూర్చిన స్థితిగతిలెక్కలను చూచినచో నీ కథ మఱింత ఘోరముగా కనబడుచున్నది.

ది నైజీరియన్ లైవ్‌స్టాక్ మిషన్ రిపోర్టు అను నివేదిక నైజీరియాలోను నైజీరియారాష్ట్రములోను నూటికి 21 మంది ఏడాదినిండకుండా మరణింతురనియు, 32 మంది రెండేండ్లు నిండకుండాను, 40 మంది 3 సంవత్సరములునిండకుండాను, 51 మంది ఐదేండ్లు నిండకుండాను మరణించుచున్నారని వివరించుచున్నది. ఈ పిల్లలు కేవలము ఆహారపుష్టి లేనందువలన కలుగు వ్యాధులవలననే మరణించుచున్నారు. నైజీరియాలోని ఆసుపత్రులలోనికి వచ్చిన పిల్లలలో మూడువంతులమంది పుష్టికరమైనఆహారము లేనందువలన కలిగిన జబ్బులతో బాధపడుచుందురని అందులో సగముమంది చనిపోవుచుందురనియు తేలినది. ఆఫ్రికాలో నెల్లయెడలను ఇటువంటి స్థితిగతిలెక్కలే కనబడుచున్నవి. కెన్యాలో నూటికి 61 మంది పిల్లలుమాత్రము

ఐదేండ్లుదాటి బ్రదుకుదురు. నూటికి 56 వంతులమంది మాత్రమే 15 సంవత్సరములుదాటి జీవింతురు.

దేశములో నింతగా వ్యాపించియున్న అనారోగ్యస్థితి తీవ్రమైన వైద్యసహాయసమస్యను కలిగించుచున్నది. అయితే వలసరాజ్యములందలి ప్రభుత్వములు దేశీయులకొరకుచేయు వైద్యసౌకర్యములు ఎంతమాత్రమును చాలవు. నైజీరియాలో డెబ్బదియైదేండ్ల బ్రిటీషుపరిపాలన జరిగినపిమ్మట కూడా ఒకేఒక జ్వరముల ఆసుపత్రి నిర్మింపబడియున్నది. ఈ దేశములో నూటికి 60 మందినుండి 80 మందివఱకును మలేరియాజ్వరమువలనను,ఇంకను తీవ్రములగు విషజ్వరములవలనను బాధపడుచుందురు. ఇటువంటి దేశములో ఆ ప్రభుత్వమువారు 60 వేలమందిప్రజల కొక వైద్యునిచొప్పున నియమించుచున్నారు. ఇంగ్లాండులోనన్ననో — వేయిమందిప్రజల కొకవైద్యుడు నియమింపబడును. పిల్లలకు అంటువ్యాధులు,జ్వరములు కలిగి చనిపోకుండా నాగరికదేశములందుచేసినట్లు నివారణోపాయములను ముందుజాగ్రత్తలను తీసికొనరు. ఈ దుఃస్థితికి కారణము ఆ దేశపరిపాలనమునందు బ్రిటీషువారవలంబించిన లాభసంపాదనావిధానమే యని చెప్పవచ్చును. ఆ దేశమువలనవచ్చు ఆదాయము ఆ దేశప్రజల సంక్షేమముకొరకు ఉపయోగింపక దానినంతయు బ్రిటీషువారు పీల్చివేసి, లండన్‌నగరములోని ధనికుల లాభముకొరకుపయోగించుచున్నారు.

పైన చెప్పిన దుఃస్థితిలోనుండియు, ఏదోవిధముగా బ్రతికి బట్టకట్టి బడిలోవేయతగిన వయస్సువచ్చిన దేశీయులపిల్లలకు ఇంగ్లాండులో నదే వయస్సుగల పిల్లలకుగల విద్యాబోధనావకాశములకు కేవలము భిన్నములగు పరిస్థితులు కలుగును. నిజమునకు ఆఫ్రికాలో బడికిపోవువయస్సు అను మాటయే హాస్యాస్పదమైనమాటగా నున్నది. అయితే ఆఫ్రికాదేశీయులైన నల్లవారికి చదువుకొని విద్యాలాభము పొందవలెననువాంఛ లేదాయని ప్రశ్నింతురేమో! నిజమునకు ఆఫ్రికాదేశీయులకుగల విద్యాసముపార్జనతృష్ణ వర్ణనాతీతమైనది. వారికిగల అన్నికోర్కెలలోను విద్యనార్జింపవలెననుకోరిక చాలా ప్రబలమైనదని దక్షిణరొడీశియారాజ్యములోని నేటివువ్యవహారముల కార్యదర్శి తన నివేదికలో 1950 వ సంవత్సరమున వ్రాసినాడు.

ఆ నివేదికలో నింకను ఇట్లు వ్రాయబడియున్నది. "ఆర్థికమగు అవసరములనుబట్టి చిన్నపిల్లలు పట్టణములకుపోయి ఐరోపావారిదగ్గర జీతములకు కూలికి కుదిరి, పనిపాటులుచేసికొనవలసివచ్చుచున్నందునను. దేశములో బాలినన్నిపాఠశాలలు లేనందునను విద్యనుబోధించుటకు తర్ఫీయతు పొందిన యుపాధ్యాయులును తగినంతమంది లేనందునను దేశములో విద్యాబోధనముచేయపూనుకొనినవారిని పిల్లలచదువులసమస్యలే గాక వయసు వచ్చినవారికి చదువుచెప్పుటనుగూర్చినసమస్యలుకూడా ఎదుర్కొనుచున్నవి. తమగ్రామములు వదలి తెల్లవారిక్రింద పనులుచేయుటకు వెళ్ళిన యువకులు విద్యవలనిలాభములను గ్రహించి మేల్కొంచి విద్యనేర్చుట కవసరమైన పరికరములను కొనుటకు కొంచెము సొమ్ముకూడా సంపాదించి విద్యనేర్చుకొనుఅవకాశము లపేక్షింపసాగిరి. ఈ నివేదిక యీసమస్యను చాలా భావగర్భితముగా వివరించినది. ఇది దేశీయుల చిన్నపిల్లలు పనిచేయవలసిన "ఆర్థికావసరముల"నుగూర్చి చెప్పుచున్నది. నిజమునకు ఈ అవసరము ఎందువలన కలిగినదనగా, ఆఫ్రికాదేశీయులగు కూలివారికి పాశ్చాత్యవ్యవసాయకులు నెలకు రెండునవరసులుమాత్రమే కూలి యిచ్చుచుందురు. ఆఫ్రికాలోనిఫ్యాక్టరీలలో నెలకు 5 నవరసులనుండి 10 నవరసులు కూలినిత్తురు. అందువలన పెద్దవారుసంపాదించునది చాలక పిల్లలు కూలిచేయవలెను. పాఠశాలల కొరతనుగూర్చియు తగినంతమంది యుపాధ్యాయులులేకపోవుటను గూర్చియు ఈ నివేదిక చెప్పుచు, అందుకొఅకు కొంతసొమ్మును కేటాయించుట అవసరమనికూడా సూచించినది. అయితే వలసరాజ్యప్రభుత్వమువారు విద్యాభివృద్ధికొరకు సొమ్ము కేటాయింపక సంవత్సరములతరబడి కాలయాపన చేయుచున్నారు.

బ్రిటీషువారు స్వయముగా సంపాదించు వలసరాజ్యములలోని పరిస్థితులుకూడా స్వపరిపాలనముగల దక్షిణ రొడీశియారాజ్యమునందువలెనే యున్నవి.

యునైటెడ్ నేషన్సువా రేర్పరచిన ధర్మకర్తృత్వముక్రింద బ్రిటీషువారుపరిపాలించు కెమెరూన్సులోని సంగతులను పరిశీలింతము. 1950మార్చి నెలలో యునైటెడ్ నేషన్సువారు ప్రకటించిన బుల్లెటిన్ అను నివేదిక

పత్రములో కెమెరూన్‌లో ప్రతిమూలనుండియు విద్యకొరకు ఆందోళనము జరుగుచున్నదనియు, సెకండరీపాఠశాలలు కావలెనని, వృత్తులను వ్యాపారములను నేర్పు పాఠశాలలు కావలెనని దేశీయులు కోరుచున్నారనియు వ్రాసిరి. అయితే వారికోర్కెలను ప్రభుత్వమువారు తీర్చలేదు. 1948లోకూడా పాఠశాలలకు పోవతగినవయస్సులోనున్న పిల్లలసంఖ్యలో ఐదవవంతుమాత్రమే పాఠశాలలకు పోవుచుండిరి. అయితే ఆ పాఠశాలలందు తగినంతమంది ఉపాధ్యాయులును లేరు; చాలినన్నిపరికరములును లేవు.

కెన్యాలోని నల్లవారిపిల్లలలో నాలుగవవంతుమందికి మాత్రమే చదువు లభించుచున్నది. నైఋతిఆఫ్రికాలోని పిల్లలకు చదువు లేనేలేదు. కేవలము నల్లవారుమాత్రమే జీవించుప్రాంతములందు మాత్రము కొంచెము విద్యనేర్పుచున్నారు. బెచూనాల్యాండులోనిపిల్లలలో మూడవవంతు పాఠశాలలకు పోవుచున్నారు. స్వాజీల్యాండులో నాలుగవవంతుపిల్లలు పాఠశాలలకు పోవుచున్నారు. ఆఫ్రికాలోని నల్లవారిపిల్లల చదువునిమిత్తము వ్యయముచేయు సొమ్ము కెన్యాలో తల 1కి 8 షిల్లింగుల 6 పెన్నీలు ఉండగా, న్యాసాలాండులో ఒకషిల్లింగు నాల్గుపెన్నీలు మాత్రమే యున్నది.

ఏదోవిధముగా చదువునేర్చిన అదృష్టవంతులగు నల్లవారిపిల్లల స్థితిగతులు ఎట్లున్నవి? ఒక్కొక్కరాజ్యములో నొక్కొక్కవిధముగా నున్నవి. పశ్చిమఆఫ్రికాలో తెల్లవారు స్థిరనివాసములేర్పరచుకొనుటకు చెట్సీయీగ భయమువలన నక్కడ నల్లవారిలో మధ్యతరగతులజనము అభివృద్ధిచెందినందువలన అక్కడ విద్యనేర్చినవారు అప్పటి బ్రిటీషుపరిపాలకులతో సహకరించుచుడినందువలనను అక్కడి భారీవ్యాపారము (commerce) లోను పరిపాలనమునందును వివిధవృత్తులలోను కొందరునల్లవారికి అవకాశములొసగబడినవి. తూర్పుఆఫ్రికాలోని తెల్లవారు వలసవచ్చి స్థిరనివాసములేర్పరచుకొన్నందువల్లను తీవ్రమైన వర్ణభేదవిధానము అమలులోపెట్టబడినందువల్లను అక్కడి నల్లవారి కట్టి యవకాశములు లేవు. "ట్రిబుల్ డ్యు

గండా" అనుపేరుతో ఈ. ఎమ్. ములిరాగారు వ్రాసిన గ్రంథమువలన కొన్నివిశేషములు తెలియుచున్నవి. ఇతడు లండన్ విశ్వవిద్యాలయములో స్కూల్ ఆఫ్ ఓరియంటల్ అండ్ ఆఫ్రికన్ స్టడీస్ అనగా ప్రాచ్య ఆఫ్రికా విజ్ఞాన విద్యాసంస్థలో అసిస్టెంటు లెక్చరరుగా పనిచేయుచు, బ్రిటిష్‌వారు వలసరాజ్యములం దవలంబించిన పరిపాలనావిధానములను సాధారణముగా సమర్థించుచుండును. అట్టివాడే కొన్నివిషయములు అసంతృప్తికరముగా నున్నవని వ్రాసినాడన్నచో నవి యెంత అధ్వాన్నముగా నున్నవో తెలియ గలదు.

"తూర్పుఆఫ్రికాలో మాదేశీయులకు బాధ్యతగల ఉద్యోగములు నిర్వ హించుటకు తగినఅర్హతలు లేవని చెప్పుచుందురు. అట్టిఅర్హతలు సంపా దించుటకు తగిన అవకాశములొసగుడని మేముకోరగా మా పేళ్ళచివర విద్యాప్రావీణ్యచిహ్నములను బిరుదులను తగిలించుకొనుటయన్న మాకు వెఱ్ఱి ప్రీతియని మమ్ములను నిందించుచు, బి. ఏ. మొదలగు డిగ్రీలకన్న శక్తి సామర్థ్యములు ఎక్కువ అవసరమని చెప్పుచుందురు. ఇంగ్లాండుకుపోయి విద్యనభ్యసించుటకు మాకు విద్యార్థివేతనముల నొసగుచుందురు. కాని ఆ విద్యార్థివేతనములు దీర్ఘములైన పెద్దచదువులకుగాక, కొలదికాలములో పూర్తి చేయుటకు వీలైన క్లుప్తమైనకోర్సులకే యిచ్చి పంపుదురు. అందువలన మా విద్యార్థులు తక్కినవారివలె ప్రవీణులుగనుండరు. బంగారుకోస్తాజనులతో పోల్చిచూచినచో నీ విద్యార్థివేతనములు చాలా స్వల్పమైనవిగ కనబడగలవు. అక్కడ జనసంఖ్య మా దేశములోనిజనసంఖ్యకు సమానమైనదేయైనను మాకు తక్కువ అవకాశముల నొసగుచున్నారు.... 1948-49 సంవత్సరము లలో ఉగండావారికి ఇంగ్లాండులో 23 ప్రభుత్వవిద్యార్థివేతనము లివ్వబడినవి. సియెర్రాలియోన్ (Sierra Leone) కు 34 విద్యార్థివేతనము లొసగబడినవి. మాలోకొందఱు తగినఅర్హతలను సంపాదింపగా మాకు తగిన సచ్ఛీలము అనుభవము మొదలైనవి లేవందురు. ఉగండానుండి పోయి కేంబ్రిడ్జి విశ్వ

విద్యాలయమునందు ఆనర్సుడిగ్రీని పొందిన మా ద్దేశీయుని త్రోసిరాజని, ఉగండాలోని తోటలయజమానియైన ఒకతెల్లవాని కుమారునికి తక్కువ అర్హతలే యున్నను, అతనికి సాలుకు 550 నవరసుల జీతమునుండి 1346 నవరసులవేతనమువఅకును వృద్ధిచెందు గొప్పయుద్యోగము నిచ్చిరి. ఆ యాఫ్రికాదేశీయుని శక్తిసామర్థ్యముల గమనించుటకు మూడుసంవత్సరముల పరిశీలనలోనుంచవలెనని చెప్పి, తుదకు అతనికన్న తక్కువఅర్హతగల ఒకతెల్లయుద్యోగిపర్యవేక్షణముక్రిందనున్న ఒకపాఠశాలలో నతనికి హెడ్మాష్టరుపదవి నిచ్చిరి." అని ములీరాగా రొక అన్యాయమైనకేసుసంగతి నుదాహరణముగా చెప్పిరి.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## నాలుగవ ప్రకరణము

### ఆ క లి బా ధ

ఆఫ్రికా దేశీయులలో నూటికితొంబదిమంది దుర్భరమైనఆకలితో జీవితము గడపుచున్నారు. సంవత్సరముపొడవునను కడుపునిండ తిండిగలవా డొకడున్నచో ఎన్నడును కడుపునిండ తిండితినియెఱుగనివారు వందల కొలది యుందురు. తమపిల్లలు తిండిలేక శుష్కించి తమ కండ్లయెదుటనే చనిపోవుచుండగా ఏమియుచేయజాలక దుఃఖించుచుందురు. ఇట్టి దుర్భరమైన ఆకలిబాధతోనున్న ప్రజలకు ఏవిధముగా ఆహారముసంపాదించి ప్రాణములను దక్కించుకొందమా యను తలంపు తప్ప మానవసౌఖ్యమునకు అభివృద్ధికి గావలసిన విషయములనుగూర్చిన ఆలోచనలుండవు.

ఈ సమస్యనుగూర్చి పాశ్చాత్యులు చాలా మృదుమధురమైనభాషలో వ్రాయుచుందురు. ఆకలిబాధను ఆహారకొఱతయని పుష్టితక్కువఆహారమని అపోషణమని వ్యవహరింతురేగాని, ఘోరమైన క్షుద్బాధయని చెప్పరు. ఈ దుర్భరమైన ఆకలిబాధవలన ఆఫ్రికాప్రజల జవసత్వములు క్షీణించిపోయినవి. పసిపిల్లలమరణములు హెచ్చినవి. జవసత్వములుగల మానవులు ప్రతిఘటింపగల జాడ్యములను ఆఫ్రికావారు ఎదుర్కొనలేక వానికి బలియై పోవుచున్నారు. అంటువ్యాధులు ప్రబలుచున్నవి. ఇది అమానుషముగ నున్నది. ఇటీవల ఆఫ్రికావలసరాజ్యప్రభుత్వములవారు నియమించిన విచారణసంఘములవారినివేదిక లీ విషయమునుగూర్చి ఎంత జాగ్రత్తతో ఎంత తక్కువగా వ్రాసినను వ్రాసినసంగతులవలననే ఈ ఘోరసమస్య యెంత తీవ్రముగానున్నదో తెలియుచున్నది.

1951 సంవత్సరము ఈస్టుఆఫ్రికన్ మెడికల్‌సర్వే అను బ్రిటిషువైద్యశాఖ వారినివేదికలో నిట్లు వ్రాయబడినది: "వాకరజాతి ఆఫ్రికాస్త్రీపురుషులకును పిల్లలకును ఆహారముసంపాదించుట బ్రహ్మాండమైన పెనగులాటగానున్నది. వైద్యనిపుణులు ఏకగ్రీవముగా నిర్ణయించినదానినిబట్టి నైజీరియాదేశీయు లందరును ఆహారకొఱతవలనను, పుష్టికరములైన పదార్థములులేని ఆహార మువలనను చాలా బాధలకులోనగుచున్నారని తేలినది" అని 1950 సంవత్స రపు నైజీరియన్ లైవ్‌స్టాకుమిషన్‌రిపోర్టు అను నివేదికలో వ్రాయబడినది. సౌత్‌వెస్టుఆఫ్రికా నేటివులేబరర్సుకమీషన్ రిపోర్టు అని నైఋతిఆఫ్రికా ప్రభుత్వమువారి విచారణసంఘమువారు 1945-48 సంవత్సరములనివేది కలో నొక జిల్లాసర్జను అను వైద్యాధికారి ఇట్లు వ్రాసినాడు. "ఈ జిల్లా తెల్లవ్యవసాయకులలో నూటికేబదిమంది తమ కృషిక్షేత్రములందు పశువులు చచ్చినప్పుడుమాత్రమే తమనేటివు-నల్లవారికి మాంసాహారము నిచ్చెదరు." సాధారణముగా నల్లవారుతినునది మొక్కజొన్నసంకటి. అందువలన వారికి తగిన శరీరపుష్టి కలుగదు. "యునైటెడ్‌నేషన్సు రివ్యూ ఆఫ్ ఎకనామిక్ కం డిషన్సు ఇన్ ఆఫ్రికా" అనుపేరుతో ఆఫ్రికాదేశపు ఆర్థికపరిస్థితులనుగూర్చి ఐక్యరాజ్యసమితివారు ప్రకటించిన నివేదికలో "ఆఫ్రికాదేశీయులఆహారము ప్రపంచములోనికెల్ల సారవిహీనముగా నున్నది. ఆఫ్రికాలోని జనులలో అధికసంఖ్యాకులు పుష్టికరమైన ఆహారము తిననందువలని బాధ లనుభవిం చుచున్నారు" అని 1951లో వ్రాసిరి.

ప్రపంచములోనికెల్ల ఆఫ్రికా జబ్బులతోనిండి అనారోగ్యకరమైన దేశముగా నున్నది. దీనికిముఖ్యకారణము దేశములోని ఆహారకొరతయే. పుష్టికరమైనఆహారము లేనందువలన వచ్చు వ్యాధులైన ఉష్ణమండలకురు పులు (Tropical ulcer), స్కర్వీ, పెల్లాగ్ర అను పాండురోగము, నంజు, గ్జెరోప్తాల్మియ (Xero phthalmia) అక్కడ ప్రబలియున్నవి. శరీరము బలహీనముగానున్నప్పుడు క్షయవ్యాధి యంకురించి వర్ధిల్లును. ఆకలిబాధవలన కేవలము వ్యాధులంకురించి ప్రాణనష్టము కలిగించుటయే కాదు, పరిశ్రమలందును పనిపాటులందును ఉండవలసిన శక్తిసామర్థ్యములు లేకుండచేయును. వారిప్రావీణ్య మడుగంటచేయును. అందువలననే దక్షిణ

రొడీశియాలోని గనులకంపెనీవారు అక్కడ పనిచేయు నల్లవారిఆరోగ్యము కొఱకై ఇటీవల కొంచెము శ్రద్ధవహించనారంభించిరి. దక్షిణరొడీశియా గవర్నమెంటు మెడికల్ డైరెక్టరుగారు 1935 లో వ్రాసిననివేదికలో ఆ దేశమున గనులలోపనిచేయు 75000 మంది ఆఫ్రికాదేశీయులలో నూటికి 55 మంది వ్యాధులకు గురియైరని, వారికిచ్చు కొలత ఆహారమునందు కొంచెము జాగ్రత్తవహించి దానిని పుష్టికరముగాచేసియుండినచో వారి జవ సత్వములు వృద్ధియై, ఈ జననష్టము (కాషుయాలిటీలు) నివారించి యుండ వచ్చుననియు వ్రాసినాడు.

నిరంతర క్షుద్బాధననుభవించువారు సరిగా శ్రమకోర్చి పనిచేయజాల రనుసంగతి అందరికిని తెలిసినవిషయమే. అయితే తెల్లయజమాను లీ దురదృష్టవంతులను సోమఱులని తిట్టుచుందురు.

దక్షిణరొడీశియా చీఫ్‌కమీషనరుగారి నివేదికయందు, పనిలోనున్న ఆఫ్రికావారందరిచేతను దినమంతయు పూర్తిగా పనిచేయించినచో కూలివారి కొరత యుండదని 1952లో వ్రాసిరేగాని, వారెందుల కట్లు పూర్తిగా పని చేయలేకపోవుచున్నారో వ్రాయరైరి. మెడికల్‌రిసెర్చికవున్సిలులోని డాక్టరు బి. ఎస్. ప్లాట్‌గారు న్యాసాలాండులోని మూడుగ్రామములందలి జనులను గూర్చి 1938లో వ్రాయుచు వారు పూర్తిగా దినమెల్ల పనిచేయుటకుసరిపోవు నంత ఆహారము వారికిలేదనియు, జాడ్యములనుప్రతిఘటించుటకు శక్తినిచ్చు నంత పుష్టికరమైనఆహారముకూడా వారికి లేదనియు వ్రాసినారు. నైజీరియా లోనిగనులలో నెలకు పదునైదుదినములుమాత్రమే పని జరుగుచుండును. దీనికికారణము పనివారికి అంతకన్న పనిచేయుశక్తి లేకపోవుటయే.

రెండవప్రపంచయుద్ధసమయమున నైజీరియాలోని తగరపుగను లందు నిర్బంధసైనికసేకరణవిధానము నమలుపరచుటకు ప్రయత్నింపగా అక్కడిపనివారిలో సగముమందికిపైగా వారుచేయవలసినపనికి తగిన శరీర దార్ఢ్యమును శరీరసౌష్ఠవమును లేకపోయినందువలన ఆ ప్రణాళికను విర మింపవలసివచ్చెను.

ఆఫ్రికాఖండములోనిభూమి సాధారణముగా బీదభూమిగా నుండు ననియు ఆఫ్రికాదేశీయులు ఆధునికవ్యవసాయవిధానములను గ్రహించి కృషి

చేయరనియు, ఆ దేశీయులు సోమఋలనియు, అందువలననే వా రెల్లప్పుడును ఆకలిబాధననుభవింపవలసివచ్చుచున్నదనియు పాశ్చాత్యులు చెప్పుచుందురు. ఇంతేగాక ఆఫ్రికాలో కొంచెము మంచిస్థితిలోనున్న ఆఫ్రికావారు కనబడినచో తెల్లవారిప్రభావమువలననే వా రట్లు బాగుపడినారనికూడా చెప్పుచుందురు.

1949 లో ఇంటర్నేషనల్ లేబర్ఆఫీసువారి నివేదిక యొకసూత్రమును ప్రతిపాదించెను. "వలసరాజ్యములోని ప్రణాళికలన్నిటిని ఒక చిత్రబంధ మెదుర్కొనుచున్నది. వలసరాజ్యములోని దేశీయప్రజలు బీదవారైనందువలన అనారోగ్యముగను అజ్ఞానులుగను ఉన్నారు. వా రనారోగ్యముగను అజ్ఞానులుగను ఉన్నందువలన బీదవారుగా నున్నారు. చెట్టు ముందా? విత్తు ముందా? అను చిత్రప్రశ్నవంటి ఈ సూత్రము నెవ్వరు త్రెంపగలరు?

ఈ ఆఫ్రికాదేశ మెల్లప్పుడును ఇట్టి దారిద్ర్యమునందు మునిగియుండెనా? లేక ఈ అనారోగ్యమునకును అజ్ఞానమునకును వేరు కారణమేదైన నున్నదా? అనునది జాగ్రత్తగా పరిశీలింపవలసినవిషయము.

19 వ శతాబ్దిమధ్యలో దేశయాత్రలనుచేసిన పాశ్చాత్యులు చాలామంది ఆఫ్రికాదేశీయుల శరీరసౌష్ఠవమును ఆరోగ్యమును చూచి ఆశ్చర్యముతో వర్ణించియున్నారు. మనకు లభించు చరిత్రాధారములవలనకూడా ఒకవంద సంవత్సరములకుపూర్వము ఇప్పటివలె గాక ఆఫ్రికాదేశము ఇంతకన్న హెచ్చుజనసంఖ్యను అధికతరమైన ఆరోగ్యవంతులైన ప్రజలను భరించుచుండెనని విశదముకాగలదు. అయితే, ఈ దుఃస్థితి యెట్లు దాపురించినది? గొప్ప గొప్ప పాశ్చాత్యకంపెనీలు వచ్చి ఇక్కడ వ్యాపారమునుచేయుట ప్రారంభించినవి. ఇందలి సహజసంపదనెల్ల ఎగుమతిచేయసాగినవి. కొన్నిచోటులలో తెల్లవారు వచ్చి నెలకొనిరి. దేశములోనున్న మంచి సారవంతమైన భూములనెల్ల ముఖ్యముగా ఆఫ్రికాఖండమున తూర్పుభాగమునను దక్షిణాఫ్రికాలోనుగల మంచిపొలములనెల్ల నల్లవారినుండి నయమునను భయమునను మోసగించియు తీసికొని తెల్లవారికిచ్చిరి. ఆఫ్రికాలోని నల్లజాతులవారిని రిజర్వు లను ప్రత్యేకప్రదేశములలోనికి త్రోసి నిర్బంధించిరి. అక్కడ నీ నల్లవారు క్రిక్కిరిసియుందురు. పూర్వమువలె ఒకచోటుమార్చి యింకొక

చోటున చేసికొను 'పోడు'వ్యవసాయము చేసికొనుటకు వారికి చోటులేదు. వారిపశువులకు మేకలకు మేయుటకు బంజరులైనను విశాలమైనవి లేవు. అందువలన అక్కడిభూమి క్రమక్రమముగా సారవిహీనమైపోయి వారికి జీవనాధారమే లేకుండాపోయెను.

కేవలము పశుబలమువలన ఆఫ్రికావా రనుశ్రుతముగా చేసికొను వ్యవసాయపద్ధతులకు ఆటంకముకలిగించి తెల్లవారి వలసరాజ్యప్రభుత్వ మువా రొక వ్యవసాయశాఖ నేర్పరచిరి. అందలి యుద్యోగులు తాము సూచించు నూతనవిధానములప్రకార మీ నల్లవారు వ్యవసాయము చేయరని కోపగించుకొందురు. దేశములోని రెండవరకముభూమిలోనికి ఆఫ్రికావారిని త్రోసివేయుటవలన తెల్లరైతులకు స్థిరమైన మంచి వ్యవసాయక్షేత్రములు లభించుటయేగాక మంచిభూములుపోయిన నల్లవారు దరిద్రులై కూలివారుగా వచ్చి ఈ తెల్లవారిసేవచేయవలసినగతికూడ వారికి పట్టినది. ఇట్లు నిరాధారులైన నల్లకూలివారిచేత పాశ్చాత్యులు తమవ్యవసాయక్షేత్రములందు గనులందు ఇతరపరిశ్రమలందు చాలా తక్కువకూలికి పనిచేయించగలుగుచుండిరి. ఈ పరిస్థితులు 19వ శతాబ్దముచివర పాతికసంవత్సరములలోను ఇరువదవశతాబ్ది ఆరంభములోను ఏర్పడినవి.

దూరప్రాంతములనుండి యిట్లు వచ్చి కూలిపనిచేయు నల్ల వారిసంఖ్య ఖచ్చితముగా చెప్పుటకు వీలులేకపోయినను మధ్యఆఫ్రికాలోనికిని,దక్షిణాఫ్రికాసరిహద్దులుదాటివచ్చి కొంతకాలము గనులలో కూలిపనిచేయువారిసంఖ్య నాలుగులక్ష లుండునని స్పష్టముగా తెలిసినది. ఇంకను కొన్నిలక్షలమంది దేశీయులు తమ రిజర్వులు లేక ప్రత్యేకస్థావరములనుండి వలసరాజ్యములలో గను లున్నప్రదేశములకువచ్చి పనిచేయుచుందురు. దీని పర్యవసానమేమనగా ఆ రిజర్వులలో పనిచేయగల శక్తిసామర్థ్యములుగల యువజను లిట్లు దేశాంతరములకు పోవుటవలన అక్కడ పనిచేయువారు లేక ఆ పొలములలో సరియైనపంటలు లేక మరింత దారిద్ర్యము వ్యాపించినది.

ఆఫ్రికాఖండములోని వలసరాజ్యములందు ఎగుమతిచేసి లాభమార్జింపవీలుగల వ్యాపారపుదినుసులను పండించుటకు, గనులుత్రవ్వించుటకే

తెల్లవారు కృషిచేయుదురుగాని, దేశప్రజలకు కడుపునిండతిండికి కావలసిన పంటలను పండించరు. పండింపనివ్వరు.

పైనచెప్పిన సంగతులవలన ఆఫ్రికాఖండములోని దేశీయుల దారిద్ర్యమును ఆకలిబాధయు నెందువలన కలిగినవో తెలియగలవు. నిజముగా ఆఫ్రికాలోని భూములు ఆఫ్రికాదేశీయులకే యుండి, వానిని వారియిష్టాను సారముగా సాగుచేయవీలున్నచో వారి కీ దారిద్ర్యము నాకలిబాధయు నుండ వనుట నిస్సంశయము. అప్పుడు వారు కడుపునిండ తిండితినుటకు ఆహార పదార్థముల నుత్పత్తిచేసి ఇతరప్రాంతములవారికి కూడా ఆహారమును సర ఫరాచేయగలిగెడివారు. అప్పుడు వారు తమకుకావలసిన ఆహారపదార్థము లను, వ్యాపారములో లాభముకలుగుదినుసులను విరివిగా పండించి లాభము పొందగలిగెడువారు. ఆఫ్రికాక్షేత్రములలో ఎఱువులు చాలా కొంతగానున్న ప్పటికిని, 1948లో ప్రపంచములో నుత్పత్తియగు ఫాస్ఫేటుఎఱువులలో నూటికి 30.5 వంతులు ఆఫ్రికాలోనే యుత్పత్తియై తెల్లవారిజేబులు నిండించి నవి.ఆఫ్రికాలోని వ్యవసాయోత్పత్తులు యథోచితమైన నిష్పత్తిలో లేవు.చాలా వలసరాజ్యములలో ఆహారధాన్యముల నేమాత్రము పండింపక, కేవలము వ్యాపారములో లాభమువచ్చు కోకోమొదలగు దినుసులనే పండించి ఎగుమతి చేయుచున్నందువలన స్థానికప్రజలకు తినుటకు ఆహారముండదు.అట్లు వచ్చిన సొమ్ముతో ఆహారపదార్థములనైన కొని సరఫరాచేయరు. ఓడలనిండ పొగాకు, కాఫీ, టీ, సైస్త్రం, చెట్లనూనె, కోకో ఆఫ్రికారేవులనుండి ప్రతి యేటా పోయి లండను, బ్రసెల్సు, పారిసు, న్యూయార్కునగరవాసుల జేబులు నిండించుచున్నవి.బంగారుకోస్తాలోని అక్రా, కాంగోలోని లియోపాల్డు విల్లీ, పశ్చిమాఫ్రికాలోని డాకరుపట్టణములలోని నల్లవా రాకలితో మాడు చున్నను వారి కావంతయైన నవి యుపయోగింపవు.

ఆఫ్రికాదేశములోనినల్లవా రాకలితో బాధపడుచుండుటకుగల కారణ ములలో నివి ముఖ్యమైనవి. ఈ దేశీయులు పనిచేసినందులకు వారికివ్వబడు

కూలి, వేతనము చాలా హీనముగానున్నది. అందువలన వారు తమకుకావల సిన ఆహారపదార్థములు కొనుట కది చాలదు. వారు సాగుచేసికొనుపొల ములు వారికి చాలవు. వారు అవలంబించు వ్యవసాయపద్ధతులవలన వారికి చాలినంతఆహారదినుసులు లభించవు. నిజమునకు ఆఫ్రికాదేశీయులదారిద్ర్య మును ఆకలిబాధయు వారి నణచియుంచి పీడించుచున్న పాశ్చాత్య సామ్రాజ్య విధానమువలననే కలుగుచున్నవి. అది లేకపోయినచో ఆఫ్రికాదేశీయులు తమబిడ్డలకు కడుపునిండ తిండిపెట్టుకొనగలిగియుందురు.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## ఐదవప్రకరణము

### ఆఫ్రికా దేశీయులలో చైతన్యము

అనేకశతాబ్దములనుండి నిద్రావస్థలోనున్న ఆఫ్రికాఖండములోని నల్ల జాతులవారు మేల్కాంచిరి. చరిత్రలోని అన్ని యుద్యమములవలెనే ఇది కూడా చాలా బాధతోకూడి జరిగినదేగాని సులభముగా జరిగినదికాదు. ఒడుదుడుకులు లేకుండా నెమ్మదిగాజరిగినదియు కాదు. ఇది ఆకస్మికముగా ఆకాశమునుండిఊడిపడినట్లును తటస్థింపలేదు. దీనికి కారణములున్నవి.

ఆఫ్రికాఖండములో ఆధునిక పారిశ్రామికార్థికవ్యవస్థగల దక్షిణాఫ్రికాసమితిలో చాలాకాలముక్రిందటనే ఆఫ్రికాదేశీయుల రాజకీయప్రజాసంఘములును దేశీయ పారిశ్రామికుల వ్యాపారవృత్తికట్టడిసంఘములు (Trade Unions) ను స్థాపింపబడియుండెను. ప్రపంచములోని ఇతర పారిశ్రామికులతో నెట్టిసంబంధమును లేక కూపస్థమండూకములవలె జీవించుచు, "ట్రేడ్ యూనియన్" (వ్యాపారవృత్తి)కట్టడిసంఘము అనుమాటను కూడా ఎన్నడును వినియెఱుగని 'సూడాను' దేశములోకూడా దేశీయ పారిశ్రామికులైన నల్లవారు రెండవప్రపంచయుద్ధానంతరము (1945లో) వ్యాపారవృత్తికట్టడిసంఘమును స్థాపించిరన్నచో నీ యుద్ధానంతరము ప్రపంచములోని మారుమూలనున్నప్రజలలోకూడా ఎటువంటి ఆధునికభావములు వ్యాపించినవో తెలియగలదు.

గోల్డుకోస్టు అనబడు పశ్చిమాఫ్రికాలోను నైజీరియాలోను ఆఫ్రికా దేశీయులలో జాతీయచైతన్యము చాలా త్వరితముగా నభివృద్ధిగాంచెను. కొన్ని చోట్ల సమ్మెలు, కొన్నిచోటుల రాజకీయప్రదర్శనములు, అప్రయత్నముగా

దౌర్జన్యములు సంభవించుటయు, ప్రజలయుద్యమమునందు యువకులును ఒక్కొకప్పుడు స్త్రీలునుకూడా పాల్గొనుటయు జరిగినది. ఇదియంతయుకలిసి ఆఫ్రికాలోని నల్ల జాతులవారిని నిద్రావస్థనుండి మేల్కొలిపి వారిలో చైతన్యముకలిగించినది.

రెండవప్రపంచయుద్ధమునందు ఆఫ్రికాదేశీయులను సైనికులుగా చేర్చుకొనకపోయినను ఏదోయొకపనియందు పనిచేయుటకు నియుక్తులైన వారు వేలకొలది నల్లవారుండిరి. ఆ సందర్భమున యుద్ధము ఎవరెవరు చేయుచున్నారో, ఎందుకుచేయుచున్నారో వారిచెవులబడినది. ఇది నిరంకుశత్వమును నిర్మూలించి ప్రజాప్రభుత్వమునుసంరక్షించుటకొఱకే జరుగుచున్నదని ఆఫ్రికావారు తెలిసికొనగలిగిరి.

ప్రపంచములోని మానవులందఱకు సర్వసామాన్యములైన ప్రాతిపదికహక్కులను ప్రజాస్వాతంత్ర్యములను సంరక్షించుటయే ఈ మహాసంగ్రామముయొక్క ఉద్దేశమని, అందువలననే అమెరికాసంయుక్తరాష్ట్రములవారు ఈయుద్ధమున పాల్గొనుచున్నారని అమెరికాసంయుక్తరాష్ట్రిఅధ్యక్షుడు, బ్రిటీషుప్రధాని మొదలగునాయకులంతా కలిసి ఆలోచించి అట్లాంటిక్ చార్టర్ అనబడు స్వాతంత్ర్యముల ప్రకటననుగావించిరి. ఈవిషయము నల్లవారు వినిరి. తమకన్న హెచ్చు అదృష్టశాలురగు జాతులవారితోను సంఘీయులతోను ఆఫ్రికావారికి పరిచయము కలిగినది. స్వాతంత్ర్యముకలిగినచో దేశములోని జనసామాన్యమునకు కలుగులాభములను వారు కన్నులారా చూచిరి. వీనియన్నిటియొక్క పర్యవసానముల నూహించుకొనిరి.

తాము పురుషప్రయత్నముచేసి తమమేలుకొఱకు పెనగులాడినచో, మునుముందు తమజాతివారికి లాభముకలిగితీరునని లక్షలకొలది ఆఫ్రికా దేశములోని వివిధజాతులనల్లవారికి అవగతమైనది. అట్లాంటికుచార్టరులో మానవులకు వాగ్దానముచేయబడిన పురోభివృద్ధి తమకు కలుగునని ఆఫ్రికా దేశీయులు ఆశించరాదని బ్రిటీషుప్రధానమంత్రి విన్‌స్టన్ చర్చిల్‌గారు ప్రకటింపగా, ఆఫ్రికాలోని వివిధప్రాంతములందలి నల్లజాతులవారు అసంతృప్తి చెంది దీనినిగూర్చి తమఅసమ్మతిని వెల్లడించిరి.

రెండవప్రపంచసంగ్రామము జరుగుచుండగానే తరువాత జరుగబోవు

సంగతులకు సూచనలు కనబడెను. 1942 లో రైళ్ళరాకపోకలందు పనిచే యువా రొక సమ్మెనుచేసిరి. అది జయప్రదముగా నిర్వహింపబడెను. 1944 నాటికి నైజీరియా నేషనల్ కౌన్సిల్ అండ్ కెమెరూన్సు అనబడు జాతీయ ప్రజాసంఘమొకటి స్థాపింపబడెను. దేశప్రజలకు సంపూర్ణ స్వాతంత్ర్యము సంపాదించుటకై పాటుపడుఉద్దేశములతో స్థాపింపబడిన మొదటి రాజకీయ సంఘ మిది. ఇది నైజీరియా వలసరాజ్యచరిత్రయందు అపూర్వమైన సంఘటనము.

కెన్యారాజ్యమునందు రెండవప్రపంచయుద్ధారంభముననే అక్కడి యధికారులకు భయముకలిగి, నల్లజాతివారిప్రజాసంఘమైన 'కికుయూ సెంట్రల్ అసోసియేషను'ను నిషేధించిరి. 1945 లో ఉగండారాజ్యమునందు పెద్దపెద్దసమ్మెలును ప్రదర్శనములును నల్లజాతులవారు చేయసాగిరి. తరువాత ఉగండాప్రజలు యునైటెడ్ నేషన్సుకు తమస్వాతంత్ర్యమునుగూర్చి అర్జీల నిచ్చుకొనిరి. ఉగండాదేశమును వంశపారంపర్యముగా పరిపాలించుచుండిన రాజును 1954 లో తెల్లయధికారులు ప్రవాసమంపిరి. 1946 లో నైజీరియాలో చాలా తీవ్రమైన సమ్మెయొకటి జరిగెను. దానికి దేశీయులలోని వ్యవసాయకులును మధ్యతరగతులవారునుకూడా తోడ్పడిరి. అది నలుబదినాలుగు దినములు కొనసాగినది. తుదకు పారిశ్రామికులకు జయముకలిగినది. 1946వ సంవత్సరములో చాలా ముఖ్యమైనసంఘటనములు జరిగెను. దక్షిణాఫ్రికా లోని బంగారుగనులలో పనిచేయుచుండిన అరువదివేలమంది ఆఫ్రికాజాతులకుచెందిన పారిశ్రామికులు తమకు హెచ్చువేతనములు కావలెనని క్రమమైన కట్టుబాటుకలిగిన పద్ధతులతో నొక గొప్ప సమ్మెను సాగించిరి. కెన్యాలో 'కెన్యా ఆఫ్రికన్ యూనియన్' అను ప్రజాసంఘము, జోమో కెన్యట్టా అను నాయకునిక్రింద కట్టుదిట్టమైన ప్రజాసంఘముగా పనిచేయుట ప్రారంభించెను.

ఫ్రెంచి పశ్చిమాఫ్రికాలో "ఆఫ్రికన్ డెమోక్రాటిక్ ర్యాలీ" అనుపేరుతో సహారాయెడారికి దక్షిణమునగల పదమూడుదేశములలోని ప్రజాసంఘములన్నియు కలిసి తమ ప్రతినిధులనంపి ఒక గొప్ప సమష్టిప్రజాప్రతినిధి సంఘసమావేశమును జరిపెను. త్వరలోనే ఈ సమష్టిప్రజాసంఘమునందు

పదిలక్షలమందిసభ్యులు చేరి, అన్నిరాజ్యములవారును ఏకీభావమువహించి పని చేసిరి ఈ సంఘముయొక్కబలమును విచ్ఛిన్నముచేయుటకు ఫ్రెంచిప్రభుత్వాధికారులు తమ సైనికదళములను పోలీసుబలముల నుపయోగించి కొన్ని సంవత్సరములపాటు నిర్బంధచర్యలు జరుపవలసివచ్చెను.

ఆఫ్రికాలోని బ్రిటీషువారి వలసరాజ్యములందేగాక ఆఫ్రికాఖండములోని తక్కిన అన్నిప్రాంతములందుగల ఐరోపాజాతులవారి వలసరాజ్యములందుగూడా పరిస్థితు లిట్లే యుండెను. అల్జీరియాలోను ట్యునీషియాలోను మొరాకోలోను పశ్చిమాఫ్రికాలోనుగల ఆఫ్రికాజాతులవారి ఆ దేశమునాక్రమించిన ఫ్రెంచివారిసైనికులు తుపాకులతో కాల్చుచు వారిని అణగద్రొక్కుటకు ప్రయత్నించుచుండిరి.

రెండవప్రపంచయుద్ధానంతరము ఫ్రెంచివారు దక్షిణాఫ్రికాకు తూర్పు ప్రక్కనున్న మెడగాస్కర్ ద్వీపములోని నల్లజాతిస్త్రీపురుషులను పిల్లలను 90000 మందిని నిర్దాక్షిణ్యముగా వధించిరి. దీనికికారణము ఆఫ్రికాలోని ఇతరభాగములందువలెనే ఫ్రెంచివారాక్రమించిన భాగనులందలి నల్లవారు కూడా మేల్కొని తమ హక్కులను సంరక్షించుకొనుటకై పాటుపడుచుండుటయే.

1947లో కెన్యారాజ్యమందలి మొంబాసారేవుపట్టణములో నొక గొప్ప సమ్మెజరిగినది. తమకు స్వాతంత్ర్యముకావలెనని నైజీరియాప్రజలు లండను కొక ప్రతినిధివర్గమును రాయబారముగా నంపిరి. బంగారు కోస్తా ప్రాంతదేశమునందు యునైటెడ్ గోల్డుకోస్టు కన్వెన్షన్ అను ప్రజాసంఘము స్థాపింపబడి ఆఫ్రికాదేశీయులహక్కులకొఱకు పాటుపడసాగినది.

ఉగండారాజ్యములోకూడా నల్లవారిరాజకీయాందోళనము తీవ్రముగా జరిగినది. టంగనీయికాలో ఓడరేవులోని డాకుపనివారిసమ్మె జరిగెను. దక్షిణరొడీశియాలో ఇండస్ట్రియల్ అండ్ కమర్షియల్ వర్కర్సు యూనియన్ అనబడు దేశీయపారిశ్రామికులసంఘము పునర్నిర్మాణముగావింపబడెను. ఆఫ్రికాఖండములోని వివిధప్రాంతములందు 800000 సభ్యులుగల ఇరువదియొక్క పారిశ్రామికసంఘములవారు డాకరులో పాన్ ఆఫ్రికన్

లేబర్ కాన్ఫరెన్సు అను మహాసభలో సమావేశమై, తమ క్షేమలాభములను గూర్చి చర్చించి తీర్మానములుగావించిరి.

1948లో గోల్డుకోస్టుదేశమునందు చాలా ముఖ్యమైనసంగతులు జరిగెను. దానిఫలితముగా సామ్రాజ్యనీతిజ్ఞులు క్రొత్త రాజ్యనీతివిధానములను ప్రయోగించి అధికారములేని రాజ్యాంగము నొకదానిని నిర్మించి దాని యందు దేశీయులైన నల్లవారికి కొంత ప్రవేశమునొసగినట్లు కనబరచి కొందఱిని తమవైపునకు త్రిప్పుకొనుటకు ప్రయత్నించిరి.

ఆ సంవత్సరములోనే నైజీరియారాజ్యములోకూడా మఱికొన్ని సమ్మెలు జరిగెను. అక్కడి యునైటెడ్ ఆఫ్రికాకంపెనీ ఆఫ్రికన్‌వర్కర్సు యూనియన్ అను దేశీయుల పారిశ్రామిక వ్యాపారవృత్తికట్టడిసంఘములో 20000 మంది సభ్యులు చేరినందువలన నది చాలా బలవంతమయ్యెను. అబి యోకుట (Abeokuta) స్త్రీజనసంఘమను దేశీయ మహిళాసంఘము ఫుమ్మిలయోరాన్సమ్‌కుటి అను నారీమణినాయకత్వముక్రింద అభివృద్ధి చెంది, అలకే తనపదవిని వదలుకొనునట్లు చేయగలిగెను. ఇతర ప్రాంతము లందుకూడా నల్లవారి జాతీయోద్యమమును వ్యాపారవృత్తికట్టడిసంఘము లును అభివృద్ధిచెందెను.

ఇట్లు ఆఫ్రికాలోని ప్రజాయుద్యమము సాగుచునేయుండెను. 1949లో నైజీరియాలోని ఎనుగులో గనిపనివారిసమ్మెయు, ఉత్తర రొడీశియాలో ఆఫ్రికన్ మైన్‌వర్కర్సుయూనియన్ అను గనులపనివారిసంఘస్థాపన మును జరిగెను. 1950 లో నైజీరియాలో పారిశ్రామికుల క్షేమలాభముల కొఱకు నడుపబడు మొదటి వార్తాపత్రిక వెలసినది. గోల్డుకోస్టు అను బంగారుకోస్తాలో సత్వరస్వాతంత్ర్య స్థాపనముకొఱకు నల్లవారు ప్రత్యక్ష కార్యక్రమము (Positive Action) అను తీవ్రమైన యుద్యమమును ప్రారంభించిరి ఆ సంవత్సరములోనే (Sierra Leone) సియెర్రా లియోన్, ఉగండారాజ్యములలో సమ్మెలు జరిగినవి. టంగనీయికాలోని వామేరు (Wameru) జాతిప్రజలు, పాశ్చాత్యులు తమను వెళ్ళగొట్టుటకై చేయు దుష్ప్రయత్నములను ప్రతిఘటించిరి.

బసూటోల్యాండును దక్షిణాఫ్రికాసమితి రాజ్యములో చేర్చకూడదని

బసూటోల్యాండులోని 32 మంది ఆఫ్రికా జాతులనాయకులు పిటీషనుపెట్టు కొనిరి. ఇదియంతయు ఆఫ్రికాదేశీయులైన నల్లవారు దేశములోని వివిధ ప్రాంతములందు తమంతటతాము చేసిన కృషియే.

దక్షిణాఫ్రికాసమితి రాజ్యములోని భారతీయులును ఆఫ్రికాదేశీయులును అక్కడ జరుగుచుండిన ఘోరమైన అన్యాయములను ప్రతిఘటించుటకై చేసిన సాత్వికనిరోధము, సత్యాగ్రహము మొదలైన వీరగాథలు వివరింపవలెనన్నచో ప్రత్యేకగ్రంథము కావలెను.

రెండవప్రపంచయుద్ధానంతరము ప్రతిసంవత్సరముపొడవునను జరుగుచున్న వేలకొలదిసమ్మెలనుగూర్చియు, అసమ్మతిప్రకటనలనుగూర్చియు దేశీయులుపెట్టుకొనిన అర్జీలనుగూర్చియు,ఆఫ్రికా దేశీయులు సమష్టిగాజరిపిన వివిధచర్యలనుగూర్చియు, వివరించుట చాలా కష్టసాధ్యమైనకార్యము. దానిని గూర్చినవివరములు తెల్లవారు దొరకనివ్వరు. అప్పటినుండి స్థాపింపబడిన వ్యాపారవృత్తికట్టడిసంఘములు (ట్రేడ్ యూనియనులు) అసంఖ్యాకములుగా నున్నవి. ఎన్నోరాజకీయపక్షములు స్థాపింపబడి ప్రభుత్వమువారిచే అణచి వేయబడినవి. దేశీయు లెన్నో గుణపాఠములనునేర్చికొని రాజకీయములందారితేరిరి. ఎంతో అనుభవమును గడించిరి. స్వాతంత్ర్యముకొఱకును హక్కుల సంరక్షణముకొఱకును ఎన్ని కష్టములుపడవలెనో ఎట్లు పనిచేయవలెనో, ఎట్లు ఆందోళనమునడుపవలెనో, ఎప్పుడు ముందుకుపోవలెనో ఎట్లు తాముసంపాదించిన హక్కులను విలువబెట్టుకొనవలెనో, తాము సాధించినవిజయములను గట్టిపునాదులపైన నెలకొల్పవలెనో, ఎప్పుడు కొంచెము వెనుకంజవైచి తలలొగ్గవలెనో అను రాజకీయాందోళనములోని తికమకలను వారు గ్రహించి, జాతీయోద్యమమును చిత్రవిచిత్రరీతులుగా నడిపినచరిత్ర ఈ నల్లవారి మహాజనప్రవాహముయొక్క పురోగతిచరిత్ర వర్ణనాతీతమైన వీరగాథగానున్నది. ఆఫ్రికాఖండము నిద్రనుండిమేల్కాంచి నవచైతన్యముతో మెలగుచుండుట కిదియంతయుకలసి తోడ్పడెను.

గత ఎనిమిదిసంవత్సరములచరిత్రలో నెంతో ప్రజాపీడనము జరిగినది. ఎందఱో స్త్రీపురుషులు తమరక్తము ధారవోసిరి. గనులపనివారినెందఱినో తెల్లవారు తుపాకులతో కాల్చిచంపిరి. గ్రామస్థులనెందఱినో చిత్ర

వధలు చేసిరి. ఎన్నో వ్యాపారవృత్తికట్టడిసంఘములు రాజకీయసంఘములు అణచివేయబడినవి. దేశీయనాయకులనెందరినో పట్టుకొని ప్రవాసమంపిరి. ఎందరినో చెరసాలలందు నిర్బంధించి బాధించిరి నల్లవారిజాతీయోద్యమము నణచుటకు తెల్లవా రెన్నో మాయోపాయములనుచేసిరి, కొందఱిని బాధించిరి, కొందరిలిని బెదిరించిరి. కొందఱికి ఆశపెట్టి లొంగదీసిరి. కొందఱికి లంచము లిచ్చిలోబరచుకొనిరి. దేశీయులలో చీలికలు కల్పించిరి. వార్తాపత్రికలను మూసివేసిరి. ప్రజాసంస్థలలోనికి దేశద్రోహులను ప్రవేశపెట్టి విచ్ఛిన్నము చేయచూచిరి. ఎంతో ద్రోహముజరిగెను. 'ఎన్నిపనులుచేసినను నల్లవారి జాతీయోద్యమము అణగలేదు. దేశీయుల ప్రజాసంఘములు క్రొత్తవి తల యెత్తుచునేయుండెను. దరిమ్రిలు దీనులును తిరుగబడి తమహక్కులకొరకు తమరక్తము ధారపోయుచునేయున్నారు. తెల్లవారి ప్రభుత్వాధికారులు నల్ల వారిపైన నిట్టి నిర్బంధచర్యలను జరపవలసివచ్చినదన్నచో నల్లవారిజాతీ యోద్యమ మెంత తీవ్రముగా ప్రవేశపారినదో తెలియగలదు.

ఈకాలమునందు ఫ్రెంచివారిక్రిందను బ్రిటీషువారిక్రిందను గల వివిధ ప్రాంతములం దెంతో రక్తపాతము జరిగెను. ఆఫ్రికా దేశీయులు విజృంభించు చున్నకొలది అధికారులనిర్బంధచర్యలు. బలప్రయోగములు. కాల్పులు వృద్ధియగుచుండెను. వారు నల్లవారిని చిత్రహింసలుచేసి వధించి రక్తపాతము చేయుచున్నకొలది దేశభక్తులగు నల్లవారు విజృంభించుచు తమ స్వాతం త్ర్యముకొరకు అఖండ త్యాగముచేయసాగిరి.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## ఆరవపరిచ్ఛేదము

### కెన్యా వలసరాజ్యము

తూర్పుఆఫ్రికాలోని ఇంగ్లీషు వలసరాజ్యమగు కెన్యాదేశముయొక్క విస్తీర్ణము 244060 చదరపుమైళ్ళు. దీని జనసంఖ్య 1955 నాటికి 6048000. ఇందులో ఆఫ్రికాదేశీయులైన నల్లవారు 5815000

| | |
|---|---|
| భారతీయులు - గోవావారు | 144100 |
| పాశ్చాత్యులు (తెల్లవారు) | 52400 |
| అరబ్బీవారు | 31600 |
| ఇతరులు | 5100 |

ఆఫ్రికాదేశీయులైన నల్లవారిలో ముఖ్యమైన జాతులు

| | | |
|---|---|---|
| కికుయూ, | నూటికి | 19.5 మంది |
| లువో (Luo) | ,, | 14.4 ,, |
| బలుహ్యా | ,, | 12.5 ,, |
| కంబ | ,, | 11.7 ,, |
| మేరు | ,, | 6.2 ,, |

చాలాశతాబ్దములక్రిందట అరబ్బీ పారసీకదేశపు వర్తకు లిక్కడ వర్తకస్థానము లేర్పరచుకొనియుండిరి. ఆనాటి కిక్కడనుండిన ఆఫ్రికాదేశీయులనుగూర్చిన చరిత్రాంశములు తెలియుటలేదు. 1498 లో పోర్చుగీసు వారు అరబ్బీదేశీయులను త్రోసిరాజనిరి. 1729 లో అరబ్బీవారు పోర్చుగీసు వారిని వెనుకకు తరిమిరి.

1823లో బ్రిటీషునావికు లీ ప్రాంతమునకు వచ్చిరి. అంతట అక్కడిప్రజలు తమను సంరక్షింపుమని కోరినారని ఆంగ్లచరిత్రకారులు

వ్రాయుచుందురు. ఏమైననేమి 1890 నాటికి జాంజిబారుసుల్తానుగారు బ్రిటీషు వారిరక్షణ నపేక్షించి వారికి కొన్ని సౌకర్యములొసగెను.

1892లో కెన్యా ఉగండారైలుదారి నిర్మాణముకొఱకు సర్వే ప్రారంభమయ్యెను. జాంజిబారుసుల్తానుగారు ఇంపీరియల్ బ్రిటిష్ ఈస్టుఆఫ్రికా కంపెనీవారికి వశపరచినదేశమును బ్రిటిషువారు ప్రొటెక్టరేటు లేక సంరక్షితరాజ్యమని 1895లో ప్రకటించిరి. 1900 నాటికి కెన్యాలో పదముగ్గురు తెల్లవారుమాత్రమే కాపురముండిరి. 1950నాటికి 30000 మంది వచ్చిచేరిరి. ఇందులో మూడువేలమంది వ్యవసాయము చేయుచున్నారు. ఆ రాజ్యములో నున్న కృషియోగ్యమైనభూమిలో సగము వీరియధీనమునందున్నది. అయితే వీరు ఆ భూమిలో పదియవవంతుమాత్రమే సాగుచేయుచున్నారు. మిగిలినది తమచేతిలోపెట్టుకొని నల్లవారికి మంచిభూమి లేకుండాచేసినారు.

కెన్యాలో 55 లక్షలమంది ఆఫ్రికాదేశీయులైన నల్లవారున్నారు. కెన్యా నల్లవారిదేశము. వారి తండ్రితాతలనాటినుండియు వా రా దేశములో నున్నప్రజలు. అప్పు డా దేశములోని భూమియంతయు వారిక్రిందనే యుండెను. అయితే ఇప్పు డా దేశములోని మంచిభూమి యేదియు వారి క్రింద లేదు. వారిని తెల్లవారు బలవంతముగా దేశములోపలిభాగమునకు తరిమి, 52000 చదరపుమైళ్ళ ఊషరక్షేత్రమునం దుండునట్లు నిర్బంధించినారు. అక్కడ వారు నిలకడలేని భూస్వామిత్వవిధానమునందు కాలక్షేపము చేయవలసివచ్చుచున్నది. ఈ పరిస్థితు లిట్లు తారుమారైనచరిత్ర చాలా చిత్రమైనది.

1895లో బ్రిటీషువారు కెన్యారాజ్యమును సంరక్షితరాజ్యమని ప్రకటించిరి. ఆ దేశములో జర్మనీదళారీలకన్న బ్రిటీషుదళారీలు ముందుగా చొరబడుటయే బ్రిటీషువా రట్లు ప్రకటించుటకుగల కారణము. ఆ యధికారమునువహించుచు అక్కడి ఆఫ్రికాదేశీయులతో ఈ రాజ్యములోని భూములపైన ఆఫ్రికాజాతిప్రజల కదివరకుండిన సాముదాయకమైన హక్కులన్నియు బ్రిటీషువారికి సంక్రమించినవని ఆనల్లవారికి చెప్పిరి. ఇంకనేమున్నది? అక్కడిభూముల యనుభవపుహక్కులను బ్రిటీషురాజ్యములకార్యాలయమువారు తమచిత్తమువచ్చినవారికి పంచిపెట్టసాగిరి. ఆ రాజ్యములోనికివచ్చి

వలసనెలకొనిన తెల్లవారినాయకుడైన లార్డు డిలామేర్‌గారికి ముందుగా 100000 ఎకరములను ప్రసాదించిరి. ఈస్టు ఆఫ్రికన్ సిండికేటు అను ఇంగ్లీషువాటాదారులకంపెనీవారికి 320000 యకరముల విచ్చిరి. గ్రోగన్ ఫారెస్టు కన్వెన్షన్ అను ఇంగ్లీషువారికంపెనీకి 200000 యకరము లిచ్చిరి. ఇట్లే తమయిచ్చవచ్చిన తెల్లవారి కిచ్చటిభూములను పంచివేసిరి. ఈ అన్యాయపు అపహరణమును శాస్త్రసమ్మతమైనకృత్యముగా చేయుటకై బ్రిటీషు ప్రభుత్వమువారు "క్రవున్‌లాండ్స్ఆర్డినెన్సు" అనబడు అవసరశాసనము నొకదానిని జారీచేసిరి. ఇంతేగాక "నేటివ్‌ల్యాండ్స్‌ట్రస్టుఆర్డినెన్సు" అను నింకొక అవసరశాసనమునుకూడా అధికారపూర్వకముగా జారీచేసిరి. రెండవ శాసనముప్రకారము ఆఫ్రికాదేశీయులవని స్పష్టముగా నిర్ణయించక విడిచిన భూములన్నియు మొదటిశాసనముక్రింద ఐరోపావారికే ప్రత్యేకింపబడినవి. ఈ శాసనములును తరువాతచేయబడిన ఇతరశాసనములును ప్రభుత్వమువారి యుత్తరువులును తాకీదులును సమశీతోష్ణములై ఆరోగ్యకరములై సారవంతములైన ఉన్నతప్రదేశములందు పాశ్చాత్యులుతప్ప ఇతరులెవ్వరును భూములకు హక్కుదారులుకాకుండా చేసెను. అవసరములైన నిషేధాజ్ఞలు చేసిరి.

ఆఫ్రికాదేశీయులను కొందరిని క్రైస్తవమతమునందు కలిపినప్పుడు పరునిధనము నపహరింపరాదను బైబిలులోని క్రైస్తవధర్మమునకీ పాశ్చాత్యక్రైస్తవులచర్య విరుద్ధముగానుండుటను గమనించి క్రొత్తగా నా మతమునచేరిన అమాయకులగు నల్లక్రైస్తవు లాశ్చర్యపడిరి. వారికి ఆశ్చర్యమే కాదు, విషాదముకూడా కలిగెను. ఈ అన్యాయపుదురాక్రమణమువలన 'కికుయూ'మ్కాంబ, కవిరొండొ మొదలగు నల్లజాతులవారు శాశ్వతముగా దారిద్ర్యమునమునిగి దుఃస్థితిననుభవింపవలసినవారైరి.

తెల్లవారు వలసరాకపూర్వము ఈ జాతులవారు భూములను సరిగా కృషిచేయలేకుండిరని పాశ్చాత్యులు దొంగమాటలు చెప్పుచుందురు. తూర్పు ఆఫ్రికాలో బ్రిటీషుసామ్రాజ్యమును స్థాపించుటలో చాలా ప్రముఖపాత్రను వహించిన లార్డు లుగార్డు (**Lugard**)గారు కంబలో తన యనుభవముల నిట్లు వ్రాసియున్నారు. "ఇక్కడిదేశీయులు నొక్కంగొనారతో అల్లిన చక్కనిబుట్టలతోను సంచులతోను ధాన్యపుదినుసులు, పిండి, బంగాళా

దుంపలు, కోళ్ళు, మంచితేనె, ఒకరితరువాత నొక రొక ప్రవాహమువలె తెచ్చుచుండిరి. కికుయూలో వ్యవసాయము చాలా విరివిగా జరుగుచున్నది. ఈ దేశమంతయు సాగులోనున్నది. మేము 20000 పౌనులధాన్యపుదినుసులను చిక్కుడుగింజలను చాలా చౌకగా కొన్నాము. కీటకములదండు వచ్చి, దేశములో పంటలుపాడుచేసిపోయినపిమ్మటకూడా ఇంత విరివిగా చౌకగా సరుకులు లభించినవన్నచో ఆ దేశ మెంతసుభిక్షముగానున్నదో తెలియగలదు. జాక్సన్‌గారి వర్తకులతండావారు కూడా చాలాసరుకులను కొనిరి. ఇంకను ముఖ్యముగా గమనింపవలసినవిశేష మేమనగా అది ఆహారపదార్థములు విరివిగా క్రయవిక్రయముచేయుతరుణము కాకపోవుట పల్లపువ్యవసాయమునకు నీటిసరఫరాకు ఈ దేశీయులకు మంచి ఏర్పాటులున్నవి." అని ఆయన వ్రాయుటవలన ఐరోపావారు ఈ దేశమునకువచ్చినపిమ్మటనే అదివరకు సాగుకానిభూములు సాగుచేయబడుచున్నవనుప్రచారము ఎంతఅసత్యమైనదో తెలియగలదు. ఆఫ్రికాదేశీయులగునల్లవా రిట్లు తమభూములను గోల్పోయి, తమతోడి నల్లవారితో గొఱ్ఱెలమందలవలె ప్రత్యేకముగా నిర్ణయింపబడిన ఊషరక్షేత్రములందు "రిజర్వుల"ను నివేశనములందు నిర్బంధింపబడిరి. కెన్యా వలసరాజ్యప్రభుత్వమువారు 1948లో ప్రకటించిన నివేదికలో నైరోబీపట్టణముదగ్గర కియాంబు అనుచోట కికుయూజాతివారు స్త్రీపురుషులును పిల్లలును కలిసి మొత్తము 90000 మంది "రిజర్వు" లేక ప్రత్యేకస్థావరమునందున్నట్లును, అక్కడ కొలదికాలములో వారికి జీవనాధారములేకుండాపోవునట్లు తోచుచున్నదనియు వ్రాసిరి. పై సందర్భములం దిది యెంత అన్యాయముగానున్నదో తెలియగలదు.

కెన్యాలో ఆఫ్రికాదేశీయులకు ప్రత్యేకించబడినప్రత్యేకస్థావరములు చాలా జనాకీర్ణములై యున్నప్పటికిని ఇంకను లక్షమందికిపై బడి ఈ యవసరసమయమునం దక్కడికి పంపబడిరని లండనుటైమ్సుపత్రిక 1953 సెప్టెంబరునెలలో వ్రాసినది. వీరి నెక్కడనుండి పంపిరి? తెల్లవారుండుప్రాంతములనుండియే పంపివేసిరి. కారణమేమనగా వీ రక్కడ కొన్ని పోరంబోకభూములనాక్రమించి ఎట్లో జీవనముగడుపుకొనుచు తమ తీరికకాలమందు తెల్లవారిపొలములలో చాకిరిచేయుచుండిరి. ఇది తెల్లప్రభుత్వమువారికి గిట్టక

పోయెను. ఇంతేగాక దురదృష్టవంతులైన నల్లవారు తమగ్రామములందు జీవనముజరుగక దారిద్ర్యమునబడి పట్టణములలో చాలా అసహ్యాకరములైన పరిస్థితులలో గుడిసెలువేసికొనియు, వీధులలోను బ్రదుకుచుండగా వారి నక్కడనుండి ప్రత్యేకస్థావరములకు పంపివేసిరి. కెన్యాలోని ఈ రిజర్వు లలో మంచిభూములు లేవు. పనులు లేవు. అందువలన జీవనము జరుగదు. పట్టణములలో చాలా తక్కువకూలికి పనులుచేయుదురు. లేదా తెల్లవారి క్రింద వ్యవసాయకూలీలుగా పనిచేయుదురు. సంవత్సరములో కొంతభాగము వీరికి కడుపునిండ తిండియుండదు.

1952 డిశంబరు 16వతేదీన ఇంగ్లాండుపార్లమెంటులో కామన్సుసభ యందు లెస్లీహేల్ అను లేబరుపక్షసభ్యుడు కెన్యాలోనిపరిస్థితులనుగూర్చి మాట్లాడెను. అత డంతకుపూర్వమే ఆ దేశమునకు వెళ్ళివచ్చెను. "నా చేతిలో నొక అచ్చుకంట్రాక్టుకాగిత మున్నది. అందులోనిఖాళీలలో పైపు చేసి వివరములు పూర్తిచేయుదురు. ఇది "రెసిడెంటులేబరర్సు ఆర్డరు" అనబడు ప్రభుత్వాజ్ఞక్రింద తయారుచేయబడినది. దానిపైన నొక మేజస్ట్రీటు అనగా నేటివుపనివారిరక్షణకొరకు నియమింపబడిన అసిస్టెంటు ఆఫీసరు వలన 1952 జూలై 21వతేదీన ధ్రువపరుపబడినట్లు ఆ యధికారి సంతకము చేసినాడు. ఇది మూడేండ్లగడువుగల కంట్రాక్టు. ఆ గడువుకాలములో పని వాడు దానిని రద్దుపరచుటకు వీలులేదు. ఆ కంట్రాక్టును బట్టి వానికి బోజన సౌకర్యములేదు. వాడుతిను మొక్కజొన్నసంకటియైనను వాని కివ్వబడదని స్పష్టముగా వ్రాయబడినది. అందుకొరకు వా డొక చిన్నమడిలో మొక్క జొన్నపైరు వేసికొని, బంగాళాదుంపలు ఇతర కూరగాయలను పండించి దైవికరాజకీయములవలననష్టములను భరింపవలెను. అత డెట్టి పశువులను ఉంచుకొనరాదు. తుదకు గాడిదలను మేకలనుకూడా ఉంచుకొనరాదు. అయితే అతనికి శక్తియున్నచో పదునైదింటికిమించకుండా గొఱ్ఱెలను మాత్రము ఉంచుకొనవచ్చును. అతనికి పదునాఱేండ్లు వయసువచ్చిన కుర్ర వాడున్నచో వాడుకూడా అతనియజమానిక్రిందనే పనిచేయవలెను. ఆ యజ మానికిష్టములేనిచో ఆ స్థలమునుండి బయటకు వెళ్ళిపోవలసినదని ఆజ్ఞాపించ వచ్చును. ఈ కంట్రాక్టు నా యజమానుడు ఐదేండ్లవరకు పొడిగింపవచ్చును.

కంట్రాక్టులోని పాశ్చాత్యయజమానిపేరు మైకేల్ బ్లుండెల్. ఇతడు శాసన సభలోని పాశ్చాత్యసభ్యులనాయకుడు. పనివానికి "ముప్పదిదినములటికెట్టుకు" వేతన మివ్వబడునని ఈ కంట్రాక్టులో నున్నది. అయితే ముప్పదిదినములు వరుసగా పనిచేయవలెనో, మొత్తముమీద ముప్పదిదినములు పనిచేయవలెనో నాకు అర్థమగుటలేదు. అందువలన వానికిచ్చు వేతన మేవిధముగా లెక్క కట్టుదురో చెప్పవీలులేదు. ముప్పదిదినములటికెట్టుకు 12 షిల్లింగుల 12 పెన్నీలు వేతనమివ్వబడును. ఆ వలసరాజ్యములో ఆఫ్రికాదేశీయుల జీవన వ్యయము నూటికి మూడువందలరెట్లకు పెరిగినది. గత మూడుసంవత్సర ములలో నది నూటికేబదివంతులు మఱల పెరిగినది. నెలకు 12 షిల్లింగు లతో ఆఫ్రికావా డెట్లు జీవింపగలడు? యజమాని కోరినచో స్త్రీలును పిల్ల లునుకూడా పనిచేయవలసినదే.

ఇట్లు నెలకు పండ్రెండుషిల్లింగులతో జీవింపవలసిన నల్లవాడు ఎట్లు కాలక్షేపముచేయుచున్నాడు? ఆ దేశమునకు పోయి పర్యటనముచేసివచ్చిన నిష్పక్షపాతులగు పాశ్చాత్య యాత్రికులందరును అక్కడితెల్లవాడు నల్లవారి పట్ల ప్రదర్శించు జాత్యహంకారమును క్రూరవిధానములను చూచి జాలిపడు చుందురు న్యూస్టేట్సుమను అండ్ నేషన్ అను ఇంగ్లీషుపత్రికలో కేంబ్రిడ్జి కాపురస్తురాలగు Mrs హెలెన్ రిచార్డు అను నొకయామె ఈ క్రిందిలేఖను వ్రాసినది.

వ్యవసాయపుపనులుచేయువారికి న్యాయమైన ప్రమాణవేతనము, కూలి యున్నట్లు తోచదు. నేనువిడసిన యొక వ్యవసాయక్షేత్రమున దినమునకు మను ష్యునకు ఆరుపెన్నీలురొక్కమును మొక్కజొన్నసంకటిని కూలిగా నిచ్చు చుండిరి. ఇంత తక్కువకూలినిచ్చుటవలన పనివారు వీలైనప్పు డేదో దొంగ తనముచేయకుండా జీవింపజాలరు. పశువులకొఱకు పొలములోనుంచిన ఉప్పును నల్లకూలీలు దొంగిలించి తినిరని ఆ క్షేత్రపాలకుడైన తెల్లయజ మానికి వారిపైన కోపమువచ్చెను. యజమాను లీ నల్లవారికి శిక్షార్థము కొరడాలతోకొట్టుపద్ధతిని రద్దుచేయవలెను. ఒకనేటివుదేశీయుడు తెల్లవారిపైన దౌర్జన్యముచేయుట యెంత తప్పుగానెంచబడునో ఒక 'తెల్లవాడు' నల్లవానిపైన దౌర్జన్యముచేయుటకూడా అంతతప్పుగానే యెంచబడవలెను. దేహదండ

మునువిధించుట అవసరమైనచో వారిని మేజస్ట్రేటు విచారించి అట్టిశిక్షను విధించినపిమ్మటనే అట్లు కొట్టవలెను. ఆ రాజ్యములో స్థిరనివాస మేర్పరచు కొనిన ఒక ప్రముఖపాశ్చాత్యునియింట నేను తేనీటివిందారగించుచుండగా సోమరి పోతులైన నల్లవారి కెట్లు బుద్ధిచెప్పవలెనో అతడు నాకు బోధింపసాగెను. పూర్వమువలె నల్లవారినికొట్టుటలో రక్తముచిందచేయుటకు వీలులేదనియు, అందువలన నా పనివారివిషయములో నీ క్రిందివిధముగా జరిగించవలెననియు నాకు సలహానిచ్చెను. నాదగ్గరపనిచేయు నల్లకూలీలమేస్త్రీచేత ఆ నల్లవాని బట్టలు విప్పించి వాని నొక తడిదుప్పటిక్రింద పండుకొనబెట్టి దానిపైన (Kiboko)కిబోకోఅను ఖడ్గమృగచర్మముతోచేసిన కొరడాతో మోదింప వలెను. అప్పుడు రక్తముచిందకుండా వానిని చాలా తీవ్రమైనదెబ్బలుకొట్టు టకు వీలగును"అనెను.

చిన్నచిన్నతప్పిదములకు శాస్తిగా జరుపబడిన కొన్నిక్రూరకృత్యము లను నా కన్నులారా చూచితిని, ఒక నల్లవాడు పని చేసిచేసి అలసివచ్చి తన యజమానునిచూచి లేచి నిలువబడకపోవగా ఆ నేరమునకు వానికాలి వ్రేళ్ళపైన యజమానుడు తనబూట్సుమడమలతో త్రొక్కి చిదుకగొట్టుటయు ఆ యజమానునియుత్తరువునుబట్టి యింకొకనల్లవా డింకొకనిని గొలుసు లతో కట్టివేయుటయు మొదలగుచర్యలను చూచితిని. మోటారుకారును నడుపు తెల్లవాడు తనకారుకు నల్లవారిపశువులును జీవములును అడ్డువచ్చి నచో వానిమీదనుండి కారునడిపి వానినిచంపినను నేరముకాదు. నేనొక స్నేహి తునితో మోటారుకారులో పోవుచుండగా ఐరోపావారిపశువు లడ్డువచ్చినప్పు డా మోటారువేగమును తగ్గించుచువచ్చెను గాని, నల్లవారిగొఱ్ఱెలమందను లెక్కచేయక త్రోసికొనిపోయి కొన్నిటిని నష్టపరచుట చూచితిని. 'నేటివు పురుగు'లని నల్లవారినిగూర్చి అతడు చాలానీచముగా మాటలాడినాడు. తెల్ల వారు ఆఫ్రికాదేశీయులనుదోచి వారికి తిండిలేకుండా మాడ్చుటయేగాకవారికి విద్యలేకుండాచేసి, సామాన్యమైన రాజకీయహక్కులుకూడా లేకుండాచేసిరి.

కెన్యాలో శాసనసభయొకటి 1906లో స్థాపింపబడియున్నది. ఇతరబ్రిటీషువలసరాజ్యములందువలెనేనిజమైనఅధికారములులేకుండా శుష్క మైన చర్చలనుమాత్రము చేయుటకువీలుగల ఒక కీలుబొమ్మశాసనసభను

కెన్యాలో నెలకొల్పినారు. ఈ శాసనసభ తీర్మానములనుచేయుచు, ప్రజాభిప్రాయమును వెల్లడించును. ప్రజలకుగలబాధలను ప్రకటించును. ప్రజలకు సంబంధించిన వ్యవహారములను చర్చించును. కాని ఈ సభవారుచేసిన తీర్మానములను ప్రభుత్వకార్యనిర్వాహకవర్గమువారులెక్కచేయకపోవచ్చును. ఈ కార్యనిర్వాహకవర్గమువారుచేసిన నిర్ణయమును గవర్నరు వీటోచేసి అమలుజరుగకుండాచేయవచ్చును. అందువలన కెన్యాలో నిజమైన ప్రజాపరిపాలనము లేదని స్పష్టమగుచున్నది. ఇంతేకాదు, ఆ దేశములోపుట్టిన నల్లవారికిని క్రొత్తగా వలసవచ్చిన తెల్లవారికిని ప్రజాప్రాతినిధ్యపోటుహక్కులలో చాలా తారతమ్యములున్నవి. 42000 మంది ఐరోపాజాతితెల్లవారు 14 మంది ప్రతినిధుల నెన్నుకొందురు. తెల్లవారిలోనుండి గవర్నరునియమించు సభ్యులుకూడా 25 మంది యున్నారు. ఆ దేశములోనున్న 182000 మంది ఆశియావారికిని అరబ్బులకును కలిపి ఏడుగురు ఎన్నుకొనబడుప్రతినిధిసభ్యులును, నియమింపబడుసభ్యు డొకడును ఉన్నారు. ఐదుకోట్ల ఏబదిలక్షల మంది నల్లవారికి ఎన్నుకొనబడుప్రతినిధిసభ్యులే లేరు. వారిపక్షమున ఎనిమిదిమందిఉద్యోగులు సభ్యులుగా నియమింపబడుదురు। ఇందువలన ఆఫ్రికాజాతినల్లవారికి కడుపుమంటకలుగుటలో నాశ్చర్యమేమున్నది? శాసనసభలోగాని కార్యనిర్వాహకసభయందుగాని వారిక్షేమమునుగూర్చి ఆలోచించువారే యుండరు.

కెన్యా ఆఫ్రికాయూనియన్ అను ఆఫ్రికాదేశీయులప్రజాసంఘమువారు న్యాయమునాలోచించి ఐరోపావారు 11 మందిని ఆఫ్రికావారు 22 మందిని ప్రతినిధులనెన్నుకొనునట్లు రాజ్యాంగము మార్చవలెనని కోరిరి. ఇది న్యాయమైనకోర్కెయైనను దీనిని చర్చింపకనే త్రోసివేసిరి. పైగా ఆ ప్రజాసంఘము రాజద్రోహకరసంస్థయని ఆరోపించి దానిని నిషేధించిరి.

1954 మార్చినెలలో ఇంగ్లాండుకాలనీలకార్యదర్శి నైరోపికి విమానములోవచ్చి ఒక క్రొత్తరాజ్యాంగప్రణాళికను ప్రతిపాదించెను. ఆ దేశములో క్లిష్టపరిస్థితులేర్పడినందువలననే అత డప్పు డక్కడికి వెళ్ళెను. ఈ క్రొత్త ప్రణాళికవలన కెన్యాలో నెట్టి యుదారమైనరాజ్యాంగము నిర్మింపబడలేదు సరికదా, కెన్యాలోని నల్లవారిపైన యుద్ధముచేయుట కొక యుద్ధాలోచన

సంఘమును స్థాపించి, కెన్యావలసరాజ్యమున స్వపరిపాలనమును స్థాపించు చున్నట్లు ప్రపంచమునకు భ్రమకలిగించుట కొక మంత్రిమండలిని స్థాపించిరి. ఆ మంత్రులసభలో ఆరుగురు ఉద్యోగేతరసభ్యులును ఆరుగురు ఉద్యోగులును ఇరువురు నియామకముచేయబడినసభ్యులు నుండిరి. ఈ పదునలుగురిలో పదునొక్కమంది పాశ్చాత్యులు, ఇరువురు ఆశియావారు, ఒకడు ఆఫ్రికాదేశీయుడు నుండిరి. వీరికి నిజమైనఅధికారము లుండవు. వారినిర్ణయములను గవర్నరు వీటోచేసి త్రోసిపుచ్చవచ్చును. ఈ ప్రణాళిక ఆఫ్రికాదేశీయులకు రుచింపలేదు. అందువలన శాసనసభలోని ఆఫ్రికాప్రతినిధివర్గము వారు దీనికిసహకరించుటకు ఇష్టపడలేదు. ఎలియుడ్ మతు (Eliud Mathu) అనునాయన 'మాకు అన్యాయముజరిగిన'దని పలికెను. కెన్యాలోని ఆఫ్రికాదేశీయులకు తక్కినవలసరాజ్యములలోని నల్లవారికివలెనే రెండవప్రపంచయుద్ధానంతరము క్రొత్తభావములు కలిగెను. ప్రజలలో జాతీయభావములు అభివృద్ధిచెందెను. దీనిఫలితముగా కెన్యాలోని దేశీయులు ట్రేడ్ యూనియనులను'వ్యాపారవృత్తికట్టడిసంఘములను'స్థాపించిరి. దేశీయ పారిశ్రామికులు కార్మికులు పనివారు తమస్థితి బాగుపడవలెనని కోరసాగిరి.

1947 జనవరినెలలో మొంబాసారేవులోనిపనివారు హెచ్చుకూలి కావలెననికోరుచు చెగెకిబచియా (Mr. Chege Kibachia) గారి నాయకత్వమున సమ్మెచేసిరి. అతడు ఆఫ్రికా వర్కర్సు ఫెడరేషన్ అను పనివారిసంఘసమ్మేళనమునకు అధ్యక్షుడు. అంతట పోలీసువారిని సైనికులను తెచ్చి ఈ సమ్మెచేసినవారిపైన బలప్రయోగముచేసిరి. కిబచియాగారిని దేశమునుండి ప్రవాసమంపిరి. ఆ సంవత్సరములోనే అప్లాండు బేకన్ఫ్యాక్టరీ అనబడు పందిమాంసపుఫ్యాక్టరీలోనిపనివారొక సమ్మెచేసిరి. అంతట ట్రేడ్ యూనియనులను రిజిష్టరుచేయకుండా రిజిస్ట్రారు కధికారమిచ్చుచు 1948లో నొక చట్టముచేయబడెను. ట్రేడ్సుయూనియన్ అండ్ ట్రేడ్సుడిస్ప్యూటు అమెండ్మెంటుఆక్టుప్రకారము రిజిస్ట్రారులు తమకునచ్చని వ్యాపారవృత్తి కట్టడి సంఘములను రిజిస్టరుచేయకుండా నిరాకరింపవచ్చును. ఆ సంఘముల యొక్కధనము నుపయోగించుటనుగూర్చిన కట్టుబాటులుచేయవచ్చును.

1948 సెప్టెంబరునెలలో "ఈస్టు ఆఫ్రికా టి. యు. సి. జనరల్ కార్యదర్శియైన మఖన్‌గారినిపట్టుకొని,ఆయన కెన్యాపౌరుడుగానున్నను ప్రవాసమంపిరి. 1949 జనవరినెలలో గవర్నమెంటు మఱియు రైల్వేఅడ్మినిస్ట్రేషనులపనివారిని రాజకీయకార్యక్రమములందు పాల్గొనరాదని ఉత్తర్వులు జారీచేసిరి. ఆ జూలై నెలలో ట్రేడ్‌యూనియన్ రిజిస్ట్రేషన్‌ఆర్డినెన్సు అమలులోనికివచ్చెను. ఆనెలలోనే పనిలేకుండాఉన్నవారిని ఏదోపనిలో ప్రవేశించునట్లు నిర్బంధించు ఒక చిత్తుచట్టమును ప్రవేశపెట్టిరి. ఈ శాసనమునకు బానిసశాసనమని పేరువచ్చెను. జూలై నెలలో ప్రవాసముపంపుట కధికారమొసగు డిపోర్టేషన్‌ఆర్డినెన్సు ప్రకటింపబడెను. కెన్యాదేశీయులలో నభివృద్ధిచెందుచున్న అసంతృప్తిని అణచివేయుటకు ఈ కఠినచర్యలు చాలవని కాబోలు, 1950 జనవరినెలలో నీటిసరఫరా, విద్యుచ్ఛక్తి, ఆరోగ్యము, ఆసుపత్రులు, ఆరోగ్యసౌకర్యములు, రాకపోకలు, రవాణాలు మొదలగు ఆవశ్యకప్రజాసేవలు (Essential Services) అరికట్టుసమ్మెలను నిషేధించుటకు ప్రభుత్వమువారు అధికారమువహించిరి. గవర్నరు తనయిష్టము వచ్చినసేవలను ఆవశ్యకసేవలుగా ప్రకటింపవచ్చుననిరి. ఆ నెలలోనే ఎమర్జన్సీపవర్సుఆర్డినెన్సు నింకను కఠినముగాచేసి ప్రభుత్వమునకు పోలీసువారికి కోర్టులకు కావలసినంతవీలుగా అధికారములను పెంపుచేసిరి.

తూర్పుఆఫ్రికా టి. యు. సి. నాయకులను విరుగడచేయుటకై ప్రభుత్వాధికారులు పూనుకొనిరి. ఫిబ్రవరి నెలాఖరునకు తూర్పుఆఫ్రికా వర్కర్సుఫెడరేషనుపైన చర్యజరిపి దాని తాత్కాలికఅధ్యక్షుని కార్యదర్శిని అరెస్టుచేసి. పనిలేని దేశదిమ్మరికాయ అని వారిపైన నేరమునుమోపి అక్రమముగా ఆరునెలలును నాల్గునెలలును శిక్షవిధింపజేసిరి. మొంబాసాలోని ఫెడరేషన్‌కార్యాలయముపైన పోలీసువారు దాడిచేసి సభ్యత్వనమూనాపారములను రికార్డులను పట్టుకొనిపోయిరి. అటుతరువాత మే 15 వ తేదీన పోలీసువారు తూర్పుఆఫ్రికా టి. యు సి. వారి కార్యాలయముపైన దాడిచేసి దాని అధ్యక్షుడైన ఫెడ్‌కుబాయిగారిని కార్యదర్శియైన మఖన్‌సింగుగారిని అరెస్టుచేసి అది రిజిస్టరుకానిసంఘమైనందున విలయముకావలసిన సంఘసభ్యులైననేరమును మోపి శిక్షలువిధింపజేసిరి. సింగుగారు విడుదలయైన

పిమ్మట నాయనను అరెస్టుచేసి దూరప్రాంతమునగల ఒక చిన్నగ్రామమున నొక మట్టికొంపలో నిర్బధించిరి.

కుబాయిగారిమీద ఒక సామాన్యహత్యనేరముచేసినట్లు అబద్ధపునేరమును మోపిరి. అది విఫలముకాగా ఆయన మావ్‌మావ్‌సంఘనాయకుడని ఆరోపించి ఆయనను, కెన్యా ఆఫ్రికన్‌యూనియన్‌లోని ఇతర ప్రముఖసభ్యులను పట్టుకొనిరి.

ఆఫ్రికాదేశీయుల నిట్లు చీటికిమాటికి పట్టుకొని శిక్షలువిధించి కారాగారమునకంపుచుండిరి. ఆ కారాగారము లెట్టిస్థితిలో నున్నవో పరిశీలించుట అవసరము. వివిధవలసరాజ్యముల ప్రభుత్వమువా రిచ్చు స్థితిగతిలెక్కలు చాలా క్లుప్తముగాను ముభావముగాను ఉండును. ఆ కారాగారములందలి ఖైదీలను కఠినముగా చూచి బాధించుచున్నారనుసంగతిమాత్రము బయల్పడినది. వీరిచేత నిర్బంధసేవలు చేయించుచుందురు. ఆఫికావలసరాజ్యముల వారు ఆఫ్రికాదేశీయులచేత బలవంతముగా చాకిరిచేయించుచుందురు. వారిని తమ పొలములువదలి పరిశ్రమలందును గనులందును నిర్మాణములందును పనిచేయుటకు నిర్బంధించుచుందురు. ఇట్లు 1945లో టంగనీయకాలో 21000 మంది నిర్బంధసేవచేయు కూలిపనివారు తోటలందుండిరి. 96000 మంది ఇష్టపడిపనిచేయుకూలీ లుండిరి. నైజీరియాలో 14వేలమంది కూలిపనివారిని 1942లో నిర్బంధముగా నియమించిరి.

1949 సంవత్సరపు కలోనియల్‌రిపోర్టు ఫర్ నైజీరియా అను నివేదికలో కారాగారములలోని ఖైదీలచేత చేయించిన వెట్టిచాకిరినిగూర్చి కొన్ని వివరములున్నవి.

38వేలకేసులకుపైగా పోలీసువారు చర్యతీసికొనిరి. దీర్ఘశిక్షలువిధింపబడిన ఖైదీలు చాలామంది వివిధకారాగారములలోని వర్క్‌షాపులలో పనిచేయుచుండిరి. ఈ పరిశ్రమలు ప్రభుత్వమువారి వివిధశాఖలయొక్క అవసరములనుతీర్చుటకే ఉపయోగించుచున్నవి కాని, గృహపారిశ్రామికులతో ఖైదీ పారిశ్రామికులు పోటీచేయరు.

దక్షిణాఫ్రికాసమితిరాజ్యములోని ఖైదీలచేత నిర్బంధసేవచేయించుట చాలా విరివిగా జరుగుచున్నది. ఆరెంజిఫ్రీస్టేటులో పూర్వము జడ్జి ప్రెసిడెంటుగాపనిచేసిన డాక్టర్ క్రౌస్ (Krause) గారు అక్కడి న్యాయపరిపాలనావిధానము, కారాగారపరిస్థితులు సిగ్గుచేటుగానున్నవనిరి." మన కారాగారములలోనిఖైదీల కింకను కాళ్ళసంకెళ్ళను, నిలువుబేడీలువేసి త్రికోణ చట్రమునకుకట్టి కొట్టుటయు జరుగుచున్నవి. ఖైదీలకు కడుపునిండా తిండి కూడా ఉండదు. వారిని చీకటికొట్టులో నిర్బంధింతురు. వారు బాధతోవేయు కేకలు ప్రతిధ్వనులిచ్చుచుండును. హత్యానేరమునకు శిక్షింపబడినవారిలో నూటికిపదిమంది కేవలము నిర్దోషులు" అని ఆయన వ్రాసినారు.

## "ట్రేడ్ యూనియన్" పారిశ్రామికుల కట్టడిసంఘము

బ్రిటిష్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్వారు 1938లో ప్రకటించిన వ్యాపారవృత్తి కట్టడిసంఘముల (ట్రేడ్ యూనియనుల) యొక్క నిబంధనల నమూనాలున్న చిన్నగ్రంథములో బ్రిటీషువలసరాజ్యముల రాజ్యాంగశాఖవారి యభిప్రాయమునుబట్టి ట్రేడ్ యూనియనులహక్కులు, బాధ్యతలును వివరింపబడినవి.

(Trade Union Rules, Agendas and Standing Orders for the guidance of Colonial Organizations)

(1) పరిపూర్ణమైన నిర్మాణవ్యవస్థ (Organization)చేకూర్చుటకు

(2) న్యాయమైనవేతనములు, కూలి, షరతులు సంపాదించుటకు,

(3) పనివారిమధ్యను యజమానులమధ్యనుగల వివాదములు, పనివారిలో వారిలోవారికిగలవివాదములను వీలైనంతవరకు సామరస్యముగా పరిష్కరించుటకు, వారిసంబంధములు క్రమపరచుటకు.

(4) సంఘసభ్యులకు వీలైనపని, సౌకర్యములు లాభములు కలిగించుటకు.

(5) సంఘసభ్యుల క్షేమ లాభములకొఱకు శాసనములుచేయించుటకు

(6) పారిశ్రామికులకుసంబంధించిన న్యాయసమ్మతమైన రాజకీయోద్దేశములను ప్రోత్సహించుటకు

(7) వార్తాపత్రికలను, ఇతరప్రచారసాధనములను ప్రకటించుటకు

(8) ట్రేడ్ యూనియన్ విధానముయొక్క క్షేమలాభములకు తోడ్పడు ఒక ఫెడరల్ సంస్థకు తోడ్పడుటకు

(9) ఇంకను అంగీకృతములైన ఇతరవిధములుగా సభ్యులక్షేమమునకు కృషిచేయుటకు ఈ సంఘములు నిర్మాణముచేయవచ్చును.

ఈ లక్ష్యములు బాగున్నవని ఆఫ్రికాదేశీయపారిశ్రామికులు తలచి ఇట్టి వ్యాపారవృత్తి కట్టడిసంఘముల నేర్పరచుకొనుటలో ఆశ్చర్యములేదు. అయితే బంగారుకోస్తా వలసరాజ్యమువారి పబ్లికు రిలేషన్సుశాఖవారు "మీ ట్రేడ్ యూనియన్" అను నొకకరపత్రమును ప్రకటించి అందులో వ్యాపార వృత్తికట్టడిసంఘములనుగూర్చిన కొన్ని శ్రీరంగనీతులను బోధించిరి."కొంత మందిపనివారు ఏకమై తమస్థితినిఅభివృద్ధిచేసికొనుటకును, తమకును యజమానులకునుమధ్య గల పరస్పరసంబంధములను బాగుపరచుకొనుటకును చేరినసంఘమే ట్రేడ్ యూనియన్ సంఘము. ఇది రాజకీయసంస్థ కాదు. ఇది సమ్మెలనుచేయుటకేర్పడినదికాదు. వీలైనంతవరకు సమ్మెలులేకుండా చేయుటకే ఈ సంఘమ లేర్పడినవి. సమ్మెలు పారిశ్రామికులకును యజమానులకునుకూడా శ్రేయస్కరములుకావు. పనివాడు పరిశ్రమకు చాలా ముఖ్యుడు. పారిశ్రామికుడును యజమానియు కలిసి పరిశ్రమనునడుపనిచో పనిజరుగదు. పని సరిగా చక్కగా జరుగునట్లును పరిశ్రమవర్థిల్లునట్లును ట్రేడ్ యూనియనులు ప్రయత్నింపవలెను. అప్పుడే పనివారికి లాభము కలుగును."

"నెగోషియేషనుకమిటీ అనబడుసంఘము పారిశ్రామికులకు దినమునకు రావలసినకూలివిషయమై వారిపనియొక్కషరతులు పరిస్థితులవిషయమై కృషిచేయును."

"తనసొమ్మునకు తగినపని జరుగువలెనని యజమాని కోరుటకు అర్హుడై యున్నాడు. సమ్మెలులేకుండా పనిచేయుటవల్లనే ఉభయులకును లాభము కలుగును. యజమానియొక్క తాహతునుబట్టి, శక్తినిబట్టి కూలినికోరవలెను. తానుపుచ్చుకున్నకూలికి తగినపని చేయవలెను."

ఈ శ్రీరంగనీతులనెల్ల బోధించుటలో ఆ ప్రభుత్వమువారు తెల్లయజమానుల లాభమునే ఆలోచించిరి. నిజముగా నిట్టిసంఘములు ట్రేడ్ యూనియనులనియే అనిపించుకొనవు. ఆఫ్రికాదేశీయులు నిజమైన ట్రేడ్ యూనియనులు స్థాపించుట ప్రారంభింపగా ప్రభుత్వమువారును తెల్లవారును కలిసి వానిని అణచివేసిరి.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## ఏడవ ప్రకరణము

### కెన్యా జాతీయోద్యమము

కెన్యాలోని ఆఫ్రికాజాతినల్ల పనివారు స్థాపించుకొనిన ట్రేడ్‌యూనియన్ అను పారిశ్రామికవృత్తిసంఘములను అణచివేయుటకు ఆ దేశమునే బ్రిటీషుప్రభుత్వమువారు కఠినచర్యలనుతీసికొనిరి. వానిని అక్రమసంఘములుగానెంచి పోలీసులు వారికార్యాలయములపైన దాడిచేసి. వారిరికార్డులను తీసికొనిపోయి వారికార్యనిర్వాహకోద్యోగులను అరెస్టుచేసి దేశమునుండి ప్రవాసమంపిరి.

కెన్యాలోనిఆఫ్రికాదేశీయులు కెన్యా ఆఫ్రికాయూనియన్‌అను నొక రాజకీయప్రజాసంఘమును స్థాపించుకొని ప్రజలక్షేమముకొరకు కృషిచేయుచుండిరి. ఇది ఆ దేశీయుల ఏకైకరాజకీయప్రజాసంఘముగా నుండెను. నల్లవారి ట్రేడ్‌యూనియనులను అణచినట్లే ఈ రాజకీయసంఘమునుకూడ ఆ వలసరాజ్యప్రభుత్వమువా రణచివేసిరి. దానికథ చిత్రమైనది. ఈ ప్రజాసంఘమునకుపునాది ముప్పదేండ్లక్రిందటనే నిర్మింపబడియుండెను. క్రీ. శ. 1921లో ఆఫ్రికాదేశీయులు రాజకీయహక్కులను జాతీయస్వాతంత్ర్యములను వాంఛించి, "తూర్పుఆఫ్రికా అసోసియేషన్"అను నొక ప్రజాసంఘమును స్థాపించిరి. గాని, దాని నా వలసరాజ్యప్రభుత్వమువారు 1922లోనే అణచివేసిరి. అప్పు డా దేశీయులు"కికుయూ సెంట్రల్ అసోసియేషన్" అను నింకొక ప్రజాసంఘమును స్థాపించిరి. దానినికూడా దొరతనమువారు అణచివేసిరి. అంతట దేశీయులు "కెన్యా ఆఫ్రికాయూనియన్" అను ప్రజాసంఘమును స్థాపించిరి, ఇది క్రమక్రమముగా నభివృద్ధిచెంది చాలా బలవం

తమైన ప్రజాసంఘమైనది. 1952 నాటికి ఈ సంఘమునందు చందాలిచ్చు సభ్యు లొక లక్షమంది యుండిరి. కెన్యాలోని ఆఫ్రికాప్రజలభూములను వారికి మరల నిచ్చివేయవలసినదనికోరుచు నాలుగులక్షలమందిచేత సంతకములుచేయించి ఈ సంఘమువారు ప్రభుత్వమున కొక మహజరునంపిరి. ముప్పదివేలమందిప్రజలు నింక నంతకన్నను హెచ్చుమంది కూడిన మహాసభలు జరుగుచు, అందులో ఆఫ్రికావారు తమహక్కులనుగూర్చి మహోపన్యాసములనుచేయసాగిరి ఈ సంఘమునందు కికుయూజాతివారే ముఖ్యమైన బలముచేకూర్చినను, వారిలోనేగాక లూవో(Luo)జాతివారిలోను ఇతర జాతులలోనుకూడా ఈ సంఘమునకు గొప్ప పలుకుబడి యుండెను. ఈ ప్రజాసంఘమునకు ప్రతిభాశాలియైన జోమో కెన్యట్టాగారు నాయకత్వము వహించిరి. ఆయనక్రింద నింకను కొంతమంది చిన్నచిన్న నాయకులుండిరి.

కెన్యా ఆఫ్రికాయూనియన్‌వారి కార్యక్రమములో సులభసాధ్యములైన మితవాదపద్ధతితోనే రాజకీయసంఘనిర్మాణమును, ఆందోళనమును చేయువిధానములే చేర్చబడెను. వారు సమావేశస్వాతంత్ర్యమును, ముద్రణ ప్రకటనస్వాతంత్ర్యమును కోరుచు ప్రజాప్రభుత్వవిధానములప్రకారము ప్రజాప్రతినిధు లెన్నుకొనబడవలెననిరి. జాతివిచక్షణ కూడదనిరి. చట్టసమ్మతములైన పారిశ్రామికవ్యాపారివృత్తిసంఘములు (Trade Unions) స్థాపించుట కాటంకము లుండరాదనిరి. ప్రజలందరికిని నిర్బంధవిద్యాబోధనము కావలెననిరి. కెన్యాప్రజలకు సంపూర్ణస్వాతంత్ర్య ముండవలెననిరి. కెన్యాదేశీయుల యొక్కయు, వలసవచ్చిన తెల్లవారి చరిత్రనుబట్టియు ఈ ప్రణాళిక చాలా న్యాయమైనదిగా నెంచవలసియున్నది. అయితే అప్పటి తెల్లప్రభుత్వాధికారులు దీనిని న్యాయమైనదానినిగా పరిగణింపలేదు. అంతేకాదు, కెన్యా ఆఫ్రికాయూనియన్ ప్రజాసంఘసభ్యులును దాని కార్యనిర్వాహకవర్గమును ప్రభుత్వమునుతిరుగదోడురాజద్రోహులుగను, తెల్లవారికి ప్రమాదముకలిగింపగలవారిగను, అసహనశీలురుగను పరిగణింపబడిరి.

కెన్యారాజ్యములోని తెల్లవారిపక్షమున ప్రకటింపబడు "కెన్యా ఎలెక్టర్సుయూనియన్ న్యూస్‌లెటర్" అనబడు నొక వృత్తాంతపత్రికయొక్క 1952 నవంబరుసంచిక లండనునగరమున 1953లో విరివిగా పంచిపెట్ట

బడెను. కెన్యారాజ్యమునందు (ఎమర్జన్సీ) అత్యవసరపరిస్థితులలోని ఆప ద్ధర్మమును పురస్కరించుకొని కెన్యాప్రభుత్వమువా రచ్చట కఠినచర్యలు జరుపదలచిన తరుణముననే ఈ వృత్తాంతపత్రికయొక్క ప్రత్యేకసంచిక ఇట్లు ప్రకటింపబడుట ముఖ్యముగా గమనింపతగినవిషయము. అందులో నీ క్రిందిసంగతులు వివరింపబడినవి. "రెండవప్రపంచసంగ్రామానంతరము మఱల నీ దేశమునకు తిరిగివచ్చినప్పటినుండియు దేశీయప్రజానాయకుడైన జోమోకెన్యట్టాయొక్కచర్యలను ఎలెక్టర్సుయూనియన్‌వారు జాగ్ర త్తగా కనిపెట్టిచూచుచున్నారు.... కెన్యట్టా చాలా టక్కరితనముతో కికుయూ జాతివారియాళయములకు మార్క్సుసిద్ధాంతములను ఘుడిపెట్టి ప్రచారము చేయుచున్నాడు.... ఈసంగతి తెలిసి ఎలెక్టర్సుయూనియన్ ఎగ్జిక్యూ టివ్‌కమిటీ 1948 మార్చినెలలో నీ క్రిందితీర్మానమును గావించి కెన్యాప్రభు త్వమునకు సమర్పించినది. "కెన్యట్టాయును, ఆయన అనుచరులును చేయు చున్న విప్లవాత్మకమైన ప్రచారమునుగూర్చినసాక్ష్యము. వారిని డిపోర్టేషన్ ఆర్డినెన్సుక్రింద ప్రవాసమంపుటకు తగినట్టిదిగా నున్నది. అందువలన న్యాయ శాస్త్రక్రమపరిపాలనశాఖమంత్రిని వెంటనే అట్టిచర్యను గైకొనవలసినదని ఈ కమిటీవారు కోరుచున్నారు."

ఈతీర్మానమును సమర్పించినప్పుడు ఆ శాఖకు అప్పుడు అధికారిగా నుండిన మంత్రిగారు, కెన్యట్టాను అరెస్టుచేయుతరుణ మింకను రాలేద నియు, అతనిని అరెస్టుచేయుటవలన అతనికి అనవసరముగా గౌరవమును ఖ్యాతిని కలిగించినట్లగుననియు, తనఅభిప్రాయమని చెప్పెను. ఈ మంత్రిగారి అభిప్రాయమును ఎలెక్టర్సుయూనియన్‌యొక్క ఎగ్జిక్యూటివుకమిటీవారికి రుచింపలేదు గాని, వారేమియు చేయజాలక ఊరకొనిరి. 1948 ఆగష్టు నెలలో ఎగ్జిక్యూటివుకమిటీలోని ఒకసభ్యుడు కెన్యట్టాయొక్క విప్లవకరమైన చర్యలనుగూర్చి స్పష్టమైనసాక్ష్యమును తెచ్చితినని ఈ క్రింది సంగతిని చెప్పెను: 1948 ఆగష్టు 14 వ తేదీన ఉదయము 9 గంటలకు మధ్యాహ్నము 2 గంటలకుమధ్య కెన్యట్టా అప్లాండు అను మెరకప్రాంతమునం దొకసభ నేర్పాటుచేసెను. కెన్యావలసరాజ్యములోని తెల్లవారు ఆఫ్రికాదేశీయులను పశువులవలె మేకలవలె చూచుచున్నారని కెన్యాగవర్నరుగారికి కూడా ఒక

వ్యవసాయకృషిక్షేత్రమున్నందువలన తెల్లవారికే సహాయముచేయుచున్నారని, బ్రిటీషుసామ్రాజ్యప్రభుత్వమువారు, తమ ఇతరదేశములలోనిప్రజలనుచూచి నట్లు ఈ కెన్యావలసరాజ్యప్రభుత్వమువా రిక్కడిప్రజలను చూడక, వేరు విధముగా చూచుచున్నారనియు ఉపన్యసించినాడు." ఈ సాక్ష్యాధారమునుబట్టి కెన్యట్టాపైన చర్యతీసికొనవలసినదని ఎగ్జిక్యూటివుకమిటీసభ్యుడు కెన్యా ప్రభుత్వమును కోరెను. అయితే, వా రట్లు జరుపుటకు నిరాకరించిరి. సాక్షులుగవచ్చువారిని భయపెట్టిరి. రాజకీయకారణములవలన సాక్ష్యములను నమ్మవలదని మేజస్ట్రేటులను హెచ్చరించిరి. ఈ వ్యవహారమంతయు ఎగ్జిక్యూటివు కమిటీసభ్యుడు గవర్నరుకు తెలియపరచుచు నిట్లు వ్రాసెను "కెన్యట్టా చేయు రాజద్రోహకరమైనప్రచారము నరికట్టి అతనిని ప్రవాసమంపనిచో, ఆఫ్రికా దేశీయులలో సంచలనము కలుగును. చాలామంది భయపడుదురు. చాలా చిక్కులుకలుగును. దేశములో జరుగుచున్నసమ్మెలకును అక్రమసమావేశములకును దొమ్మినేరములకును, భూసారరక్షణప్రయత్నములు విఫలములగుటకును, కొండకనుమలదగ్గర జరుగు సంఘర్షణలకును, ఇతరవిధములుగా ప్రభుత్వాధికారములు ధిక్కరింపబడుటకును కెన్యట్టాయే కారకుడుగా నున్నాడు." అని వ్రాసెను. ఈ నివేదికలో వ్రాయబడినసంగతులవలన కొన్నివిశేషములు తెలియుచున్నవి. కికుయూజాతివారున్నప్రదేశములలోని ఉద్యోగు లా నల్లవారిపశువులను విరివిగా పట్టుకొని బందెలలోపెట్టుచుండుటయు, సాయుధదళములవారు గట్టిగా బలప్రయోగముచేసి దౌర్జన్యములనణచుటయు, కఠినమైన కారాగారశిక్షలను విధించుటయు, కొరడాలతోకొట్టుట, దెబ్బలశిక్షలువిధించుటయు చాలా బాగున్నదనియు, దీనివలన కొంత మేలు కలుగుననియు చెప్పి, ఆనాడు అవలంబింపబడుచున్న క్రూరవిధానముల నతడు సమర్థించినాడు.

కెన్యట్టానుగూర్చిన రెండవసాక్ష్యము ఆ నివేదికకు జతపరుపబడిన అనుబంధమునం దున్నది. అది ఎలెక్టర్సుయూనియన్ ఎగ్జిక్యూటివ్ఆఫీస రగు కెండల్‌వార్డు అనునతడు యూరపియన్ ఎలెక్టెడ్‌మెంబర్సు ఆర్గనైజేషన్‌చెయిర్మనుకు వ్రాసినలేఖయొక్కనకలు. ఆఫ్రికాదేశీయనాయకులను చైతన్యరహితులుగాచేయవలసినదని ఎలెక్టర్సుయూనియన్‌వారు చాలా

మారులు కోరియున్నారనుసంగతిని వార్తగా రా లేఖలో వ్రాసిరి. విప్లవ కారులు (Subversive Leaders) అగు ఆఫ్రికా దేశీయనాయకులను చైతన్యరహితులుగాగాని విగతప్రాణులుగాగాని (Neutralization or Liquidation) చేయుట అత్యావశ్యకమని, మూడునాలుగేండ్లక్రిందట నీ యూనియన్ ఎగ్జిక్యూటివ్‌కమిటీవారు ప్రకటించిన అభిప్రాయము ఇటీవల సంభవించిన పరిస్థితులవలన రుజువైనది. కెన్యాఆఫ్రికాసంఘమువారును, ఆ సంఘములోని ఆఫ్రికాజాతినాయకులును, ప్రజాప్రభుత్వసిద్ధాంతములనను సరించి జరుపు శాస్త్రసమ్మతములైనచర్యలను ఆ దేశములోనివసించు తెల్ల వారు రాజద్రోహకరమైనవిగను విప్లవాత్మకములైనవిగను పరిగణించి ఈ నల్లవారి దేశనాయకులను రూపుమాపవలసినదని గట్టి ఆందోళన చేయుచుండిరి. పోలీసువారుచేయు దాడులు, దొమ్మీలువల్లను తెల్లవారి వర్ణ భేదసిద్ధాంతమువలనను దేశములోని వివిధజాతులమధ్యగల సామరస్యము చెడుటను, కెన్యా ఆఫ్రికాయూనియన్‌నెత్తిపైన రుద్దుట కీ తెల్లవారు ప్రయత్నించిరి. అదివఱకు ఆఫ్రికావారి ప్రజాసంఘములను అణచి నట్లే ఈ సంఘమునుకూడా అణచివేయవలెనని వారు సంకల్పిం చిరి. దానికి వా రొకతంత్రమును పన్నిరి. అంతకుపూర్వము కొంతకాలము నుండి దేశములోనికి ఆఫ్రికాజాతివారిలోని దుర్మార్గులైన ఆతతాయినేర గాండ్రు కొందరు చెలరేగి తెల్లవారియిండ్లపైనబడి వారిపైన దౌర్జన్యములు చేసి, వ్యాఆస్తినిదోచుకొనుచు కొన్ని దారుణకృత్యములను గావింపసాగిరి. ఇట్టిదారుణకృత్యములను జరుపుటకు నేరగాం డ్రొక రహస్యసంఘముగా నేర్పడిరని అది మావ్‌మావ్‌సంఘమని, వారు ఇతరులనుకూడా ఘోరప్రమా ణములచేయించి తమసంఘములో చేర్చుకొనుచున్నారనియు,దేశములోజరుగు హత్యలు చిత్రవధలు మొదలగు దారుణకృత్యములకెల్ల ఆ రహస్యసంఘ సభ్యులే కారణభూతులనియు, కెన్యా ఆఫ్రికాయూనియన్‌లోని జాతీయనాయ కుల కా రహస్యసంఘముతో సంబంధమున్నట్లును ఆరోపించి తెల్లవారు దుష్ప్రచారము గావింపసాగిరి. అంతట 1952 అక్టోబరు 20వతేదీన కెన్యా ప్రభుత్వమువారు దేశములో అత్యవసరపరిస్థితి (Emergency)ఏర్పడినదని ప్రకటించి, కెన్యా ఆఫ్రికాయూనియన్ ప్రజాసంఘమును నిషేధించి, ఆ

సంఘములోని ప్రముఖసభ్యులకు మావ్‌మావ్ ఉద్యమముతో సంబంధము న్నట్లు ఆరోపించి వారికి చాలా క్రూరశిక్షలను విధించిరి.

అత్యవసరపరిస్థితి యేర్పడినట్లు ప్రభుత్వము ప్రకటించినసమయ ములో నీ విషయమై ప్రభుత్వోద్యోగు లేమనిచెప్పుచుండిరో పరిశీలిం తము. 1952 జూలై నెలలో న్యాయశాస్త్రక్రమపరిపాలనశాఖమంత్రి ఆ సమ యమున చాలా విపరీతముగా నేరములు జరుగుచున్నట్లు చేయబడినప్రచా రము నిజముకాదని నేరములనుగూర్చిన స్థితిగతిలెక్కలు అంకెలు రుజువు చేయుచున్నవని పలికెను. కొలదిదినములకే పోలీసుకమీషనరుగారు మాట్లా డుచు అప్పుడు జరిగిన బందిపోట్లు దౌర్జన్యములు సామాన్యనేరగాండ్రు చేసినవేగాని, వానితో రహస్యసంఘములవారి కెట్టిసంబంధమును లేదని చెప్పెను. సెప్టెంబరునెలలో చీఫ్ నేటివ్‌కమీషనరు మాట్లాడుచు "మావ్ మావ్ అను దారుణచర్యల రహస్యసంఘమువారినిగూర్చిన సమాచారములు కేవలము అతిశయోక్తులతో నిండియున్నవి. గోరంతలు కొండంతలుచేయ బడిన" వని చెప్పెను. దారుణకృత్యములు జరుగుచున్నవిధానములనుగూర్చి ప్రశ్నింపగా అట్టిదేదియు నాకు కనబడుటలేదని ఆయన బదులుచెప్పిరి. పైన చెప్పినసంగతులవలన అత్యవసరపరిస్థితి యేర్పడినట్లు ప్రభుత్వముప్రకటించి ఆఫ్రికాదేశీయులపైన యుద్ధచర్యలను ప్రారంభించినసమయమునందు ఆ వలసరాజ్యములోని తెల్లవారిపైన ఆయుధములతో దౌర్జన్యములు సాగుచుం డినమాట నిజముకాదనియు, అప్పుడు జరిగిన కొన్నినేరములు సామాన్య మైననేరములేయనియు, కెన్యా ఆఫ్రికాయూనియన్‌తో వాని కెట్టిసంబంధ మును లేదనియును స్పష్టపడుచున్నది. ఆసమయమున రాజకీయహత్యలు చేయుటకు ప్రమాణములనుచేయించురహస్యసంఘ మేదైన యొకటి యున్న దాయనువిషయము అప్రస్తుతమైనది. నిజమునకు సామాన్యనేరములు కొం చెము వృద్ధిచెందగా అధికారులు లా నెపమునుగైకొని లేనిపోనివి కల్పించి, ఆఫ్రికాదేశీయుల జాతీయోద్యమమును విచ్ఛిన్నముచేయుటకు పూనుకొనిరి. అట్లుచేసినప్పుడు సామాన్యముగా ఆత్మగౌరవముగలవారెల్లరును చేసినట్లే దానికి ప్రతిక్రియగా ఆఫ్రికాదేశీయులు జరిపిన చర్యలనుగూర్చి తెల్లవారు తీవ్రముగా విమర్శించి తమ భయాశ్చర్యములను ప్రకటించిరి. మావ్‌మావ్

ఉద్యమమునుగూర్చి కెన్యాప్రభుత్వమువారు చిత్రచిత్రములైనవర్ణనలనుగావించుచు, అధికారపూర్వకమైన ప్రకటనలను గావించిరి. "ఈ మృగముపైన కలియబడగా నిది ఎదురుతిరుగుచున్నది. ఇది చాలా పొగరుబోతుది" అని ఒక ఫ్రెంచిసామెత యున్నది. కెన్యాఅధికారుల పద్ధతి యీ సామెతకు అనుగుణముగా నున్నది.

కెన్యాలోని ఆఫ్రికాదేశీయులు తమ రాజకీయ పారిశ్రామికవ్యవస్థలను క్రమక్రమముగా బలవంతులగుచున్న నల్లపారిశ్రామికులసహాయముతో గట్టిచేసికొనుటకు ప్రయత్నించుచు, అన్నివిధములైన ప్రజాప్రభుత్వహక్కులను అభివృద్ధిచేయవలసినదని కోరుచు నిజమునకు కెన్యా ఆఫ్రికాయూనియన్‌వారుకోరిన కోర్కెలనే కోరుటయనునది వారి ప్రధానకార్యక్రమమై యున్నమాట నిజము. అయితే 1952 నుండి కెన్యాప్రభుత్వమువారీ ప్రజలను అనేకవిధములుగా రెచ్చగొట్టి బాధించుచుండగా వారిని తుపాకులతో కాల్చుచుండగా, వారిని నిప్పులపైన పట్టుకొనియుంచి కాల్చుచుండగా, పచ్చిఖడ్గమృగచర్మపుకొరడాలతో బాదుచు, వారిని బూట్సుకాళ్ళతో తన్నుచు, కొట్టుచు తిండిలేకుండా మాడ్చి చంపుచుండగా వారు సహించియుండవలెనమట హాస్యాస్పదము. తక్కిన వలసరాజ్యములందుకూడా నల్లవారికీ దురవస్థయేపట్టినది. అక్కడకూడా ఇదేతంతు జరుగుచున్నది.

1953 జనవరి 19 వ తేదీన నకురులోని మేజస్ట్రేటుకోర్టులోనికి డెబ్బదియేండ్లముదుసలివాడొకడు వచ్చెను. అతనిపేరు కింమనగితూరి. అతడు కినంగోప్రాంతమున నొక తెల్లవానివ్యవసాయక్షేత్రములో చేరిన ఒకభూమిలో తిష్ఠవేసుకొని కూర్చుండెనట. ఒకనాటిరాత్రి తనగుడిసెపైకి వచ్చిపడి, తననుకొట్టి ఘోరకృత్యములుచేసిన కొందఱిపైన నతడు సాక్ష్యమిచ్చుటకు వచ్చెను. ఆ నేరముచేసినవారిలో మొంబాసాలో సరుకు లమ్ముకొను 31 సంవత్సరములవయస్సుగల మైకేల్ జాన్‌సాయరు; కిసెలోలో రైతుఅగు 29 సంవత్సరములయీడుగల డెవిన్‌లెస్ చార్లెస్ ఫారబిన్; డెన్మార్కుదేశమునుండి వలసవచ్చియున్న ఫ్రాంజ్ పొలిహ్వాన్, ఆఫ్రికాదేశీయుల రిజర్వుపోలీసువారేడుగురు నుండిరి. సాయరు, ఫారబిన్,

హ్యూస్‌లు కెన్యాపోలీసురిజర్వుస్థావరదళములలోనివారు." కింవనగితూరిఇచ్చిన సాక్ష్యము ప్రైమ్సుపత్రికలో ప్రకటింపబడెను. "కింవనగితూరి మేజస్ట్రేటు దగ్గర నిట్లుచెప్పెను. అక్టోబరు 24వతేదీన సాయరు, ఫారజిన్‌లును, నలుగురుఅస్కారీలును అర్ధరాత్రిలో తనగుడిసెదగ్గరకువచ్చి నీవు మావ్‌మావ్ ప్రమాణమునుచేసినావా యని అడిగిరి. లేదని అతడు చెప్పెను. అంతట పోలీసులు అతనిగుడిసెను వెదకిచూచిరి. అప్పు డొక ఐరోపావాడు తన చేతితో నతని నొక చెంపకాయకొట్టెను. పోలీసువారు పిడికిళ్ళతోగ్రుద్ది తన్నిరని అతడు చెప్పినాడు. తరువాత తనను కొరడాతో కొట్టవలసినదని సాయ రొకపోలీసువాని నాజ్ఞాపించినాడు. బిరుసైనఖడ్గమృగచర్మముతోనో నీటిగుఱ్ఱపుతోలుతోనో చేసిన 'కిబోక్' అనబడుకోరడాతో నా పిర్రలపైన బాదినపిమ్మట సాయరు ఇరువురుఅస్కారీలను, ఇంక నిద్దరిని అతనికాళ్ళ చీలమండలదగ్గర పట్టుకొనుడని చెప్పి, అతనిగుడిసెలోనున్న బొగ్గులనిప్పు పైన అడ్డముగా పట్టించియుంచెను, అని చెప్పి, కింవనగితూరి తనను వేడి పొయ్యిరాళ్ళమీద పెట్టిరనియు,తనరొమ్మును పొత్తికడుపును కాలినవనియు, తా నేడ్చినను ఆ నిప్పులపైనుండి తనను తీయలేదనియు, తన నాప్రకారము కాల్చుచుండగా ఐరోపావారు చూచుచు నూరకొనిరనియు చెప్పెను. హ్యూసుకు 60 నవరసులుజరిమానా విధింపబడెను. సాయరుకును ఫారిజీనుకునుకూడా జరిమానావిధింపబడెను. ఏడుగురు ఆఫ్రికాపోలీసువారిని రెండేండ్లవఱకు సత్ప్రవర్తనమునకు పూచీయిచ్చునట్లు మేజస్ట్రేటు ఉత్తరువుచేసెను.

ఇది పైకివచ్చినకేసు. సాధారణముగా పోలీసువారుచేయు ఘోరకృత్యములు బయటకురావు. ప్రకటింపబడవు. వారిక్రూరచర్యలకు గురియైన దురదృష్టవంతుడు మరణించును లేదా భయపడిపోయి సంగతులను బయటకుచెప్పడు. లేదా వాడు ఇచ్చుకొనినఅర్జీ బుట్టదాఖలగును.

1954 జనవరినుండి అరెస్టుచేయబడిన 170000 మందికి పైబడిన సంఖ్యగల నల్లవారిలో బహుకొద్దిమంది మాత్రమే తమపైనజరిగిన దౌర్జన్యములనుగూర్చి చెప్పుకొనుటకు సాహసించిరి. దౌర్జన్యములుచేసిన 130 మందిపైన కేసులుపెట్టగా 73 మందిని శిక్షించిరి. అవినీతిపరులైన 12 మందిపోలీసువారుకూడా శిక్షింపబడిరి. ఫిబ్రవరినెలలో నొక పార్లమెంటరీ

డెలిగేషనువారు తమనివేదికలో ప్రజలకు న్యాయశాస్త్రముపైన క్రమపరిపాలనముపైన విశ్వాసముపోవునంత హెచ్చుగా పోలీసువారి దుర్మార్గములును క్రూరకృత్యములును జరిగినవని వ్రాసిరి.

కోర్టులోనికివచ్చిన కేసులవలన చాలావిశేషములు బయల్పడుచుండును. ఆఫ్రికావారికి నాగరికతనేర్పుటకువచ్చిన తెల్లవారిఅవినీతి స్పష్టమగును. ఎలిజాఅను నొక ఆఫ్రికాదేశీయునికొట్టి చంపి హత్యచేసిననేరమునకు సార్జెంటు కీట్సుపైన, రూబెన్సు అను పోలీసుఉద్యోగిపైన 1903 అక్టోబరులో నేరముమోపబడెను. ఆతడు దారుణవాదియని సాక్ష్యమువచ్చినందున అతనిని కొట్టిరి. అతనిపైనవచ్చిన సాక్ష్యమన్ననో మఱియొక ఆఫ్రికావానిని కొట్టగా వాడు చెప్పినదే. తుదకీ సాక్షి పోలీసువారు చెప్పమని బోధించినసంగతులను తన దెబ్బలబాధవలన నోటితోచెప్పలేక ఒక కాగితముపైన వ్రాసి సంతకముచేసెను. విచారణలో నీ కీట్సును రూబెన్సును కియాంబులోని వ్యవసాయోద్యోగియైన లెఫ్టినెంట్ సెట్టనును ఈ కేసునుమాపుచేయుటకై చనిపోయినవానిశవముదగ్గర జరిగిన పంచాయితీలో తాముచెప్పవలసిన వాఙ్మూలమును డిస్ట్రిక్టుకమీషనరుగారే తయారుచేసిరను సంగతిని బయటపెట్టిరి. కీట్సుకు 50 నవరసులును, రూబెన్సుకు 100 నవరసులును జరిమానా విధింపబడెను.

టంగనీయికాలోని డారెస్సలాములో నవంబరునెలలో ఇటువంటిదే మఱియొకకేసు విచారణకువచ్చెను. నల్లవారి పుట్టుపూర్వోత్తరములనుపరిశీలించి వారిలో రహస్యసంఘములతో సంబంధమున్నవారిని పట్టుకొనుటకునియమింపబడిన కెన్యా స్క్రీనింగుటీములో పదునొకండుమంది టంగనీయికానుండి పారిపోయివచ్చి "మావ్‌మావ్" సంఘీయులని అనుమానింపబడిన కొంతమందిపైన బలప్రయోగము చేసినందులకు నేరము మోపబడెను. ఈటీమువారినాయకుడు పందొమ్మిదేండ్లవయస్సుగల బ్రయన్ హేవర్డు. అనుమానింపబడినవారిని ఖడ్గమృగచర్మపుకొరడాలచిక్కలతో నురిపెట్టిచంపెదనియు కాలుచున్నసిగరెట్టుపీకెలతో వారిచెవిగూబలను కాల్చెననియు అతనిపైనసాక్ష్యమువచ్చెను. అతడు నేరముచేసినట్లు నిర్ణయింపబడి

అతనికి మూడునెలల ఖైదును నూరునవరసుల జరిమానాయును విధింపబడెను.

నేరములుచేసిన దేశీయులకు, నేరములుచేసిన ఐరోపావారికిని విధింపబడుశిక్షలయందు తారతమ్యముకనబరచుచుండిరి. జేమ్సు మెక్‌డౌగల్ అను ఐరోపావానిని హత్యచేసెననునేరమునకు 12-1-1953 తేదీన ఐదుగురు కికుయూదేశీయులకు ఒక అసాధారణ సెషన్సుకోర్టు మరణదండనశిక్ష విధించెను. ఈకేసులో ముద్దాయి నేరముచేసినట్లుచెప్పిన సాక్షులు 12 లేక 14 సంవత్సరములవయస్సుగల ఆఫ్రికా దేశీయులచిన్నపిల్లలు! వారిసాక్ష్యములో నెన్నో అసందర్భములున్నవని టైమ్సుపత్రిక వ్రాసియున్నది. అయినను వారి సాక్ష్యముపైన నా న్యాయాధిపతి ఆ దురదృష్టవంతుల కట్టి క్రూరశిక్ష విధించెను.

ఆఫ్రికాలోనినల్లవారిని చిత్రవధలుచేయుటనుగూర్చియు, వారిని సమష్టిగాశిక్షించుటనుగూర్చియు. చర్చిమిషనరీసొసైటీకిచెందిన క్యానన్ టి. సి. ఎఫ్. బ్యూస్‌గారు తమఅసమ్మతిని ప్రకటించిరి. న్యూస్టేట్సుమన్ అండ్ నేషన్ పత్రికాసంపాదకులైన కింగ్‌స్లే మార్టిన్‌గా రిట్లు వ్రాసిరి. "లంకాషైర్ ఫ్యూజిలీయర్సుయొక్క ఉద్యోగులు ఆఫ్రికాలోనిపోలీసువారు అనవసరముగా నుపయోగించు అత్యధిక బలప్రయోగమునుగూర్చినవివరములను నేను విని విషాదమునుపొందితిని." కెన్యాపోలీసులో క్రొత్తగాచేరిన టోనీ క్రాస్ అనునతడు ఇంగ్లాండులో స్ట్రీతాములోని తన పూర్వస్నేహితుల కిట్లు వ్రాసెను. మాకు మూడు హోంగార్డ్సు (Home guards) సెక్షనులున్నవి. ఒక్కొకదానిలో 60 మంది యుందురు. వారు పోయి సమాచారములను తీసికొనివచ్చెదరు. కొన్ని బాగుగనేయుండును. అంతట మేము బయలుదేరివెళ్ళి దాడిచేసి కొందఱిని పడగొట్టుచుందుము. ఎందులకని నన్నడుగవలదు....వారు చెడ్డవారని హోంగార్డ్సు చెప్పినచో మాకు చాలును, ఏమైననేమి? నిజముచెప్పుడని కొంతసేపు నిర్బంధించినపిమ్మట వారు ఏదో ఒప్పుకొందురు. ఖైదీలనందరిని నేను తనిఖీచేయుదును. నాకు కొంచెము అనుమానముకలిగినచో మాత్రము ఖైదీని తీసికొనను. ఆ మరునాటియుదయము నన్ను ఒకశవముదగ్గరకు తీసికొనిపోవుదురు. అప్పుడు మామూలుతంతు. ఐదు

గును.పెట్రోలుడ్యూటీపైన పోవునప్పుడు పొదలలో నెవ్వడైననల్లవాడు కన బడినచో వానిని ఆగుమని ఆజ్ఞాపింతుము.వాడు ఆగనిచో వానిపైన తుపాకులు కాల్చుదుము. నాక్రిందిమనుష్యులు సరిగా గురిచూచి కాల్చలేరు. అందువలన మధ్యమధ్య నే నొక తుపాకిపుచ్చుకొని కాల్చుచుందును. లండనుపోలీసుపని చేసినవాని కిక్కడిపని చాలా అన్యాయముగా కనబడును. ఇక్కడ న్యాయాధి కారులవిధులుగాని జాగ్రత్తలుగాని ఉన్నట్లు తోచదు. జర్మనీలోని క్రూర రహ స్యపోలీసుదళమగు 'గెస్టపో'వా రవలంబించిన ఈ అన్యాయపుపద్ధతుల వలన నెట్టిఫలితములును కలుగుటలేదని నేను చెప్పగలను.

ఇంగ్లాండుదేశమున స్వాతంత్ర్యోద్యమానుభవముగల ఐరిష్టైమ్సు పత్రిక 10-4-1953 తేదీన నిట్లు వ్రాసినది. "అరెస్టును తప్పించుకొనుటకు ప్రయత్నించు ఆఫ్రికావారిని ఆగుడని ఆజ్ఞాపింపగా ఆగనివారిని విచ్చల విడిగా కాల్చిచంపుచున్నట్లు పత్రికలందు ప్రకటింపబడుచున్నది. పూర్వము నిరాయుధులైన ఐరిషుస్త్రీపురుషులను బ్రిటీషుపోలీసువారును సైనికులును చేసినహత్యలను ఐర్లాండుప్రజ లింకను మరచిపోలేదు. ఆకాలమున నుప యోగింపబడిన పరిభాషనే ఇప్పుడు కెన్యానుండివచ్చు సమాచారములం దుపయోగింపబడుచు, ఐరిషువారికి కర్ణకఠోరముగానున్నది. అక్కడ ఏమిజరుగుచున్నను ఆ ప్రజలకు అక్కడిప్రభుత్వమన్న ఇష్టములేదనియు ఎదురుతిరుగుచున్నారనియు మాత్రము స్పష్టమగుచున్నది. సమాచార మును చెప్పలేదని చాలామందిని శిక్షించుచున్నారు. 30 సంవత్సరముల క్రిందట ఐర్లాండులోకూడా ఇదియొక గొప్పనేరముగా చేసిరి. కెన్యాలోని ఘోరపరిస్థితులనుగూర్చి ఆఫ్రికాదేశీయు లేమనుకొనుచున్నారో తెలిసికొనుట చాలా అవసరము. మనస్సునుకరిగించగల సంగతులుగల ఒకకాగితము 1953లో కెన్యాదేశమునుండి మెల్లగా బయటకుతీసికొనివెళ్ళి లండను లోని డెయిలీవర్కర్సు అను పత్రిక ప్రకటించినది. అందిట్లు వ్రాయబడి యున్నది.

"కుశలప్రశ్నానంతరము నీకు కొన్నిసంగతులను తెలుపుటకు ఈ జాబు ఉద్దేశింపబడినది. నీవు వినుచున్నహోంగార్డ్సు అనువారు మన దేశము నకు బలవద్విరోధులు. ఏలనన తెల్లవారితోకలిసి వీరుచేయు ఘోరకృత్యము

లను వందలకొలదిసంవత్సరములవరకును ప్రజలెవ్వరును మఱచిపోజాలరు. ఈ హోంగార్డ్సులోనివారికి పూర్వము భూమినిగూర్చిగాని విలువగలపంటలనుగూర్చిగాని ఎవ్వరితోనైన తగాయిదాలున్నచో వీ రీ అసాధారణపరిస్థితిని సాకుగాగొని తమవిరోధులపైన పగదీర్చికొని వారిని మట్టుపెట్టుచున్నారు. దైవానుగ్రహమువలన నీవు సంపన్నుడవుగానుండి హోంగార్డ్సులోనివారెవ్వరైననిన్నుచూచి యోర్వలేకపోయినచో నీపనినిబట్టుటకు వారికిదేసమయము. ఈ హోంగార్డ్సుకు అపరిమితమైనఅధికారము లొసగబడినవి. పైవారికి తెలుపకుండా నెవ్వరినైనను కాల్చిచంపుటకు కూడా వీరికధికారమున్నది.

దుర్మార్గు లిట్లు తమకిచ్చవచ్చినవారిని నిరపరాధులైనవారినికూడా చంపుచున్నందున చాలామంది యువకులు భయపడి. తమయిండ్లను వదలిపెట్టి పోవుచున్నారు. పెద్దవారుకూడా తమయిండ్లలోనుండుట మానినారు. చంపుదురనియో, తమవృషణములనుచిదుకగొట్టి (Castrate) నపుంసకులుగ చేయుదురనియో భయపడి ఇండ్లువదలి పారిపోయినవారిఇండ్ల నీ హోంగార్డ్సు తగులబెట్టుచున్నారు. ఈ తెల్ల మావ్‌మావ్‌దుర్మార్గులు చాలామంది ఆఫ్రికావారి నిట్లు బలవంతముగా నపుంసకులుగాచేసిరి. చాలామంది ఇండ్లను తగులబెట్టినారు. వారిపిల్లలను ఇండ్లలో బ్రతికియుండగానే తగులబెట్టి చంపినారు. అట్లు తగులబడుచున్న యిండ్లలోనుండి ఆస్తినిగాని సామానులనుగాని తుదకు రొక్కమునుగాని బయటకుతీసికొనిరానివ్వరు. అదియంతయు దగ్ధముకావలసినదే. ఇట్లీ యిండ్లను తగులబెట్టుట పగటిపూటనైన చేయరు. రాత్రులందే తగులబెట్టుదురు.

"అదివరకు అరెస్టుచేయబడినవారియిండ్ల నిప్పుడు తగులబెట్టుచున్నారు. కుంగుకురుంబగారిఇంటి నిట్లు తగులబెట్టిరి. దెడానిముగోగారి ఇంటిని నేలమట్టముచేసిరి. ఇంకను ఇతరులయిండ్లనుకూడా ఇట్లేచేసిరి. ఇక్కడ జరుగుచున్నసంఘటనలు చాలా ఘోరముగానున్నవి. మేముకూడా ఇండ్లలో కాపురముండుటలేదు.' రెవరెండు బ్వానాగటుంగగారు, చార్లెస్‌కరావ్‌గారు మేనెలలో నరెస్టుచేయబడి, కెజియాకు పంపబడినారు. పూర్వము వీరు "శుద్ధిప్రాయశ్చిత్తకర్మలు చేయించుచుండిరి. నీ కేసంగతి తెలిసినను తెలియకపోయిననుకూడా నీవు మావ్‌మావ్‌ప్రమాణము చేసినానని ఒప్పుకొని

తీరవలెను. అట్లుచేయనిచో నీయింటిని ధ్వంసముచేసివేయుదురు. లేదా నిన్ను తెల్లవారికి అప్పగింతురు. వారు నిన్ను నిర్దయగా కాల్చిచంపుట నిశ్చయము. కొన్నిప్రదేశములం దిప్పు డింకొక ఘోరమైనసంగతి జరుగుచున్నది. ఉదాహరణమునకు గాతేజ్ నీటిమిల్లుదగ్గరలోనున్న దేశీయ స్త్రీజనమును పట్టుకొని మిల్లులోనికి తీసికొనివెళ్ళి అక్కడ వారిబట్టలనూడదీసి, ఐదుగంటలనుండి ఆరున్నరగంటలవఱకును ఆనకట్టవెనుక మెడబంటిలోతు నీటిలో చేతులను తలపైకెత్తి నిలువబెట్టుదురు. అక్కడ వారిని 25 లేక 30 నిముషములుంచి దిసమొలలతో బయటకు తీసికొనివచ్చి చావబాదుదురు. కెన్యట్టా తనయింటిదగ్గర తమచేత మావ్‌మావ్‌ప్రమాణమునుచేయించినాడని ఒప్పుకొనవలసినదని నిర్బంధింతురు. అతనియిల్లు ఆ సమీపములో కొంతదూరములోనుండుటయే దీనికంతకును కారణము.

ఆప్రాంతమునందలి చాలామందిస్త్రీలకే బాధ కలుగుచున్నది. మఱుగాగార్‌ప్రాంతమువారికిని చాలా బాధకలుగుచున్నది. వారిని అరెస్టుచేసి బట్టలు విప్పివేయుదురు. ఏ స్త్రీయైనను మావ్‌మావ్‌ప్రమాణముసంగతి తనకు తెలియదని పలికినచో నామె స్తనములపైన తోలుఊడిపోవువఱకు ఉడుకు నీటిని పోయుదురు. ఆ బాధతో నామె చచ్చినను వారు లెక్కచేయరు. ఆమె నా దుర్గతిలో వదలిపోవుదురు.

"ఇంకొక క్రొత్తసంగతి జరుగుచున్నది. అది యెట్టివిచక్షణయును లేకుండా స్త్రీలనుగాని పిల్లలనుగాని అరెస్టుచేయుట. అట్లు వందలకొలది మందిని ఎట్టికారణమును చెప్పకయే అరెస్టుచేయుచున్నారు. కొందఱిని కొట్టుదురు. కొందఱిని పట్టుకొని నిర్బంధించి మూడుమొదలు ఏడుసంవత్సరములవరకు దీర్ఘమైన కఠినశిక్షలను విధించుచున్నారు. వీరు మావ్‌మావ్ సంఘమునసభ్యులని చెప్పుచుందురు. వారందరిని వరుసగా నిలువబెట్టి విచారణలేకుండా ఈవరుసలో నింతవరకు ఒక్కొక్కసంవత్సరము అంతవరకు రెండుసంవత్సరములునని శిక్షలు పురమాయింతురు, ఎందులకని అడుగుటకు వీలులేదు.

రిఫ్టువాలీయను పల్లపుభూములలోనిప్రజలు మావ్‌మావ్‌సంఘమునకు చెందినవారని ఆరోపించి, వారిని వెళ్ళగొట్టి వారిని కొన్ని ప్రత్యేకప్రదేశము

లందు నిర్బంధించియుంచిరి. వీరు మూడుమొదలు ఏడుసంవత్సరములవరకు శిక్షలువిధింపబడినవారు. వీరు తెల్లవారి సేవచేయుటకు నిరాకరించి"రిజర్వు" లకు పోయినవారు. ఇందులో చాలామందియొక్క వృషణములను చిదుగ గొట్టి వారిని నపుంసకులుగాచేసిరి.

ఒక ఐరోపావానిపొలముదగ్గరనున్న క్యాంపులో పురుషులనందరిని ఖైదుచేసి వారికుటుంబములను భార్యలను పిల్లలను తిండిలేకుండా ఆ శిబిర ములలోనే పడవేసియుంచిరి వారిని వెళ్ళగొట్టినప్పుడు వారితో నేమియు తీసికొనిపోనివ్వనందున వారికి తినుటకేమియు లేకపోయెను. వారిమేకలను పంటలను తెల్లవారిపొలములోనే దిగబెట్టివచ్చిరి. రెండుగాదులమొక్క జొన్నపంటను వదలివచ్చినవారును 80 లేక 100 మేకలను వదలివచ్చినవా రునుకూడా ఇందులో నున్నారు. కొంతకాలమైనపిమ్మట స్త్రీలను పిల్లలను కికుయూరిజర్వుకు తీసికొనిపోవుటకు నిశ్చయించిరి. వారిని లారీలలో నెక్కించి పశువులవలె తీసికొనిపోయి కొందఱిని లిమూరుస్టేషనులోను కొందఱిని కికుయూస్టేషనులోను దిగమనిరి. వారి నెక్కడకుతీసికొనిపోవు చున్నది చెప్పలేదు. వారికి తినుట కేమియు నివ్వలేదు. వారికిగల గొప్పబాధ ఆకలిబాధ. ఆ రిజర్వులలో నదివఱకున్నవారికే కడుపునిండ తిండిలేదు. అందువలన నిచ్చటిస్త్రీలు బజారులోతిరుగుచు అక్కడ కనపడిన చెఱకు పిప్పిని అరటిపండ్లతొక్కలను తెచ్చి తినుట ప్రారంధించిరి. దీనిని పసిపిల్ల లకు పెట్టగా వారికి జబ్బులుచేయుట ప్రారంభమయ్యెను.

గితుంగురి, కియముకాంగి, అప్లాండ్సులోగల నిర్బంధశిబిరములందు (Detention Camps)చాలామందిని పెట్టియుంచిరి. ప్రతిరాత్రియు ఇద్దరిని లేక నలుగురిని ఈ తెల్ల మావ్‌మావ్‌దుర్మార్గులును, కెన్యాపోలీసురిజర్వు వారును కలిసి బయటకుతీసికొనివెళ్ళి తుపాకులతో కాల్చివేయుచుందురు. 'మ్వారియాకిహార'నుండి వచ్చిన ముగ్గురుయువకులను జూలై 18 వతేదీన కాల్చిచంపిరి. ఈ దుర్మార్గము లింకను జరుగుచునేయున్నవి. దీనివిషయ ములో మే మేమిచేయవలెను? మమ్ముల నింకను కొట్టిచంపుచున్నారు. నీవు ఎవ్వరినైనను దర్శించి యీసంగతులు చెప్పగలవా?"అని ఆ లేఖలో వ్రాయ బడెను.

ఆతినదినానుకొని నైరోబినుండి ఇరువదిమైళ్ళదూరమున రెండు నిర్బంధశిబిరములు (Detention Camps) ఉన్నవి. అందులో 1400 మంది కికుయూజాతివా రున్నారు. ప్రస్తుతము విచారణలేకుండా నిర్బంధింప బడియున్నవారిలో వీరు చాలా అల్పసంఖ్యాకులే. ఈ 1400మంది వివిధ వయస్సులవారు. అందులోనొకడు 83 సంవత్సరముల ముదుసలికూడా ఉన్నాడు. వీరందరును మావ్‌మావ్‌సంఘముపట్ల అభిమానముకలవారని దారుణవాదులని అనుమానింపబడినవారు.

ఇవి పునర్వ్యవస్థాపకశిబిరములట. అనగా కికుయూజాతివారిని తమ దేశీయులకు వ్యతిరేకముగాతిరిగి తెల్లవారిపక్షమును పోలీసులపక్షమును బ్రిటీషుసైనికులపక్షమును అవలంబింపవలసినదని, నయముననుభయము నను ప్రోత్సహించు శిబిరము లివి. ఈ శిబిరములలోని క్రమశిక్షణవిధానము చాలా కఠినమైనదని టైమ్సుపత్రికయే వ్రాసినది. ఇక్కడ ముఖ్యముగా నొక చాప్లెయిన్ అను మతబోధకుడు క్రైస్తవమతబోధచేయుచుండును. శిబిరములలోనివారిని ఆటలలోపాల్గొనవలసినదని ప్రోత్సహింతురు. దేశీయు లను ఆటలపోటీలలో ప్రవేశింపజేసి, వారికి "సత్ప్రవర్తనము"ను అలవాటు చేయవలెనని వారియుద్దేశమట.

ఈ శిబిరములలోనివారిని చాలామారులు జల్లెడలలోవలెజల్లించి నిర్బంధితులైన స్త్రీపురుషులను దేశీయరిజర్వులకు పంపుచుందురు. అక్కడ వీరు చదరపుమైలునకు వేయిమందిచొప్పున కాపురముండవలసినందున వీరికి జీవించుటకు అవకాశముశేలేవు. ఆకలికిమాడి చచ్చిపోవుటతప్ప గత్యంతరములేదు. *

ఇట్లు బాంబులువేసియు, కొరడాలతోకొట్టియు, ఉరిదీసియు, తిండి పెట్టక మాడ్చిచంపియు కికుయూజాతివారిని బాధించుచు వీరికి క్రైస్తవమత బోధచేయు మిషనరీలను, ఫుట్‌బాల్ కాలిబంతియాటలను నేర్పువారిని పంపి ఈ జనుల నుద్ధరించుటకు బ్రిటీషువారు పూనుకొన్నారు!

---

* Africa Africa: A continent rises to its feet. Derek Kartun; Lawrence and Wishart. Ltd. London, 1954

కెన్యాలోని ఆఫ్రికాదేశీయులపట్ల అక్కడ వలసనెలకొన్నతెల్లవారును బ్రిటీషుసామ్రాజ్యమునేలు ఆంగ్లజాతివారును అవలంబించినపద్ధతుల వలన కెన్యాప్రజలలో బ్రిటీషుసామ్రాజ్యముపట్ల విరోధభావమే వర్ధిల్లెను. పునర్వ్యవస్థీకరణశిబిరములు, చిత్రహింసలు, వధలు, బలవంతనిర్బంధములు, ఆయుధదళములదాడులు, నివేవియు కెన్యాదేశములోని ఆఫ్రికాజాతివారిని బ్రిటీషుప్రభుభక్తులుగా చేయలేకపోయెను. తమజాతిని బానిసత్వమున ముంచి దేశమును నాశనముచేయుటకు బ్రిటీషువారు తెల్లజాతివారు చేయు ప్రయత్నములకు వారు హర్షింపలేరు. తమదేశము స్వాతంత్ర్యముపొందవలె ననువాంఛయు, తమజాతు లభివృద్ధిగాంచవలెననుకోరికయు, ఈ నల్లవారిలో దినదినాభివృద్ధిచెందెను.

## "మావ్ మావ్"ఉద్యమము

కెన్యావలసరాజ్యప్రభుత్వమువారును ఇంగ్లాండులోని బ్రిటీషుసామ్రాజ్యప్రభుత్వమువారును, కెన్యాదేశములోనితెల్లవారు ఆఫ్రికాదేశీయులనుగూర్చి చేసిన దుష్ప్రచారఫలితముగా ఆ దేశములోజరిగిన సామాన్యనేరములకును దౌర్జన్యములకును హత్యలకును చిత్రవధలకును ఆఫ్రికాదేశీయులలో బయలుదేరిన "మావ్మావ్" అరాజకవిప్లవోద్యమమే కారణమని నిర్ణయించి, దానినిగూర్చి అధికారపూర్వకముగా కొన్నినివేదికలను కరపత్రములను గ్రంథములను ప్రకటించినారు. ఈ మావ్మావ్ఉద్యమమును అణచునెపముతో భారతదేశమున అరాజకవిప్లవోద్యమమునణచుటలో ప్రయోగించిన దానికన్న ఎన్నో క్రూరకృత్యములను గావించి, కెన్యాదేశమును బీభత్సములో ముంచినారు. అక్కడిదేశీయులకు ధన ప్రాణమానములకు రక్షణలేకుండా అత్యాచారములు గావించినారు. లండన్లో సెంట్రల్ఆఫీస్ ఆఫ్ ఇన్ఫర్మేషను వారుప్రకటించిన చిన్నపుస్తకములందు కొన్నివివరము లొసగబడినవి. దానివలన ననేకవిశేషములు తెలియుచున్నవి.

"కికుయూజాతినల్లవారిలో మావ్మావ్సంఘమను నొక రహస్య అరాజకసంఘము బయలుదేరినట్లు కెన్యాలోని వలసరాజ్యప్రభుత్వాధికారులకు 1950లో తెలిసెను" అని ఆ పుస్తకములోని మొదటివాక్యములవలన

అంతకుపూర్వము చాలాకాలమునుండి కెన్యాలోనితెల్లవారు ఆఫ్రికాదేశీయులు చేయుచున్నప్రచారము 1950లో ఫలించినట్లు తెలియగలదు. అందులో నింక నిట్లు వ్రాయబడినది:

1952సంవత్సరారంభములో కికుయూజాతివారు నివసించు ప్రత్యేక స్థావరములలోనుండిన ఆఫ్రికాజాతి నల్లప్రభుత్వోద్యోగులపైన దౌర్జన్యములుజరుగుట ప్రారంభమయ్యెను. వారిఇండ్లను తగులబెట్టసాగిరి. 1952 జూలై, సెప్టెంబరునెలలమధ్య దౌర్జన్యములు హెచ్చుటయేగాక పాశ్చాత్య జాతి భూభామందులు కొందరు హత్యచేయబడిరి. అంతట 1952 అక్టోబరు 20వతేదీన అత్యవసరపరిస్థితి తటస్థించినట్లు కెన్యాప్రభుత్వమువారు ప్రకటించిరి.

1953 లో మావ్‌మావ్ దౌర్జన్యములు చాలా తీవ్రముగా జరుగసాగెను. నైరోబికివాయవ్యమూలగా 40 మైళ్ళలోనున్న ఒక కికుయూ గ్రామము నాశనమయ్యెను. తెల్లవారిభృత్యులని అనుమానింపబడిన చాలా మంది ఆఫ్రికావారు హత్యచేయబడిరి. కికుయూ, ఎంబు, మేరు, కంబజాతులవారు వసించుజిల్లాలో అరాజకము వ్యాపించెను. క్రైస్తవులైన నల్లవారికి ప్రాణభయము హెచ్చెను. కొన్నిచోటులలో చాలా క్రూరమైన చిత్రహింసలతో హత్యలు జరిగెను. అరాజకులలో కొంతమందికి మందుగుండుఆయుధములుకూడా ఉండెను. అయితే వారు ముఖ్యముగా బంగో అను పొదలకొడవలితోనే వధలుచేయుచుండిరి. పాశ్చాత్యులహత్యలు పెరిగెను. అరాజకులను ప్రతిఘటించుటకు బ్రిటీషుప్రభుభక్తులగు నల్లవారు హోంగార్డ్సుఅను దళములుగా నేర్పడిరి. తూర్పుఆఫ్రికా నౌక ప్రత్యేక సైనికఅధికారమండలముగా చేసిరి. 1953 జూన్‌నెలలో ఆఫ్రికావారియొక్క ప్రధానరాజకీయప్రజాసంఘమగు కెన్యాఆఫ్రికాయూనియన్ అనుసమితికి మావ్‌మావ్‌దౌర్జన్యములతో సంబంధమున్నట్లు నిర్ణయించి దానిని అక్రమసంఘముగా నిషేధించిరి. ఈ సంఘములో కికుయూజాతివారికి చాలా పలుకుబడియుండెను. ఈ సంఘ వ్యవహారములను చక్కబెట్టు కార్యనిర్వాహకసభ్యులగు నైదుమందిని దాని అధ్యక్షుడగు జోమో కెన్యట్టాను పట్టుకొని శిక్షలు విధించిరి.

ఇంగ్లాండుదేశపు పార్లమెంటువారి ప్రతినిధివర్గమొకటి 1954 జనవరి నెలలో కెన్యాకు వచ్చి అక్కడిపరిస్థితులను గూర్చి విచారించి, యొక నివేదికను ప్రకటించిరి. "మావ్‌మావ్ ఉద్యమము మొదట కికుయూజాతిలో ప్రారంభమై తరువాత నల్లవారందరిలోను వ్యాపించినది. దానిప్రధానోద్దేశము ఇతరజాతులవారినందరిని దేశములోనుండి తరిమివేసి, కెన్యాలోని ప్రభుత్వాధికారములను చేజిక్కించుకొనుటయే. ఇది యొక రాజకీయ సాంఘిక కుతంత్ర రహస్యసంఘము. ఇతరులు ఇష్టపడి తమతోచేరనిచో వారినిభయపెట్టి దారుణకృత్యములను గావించి లోబడునట్లుచేయుదురు. మావ్‌మావ్ ఉద్యమములో చేర్చుకొనునప్పుడు ఎంతటిదుష్కార్యమైన వెనుదీయకుండా చేయుటకును, రహస్యమును బయటపెట్టకుండుటకును ఘోరమైన ప్రమాణముచేయించుచుందురు. ఒకదానికన్నఒకటి చాలా ఘోరమైనప్రమాణములు చేయించుచు నీ సంఘమును వ్యాపింపచేయుచుందురు. ఈ మావ్‌మావ్ ఉద్యమము కెన్యాలోని ఆఫ్రికావారినందఱిని క్రూరమృగములస్థితికిని అనాగరికఆటవికులస్థితికిని దింపదలచినదేగాని, అభివృద్ధిచేయదలపలేదు" అని ఆ నివేదికలో వ్రాసిరి.

మావ్‌మావ్ ఉద్యమము ముఖ్యముగా కికుయూ, ఎంబు, మేరు జాతులలో తీవ్రముగా వ్యాపించియున్నది. ఈ యుద్యమము ఉద్ధృతముగానున్నప్పుడు కెన్యాలో పదియవవంతుభూభాగములో వ్యాపించినది. 1956 అంతమునాటికి ఈ యుద్యమమునందు 2869 మంది సివిలుఉద్యోగులకు గాయములుతగిలినవి. ఇందులో కొందఱు ప్రాణములనుబాసిరి. ఇందులో 2739 మంది ఆఫ్రికావారే. అందువలన నిజమున కీ యుద్యమము ఆఫ్రికాదేశీయులలోనే రెండువర్గములవారిమధ్య జరిగిన అంతర్యుద్ధమువంటిది. అందులో నొకవర్గమువారు బ్రిటిషుప్రభుభక్తులు. రెండవవర్గమువారు దేశభక్తులు, జాత్యభిమానముకలవారు నని చెప్పవచ్చును.

"ఇంగ్లాండుదేశపుసైన్యమును ఆఫ్రికా ప్రభుత్వమువారి సైన్యమును ఆంగ్లరాజభక్తిగల వేలకొలది కికుయూజాతివారును కలిసి చేసిన సైనికచర్యలవలనను ఆ ప్రాంతములందు గైకొనబడిన కఠినచర్యలవలనను ఈ

అరాజకోద్యమము క్రమక్రమముగా అదుపులోనికివచ్చిన"దని బ్రిటీషుప్రభుత్వసమాచారశాఖవారు వ్రాసిరి.

1956 సంవత్సరపు కెన్యాప్రభుత్వవార్షికనివేదికయందీ యుద్యమమునుగూర్చినవివరములు కొన్ని వ్రాసిరి. "మావ్‌మావ్‌అరాజకోద్యమమునడుము విరిగినదని చెప్పవచ్చును. అక్కడక్కడనున్న చిన్నచిన్న అరాజకుల గుంపులను విచ్ఛిన్నముచేయుపని మిగిలియున్నది. 1956 ప్రారంభములో అరాజకులసంఖ్య రెండువేలున్నట్లు అంచనావేయబడినది. ఆ సంవత్సరాంతమున నది 400 కు తగ్గినది. ఇంగ్లాండు ఆఫ్రికాప్రభుత్వసేనలు 1955 జూన్ నెలలో 12 వేలమంది యుండిరి. 1956 జూనునాటికి వానిని 5 వేలకు తగ్గించిరి. 1956 నవంబరులో పోలీసువారును సివిలుఅధికారులును శాంతిభద్రతలు కాపాడుబాధ్యతను సైనికాధికారులనుండి గ్రహించిరి. 1957 అక్టోబరునాటి అరాజకులలెక్కలోనున్నవారు 150 మంది మాత్రమే పట్టుబడకుండా తప్పించుకొని తిరుగుచుండిరి.

1956 అంతమువఱకును కెన్యాసైన్యములోను పోలీసువారిలోను గాయపడినవారు ప్రాణనష్టమైనవారును కలిపి 1167 మంది యుండిరి. ఇందులో 988 మంది ఆఫ్రికాజాతినల్లవారే. సివిలియనులలో ప్రాణములు గోల్పోయినవారు 1879 మంది. ఇందులో 1821 మంది ఆఫ్రికాజాతివారే. గాయపడిన 980 మందిలో నల్లవారు 918 మంది యుండిరి. అరాజకులలో 10534 మంది మరణించిరి. 2664 మందిని పట్టుకొనిరి. 1068 మందిని అరాజకనేరములకు ఉరిదీసిరి. 1957 మార్చినెలనాటికి మొత్తము 2845 మంది అరాజకులు లోబడిపోయిరి" కెన్యాలో ప్రకటింపబడిన అసాధారణ పరిస్థితిసందర్భమునందు చేయబడిన కఠినశాసనవిధులు క్రమక్రమముగా సడలింపబడెను. జిల్లాలలో నల్లవారిప్రజాసంఘములను ప్రభుభక్తిపరులు అధికారులు అనుమతినిపొంది స్థాపించుకొనుట కవకాశములను కలిగింపసాగిరి.

1958 ఫిబ్రవరినెల అంతమునకు అసాధారణపరిస్థితిలో నిర్బంధింపబడినవారిసంఖ్య 10885 మందికి తగ్గిపోయినదని ప్రకటించిరి. దీనివలన

అంతకుముం దెన్నివేలమందిని నిర్బంధించిరో ఊహింపవచ్చును. ఈ అసాధారణపరిస్థితిసందర్భమును గ్యారి ప్రభుత్వమువా రనేక విచారణలు, దర్యాప్తులు జరుపుచువచ్చిరి. అనుమానమున్నవారిని జాగ్రత్తగా కనిపెట్టి యుండవలెనని గట్టిగా ఉత్తరువులు జారీచేసిరి.

ఈ మావ్‌మావ్ ఉద్యమమునెపమున దేశములో అసాధారణపరిస్థితిని ప్రకటించి కేవలము సైనికశాసనముకన్న కఠినవిధానములతో దేశపరిపాలన జరిపి దేశములోని నల్లజాతులవారిపైన అత్యాచారములుగావించి వారిలో జాతీయచైతన్యము నణచివేయదలచిరి.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## ఎనిమిదవ ప్రకరణము

### కెన్యా రాజకీయములు

మావ్‌మావ్ ఉద్యమమునకు పూర్వముకన్నకూడా ఇటీవల కెన్యా రాజ్యములోనినల్లవారికిని తెల్లవారికినిమధ్య జాతివైషమ్యము చాలా హెచ్చినది. అనేకవిధములైననేరములు మోపబడి నిర్బంధింపబడిన వేలకొలది నల్లవారు విడుదలపొంది తమతమగ్రామములు చేరుకొనినారు. తెల్లదొరలు భూమిని ఏకఖండములుగాచేసికొనినందువలన నల్లవారికవసరమైనభూమి దొరకదనుభయము వ్యాపించినది. నిరుద్యోగము వ్యాపించినది. చాలామంది నల్లవారు తమ రిజర్వులలో నివేశనములలోనున్న తమ మట్టిగుడిసెలను చేరుకొనుటకు మైళ్ళకొలదిదూరము నడచిపోవలసివచ్చుచుండగా, తెల్లవారి ఖాళీమోటారులు వడిగాపోవుచుండును. ఆకలితోబాధపడుచు శాపనార్థములు పెట్టుచున్న ఆగ్రహావేశులైయున్న లక్షలకొలది నల్లవారు బయట నిలువనీడ లేక కట్టబట్టలేక తినతిండిలేక అల్లాడుచుండగా తెల్లవారు తమ దివ్యభవనములందు క్రీడామందిరములందు హోటళ్ళలోను సినీమాలలోను సుఖమనుభవించుచున్నారు. వీరికాలము సమీపించినదని నల్లవారు గొణగికొనుచుందురు.

దేశములోనినల్లవారు దార్‌ద్ర్యములోమునిగి అసంతృప్తితో కుములుచున్నను ధనికులగు తెల్లపెట్టుబడిదారులు దేశములో భారీపరిశ్రమలను స్థాపించుచునేయున్నారు. నైరోబిలో,నాకురులో నేనారేకుక్యానులు,బీరుసారాయము ఇటుకలు, కలప, సిమెంటు, సిగరెట్లు, సబ్బులు, బట్టలు, రంగులు తయారుచేయుఫ్యాక్టరీలు, కార్ఖానాలు వృద్ధిచెందుచునేయున్నవి. ఇటీవల ఎనిమిది

# కెన్యారాజకీయములు

సంవత్సరములలో ఆఫ్రికావారికొనుగోలుశక్తి మూడురెట్లు పెరిగినది. దేశములోని గ్రామములందును పట్టణములందును పరిశ్రమలు అభివృద్ధిచెందినవి. నల్లజాతుల పూర్వాచారసంఘనిర్మాణము, పూర్వపు ఆర్థికవిధానము విచ్ఛిన్నమగుచున్నది. నల్లప్రజలు క్రమక్రమముగా పట్టణములు చేరుచున్నారు. పూర్వము మావ్‌మావ్ ఉద్యమకాలమువలెగాక ఇప్పుడు నల్లవారిలో రాజకీయ పరిజ్ఞానముగల దేశీయనాయకులు బయలుదేరినారు మావ్‌మావ్ ఉద్యమానంతరము తెల్లవారు స్వసంరక్షణము నిమిత్తము మారణాయుధములుంచుకొనుటకు అనుమతి యొసగబడినది. తెల్లవారిలో సాంఘికవ్యవస్థ కట్టుదిట్టము చేయబడినది. అయితే దేశమునుపాలించు తెల్లవారికులమునందు కొన్ని బీటలు పొడసూపినవి. తెల్లవారిలోనే కొందరు నల్లవారికి కొన్నిహక్కుల నొసగవలెనని కోరుచున్నారు. రెండుసంవత్సరముల క్రిందట కెన్యాలో శాసనసభకు ఎన్నికలుజరిగినవి. 5 కోట్లమంది నల్లవారికికలిపి ఎనిమిది మంది ప్రతినిదుల నెన్నుకొనుహక్కు నిచ్చిరి. ఏబదివేలమంది తెల్లవారు పదు నారుగురుప్రతినిధుల నెన్నుకొందురు. ఈ తారతమ్యములోని అన్యాయమును నల్లవారు గమనించిరి. శాసనసభకు ఎన్నుకొనబడిన నల్లవారు ప్రభుత్వాధికారములను ఉద్యోగములను స్వీకరించుటకు నిరాకరించిరి. అందువలన 1960 వరకు అమలుజరగవలసిన లిటిల్‌టన్ రాజ్యాంగసంస్కరణము అడుగంటినది. జాతివిచక్షణమును వర్ణభేదమును విసర్జించి నల్లవారితో రాజీచేసి కొని దేశములో శాశ్వతశాంతి నెలకొల్పుట మంచిదని తెల్లవారుగ్రహించిరి. కాని, వారందు కంగీకరింపలేదు. మరల నేదోకొంత రాజ్యాంగసంస్కరణ నాటకమునాడి నల్లవారిని ఊరడింపజూచిరి. కెన్యాలోని తెల్లజాతివారు తమ అభివృద్ధికి ఆటంకములుకలిగింతురని నల్లవారు ఎరుగుదురు. అందువలన బ్రిటీషుసామ్రాజ్యప్రభుత్వమువారితోనే వారు రాయబారములుజరుపుట కిష్ట పడిరిగాని, కెన్యాలోని తెల్లవారితో రాజీచేసికొనుట కిష్టపడలేదు.

ఈ స్థితిలో ఇంగ్లాండుదేశ వలసరాజ్యాంగమంత్రిమైన లెన్నాక్సు బాయిడ్‌గారు తనకుతోచినవిధముగా నీ రాజ్యాంగసమస్యను పరిష్కరించుటకు నిశ్చయించెను. ఆఫ్రికా జాతివారికి మరికొంత అభివృద్ధి కలిగించుచు వారు పాశ్చాత్యులహక్కులకు భంగకరముగా వర్తింపకుండ బందోబస్తు

లను కల్పింపబూనెను. ఈపద్ధతినిబట్టి ఆఫ్రికావారు ఇంకను 15 మందిప్రతి నిధులు కావలెననికోరగా వారికి మఱిఆరుగురుప్రతినిధులను ఒసగెను. ఎగ్జి క్యూటివుకౌన్సిలుఅను పరిపాలకవర్గసభలో తెల్లవారియధికారములను యథా తథముగా నిలిపియుంచెను. లెజిస్లేటివుకవున్సిలువారందరు వెన్నుకొనువిధాన మువలన ఆఫ్రికావారిబలము తగ్గించెను. జాతిభేదవిధానశాసనములు చేయ కుండా కవున్సిల్అఫ్‌స్టేటు నొకదానిని నిర్మించెను. గవర్నరుకు ప్రత్యేకాధి కారము లెప్పటివలెనే యుండెను. టామ్‌మ్బోయా (Tom Mboya) అను దేశీయనాయకుడును నైరోబీలోని మఱికొందఱు దేశీయనాయకులును ఆలో చించి లిటిల్‌టన్‌రాజ్యాంగసంస్కరణములను విఫలముచేసినట్లే ఈ క్రొత్త రాజ్యాంగమునుకూడా భగ్నముచేయుటకు నిశ్చయించిరి. సంపూర్ణమైన రాజ్యాంగసంస్కరణలసభను గావించవలెనని కోరిరి. ప్రభుత్వాధికారములను స్వీకరించుటకు నిరాకరించిరి. వీరు ఇంగ్లాండుకు తమప్రతినిధులనంపి వయో జనవోటుహక్కులతో ప్రజాప్రభుత్వము స్థాపింపవలెనని కోరిరి. అయితే, కెన్యాప్రభుత్వమువారును లెన్నాక్సుబాయిడుగారునుకూడా రాజ్యాంగమును ప్రస్తుతము మార్చుటకు వీలులేదనిరి.

ఇటీవల ఆఫ్రికాదేశీయులు తమకార్యమును సాధించుటకు ప్రత్యక్ష చర్య (Positive action) తీసికొనవలెనని ప్రచారముగావించుట ప్రారం భించిరి. ఈమాటను ఘనప్రధానియైన న్క్రూమాగారిపరిభాషనుండియే వారు గ్రహించిరి. దీని అర్థము శాసనోల్లంఘనమే. ఇది అహింసామార్గమున నడ చునో హింసామార్గమున నడుచునో చెప్పుట దుస్తరము.

రాజ్యాంగసంస్కరణలనుగూర్చి చర్చించి, పరిష్కరించుట కొరక రౌండుటేబిలుసభ జరుపవలసినదని ఆఫ్రికాదేశీయులునుఅక్కడి భారతీయు లునుకూడా కోరిరి. అయితే బ్రిటీషుసామ్రాజ్యప్రభుత్వమువారు దీని కంగీక రింపలేదు. అంతట కెన్యాశాసనసభలోని ఆఫ్రికాదేశీయప్రతినిధులును భార తీయప్రతినిధులును శాసనసభను లెజిస్లేటివుకవున్సిలును 1959 ఫిబ్రవరి 17 తేదీ నుండి బహిష్కరించుటకు నిశ్చయించిరి.

కెన్యాశాసనసభలోని తెల్లప్రతినిధులలో అధికసంఖ్యాకులు నల్లవారికి వ్యతిరేకులు. రాజ్యాంగమును మఱల మార్చుటకు అంగీకరింపరు. నల్లవారికి

హెచ్చుఅధికారములనొసగుట కిష్టపడరు. అయితే శాసనసభలోని పాశ్చాత్యులలో కొందఱు ధర్మాత్ములున్నారు. వారు కెన్యాలో కొంత ఉదారమైన రాజ్యాంగమును స్థాపించవలెనను అభిప్రాయముకలవారుగా నున్నారు. దేశములో వచ్చినమార్పులను గమనించి దేశీయులు తిరుగుబాటు చేయకుండా ఎంతకాల మట్లు అణచియుంచి పరిపాలింతుమని వారియూహ. బ్రిటీషు సామ్రాజ్యమువారిరాజ్యతంత్రము ఫలితముగా దక్షిణాఫ్రికాసమితిలోవలెనే అధికారమంతయు తెల్లవారివశమై వర్ణభేద జాతివిభజన అపార్తీడ్ విధానము అవలంబింపబడి తా మధోగతిపాలగుదుమేమోయని కెన్యాలోని నల్లవారి భయము.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## తొమ్మిదవ ప్రకరణము

### స్వాతంత్ర ఘనరాజ్యము

ఆఫ్రికాఖండమున పశ్చిమభాగమున గోల్డుకోస్టు లేక బంగారుకోస్తా అని వ్యవహరింపబడిన బ్రిటీషువలసరాజ్యమునందు అషాంటి ప్రొటెక్టరేటు లేక రక్షితరాజ్యమును, ఉత్తరభాగమును, బ్రిటీషువారిధర్మకర్తృత్వము క్రింద నుంచబడిన టోగోలాండును చేరియున్నవి. దీనిమొత్తముపైశాల్యము 91843 చదరపుమైళ్ళు, ఇందలిజనసంఖ్య 4095276 ఉండెను. ఇందు వ్యవసాయము, కోకో, నూనెనిచ్చు కొబ్బెరచెట్టువంటివృక్షములు, వేరుశనగ, టేకువంటి మహోగనికలప, మాంగనీసు, బంగారము, వజ్రములు ఉత్పత్తి యగుచున్నవి.

బ్రిటీషువారీ రాజ్యములో తక్కినవలసరాజ్యములందువలెనే ఒక ముఖ్యద్రవ్యముయొక్క ఉత్పత్తినిమాత్రము ప్రోత్సహించుచు తక్కినవిధములైన కృషి పరిశ్రమలను అరికట్టువిధానమునే యవలంబించిరి. ఆప్రకారము వారు పోత్సహించిన ప్రధానమైనపంట కోకో. పూర్వ మీ తీరమున నొకనదిలో బంగారు కనబడినందున దీనికి బంగారుకోస్తా అని పేరువచ్చినది. ప్రపంచములో నుత్పత్తియగు మొత్తముకోకోపంటలో మూడవవంతు ఈరాజ్యమందే యుత్పత్తియగునట్లుచేసి తెల్లవారు దానిని విపరీత ధరలకు విక్రయించి బంగారు సంపాదించుచున్నందువలన కోకోపంటకు పచ్చబంగారు అని పేరుపెట్టిరి.

ఇక్కడ నింకను వివిధఖనిజము లున్నవి. బంగారు, వజ్రములు, బాక్సైటు, మాంగనీసు మొదలైనవి అపరిమితముగా నున్నవి. ఇక్కడ

నిలువయున్న బాక్సైటు ప్రపంచములోని ధనవంతములగు పెట్టుబడిదారీ రాజ్యములం దెక్కడను లేనంత యున్నదని అంచనావేయబడినది. ఇది ఆర్థికరాజకీయములకు చాలా ముఖ్యమైనవిషయము. ఏలన యుద్ధవిమానము లకుకావలసిన అల్యూమినియము బాక్సైటువలననే యుత్పత్తియగు చున్నది.

భారతదేశమునందువలెనే బంగారుకోస్తాలో ఆఫ్రికాదేశీయప్రజలలో కూడా చాలాకాలమునుండి జాతీయభావములు వర్ధిల్లుచుండెను. 1930 సంవత్సరమునుండి ఆ దేశముయొక్క ప్రభుత్వనిర్వహణమునందు తామకూడా పాల్గొనవలెనని ఆఫ్రికావారు కోరసాగిరి. అక్కడకూడా జాతీయవార్తాపత్రికలు బయలుదేరెను. ఆ వలసరాజ్యములోని కోకోపరిశ్రమకు నష్టకరమైన ఆర్థికమాంద్యముకలుగగా, అక్కడ ఆర్థికరాజకీయఉద్యమములు తలయెత్తెను. 1937-38 సంవత్సరములలో 'కోకోట్రస్టు' అనబడు పెట్టుబడిదారుకంపెనీ వారు అవలంబించిన అక్రమపుపద్ధతులకు అసమ్మతిసూచకముగా కోకో ఉత్పత్తి పరిశ్రమ స్థంభింపచేయబడెను. రెండవప్రపంచయుద్ధములో స్వాతంత్ర్యభావములు వ్యాపించెను. ప్రజాపీడకులగు నిరంకుశపరిపాలకులను కూలద్రోయుటకే ఈ ఘోరసంగ్రామము జరుగుటయు, మానవులందరకు స్వేచ్ఛ స్వాతంత్ర్యము లుండవలెనని యుద్ఘాటించిన 'అట్లాంటికుచార్టర్' అనబడు ప్రకటనముచేయబడుటయు, అటుపిమ్మట యునైటెడ్ నేషన్సువారి స్వాతంత్ర్యముల ప్రకటనముచేయబడుటయు ప్రజలలో నూతనభావములను పురికొల్పెను. ప్రపంచములోని యితరదేశప్రజలందరివలెనే బంగారుకోస్తాలోని ఆఫ్రికాదేశీయులుకూడా తమకు భావిపురోభివృద్ధి కలుగునని యువ్విళ్ళూరిరి.

బంగారుకోస్తాలోనినల్లవారు చాలామంది పశువులను మానవులను కుట్టి పెద్దనిద్దురరోగమును కలిగించి చంపు 'ట్సెట్సీ'యీగ తమపాలిటి ధర్మదేవత యని చెప్పుచుందురు. ఈ యీగనుచూచి భయపడియే ఐరోపాజాతులవారు ఈ సారవంతమైన ఆఫ్రికాపశ్చిమతీరమునందు స్థిరమైనవలస లేర్పరచుకొన లేదు. ఆఫ్రికాఖండములోని తూర్పుభాగములందును దక్షిణభాగములందును ఐరోపాజాతులవారు స్థిరనివాసములేర్పరచికొని అక్కడి మంచిభూముల నన్నిటిని ఆక్రమించి కోట్లకొలదిగానున్న ఆఫ్రికాజాతులనల్లవారిని మారు

మూలలనున్న ఊషరక్షేత్రములకు పారదోలి, వారిని రిజర్వులను ప్రత్యేకస్థావరములందు నిర్బంధించి జీవనాధారములేకుండా చేసిరి. అక్కడనా నల్లవారు క్రిక్కిరిసి దున్నుటకు భూములుగాని, చేయుటకు పనులుగాని లేక అల్లాడుచు బాధపడుచుండిరి. ఈ తెల్లవారు అల్పసంఖ్యాకులై యున్నందున నల్లవారు తమతో పోటీచేయకుండాను వారు అభివృద్ధిచెందకుండాను నిరోధించి, వారికి సాంఘిక రాజకీయహక్కులు లేకుండాచేసిరి. దేశీయులలో విద్యవ్యాపించకుండా చేసి, తమతో పోటీచేయకుండా అణచియుంచిరి. నల్లవారు అభివృద్ధిచెందకుండా వారిలో పెట్టుబడిదారులు బయలుదేరకుండా నిరోధములుకల్పించిరి. అయితే, పైనచెప్పిన సెటిల్సియాగధర్మమాయని ఆఫ్రికాలోని పశ్చిమతీరమునం దిట్లు చేయుటకు తెల్లవారికి వీలుకలుగలేదు. ఇక్కడ ఐరోపావారు స్థిరనివాసము లేర్పరచుకొనుటకు భయపడి వలసలను స్థాపించలేదు. అక్కడ శాంతిభద్రతలను కాపాడుటకుమాత్రము కొద్దిమంది ఐరోపావారికి పెద్దజీతములిచ్చి యుద్యోగులుగా పంపిరి. కొద్దిమంది పాశ్చాత్యవ్యాపారులు, పారిశ్రామిక సాంకేతికనిపుణులగు టెక్నీషియనులను కోకోపరిశ్రమను, గనులపరిశ్రమను నడుపుట కక్కడికి పంపిరి. కోకోతోటలలోను గనులలోను ఆరోగ్యపరిస్థితులను కాపాడుటకై కొలదిమంది సంఘసేవకులనుకూడా పంపవలసి వచ్చెను. అంతే. అంతకన్న ఆ దేశములో తెల్లవారికుటుంబములుగాని, సంఘములుగాని స్థిరముగా నివసింపలేకపోయిరి. ఈ పరిస్థితులలో నల్లవారు వ్యాపారము చేయుటవల్లగాని వృత్తులను చేసికొనుటవల్లగాని అక్కడితెల్లవారితో పోటీచేయుదురను భయము లేనందువలన అక్కడి నల్లవారితో మధ్యతరగతిజను లభివృద్ధిచెందుటకు తెల్లవా రెట్టి ఆటంకములును కలిగింపలేదు. ఇంతేకాదు, దీనికి విరుద్ధముగా నల్లవారిని తెల్లవారు ప్రోత్సహింపవలసివచ్చెను. కోకోతోటలనునవి చిన్నచిన్న క్షేత్రములలో పెంపవలసియున్నందున ఆ క్షేత్రములనుండి యొడల కీ ఆకుపచ్చబంగారమనబడు కోకోను తెచ్చుటకు తెల్లవారు ఫ్యాక్టర్లు లేక ప్రతినిధుల నేర్పాటు చేయవలసివచ్చెను. ఆఫ్రికా బంగారుకోస్తాలో నీవిధముగా తెల్లవారులేని వలసరాజ్యమొకటి వర్ధిల్లెను. అంతేగాక ఆ ప్రాంతమున ఆఫ్రికాదేశీయుల మధ్యతరగతిప్రజలుగల వలసరాజ్యము స్థాపితమయ్యెను. ఈ మధ్యతరగతి

దేశీయప్రజలలో కొందరు ధనవంతులుగా నుండిరి. అందులో చాలామంది తమజీవనము, లాభము బ్రిటీషుసామ్రాజ్యమువారి ట్రస్టులనబడు పెద్దకంపెనీలవారిపై నాధారపడియున్నందున వారితో అవినాభావసంబంధము కలవారైరి. ఈ మధ్యతరగతిజనమును బ్రిటీషువారు నయమునను భయమునను తమకనుకూలురుగ చేసికొనగలిగి. అక్కడ క్రమక్రమముగా వర్ధిల్లుచున్న పారిశ్రామికులయుద్యమమును జాతీయోద్యమమును అరికట్టుట కుపయోగింపసాగిరి. బంగారుకోస్తాలోని వర్గపోరాటమునందు గమనింపతగిన దీ యొక్క విషయమే కాదు. ఇంతకన్న ముఖ్యమైనవిషయము. అక్కడ దేశీయులైన పారిశ్రామికులవర్గమొకటి దినదినాభివృద్ధిచెందుట. 1951 నాటి కా దేశములో రోజుకూలిపైన బ్రదుకువారు మూడులక్షలమంది యుండిరి. అనగా దేశములోనిజనసంఖ్యలో యుక్తవయస్సువచ్చినప్రజలలో నాలుగవవంతుజన మట్లు బ్రదుకుచున్నారన్నమాట. ఈపనివారుచాలావరకు కోకోతోటలలోనే యుండిరి. అయితే గనులలోకూడా 38 వేలమందిపనివా రుండిరి. రాకపోకలు రవాణాలపరిశ్రమలోను వ్యాపారములోను కలపపరిశ్రమలోను కూడా చాలామందిపనివా రుండిరి. నిజమునకు బ్రిటీషుసామ్రాజ్యనీతిజ్ఞులవలన పీడింపబడవా రీ పనివారే. స్వాతంత్ర్యమువచ్చినచో వీరిస్థితి బాగుపడితీరును. అందువలన నిజముగా వీరికే స్వాతంత్ర్యవాంఛ యత్యధికమైయుండెను. వీరిప్రక్క మూడులక్షలమంది కోకోకృషిచేయువ్యవసాయకులుండిరి వీరు తమపంటను మధ్యనున్నదళారీలద్వారా కోకోమార్కెటింగు బోర్డువారికి విక్రయించవలసినవారగుచుండిరి. వీరిదగ్గర కొనువా రా కోకో సరకును మూడురెట్ల హెచ్చువిలువకు ప్రపంచమార్కెట్లలో విక్రయించుకొని, అమితలాభములను పొందుచున్నట్లు తెలియగా ఈ వ్యవసాయకుల కడుపుమండుటలో నాశ్చర్యమేమున్నది ?

ఈ పరిస్థితులలో ముఖ్యముగా కనబడువిషయమేమనగా సామ్రాజ్యవాదులగు పెట్టుబడిదారు లీ దేశములో కేవలము కోకోఅను నొకపరిశ్రమమాత్రమే యున్న ఆర్థికవ్యవస్థను నిర్మించి దానివలన అమితలాభమును పొందుచుండుట. దానికొఅకే ప్రజాజీవనమెల్ల వక్రింపచేయుట. బహిష్కారండమైన విదేశపెట్టుబడిదారీకంపెనీలు బయలుదేరి ఆఫ్రికాదేశీయులలో మధ్య

తరగతివారిని కొందరిని చేరదీసి, పనివారిని దారిద్ర్యదుఃఖమునముంచి పీడించుట కనబడుచుండెను. ఈసందర్భములో నింకొకపరిస్థితికూడా సంభవించినది. పూర్వము ఆఫ్రికా సాంఘికవ్యవస్థకు మూలకంబముగానుండిన వివిధ జాతులనాయకులు, వారిక్రింది పెత్తనదారులు మొదలైనవారు, పూర్వమువలె కుటుంబములను వ్యక్తులను కట్టుబాటులలో నుంచలేకపోవుటకు కారణము వారియధికారములను తెల్లవారు తృణీకరించి, క్రొత్తన్యాయవిధులను కల్పించి వారివంశపారంపర్యపుహక్కులను తీసివేసి వారికి గౌరవభంగముకలిగించుటయేగాక, వారికి జీతములిచ్చి తమక్రిందియుద్యోగములిచ్చి తమనౌకరులుగ చేసికొనుటతో పూర్వపు సాంఘికవ్యవస్థ విచ్ఛిన్నమయ్యెను. అసమయమున కొంతమంది ఆఫ్రికాకర్షకులు, వ్యవసాయకులు ధనవంతులై మధ్యతరగతి వారితో సహకరించుచుండగా, అందులోకొందరు నష్టపడి మరల తేరుకొనలేక దరిద్రులై కూలిపనివారితో సహకరింపసాగిరి. ఇట్లు పునర్నిర్మాణమైన పారిశ్రామికవర్గమువారు బలవంతమైన వ్యాపారవృత్తికట్టడిసంఘములను స్థాపించుకొని విజయవంతములైన సమ్మెలనుచేయుచు సంపూర్ణస్వాతంత్ర్యముకొరకై జాతీయోద్యమమును నడుపుటకు పూనుకొనిరి. ఇదియే సి. పి. పి. లేక కన్వెన్షన్ పీపుల్సుపార్టీ అనబడు ప్రజాసంఘము స్థాపింపబడి బలవంతమగుటకు కారణమైయుండెను. నిజమునకు ప్రజాసంఘమువారినాయకులేమిచెప్పినను ఎట్లుప్రవర్తించినను వారినిజోద్దేశము సంపూర్ణస్వాతంత్ర్యము కొరకు పోరాటముజరుపుటయే.

1947 అగస్టునెలలో ప్రజలలో తీవ్రమైనఅసంతృప్తి చెలరేగుచుండగా, ది యునైటెడ్ గోల్డుకోస్టు కన్వెన్షన్ (యు. జి. సి. సి.) అను పొడియక్షరములతో వ్యవహరింపబడిన ప్రజాసంఘము నెలకొల్పబడినది. ఇది యీ వలసరాజ్యములోని మొట్టమొదటి రాజకీయసంస్థ. దానికి దేశములోని జనసామాన్యముయొక్కతోడ్పాటు పూర్తిగానుండెను. సాధ్యమైనంత త్వరలో స్వపరిపాలనమును స్థాపించుటకు కృషిచేయుటయే దానియుద్దేశము.

ఆ మరుసటిసంవత్సరము జనవరినెలలో ఐరోపావారివస్తువులను బహిష్కరించుకార్యక్రమము ప్రారంభింపబడెను. ఫిబ్రవరినెల 28వతేదీన అక్రానగరములో పూర్వము యుద్ధములోపనిచేసివచ్చిన నల్లవారు పట్టు

దలతో ప్రజలపక్షమున అసమ్మతిప్రదర్శనమును జరుపుచుండగా పోలీసు వారు వారిని బేటనులాటీకర్రలతో కొట్టుటయేగాక, వారిపైన తుపాకులు ప్రేల్చిరి. ఈ సంఘటనమునందును తరువాతజరిగినసంఘర్షణములందును కలిపి 29మంది దేశీయులు మరణించిరి. 237 మంది గాయపడిరి. చాలా ప్రమాదకరమైనపరిస్థితు లేర్పడెను. బంగారుకోస్తాపైన తమ బలము స్థిర ముగానుండుటకొరకై బ్రిటీషు వలసరాజ్యవ్యవహారముల కార్యాలయము వారు తీసికొనుచున్నచర్యలు వ్యర్థమగుచున్నట్లు స్పష్టపడెను. అయితే వలస రాజ్యవ్యవహారకార్యాలయమువారీ విషయమున ఉపేక్షవహించి యూరకొన లేదు. రెండుసంవత్సరములకుపూర్వమే ఆ వలసరాజ్యములో నొక క్రొత్త రాజ్యాంగమును ప్రవేశపెట్టుదుమని ప్రకటించియుండిరి. ఆ రాజ్యాంగము వలసరాజ్యగవర్నరైన బరన్సుగారిపేరుతో ప్రఖ్యాతిచెందినది. ఈ బరన్సు రాజ్యాంగము చాలా బాగున్నదనియు వలసరాజ్యములలో సామ్రాజ్యవిధాన మున కొక మంచి నమూనాగానున్నదనియు బ్రిటీషువార్తాపత్రికలు ప్రశంసిం చెను. బంగారుకోస్తాలోనున్న విద్యాధికులును ధనవంతులునగు దేశీయులలో కొందరుకూడా ఈ రాజ్యాంగమునకు తమహర్షమును ప్రకటించిరి. అయితే మఱిరెండేండ్లలోనే బంగారుకోస్తాలోని జనసామాన్యమువారీ రాజ్యాంగ మును హర్షింపక, దీనిని వెంటనే రద్దుచేయవలసినదని తీవ్రమైన ఆందోళ నను చేయసాగిరి. భారతదేశములోకూడా కొన్నిసంవత్సరము లిటువంటి రాజ్యాంగసంస్కరణలనాటకమును బ్రిటీషువారాడి యుండినసంగతి అందరు ఎఱుగుదురు. ఆక్రాలో పోలీసువారు రక్తపాతముజరిగించినతరువాత యు. జి. సి. సి. ప్రజాసంఘమువారు అప్పటిగవర్నరైన సర్ జెరాల్డు క్రీసీ (Creacy) గారు రాజీనామా నొసగవలెననియు, తత్క్షణమే జాతీయప్రభుత్వమును స్థాపించవలెననియు ఆందోళనముగావించిరి. దీనికిప్రతిక్రియగా గవర్నరు గారు యు. జి. సి. సి. సంఘనాయకుల నారుగురను అరెస్టుచేయించిరి. ఆసందర్భమున కన్సర్వేటివున్నాయకుడగు డాక్టరు జె. బి. డాన్క్వాషగారిని, కార్యదర్శియైన క్వామే న్క్రుమాగారినికూడా అరెస్టుచేయించెను. ఇది కేవ లము అన్యాయమైనచర్యయని అందరికిని తోచెను. దీనిని సమర్థించుటకై బ్రిటీషు అధికారులు ఈ ప్రజాసంస్థకు కమ్యూనిస్టులతోసంబంధమున్నదని

యొక అసత్యప్రచారమును గావించిరి. తరువాత నైదేండ్లకు బ్రిటీషుగయానా ప్రధానమంత్రియైన చెడ్డి జగన్‌గారిని అధికారమునుండి తొలగించుటకై ఇట్టి అపవాదునే కల్పించిరి.

ఇప్పుడు పోలీసువారుచేసిన దాడులందు న్క్రూమాగారియింటిలో కమ్యూనిస్టులతో సానుభూతియున్నట్లు తెలియగలకాగితములు దొరికినవనిరి. ఈ దేశములోని క్రమపరిపాలనమును తిరుగదోడుటకు విదేశకమ్యూనిస్టులతో సంబంధములేర్పరచుకొన్నట్లు పత్రికలందసత్యప్రచారముచేసిరి. తరువాతచరిత్రవలన నీ ప్రచారమున కేమి విలువకలదో తేలినది. ఆరుగురు దేశీయనాయకులను అరెస్టుచేయుటవలన ప్రజలజాతీయోద్యమము మఱింత బలవంతమయ్యెను. దేశీయులలో తీవ్రమైన విషాదము, ఆగ్రహము వ్యాపించెను. ఈ పరిస్థితులలో వాట్సన్‌కమిషన్‌వారు రాజ్యాంగసంస్కరణలను గూర్చి యొక విచారణజరిపి, మఱియొక క్రొత్తరాజ్యాంగప్రణాళికను సూచించిరి. ఈలోపుగా బంగారుకోస్తాలోని రాజకీయపరిస్థితులు అత్యంత త్వరితగతితో మార్పులుచెందుట మొదలిడెను. 1948 ఉత్తరభాగమునందు యు.జి.సి. సి. ప్రజాసంఘనాయకులకును డాక్టర్ డాన్‌క్వాషుగారికిని అభిప్రాయభేదములు తీవ్రమయ్యెను. అతడు తొందరపడవలదనియు, రాజ్యాంగసమ్మతములైనపద్ధతులతోనే ఆందోళనముజరుపవలెననియు బోధించుచుండెను. అప్పుడు దేశప్రజలలో అధికసంఖ్యాకపక్షమువారి యభిమతముననుసరించి న్క్రూమాగారు తత్‌క్షణమే దేశీయులకు స్వాతంత్ర్యమునొసగవలసినదని బ్రిటీషువారిని ఒత్తిడిచేయసాగిరి. 1949 జూన్ నెలలో ప్రజాసంఘమునందు చీలికలుకలిగెను. అప్పుడు న్క్రూమాగారును మఱికొందఱు దేశీయ నాయకులును కలిసి కన్వెన్షన్ పీపుల్సుపార్టీ అను దేశీయప్రజాసంఘమును స్థాపించిరి. ఇది సి. పి. పి అను పొడియక్షరములతో వ్యవహరింపబడసాగెను.

తత్‌క్షణమే స్వపరిపాలనమును స్థాపించుటయే ఈ సి. పి. పి. వారి లక్ష్యము. రాజకీయాందోళనమువలనను ప్రజలను తగినవిధముగా కట్టుదిట్టపరచియు, అవసరమైనచో (Direct Action) ప్రత్యక్షచర్యల కార్యక్రమమును అవలంబించియు తమలక్ష్యమును సాధింపవలెనని వారియాశయము.

దీనివలన వారికి దేశప్రజలలో గొప్పపలుకుబడి కలిగెను. దీనిఫలితముగా 1951 ఫిబ్రవరిలో జరిగిన మొదటి 'జనరల్ఎలెక్షన్' ఎన్నికలలో సీపక్షము వారు భారతదేశములోని కాంగ్రెసుపక్షమువారివలెనే వేలకొలది అధికసమ్మతులతో ప్రత్యర్థులనోడించి గెలుపొందిరి.

వాట్సన్‌కమిషన్‌వారు రాజ్యాంగసంస్కరణమునుగూర్చి సూచనలు చేయగానే క్రొత్తరాజ్యాంగమునునిర్మించుటకు (Coussey Committee) కౌస్సేకమిటీ అను నొక రాజ్యాంగనిర్మాణఉపసంఘము నిర్మింపబడెను. అయితే. సి. పి. పి. ప్రజాసంఘమువారిప్రతినిధి నెవ్వరిని వారితోకలిసి పనిచేయమని ఆహ్వానింపలేదు. ఈ ఉపసంఘమువారు నిర్మించిన రాజ్యాంగముక్రిందనే 1951 ఫిబ్రవరిలో పైనచెప్పిన మొదటిఎన్నికలు జరిగెను. ఈ రాజకీయపక్షమువా రా ఎన్నికలలో అఖండవిజయముపొందినపిమ్మట బ్రిటీషువారు చేయునది లేక ఆ పక్షనాయకుడైన న్క్రూమాగారిని మొదటి దేశీయ ప్రధానమంత్రిగా నంగీకరించిరి.

ఈ క్రొత్తరాజ్యాంగముప్రకారము శాసనసభవారు ప్యాసుచేసిన ఏ చట్టమునైనను గవర్నరుకిష్టములేనిచో వీటోచేసి అమలుజరుగకుండ చేయ వచ్చును. ముఖ్యమైన అధికారములగు విదేశవ్యవహారములు ద్రవ్యవిషయములు, ఆయుధబలములపోలీను బ్రిటీషువారిచేతులలోనే యుంచబడెను. ఈ రాజ్యాంగము కేవలము సామ్రాజ్యవాదులు నిర్మించి, దేశీయులపైన రుద్దినదేగాని దేశీయులు ఇష్టపడి నిర్మించుకొనినదికాదు. తా మేదో రాజ్యాంగ సంస్కరణములనుచేసినామని చూపి, జాతియోద్యమమునపాల్గొనువారికి కొంత భ్రమకలిగించి ప్రపంచములోని ఇతరరాజ్యములవారికి తాము న్యాయముగా ప్రవర్తించుచున్నామని ప్రకటించుటకే ఈ రాజ్యాంగము నిట్లు నిర్మించిరి.

ఈ రాజ్యాంగముద్వారా సంపూర్ణస్వాతంత్ర్యముకొరకు పాటుపడ వచ్చుననియే న్క్రూమాగా రధికారము స్వీకరించిరి. ఆ దేశములోని మధ్యతరగతిజనములో రెండువర్గములవా రుండిరి. బ్రిటీషుసామ్రాజ్యమువారేవో కొన్నిఅధికారములుఇచ్చినచో వారితోసహకరించుటకు ఇష్టపడువర్గము వా రొకరుండిరి. రెండవవర్గమువారన్నన్నో తమపెట్టుబడులకు విదేశీయుల

సర్వముక్తాహక్కులు ఆటంకముకలిగించుచున్నందున దానిని ప్రతిఘటింప దలచువారు. ఈ రెండువర్గముల్వారును దేశములోని బీదజనులకు కార్మికు లకు క్షేమ లాభములు కలిగింపవలెనను పరమార్థచింతగలవారు కారు. ఏమైనను బ్రిటీషువారుపూర్వపద్ధతులతోపరిపాలింపజాలమని గ్రహించి, రెండవ వర్గమువారితోగాక మొదటివర్గమువారితో మైత్రినేర్పరచుకొనిరి.

1954లో జరిగిన ఎన్నికలలోకూడా న్క్రూమాపక్షమువారే విజయము పొందిరి.

బంగారుకోస్తాలో జాతీయోద్యమము తీవ్రమై న్క్రూమాగారిప్రధాన మంత్రిత్వముక్రింద ప్రజలలో సంపూర్ణస్వాతంత్ర్యవాంఛ గాఢముగా నుండినందున బ్రిటీషుసామ్రాజ్యమువారి ప్రాతరాజ్యాంగమును మార్చి దేశీయులకిష్టమైన రాజ్యాంగవిధానమును స్థాపింపకతప్పదయ్యెను. అంతట బంగారుకోస్తాప్రజలకు బాధ్యతగల స్వపరిపాలనము నొసగుచు, ఆ రాజ్యమును బ్రిటీషుకామన్వెల్తు అను స్వతంత్రరాజ్యసమ్మేళనమున భాగస్వామిగా చేయుటకు బ్రిటీషువారు నిశ్చయించిరి. బ్రిటీషువా రొక స్వతంత్రపరిపాలనా విధానప్రణాళికను తయారుచేసిరి. దానిని చర్చించుటకు బంగారుకోస్తా ప్రధానమంత్రి న్క్రూమాగారు అచిమోటాలో నొక సర్వపక్షసభను సమావేశ పరచిరి. ప్రస్తుతరాజ్యాంగమును మార్చి ఇంగ్లాండులోని ప్రజాప్రభుత్వసంప్రదాయములప్రకారము బ్రిటీషుకామన్వెల్తుభాగముగా సంపూర్ణస్వాతంత్ర్యము గల ప్రజాప్రభుత్వము స్థాపించుట యుక్తమని బంగారుకోస్తాప్రభుత్వము వారు ఒక వైట్ పేపరు అను అధికారప్రకటనచేసిరి. ఆ ప్రకారము దేశమునకు స్వాతంత్ర్యమొసగబడినపిమ్మట దానిపేరు "ఘన"రాజ్యమని మార్చబడవలెననిరి. 'ఘన' అనునది పూర్వకాలమున ఆఫ్రికాఖండములోనుండిన ఒక స్వతంత్రరాజ్యము పేరు.

అచిమోటాకాన్ఫరెన్సుతీర్మానమునుబట్టి ఈ దేశమును తూర్పు పడమర ప్రాంతములుగాను, అషాంటిబ్రోంగ్ఉత్తరము ట్రాన్సువోల్టాటోగోలాండ్ అను ప్రాంతములుగా విభజించిరి. అక్కడ ప్రాంతీయసంఘము స్థాపించిరి. అదివఱకు బ్రిటీషువారిధర్మకర్తృత్వముక్రింద యున్నై టెడ్ నేషన్సువారుంచిన

టోగోలాండును అక్కడి ప్రజలకోరికప్రకారము ఘనరాజ్యములో కలుపుటకు యునైటెడ్‌నేషన్సువారు నిశ్చయించిరి.

అంతట ఘనరాజ్యములోని ప్రజలయభిమతానుసారముగా ఇంగ్లండు పార్లమెంటువారొక స్వతంత్రరాజ్యాంగచట్టమును పార్లమెంటులో శాసించిరి. దానిప్రకారము ఘనరాజ్యము 1957 మార్చి 6 అర్ధరాత్రినుండి బ్రిటీషు స్వతంత్రరాజ్యములసమ్మేళనమున నొక భాగస్వామియయ్యెను. ఆ నూతన స్వతంత్రరాజ్యాంగము నేషనల్ అసెంబ్లీ అనబడు జాతీయశాసనసభనే గాక దేశములోని ఐదుప్రాంతములకును ప్రాంతీయసభల నేర్పరచినది. వీనికి కొన్ని ప్రత్యేకవిషయములందు, మండలములందు అధికారముండును. ఇది గాక ప్రతిప్రాంతమునందును ఆఫ్రికాజాతినాయకులసభలు (Houses of Chiefs) కూడా ఏర్పాటుచేయబడినవి. వీనికి ఆఫ్రికాజాతివారి ఆచార వ్యవహారములందుమాత్రమే అధికారముండును. దేశమునకంతకు ఒక పబ్లికుసర్వీసుకమిషను, జ్యుడిషియల్‌సర్వీసుకమిషను ఏర్పాటు గావింపబడి ఉద్యోగులను స్వతంత్రముగా నియమించును. అవసరమువచ్చినప్పుడు నేషనల్ అసెంబ్లీలోని మూడువంతులసభ్యులలో రెండువంతుల అధికసంఖ్యాకులవోటుపైన రాజ్యాంగములోని ముఖ్యభాగములను మార్చవచ్చును.

ఈ రాజ్యాంగమునుగూర్చి బంగారుకోస్తాశాసనసభలో ప్రధానమంత్రి న్క్రూమాగారును ప్రతిపక్షనాయకులైన డాక్టరు బుసియా (Busia)గారును 1957 ఫిబ్రవరి 12వ తేదీన తమఅభిప్రాయము వెల్లడించి మొత్తముమీద స్వతంత్రరాజ్యాంగచట్టమును ఆమోదించిరి. 1957 మార్చి 6వ తేదీన ఘన స్వతంత్రరాజ్యమైనది. ఘనరాజ్యము యునైటెడ్‌నేషన్సులో నొక సభ్యదేశముగ చేర్చుకొనబడెను.

స్వతంత్రఘనరాజ్యప్రధానమంత్రి న్క్రూమాగారు భారతదేశమున 1958 డిశంబరునెలలో పర్యటనము గావించిరి.

1958 డిశంబరు 20 వ తేదీన స్వతంత్ర ఘన ప్రధానమంత్రి న్క్రూమాగారొక ప్రెస్‌కాన్ఫరెన్సులో జాగ్రత్తగా ఆలోచించి ముందుగా సిద్ధపరచిన అభిప్రాయములను ప్రకటించిరి. దేశస్వాతంత్ర్యమునకు భంగకరము లగు శక్తులను తమరాజ్యమందు వ్యాపింపనివ్వమని చెప్పిరి. అషాంటిలోను

టొగోల్యాండులోను ఘనదేశీయైక్యతకు భంగముకలిగించుటకు కొన్నిదుష్ప్రయత్నములు జరుగుచుండుటనుగూర్చియు, ప్రాంతీయజాతితెగల అభిమానము ప్రోత్సహించి, జాతీయైక్యతకు భంగముకలిగించుటకు కొందఱు ప్రయత్నించుచుండుటనుగూర్చియు చెప్పిరి.జాతీయప్రభుత్వమన్న ఇష్టములేనివారు కొందరు ప్రస్తుతము అధికారమువహించిన నాయకులకు హానికలిగింపవలెననికూడా ప్రయత్నించుచుండుటనుగూర్చి చెప్పిరి. ఈ ఘనరాజ్యము నైదు ముక్కలుగాచేయవలెనని ఈ జాతిద్రోహుల ప్రయత్న మనిరి. ఆంతరంగికముగాపుట్టిన ఈ వ్యాధిని అణచివేయనిచో నిది కల్లోలముగా పరిణమించి జాతీయస్వాతంత్ర్యమునకు ప్రజాప్రభుత్వమునకు భంగముకలిగించుననునీతిని ఆసియాలోను, ఆఫ్రికాలోను జరిగిన సంఘటనలనుబట్టి గ్రహించితిమని చెప్పిరి. అందువలన దీనినిగూర్చి కఠినచర్యలు తీసికొంటిమనియు ఈ విద్రోహమును పురికొల్పువారిలో దేశద్రోహులపైన చర్యతీసుకొనుచున్నామనియు విజాతీయులను ప్రవాస మంపుచున్నామనియు చెప్పిరి.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## పదవ ప్రకరణము

### ఘనరాజ్య స్వాతంత్ర్యోద్యమము

గోల్డుకోస్టు లేక బంగారుకోస్తాలో 1948నుండి సంపూర్ణస్వరాజ్యము కొరకు తీవ్రమైన జాతీయోద్యమము ప్రారంభమయ్యెను. దానికి అనేకసందర్భములు తోడ్పడెను. ఘనదేశమున కిప్పుడు ప్రధానమంత్రిగానున్న క్వామే న్క్రూమాగారు అమెరికాలోను, ఇంగ్లాండులోను విద్యనభ్యసించి బంగారు కోస్తాలో క్రొత్తగాస్థాపింపబడిన "గోల్డుకోస్టుకన్వెన్షన్"అను రాజకీయపక్షమువారికోరికపైన దానికి కార్యదర్శిగా 1947లో ఘనదేశమునకు తిరిగి వచ్చిరి. అంతకుపూర్వము అనుభవజ్ఞుడైన జె. బి. డాంక్వాగారు దానికి కార్యదర్శిగా నుండిరి. న్క్రూమాగారు గొప్పవక్త. తెలివైనవాడు. దేశములో నలుప్రక్కలకును పోయి, ఉపన్యాసములిచ్చుచు త్వరలోనే భారతదేశమున మన నెహ్రూగారివలెనే అక్కడిప్రజల అనురాగమున కాయన పాత్రుడయ్యెను.

1948 సంవత్సరము ఘనరాజ్యచరిత్రయందు చాలా ప్రసిద్ధిగాంచిన సంవత్సరము. 1948 ఫిబ్రవరి 28వ తేదీన ఘనరాజ్యరాజధానియైన అక్రానగరమున దేశీయులఊరేగింపు జరుగుచుండగా క్రిస్టియన్సుబోర్గు కాసిల్ రోడ్డుదగ్గర సైనికపోలీసులు వారినిఅటకాయించి తుపాకులుకాల్చిరి. అప్పుడు చాలామందికి గాయములుతగిలినవి. కొంతమంది చనిపోయిరి. అంతట దేశీయులలో తీవ్రమైన విషాదము కలిగెను. అప్పటినుండి వారు బ్రిటీషు అధికారులను పూర్తిగా ద్వేషించి, సంపూర్ణస్వాతంత్ర్యముకొరకై పోరాడ సాగిరి. ఆ యూరేగింపులోనుండిన నిరాయుధులైన ఆఫ్రికా మాజీసైనికులు

పూర్వము బర్మాలో యుద్ధమునందుపాల్గొని, తిరిగివచ్చినవారు. వారు జీవన భృతికొరకు గవర్నరుగారి కొక విన్నపమును స్వయముగా సమర్పించుటకై బయలుదేరియుండిరి. ఈ ఊరేగింపులో జను లసంఖ్యాకముగాచేరినందున వీరు దౌర్జన్యముచేయుదురేమోయని బ్రిటీషు సైనికపోలీసుఅధికారి భయపడి, ఈ ఊరేగింపును ఆటంకపరచి దానినిచెదరగొట్టుటకు ప్రయత్నించిరి. అందు వలన అల్లరిప్రారంభమైనది. నిరాయుధులైనప్రజలపైన పోలీసులు బాటన్ లాటీలను ప్రయోగించిరి. ప్రజలు రోడ్డుమీదిరాళ్ళనుతీసి పోలీసులపైన రువ్విరి. అంతట పోలీసువారు వారిపైన తుపాకీలనుకాల్చిరి. బ్రిటీషుసామ్రా జ్యములోని ప్రతిభాగమునందును జరిగినట్లే ఇక్కడను జరిగినది. దీనిఫలిత ముగా ప్రజలలో ప్రభుత్వముపైన తీవ్రమైన ద్వేషభావము వర్ధిల్లినది.

1948 మార్చినెలలో దేశములో చాలచోట్ల అల్లరులు జరిగినవి. నిజమునకీ అశాంతికి ఆల్లరులకు కారణము కేవలము మాజీసైనికుల కును పోలీసులకును జరిగిన సంఘర్షణమాత్రమే కాదు. దానికి రాజకీయ ఆర్థిక సాంఘికకారణములు చాలా ఉండెను. వానివలన ప్రజలు బాధపడిపడి వారిలో వ్యాపించిన అసంతృప్తియు బ్రిటీషువారీ ప్రజలను అణచియుం చుటకు తీసికొనినచర్యలును. దానిఫలితముగా ప్రజలలో ప్రజ్వలించిన క్రోధా గ్నియు దానికి నిజమైన కారణములుగానుండెను.

చాలాకాలమునుండి విద్యావంతులైన ఆఫ్రికాదేశీయులలో రాజకీయ పరిజ్ఞానముకలవారు తమదేశాభివృద్ధియందును పరిపాలనమునందును పాల్గొ నుట కవకాశములులేనందువలన బాధపడుచుండిరి. దేశములో ముఖ్యమైన అన్నియుద్యోగములును బ్రిటీషువారికే యొసగబడుచుండెను. వారీ దేశీయ ప్రముఖులను తృణీకరించి నల్లజాతివారి పూర్వవంశములవారి నాయకుల తోను పెత్తనదారులతోను మాత్రము కార్యాలోచనముచేయుచుండిరి. ఈ వంశపారంపర్యపునాయకులును పెత్తనదారులును బ్రిటీషువారికి మిత్రులుగ నుండిరి. 1946 లో చేయబడిన క్రొత్తరాజ్యాంగవిధానమునందుకూడా ఈ పద్ధతియే నెలకొల్పబడినందువలన జనసామాన్యమునకు రాజకీయమైన

హక్కులు కలిగి అభివృద్ధినిచెందుట కవకాశములులేకుండెను. భారతదేశము 1947లోను, బర్మాదేశము 1948లోను సంపూర్ణస్వరాజ్యముపొందుటవలన బంగారుకోస్తాలోని రాజకీయనాయకులలో క్రొత్త ఆశాభావ ముదయించెను. వా రెక్కడ నుపన్యాసములిచ్చినను దీనినిగూర్చియే చెప్పసాగిరి. రెండవ ప్రపంచయుద్ధమునందు పాల్గొనివచ్చిన నల్లసైనికులు యుద్ధమునందు చేరి నప్పుడు బ్రిటీషువారుచేసిన వాగ్దానములు చెల్లింపలేదని అసంతృప్తిని వహించియుండిరి. వారు యుద్ధభూమియందు ఇతరదేశములవారితో సంప ర్కముకలిగి, కలిసిమెలిసియుండినందువలన వారిలో జాతీయభావములు అభివృద్ధిచెందెను. ఈ మాజీసైనికులలో గాయపడి అవధ్యులైనవారి కివ్వబడు ఉపకారవేతనములును ఇతరఅలవెన్సులును చాలా హీనముగా నున్నందునను అన్నివస్తువులధరలును పెరుగుచున్నందువలనను తమ అల వెన్సులనుకూడా పెంచవలెనని వారు కోరుచుండిరి. తాము దేశమునకు తిరిగివచ్చినపిమ్మట తాము స్థిరపడుటకు తగిన పనులనిచ్చి అవకాశములను కల్పించి, వారికి ప్రభుత్వమువారు సహాయపడలేదని వారికి బాధకలిగెను. తమనుమోసగించి సైన్యమునచేర్చి తమను కష్టపెట్టి బాధించిరనికూడా వారు అనుకొనసాగిరి. ఇటువంటివారు దేశములో మారుమూలగ్రామములందు కూడా ఉన్నందువలన అసంతృప్తి వ్యాపింపసాగెను.

దేశములో చాలామందిప్రజలు, ముఖ్యముగా వర్తకులు తమదేశము నకువచ్చిన అన్యదేశీయులైన సిరియనులు లెబానీసువర్తకులు బాగుపడి ధన వంతులగుచున్నారని, తమకుమాత్రము అన్నవస్త్రములు కరవగుచున్నవని, దీనికంతకును కారణము విదేశీయులేయని తలంపసాగిరి.

ప్రభుత్వమువారు పైకి ఆఫ్రికాదేశీయులకు ఉద్యోగములందు హెచ్చు అవకాశములనిచ్చెదమని చెప్పుచున్నను, ఆఫ్రికావారికి సివిలుసర్వీసుఉద్యో గములిచ్చుట నిజముగా వారి కిష్టములేదని దేశీయులకు తోచెను. నల్లవా రెంతకాలముపనిచేసినను చిన్నస్థాయిలోనే యుండుటయు, వారికన్న ఆల స్యముగా నుద్యోగములలోచేరిన తెల్లవారు ఉన్నతఉద్యోగములందు నియ మింపబడుచుండుటయు చూచి అసంతృప్తిచెందిరి. నల్లవారిలో అర్హతగల పట్టభద్రులకుకూడా తగినయుద్యోగము లొసగబడుటలేనందువ నల్లవారికి

బ్రిటీషువారిపైన క్రమక్రమముగా ద్వేషము వృద్ధిచెందెను. ఉదాహరణము నకు 1948లో 1300 లేక 1400 మంది సీనియరు ఉద్యోగులలో 98 మంది మాత్రమే నల్లవారుండిరి. యుద్ధముయొక్క ఫలితముగా దేశప్రజలజీవనమున కవసరములైన అన్నిపదార్థములుకూడా కరవయ్యెను. ధరలు హెచ్చెను. తెల్లవారికి కావలసినసరకులు సక్రమముగా సరఫరాచేయుచు, నల్లవారికి కావలసినవాటిని సరిగా సప్లయిచేయకుండిరి. యుద్ధకాలమునందు సరకుల యుత్పత్తిలోను వినియోగములోను కంట్రోళ్ళు అనబడు పరిమిత సరఫరా నిబంధనలను చేసి, వానిని అమలుచేయుటలో తెల్లవారిపట్ల పక్షపాతము చూపుచుండిరి. దీనివలన నల్లవారికి చాలా కష్టముకలిగెను. యుద్ధకాలము నందు పెట్టిన ఈ నిర్బంధములను యుద్ధానంతరముకూడా అట్లే అమలు జరుపుచుండిరి. దేశమునభివృద్ధిచేయుటగాని దేశీయులకుపకారముచేయుట గాని బ్రిటీషుప్రభుత్వమువారి కిష్టములేదని దేశీయులు తలంపసాగిరి.

దేశములో నల్లవారికిని పాశ్చాత్యవర్తకులకునుగల వ్యవహారసంబంధములందు బ్రిటీషుప్రభుత్వమువారు తెల్లవర్తకులపక్షము వహించుచుండిరి. సరకులగిరాకీకిని తమబాధలకును ప్రభుత్వమువారే కారకులని దేశీయులు ప్రభుత్వమును నిందింపసాగిరి.

దేశములో ముఖ్యమైనవ్యాపారపుపంటయైన కోకోచెట్లకు కొన్ని సంవత్సరములనుండి యొకవిధమైన "వైరస్" తెగులు పుట్టి అవి నాశనమగు చుండెను. దీనికి స్వొలెన్‌షూట్ తెగులు అని పేరు. దీనిని నిర్మూలించు టకు తగినమందులు కనబడలేదు. అందువలన ఈ తెగులుపుట్టిన కోకో చెట్లను నరికివేసినచో మంచిచెట్లకీ తెగులు వ్యాపింపదని శాస్త్రజ్ఞులనిరి. అందువలన ప్రభుత్వమువారు వ్యాధిసోకినచెట్లను నరుకుటకు ప్రత్యేకసిబ్బందిని నియమించిరి. చెట్లను బలవంతముగానరుకుటకు శాసనవిధులను గావించిరి. తమసర్వస్వమును కోకోతోటలపైనపెట్టిన రైతులు చెట్లనునరకుట కంగీకరింపక తిరుగుబాటుచేసిరి. 1948 నాటికి కొన్నిప్రదేశములోనిరైతులు ఆయుధములు ధరించి ప్రభుత్వసిబ్బందిని ఆటంకపరుపసాగిరి. ఈ శాసనమునుచేసిన శాసనసభ్యులను ప్రభుత్వమువారిని దేశీయులు దూషించుచ వారినిద్వేషించిరి.

బ్రిటీషుప్రభుత్వముపట్ల దేశీయులలో అసంతృప్తి వ్యాపించియుండుటకు సాంఘికకారణములుకూడా తోడ్పడెను. దేశములో ప్రాథమికపాఠశాలలుండెను. గాని, ఉన్నతవిద్యావకాశములు చాలా తక్కువగానుండెను. తుదకు సెకండరీవిద్యనుపొందుటకుకూడా దేశీయులకు తగుఅవకాశములు లేకుండెను. దేశీయులకు విద్యనార్జించవలెనను గాఢమైనవాంఛ కిది చాలా ఆశాభంగకరముగానుండెను. పైగా విద్యావంతులగు దేశీయులకన్న పాశ్చాత్యులకు హెచ్చుజీతము లిచ్చుచుండిరి. దేశీయులు నివసించుఇండ్లకును పాశ్చాత్యులునివసించుఇండ్లకును సౌకర్యములవిషయములో చాలా భేదముండెను. ఈ తారతమ్యము నల్లవారిని బాధించుచుండెను. పట్టణములందు నల్లవారికి గృహవసతియే లేకుండెను. వారు చాలా బాధపడుచుండిరి. నిరుద్యోగసమస్య కూడా దేశములో తీవ్రముగ వ్యాపించియుండెను.

1947 సంవత్సరాంతమునాటికి బంగారుకోస్తాలో ఆహారపదార్థముల ధరలును ఇతరవస్తువులధరలును విపరీతముగా పెరిగిపోయెను. దీనివిషయమై ఏదోయొకవిధమైన గట్టిచర్యతీసికొనుట అవసరమని అందరికిని తోచెను.

అక్రాలోని ఒక నల్లజాతిఉపనాయకుడగు నై క్వబెనా బొన్నే (Nii Kwabena Bonne) అను నాయనకు ఈపరిస్థితులు దుర్భరములుగతోచి, దీనికిప్రతిక్రియగా పాశ్చాత్యసరుకులను బహిష్కరింపవలెనను నొక యుద్యమమును లేవదీసెను. అతడు దేశములో పర్యటనముచేసి దీనినిగూర్చి ప్రచారముచేసెను. చాలామంది ఆయనకు తోడ్పడిరి. నల్లజాతులవారి పూర్వ వంశములవారినాయకులుకూడా అతనిచర్యకు హర్షించిరి. అంతట 1948 జనవరి 25 తేదీన బహిష్కరణమును ప్రారంభించిరి. ఐరోపాకంపెనీలవారు మొదట దీనిని నిర్లక్ష్యభావముతో చూచి, దీనిని ప్రతిఘటింపలేదు. ఈ నల్లవారిలో నైకమత్యములేదనియు, ఇది జయప్రదముకాదనియు వారనుకొనిరి. కాని బహిష్కరణము చాలా జయప్రదముగా జరిగెను. ఈ వివాదము కేవలము దేశీయప్రజలకును విదేశీయవర్తకులను మధ్యవచ్చిన వ్యాపారవివాదమనియు తాము జోక్యముకలిగించుకొనమనియు ప్రభుత్వమువారు మొదట చెప్పిరి. అయితే, దీని తీవ్రపరిణామమునుచూచి 1948 ఫిబ్రవరిలో ఈ వ్యవహారమునుగూర్చి తాము వ్యాపారస్థులతో మాటలాడినామనియు, దిగుమతి

చేయబడుసరుకులధరలు తగ్గించుటకు పాశ్చాత్యవర్తకు లంగీకరించినారనియు ఫిబ్రవరి 28 వ తేదీన ఈ బహిష్కారణము విరమింపబడుననియు ప్రభుత్వమువారు రేడియోద్వారా ప్రకటనచేసిరి.

ఆఫ్రికాదేశీయులు తమబహిష్కారోద్యమున జయమునుపొందినందులకు సంతోషించిరి. అయితే విదేశీయవర్తకులు చేసిన వాగ్దానమును చెల్లింతురో లేదో అని అనుమానముచెందిరి. అందువలన ఫిబ్రవరి 28వ తేదీన ఉదయమునుండియు నల్లవారు తండోపతండములుగా బయలుదేరి ఆక్రాపట్టణములోని పాశ్చాత్యవర్తకులఅంగళ్ళవద్ద మూగిరి. తెల్లవారికిని నల్లవారికినిమధ్య వైషమ్యము ముదిరినదనియు, ఏదోకొంత గడబిడ జరుగగలదనియు చాలామందికి తోచెను. ఆదినమున పాశ్చాత్యులఅంగళ్ళదగ్గర మూగిన నల్లవారు సరుకులధరలనుగూర్చి తెలిసికొనదలచిరి. తా మనుకున్న దానికన్న సరుకులవిలువలను చాలా స్వల్పముగా తగ్గించినారని తెలియగనే వారు ఆశాభంగముచెంది, పాశ్చాత్యులు తమను మోసగించుచున్నారని ఆగ్రహపరవశులైరి.

ఆదినముననే అధికారులఅనుమతితో మాజీ ఆఫ్రికాదేశీయసైనికుల యూరేగింపు ఒకటి కాకతాళన్యాయముగా ఆక్రానగరవీధులలో బయలుదేరి పోవుచుండెను. ఈ సైనికులు తమకుగలబాధలనుగూర్చి క్రిస్టియనుబోర్గుకాసిల్ అను రాజభవనమునందున్న గవర్నరుగారికి ఒక విన్నపమును స్వయముగా సమర్పింపదలచిరి. అయితే వారా విన్నపమును ప్రభుత్వకార్యాలయమునందలి యొక కార్యదర్శిగారి కిచ్చుటకు నిశ్చయించి, ఫిబ్రవరి 28వ తేదీమధ్యాహ్నము అట్లా విన్నపమును సమర్పించి పోలీసువారునిర్ణయించినమార్గముననే తమఊరేగింపును జరుపుచు పోవుచుండిరి.

ఈ మాజీసైనికులపట్ల సానుభూతినివహించిన జనసామాన్యము ఈ సైనికులఊరేగింపులో చేరుటవలన నిది పెద్దఊరేగింపుగా పరిణమించినది. మూడుగంటలగునప్పటి కీ యూరేగింపు అధికారులుసూచించినమార్గమునుండి కొంత ప్రక్కదారికి పోయి, క్రిస్టియన్‌బోర్గుకాసిల్‌కు పోవు చౌరస్తాదగ్గరకు వచ్చెను, అక్కడనుండి గవర్నరుగారుండు రాజభవనమునకుపోవు రోడ్డుండెను. నిరాయుధులైన ఈ ప్రజలయూరేగింపునకప్పుడు సి. హెచ్.

ఇస్రమే అను నొక బ్రిటీషుసూపరెంటుక్రింద నొక చిన్న పోలీసుదళ మెదురయ్యేను. ఈ యూరేగింపులోనివారు గవర్నరుగారి భవనముపై నబడి ఆయనకు అపాయముకలిగింతురేమోయని ఈ బ్రిటీషుఉద్యోగికి తోచెను. అంతట అతడు ఈ ప్రజాసమూహమును చెదరగొట్టవలెనని వీరిపైన తుపాకులు కాల్పించెను.

అంతట ఆ జనసమూహమునందు కల్లోలముకలిగెను. సంరక్షణముచేసికొనుటకు వారిచేతులలో నాయుధములు లేవు; కర్రలైనను లేవు. అంతలో వారు ఆగ్రహపరవశులై రోడ్డుప్రక్కనపడియున్న కంకరరాళ్ళను తీసి పోలీసులపైకి రువ్వసాగిరి దీనికిజవాబుగా పోలీసువారు వీరిపైన తుపాకులుబారుచేసి మరల మరల కాల్చిరి. కొన్నిక్షణములలోనే చాలమందికి గుండుదెబ్బలుతగిలెను. కొందఱు హతులైరి. జలియన్‌వాలాబాగువధలవలనను పంజాబుదురంతరములవల్లను భారతదేశప్రజలలో బ్రిటీషువారిపైన కలిగిన అసహ్యాభావము ద్వేషభావము బంగారుకోస్తాలోని నల్లవారికిని ఆ క్షణమునుండి కలిగినది. దీనిఫలితము 1951 ఫిబ్రవరినెలలో జరిగిన జనరల్ ఎన్నికలసందర్భములో స్పష్టముగా కనబడినది.

ఈ తుపాకికాల్పులనుగూర్చినవార్త అక్రాలో వ్యాపించగానే ఆగ్రహపరవశులైన నల్లవారిజనసమూహములు బయలుదేరి పాశ్చాత్యులుచేసిన ద్రోహమునకు పగతీర్చికొనవలెనని వారిషాపులను గిడ్డంగులను పగులగొట్టి లూటీచేయుట ప్రారంభించిరి. ఇంగ్లీషువారిషాపులతోపాటు పాశ్చాత్యుల షాపులు సిరియావారిఅంగళ్ళను భారతీయులఅంగళ్ళను దోచిరి. ఇండ్లలో జొరబడిరి. మనుష్యులపైన దౌర్జన్యముచేసిరి. కట్టడములను తగులబెట్టిరి. విదేశీయులందరిపైనను వారు దౌర్జన్యముచేయసాగిరి. ఆనగరమున అరాజకము వ్యాపించెను. అక్రాలోఅల్లరులు చెలరేగినవనువార్త దేశములోని ముఖ్యపట్టణములందు తెలియగానే అక్కడకూడా ఇట్లే జరిగెను. చిన్న పట్టణములందును ఇది వ్యాపించెను మూడునాలుగుదినము లీ అరాజకము వ్యాపించి చెలరేగినపిమ్మట సైనికదళములు వీనిని అణచెను. గవర్నరైన సర్ జెరాల్డు క్రీసీ (Creasy)గారు అత్యవసర "ఎమర్జెన్సీ" స్థితిని ప్రకటించి ప్రతిపట్టణములోని పోలీసుదళములకు ఆయుధములిచ్చి నగరము

లోను పట్టణములోను వీధులలో తగినబందోబస్తులు చేసెను. లారీలను కారులను సోదాచేసి అనుమానమున్నవారిని పట్టుకొనిరి. క్రొత్తపోలీసు దళములను నియమించిరి. దేశములో సెన్సారుషిప్పు ప్రవేశపెట్టిరి. నిజమునకు దేశములో నొకవిధముగు సైనికశాసనపరిపాలనమునే స్థాపించిరి.

దేశములో శాంతిభద్రతలను స్థాపించుటకై గవర్నరుగారు పైన చెప్పినచర్యలను తీసికొనుటతో తృప్తిచెందక, దేశీయనాయకులైన డాక్టర్ జె. బి. డాన్క్వాగారిని, క్వామే న్క్రూమాగారిని, మఱినలుగురను ఈ అల్లరులకు ప్రోద్బలముచేయు కుట్రదారులుగా పరిగణించి 1948 మార్చి 12వ తేదీన ప్రవాసమంపునట్లు ఉత్తర్వుచేసెను. దీనిఫలితముగా దేశములోని వివిధప్రాంతములందు మఱికొన్ని అల్లరులు చెలరేగెను. ఇందులో విద్యార్థులుకూడా పాల్గొనిరి.

మార్చినెలమధ్యనాటికి దేశములో శాంతినెలకొనెను. ఈపరిస్థితులు అనుకొనకుండాజరిగెనని ఆసమయమున నేమిచేయుటకు తోచలేదని గవర్నరుగారు చెప్పకతప్పినదికాదు. ఈ అల్లరులలో మొత్తము 29 మంది ప్రాణములనుగోల్పోయిరని, 230 మంది తీవ్రముగా గాయపడిరని అధికారులు ప్రకటించిరి. లూటీలుచేసినవారిలోను లూటీచేయబడినవారిలోనుకూడా కొందఱు చచ్చిరి; కొందఱు గాయపడిరి.

ఈ అల్లరులనుగూర్చి విచారించుటకు అయికెన్ వాట్సన్ (Mr. Aiken watson) గారును మరిముగ్గురు ఇంగ్లీషుదొరలును గల విచారణసంఘమును బ్రిటీషుప్రభుత్వమువారు ఏప్రిలు 8వతేదీన నియమించిరి. ఈసంఘమువారు దేశపరిస్థితులను జాగ్రత్తగానే విచారించి తమనివేదికలో వ్రాసిరి. బంగారుకోస్తాప్రభుత్వమువారు అవలంబించిన ఉద్యోగనియామక విధానమున నల్లవారికి న్యాయముజరుగుటలేదని వారు స్పష్టముగా చెప్పిరి. దేశమున ఆర్థికాభివృద్ధి సరిగా జరుగుటలేదని విమర్శించిరి. ప్రభుత్వము బలహీనమైనదిగా నున్నదనిరి. రాజ్యాంగమునందు ఉదారమైనస్వపరిపాలనము నొసగవలెననికూడా వారు సూచించిరి. క్వామే న్క్రూమాగారిఅనుచరుడైన కోఫీబాకో (Kofi Baako) గారుకూడా వాట్సన్కమిటీనివేదిక న్యాయముగనేయున్నదని అంగీకరించిరి. అయితే దేశములోనిపరిస్థితులందు

ప్రజలభావములందు గొప్ప మార్పుకలిగెను. తక్కినసంగతు లెట్లున్నను, క్వామే న్క్రూమాగారిని డాన్ క్వాగారిని తక్కిననలుగురు దేశనాయకులను నిర్బంధమునందుంచినందువలన దేశప్రజలలో తీవ్రమైన అసంతృప్తి వ్యాపించెను. న్క్రూమాగారిని కమ్యూనిస్టుఅని ప్రభుత్వమువారు నిందింపసాగిరి. అయితే దీనినెవ్వరును లక్ష్యముచేయలేదు. వీరివిచారణ దేశములో గొప్ప సంచలనము కలిగించెను.

అనేకప్రజాసంఘములు సంపూర్ణస్వాతంత్ర్యము నొసగవలెనని తీర్మానించెను. ( U. G. C. C.) యు. జి. సి. సి. పక్షమునందు వేల కొలది క్రొత్తసభ్యులు చేరిరి. ఆ పక్షమువారినాయకులు జాతీయనాయకులుగా గౌరవింపబడిరి. న్క్రూమాగారు కిరీటములేనిరాజుగా మన్నింపబడసాగెను. ఆయన ఎక్కడకువెళ్ళినను బ్రహ్మరథముపట్టుచుండిరి. ప్రజలందఱు ఎకమై గట్టిగా నిలువవలెనని ఆయన యుద్బోధించును. ఆయన స్థాపించిన 'అక్రా ఈవినింగ్ న్యూస్' జాతీయపత్రిక యయ్యెను.

వాట్సన్ నివేదికను శాసనసభవారు ఆమోదించిరి. దేశవ్యవహారములలో అనుభవమున్ననాయకులుగల ఒక స్థానికసంఘమును రాజ్యాంగసంస్కరణములనుగూర్చి సిఫారసులుచేయుటకు నిర్మించవలెనని వాట్సన్ కమిటీవారు సూచించిరి. రాజ్యాంగసంస్కరణలనుసూచించు సంఘమునకు ప్రజకిష్టమైనవారి నెన్నుకొనుటకు అవకాశమివ్వవలెనని న్క్రూమాగారిపత్రిక వాదించెను. ప్రభుత్వమువా రిందుకు అంగీకరింపలేదు 1948 డిశంబరులో తామునియమించిన ఆ సంఘసభ్యులపేర్లు ప్రకటించిరి. ఇందులోనిచిత్ర మేమనగా జాతీయనాయకులలో ముఖ్యులైనవారి పేర్లనన్నిటిని గవర్నరు ఆ సంఘమున చేర్చెనుగాని, న్క్రూమాగారిని మాత్రము చేర్చలేదు. దానికి జస్టిస్ కౌసీ,(Justice Coussy)గారి నధ్యక్షునిగాచేసిరి. దీనినిగూర్చి న్క్రూమాగారిపత్రిక వ్రాయుటలో న్యాయాధిపతిగారిని విమర్శింపక, ప్రజాభిమతమునకువిరుద్ధముగా అధ్యక్షుని ఎన్నుకొననివ్వక నియామకముచేయుట న్యాయముకాదనిమాత్రము వ్రాసెను. ఈసంఘమునకు ప్రభుత్వమువారు ఇరువురు కార్యదర్శులను నియమించిరి. అందులోనొకడు బ్రిటీషుఉద్యోగి, ఒకడు

ఆఫ్రికాదేశీయోద్యోగి. తెల్లవానిని కార్యదర్శిగా నియమించుటనుగూర్చి న్క్రూమాగారు విమర్శించిరి.

న్క్రూమాగారి నీ సంఘమున నియమించకపోవుటవలన ఆయన పరువుప్రతిష్ఠలకు భంగముకలుగలేదు సరికదా, అవి మఱింత హెచ్చెను. ఆయన నిజమైనదేశభక్తుడై నందువలన ప్రభుత్వమువారి కాయనపైన క్రోధ మని ప్రజలందరు గ్రహించి ఆయనను మఱింత గౌరవించి ఆయనఅభిప్రా యములకు మఱింత విలువనొసగిరి. క్రొత్తసంఘమునందుసభ్యులైనవారు తమఅభిప్రాయములను ధైర్యముగా ప్రకటింపజాలరు. న్క్రూమాగారు మాత్రము ఎప్పటివలెనే దేశములో తీవ్రజాతీయవాదిగా ప్రచారముచేయుచు, సంపూర్ణస్వాతంత్ర్యము నొసగనిచో ప్రజలు అంగీకరింపరని యుద్ఘాటించు చుండెను.

ఒకవంక రాజ్యాంగసంస్కరణలవిచారణ జరుగుచుండగా నింకొక వంక బ్రిటీషువారు విడదీసి పాలించు రాజ్యతంత్రము సాగించుచుండిరి. దేశీ యులలో కొందఱిని చేరదీసి ప్రభుభక్తులుగాచేయుటకు ప్రయత్నించు చుండిరి.

1948 చివర లండనులో నొక ఆఫ్రికా కాన్ఫరెన్సు జరుపుచుండగా ఈ దేశప్రతినిధిగా డాన్క్వాగారిని ప్రభుత్వము పంపుటకు నిశ్చయించెను. ప్రభుత్వమువారినియామకము నాయన స్వీకరించుటతో నాయనపట్ల గౌరవము తగ్గెను.

దేశములో తీవ్రజాతీయభావములను ప్రచారముచేయుటకు న్క్రూమా గారు క్రొత్తరాజకీయప్రజాసంఘము నేర్పరచిరి. దేశములో జరిగిన ప్రతి సంఘటనమునందును న్క్రూమాగారి తీవ్రజాతీయవాదమునే ప్రజలు హర్షింప సాగిరి. ఆనాటిదేశనాయకులతో న్క్రూమాగారికి అభిప్రాయభేదముకలిగెను. అంతట ఆయన బ్రిటీష్‌వారవలంబించు కుటిలరాజ్యతంత్రమును ప్రతిఘటించు టకు "ది కన్వెన్షన్‌పీపుల్సుపార్టీ" (C. P. P.) అను తీవ్రజాతీయ రాజకీయ పక్షమును 1949 జూన్ 12వ తేదీన స్థాపించిరి. దీనితో న్క్రూమాగారు దేశములో అద్వితీయ జాతీయనాయకుడయ్యెను. దేశప్రజలకు రాజకీయము గాను ఆర్థికముగాను అభివృద్ధికలుగుటకును సంపూర్ణస్వరాజ్యము తక్షణమే

స్థాపింపవలెననునినాదము నాయన ప్రారంభించిరి. దీనిని సహేతుకముగా సమర్థించుచు దేశములో ప్రచారముచేయసాగెను. ప్రభుత్వమువారు ప్రజల కోర్కెలనుమన్నింపనిచో దానిని సాధించుటకై ఆయన ప్రత్యక్షచర్యజరుపుటకు నిశ్చయించెను. దీనినిగూర్చి ప్రభుత్వమువారిని హెచ్చరించెను. గవర్నరైన సర్ చార్లెస్ ఆర్డెన్‌క్లార్కుగారు రాజకీయములందు బలమునుప్రయోగించినచో మఱింతబలము నుపయోగించి అణచివేసెదమని ప్రకటించి మొబైల్‌పోలీసుదళమును నిర్మించిరి. న్క్రూమాగారి నూతనరాజకీయపక్షము సభ్యులసంఖ్య అభివృద్ధిచెందెను. నూతనరాజ్యాంగసంస్కరణలు సంతృప్తికరముగలేవని తిరస్కరించి ప్రత్యక్షచర్యజరుపుటకు నిశ్చయించిరి. ప్రభుత్వమువా రీ క్రొత్తపార్టీసభలను నిషేధించిరి. పత్రికను అణచివేసిరి. న్క్రూమాగారిని నిర్బంధించి విచారించిరి. కాని కేసు విఫలమైనది. తరువాత న్క్రూమాగారిని పట్టుకొని చెరకంపిరి. అయితే అటుపిమ్మట జరిగిన అన్ని ఎన్నికలలోను ఆయనపక్షమే విజయముపొందెను. అందువలన తుదకు విధిలేక ఆయననువదలి క్రిందటి ప్రకరణమున చెప్పినట్లు ఆయనను 1961 లో ప్రధానమంత్రిగా నాహ్వానించిరి.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## పదునొకండవ ప్రకరణము

### బెల్జియన్ కోంగో

మధ్య ఫ్రికాలోనున్న బెల్జియన్‌కోంగో బెల్జియందేశమువారి వలస రాజ్యము. దీనివిస్తీర్ణము 904757 చదరపుమైళ్ళు. ఆఫ్రికాఖండములోనెల్ల గొప్పనదియై 3000 మైళ్ళదూరము ప్రవహించు కోంగోనదియు దానిశాఖలును వ్యాపించియున్న సారవంతమైనప్రాంత మిది. ఇది చాలా ఉష్ణముగా నుండుదేశమును హెచ్చుగా వర్షపాతముగల దేశము నైయున్నందున నిందులో సూర్యరశ్మిచొరని మహారణ్యములున్నవి.

ఇందులోనివసించు బాంటూజాతిజనులు 10761353 మంది యున్నారు. తెల్లవారు 43408 మాత్రమే యున్నారు. ఈదేశములోని యుత్పత్తులు నూనెనిచ్చుచెట్లు, ప్రత్తి, వరి, కోపాల్, కాఫీ, దంతము, రబ్బరు, ఖనిజములు రాగి, బంగారు, వజ్రములు. తగరము, యురేనియము. దీనిరాజధానినగరము లియోపాల్డువిల్లి, (Leopcldville) ఇందులో ముఖ్యపట్టణములు బోమ, స్టాన్లీవిల్లీ, ఎలిసబెత్‌విల్లి అనునవి.

ఈరాజ్యము చాలాకాలము బెల్జియందేశపురాజైన లియోపాల్డుగారు తమస్వంతఆస్తిగా పరిగణించి పరిపాలించుచుండిరి. తరువాత 1908 లో బెల్జియంపార్లమెంటువారు అధికారమువహించిరి. ఇక్కడ ప్రజాప్రతినిధి ప్రభుత్వము లేదు. దీనివ్యవహారములను బెల్జియందేశపు వలసరాజ్యమంత్రి చక్కబెట్టుచుండెను ఆయన కొకసలహాసంఘ ముండెను. దీనిలోని వివిధ రాష్ట్రములను పరిపాలించుటకు గవర్నరులు నియమింపబడిరి. నల్లజాతుల నాయకులు తమతమజాతులవారిపైన అధికారము చెలాయించుచుండిరి. వీరి

న్యాయపరిపాలనముగాక ఆ దేశములో ప్రభుత్వమువారిఅధికారముక్రింద పనిచేయు న్యాయాధిపతులుకూడా నియమింపబడిరి.

కోంగోలోని విద్యాబోధనము క్రైస్తవమతబోధకులయధికారము క్రింద జరుగుచుండెను. అయితే, ప్రభుత్వమువారు పైతనిఖీచేయుచుండిరి. నల్లవారిలో చదువుకున్నవారు హెచ్చుగాలేరు. ఉన్నవారు పట్టణములలోనికి చేరిరి.

ఆఫ్రికాలోని వివిధజాతులవారిలో రెండవప్రపంచసంగ్రామానంతరము జాతీయభావములును స్వాతంత్ర్యేచ్ఛయుఅభివృద్ధిచెందెను. కోంగోలోని నల్లవారిలోకూడా చైతన్యముకలిగెను. అంతట వారు పరిపాలనమునందు పాల్గొనవలెననికోరసాగిరి. బెల్జియంప్రభుత్వమువారు వీరిని తమఅధికారమునకులోబరచియుంచుట కనేక సాత్వికోపాయములను అవలంబించిరి.

బెల్జియంవారివలసరాజ్యమైన కోంగోలో ఆఫ్రికాదేశీయులకును బెల్జియందేశపుతెల్లవారికినిమధ్య సంఘర్షణలుజరుగుచు 1958 జనవరి 4వ తేదీన ఒక యుద్ధమే జరిగినది. ఘనరాజధానియైన అక్రాలో 1948 ఫిబ్రవరి 28వ తేదీన క్రిష్టియన్సుబోర్గురోడ్డుదగ్గర బ్రిటీషువారు ఆఫ్రికాదేశీయులపైన తుపాకులుకాల్చినసంఘటనము దానివలన ప్రజలలోకలిగిన సంక్షోభమునకు కోంగోలో జనవరినాలుగవతేదీన జరిగినవిశేషములు సరిపోలినవి.

బెల్జియంనుండి, కమినా నుండి తెల్లవారి "పేరాట్రూపరు"లను విమానములపైన తీసికొనివచ్చినల్లవారిపైన తుపాకులుకాల్చి తాత్కాలికముగా శాంతిస్థాపించినట్లు కనబడినను, జనవరి 4వ తేదీన వీరస్వర్గముపొందిన త్యాగమూర్తులదే నిజమైన జయమనిచెప్పవచ్చును. ఆదినమునజరిగినది ముందుగా ఆలోచించిచేసినతిరుగుబాటుగాక అకస్మికముగా ప్రజలలోకలిగిన సంక్షోభఫలితముగా చేసిన ధిక్కారము.

కోంగోరాజధానియైన లియోపాల్డువిల్లీలో దేశీయులు సభచేయదలపగా తెల్లఅధికారులు నిషేధించిరి. ఘనరాజధానియైన అక్రాలోజరిగిన ఆఫ్రికాప్రజల కాన్ఫరెన్సుకు పోయి తిరిగివచ్చిన నలుగురు కోంగోప్రతినిధు

లా సభలోనుపన్యసింపవలసియుండిరి. ఈసభను నిషేధించినందులకు నిరాయుధులై చేరిన జనసమూహము ఆగ్రహించిరి. అక్కడనున్న ప్రభుత్వము వారి సాయుధపోలీసుదళమువారీ జనులగుంపును చూచి భయభ్రాంతులై గట్టిచర్య తీసికొనుటకై తుపాకులుకాల్చిరి.

అంతకువారముదినములకుముందొక చిన్నపట్టణమున జరిగిన సభలో ప్రజలు శాంతముగా సమావేశమై తక్షణమే స్వాతంత్ర్యము స్థాపించవలెనని తీర్మానించియుండిరి. బెల్జియంజాతితెల్లవారా దేశము నుండి వెడలిపోవలెనని అనలేదు. తెల్లవారిపట్ల ద్వేషభావము పురికొల్పలేదు. ఈసంగతిని ఆ సభకువెళ్ళిచూచిన ఆంద్రీ బ్లాంచెట్ (Andre Blanchet) గారు లీ మొండె (Le Monde) అను పత్రికలో వివరించియున్నారు. ఈ పరిస్థితులలో లియోపాల్డువిల్లీలోనివారెందుల కింత తొందరపడిరో చెప్పుట కష్టము.

పైనచెప్పినట్లు లియోపాల్డువిల్లిలోజరిగిన సంఘటనము ముందుగా ఆలోచించిచేసిన రాజకీయమైనకుట్రగాని తిరుగుబాటుగాని కాకపోయినను, అధికారులు బలప్రయోగముచేసిరి. అంతట జను లాగ్రహపరవశులై చెలరేగిరి. పోలీసువారికిని ప్రజలకును మూడుదినములు యుద్ధముజరిగినది. కోంగోలోని జాతీయప్రజాసంఘమైన "అబకో" (Abako) ను నిషేధించిరి. ఆఫ్రికాదేశీయులైన ముగ్గురుమేయరులను నగరసభాధ్యక్షులైన కసవుబు (Kasavubu) పింజీ (penzi) డియోమి (Diomi) గార్లను అరెస్టు చేసిరి. దీనివలన కోంగోదేశీయులైననల్లవారిలో ఏకీభావముకలిగెను. కోంగో స్వాతంత్ర్యోద్యమమునకు బలముచేకూరెను. త్యాగముచేసినవారిని గౌరవించు భావము ప్రజలలో వ్యాపించెను.

సాధారణముగా దేశమునందలి పూర్వవిధానములపట్ల ప్రజలు అసంతృప్తివహించినప్పుడే విప్లవములు జరుగును. కోంగోదేశములోకూడా ఇట్లే జరిగినది. కోంగోదేశమును చక్కనివలసరాజ్యముగాచేసితిమని బెల్జియం వారు చాలా ప్రచారముగావించిరి. అక్కడి ప్రజలు శాంతిని సత్పరిపాలనము ననుభవించుచున్నారని, తీవ్రజాతీయవాదులు తిరుగుబాటుచేయుచున్నను సామాన్యజనులు సుఖముగానుండి అభివృద్ధిచెందుచున్నారని బెల్జియంప్రభు

త్వమువారు గొప్పప్రచారముచేసిరి. ఈ బెల్జియంవారు తమచర్యలకుతామే సంతసించి తృప్తిచెందుచుండిరి. తమపరిపాలనావిధానము బాగున్నదని సంత సించుచుండిరి. కోంగోలో వారు కొన్ని మంచిసంస్థలను స్థాపించినమాట నిజము. శిశుసంరక్షణకొరకు కొన్ని క్రెషే (Creches) స్థాపించిరి. వైద్య మునకు "క్లినిక్సు" (Clinics) లను రోగనిదానచికిత్సాలయములను నెల కొల్పిరి. కొన్నిపాఠశాలలు, సాంఘికక్షేమకేంద్రములు, కుట్టుపనితరగతులు స్థాపించిరి. బాయ్‌స్కౌట్, గరల్‌గైడ్ దళములు, వినోదక్రీడామందిరము, క్లబ్బులు, సేవింగ్సుబ్యాంకులును స్థాపించినారు. వీనిద్వారా కోంగోప్రజలకు విజ్ఞానము శరీరసౌఖ్యముకలిగించుచున్నామని బెల్జియంవారు చెప్పుదురు. ఈ పనులనుచేయుటలో బెల్జియంపరిపాలకవర్గమువారు కన్సెషన్‌కంపెనీలవారు క్రైస్తవమిషనులను ఒకరితోనొకరు సహకరించి చేయుచున్నారు. క్రైస్తవ మిషను లనుప్రచారకసంఘములువారు కోంగోప్రజలయాత్మల నుద్ధరింపదలచి క్రైస్తవమతప్రచారముచేయుచు అందుకొరకు కొన్నిసంస్థలను స్థాపించిరి. కన్సెషనుకంపెనీలవారు కోంగోదేశములో పరిశ్రమలలోపనిచేయువారి కిచ్చు కూలివిషయమైన కట్టుబాటులుచేసిరి. బెల్జియంప్రభుత్వమువారి పరిపా లకవర్గమువారు కోంగోదేశీయుల నిత్యజీవనమునుగూర్చిన కట్టుబాటులను చేయుచు తెల్లప పాలకవర్గముద్వారా శాసనవిధులను అమలుజరుపుచున్నారు. కోంగోలోనినల్లవారు ఈ విధులను మీరిచరింపరాదు. బెల్జియంప్రభుత్వము వారు సాధారణముగా మంచియుద్దేశముతోనే చాలాప్రణాళికలను అమలు జరుపుచుందురు. సాధారణముగా నవి జయప్రదములుగనే జరుగును. అధి కారరీత్యాజరుగు కార్యక్రమములవలని మంచిఫలితములను గాని దుష్ఫలిత ములనుగాని అనుభవించువారు కోంగోదేశీయులు, ఇంతవఱకు అధికారము లన్నియు పాశ్చాత్యులహస్తగతములుగనేయున్నవి కోంగోదేశీయులు పరిపాల నమునందు విద్యావిధానమునందు పరిశ్రమలందు చిన్నచిన్న "ఫోర్మన్" ఉద్యోగములవంటి యుద్యోగములుచేయుటకు వీలున్నది. వారు గుమాస్తాలు గాను వారంటుఆఫీసరులుగా నుండవచ్చును. వారు సలహాసంఘములందు కూర్చుని తమకుతోచినసూచనలుచేయవచ్చును గాని, అవి అమలుజరుగక పోవచ్చును. పెద్దఅధికారముగల ఉద్యోగములుచేయుటకు వారికి అవకాశము

లేదు. తమదేశప్రభుత్వవిధానమునందు పలుకుబడిలేదు. ఇందువలన కాంగో దేశీయులలో తీవ్రమైనఅసంతృప్తివ్యాపించి తుదకు లియోపాల్డువిల్లీలో అధి కారధిక్కారముచేసిరి.

కాంగోదేశీయులు కొంతకాలమునుండి అసంతృప్తిచెందియున్నారు. బెల్జియంవారు మొదటినుండి కోంగోదేశీయులను యుక్తాయుక్తవివేచనలేని పిల్లలుగా పరిగణించి, అన్నిఅధికారములు తామే చెలాయించుచు, వారి నిట్లు చేయుడు అట్లుచేయుడని ఆజ్ఞాపించుచుందురు. అయితే ఇటీవల కొంతకాల మునుండి బెల్జియంవారిమాటలను దేశీయులు శిరసావహించుటమాని వారి యాజ్ఞలను ప్రతిఘటించుట ప్రారంభించిరి. స్వతంత్రకోంగోరాజ్యస్థాపనమను నొకభావము వారిలో వ్యాపించినది. నాలుగేండ్లనుండి "స్వాతంత్ర్యము వర్ధిల్లు గాక, కోంగోరాజ్యమువర్ధిల్లుగాక" యని వారు గోడలపైన వ్రాయసాగిరి. డేనియల్ కంజా (M.Danial Kanza) అబకో అను కోంగోప్రజా సంఘమునకు ఉపాధ్యక్షులు. ఆయనను అధికారులు కారాగారమున నుంచిరి. కోంగోదేశీయులపట్ల జాతిభేదముచూపవలదని ప్రజలు తమ అభి ప్రాయమును ప్రకటించుటకు హెచ్చుఅవకాశములొసగవలెనని దేశీయులకు ఇంతకన్న మంచి విద్యాసౌకర్యములొసగవలెనని చాలా నెమ్మదిగా ఆయన కోరుచుండెను. నాలుగేండ్లకు పూర్వము ఆయనయొక్కడే ఇట్లు ప్రచారము చేయుచుండెను. అయితే క్రమక్రమముగా ప్రజలలో నీ భావములు వ్యాపిం చెను. దీని కనేకపరిస్థితులు తోడ్పడెను.

శ్రీ పెటిల్లన్ (M. Petillon) గారు గవర్నరుజనరలుగానుండగా ప్రపంచపరిస్థితులు మారుచుండుటను బెల్జియంవారు గ్రహించియే కాబోలు బిగువైన తమ అధికారమును కొంత సడలించిరి. లొవెనియం (Lovanium) ఎలిసబెత్‌విల్లీ (Elisabethville) యునివర్సిటీ లను రెండు విశ్వవిద్యాలయములను స్థాపించిరి. ఒక క్యాతలిక సంస్థయున్నచో మఱియొక ఉదారమైన లిబరల్‌సంస్థ యుండవలెనని బెల్జియంవారి సంప్రదాయము. అందువలననే ఇట్లు రెండు విశ్వవిద్యాల యములను స్థాపించిరి. దీనిఫలితముగా కోంగోదేశీయులైన నల్లవారిలో నిప్పుడు కొందఱువిద్యాధికులు బయలుదేరుట కవకాశముకలిగెను. రెండు

విశ్వవిద్యాలయములుండుటవలన అధికారులకిష్టమైనదానికన్న రెట్టింపు మంది విద్యార్థికులుత్పత్తియగుచుండిరి. మూడుపెద్దపట్టణములందలి మునిసిపలుసంఘములందు కోంగో దేశీయులు ప్రతినిధులనెన్నుకొనుటకవకాశమొసగబడెను. లియోపాల్డువిల్లీలోని ఆఫ్రికాజాతివారి కమ్యూనులమేయరులు అందు ముఖ్యముగా కసవుబు (Kasavubu)గారు రాజ్యాంగసంస్కరణములు కావలెనని ఇటీవల జరిగిన ఉద్యమమందు ప్రధానపాత్రవహించెను. పారిశ్రామికుల వ్యాపారవృత్తికట్టడిసంఘములను బెల్జియం ప్రభుత్వమువారు కొంతవరకు శాస్త్రసమ్మతములుగా అంగీకరించిరి. కోంగో దేశీయులలో కొంతమందిని పాశ్చాత్యపానశాలలందు (bars) తెల్లవారితో పాటు ఫలహారములుచేసి మధుపానము చేయనిచ్చిరి. ఇటువంటిమార్పులుకొన్ని జరిగినను నల్లవారివిషయమున బెల్జియంవారిపై ఖరిలో నిజమైనమార్పు కలుగలేదని కోంగో దేశీయు లనుకొనసాగిరి. ప్రక్కనున్న పోర్చుగీసుజాతి పాశ్చాత్యులకన్న బెల్జియంజాతివా రిట్టిసంస్కరణములను కొన్నిటిని చేయుట చూచి రాజ్యాంగసంస్కరణములవలన అధికారముపొందవలెననువాంఛ కోంగోదేశీయులలో రేకెత్తుటలో ఆశ్చర్యములేదు.

దేశములోనిజనులకు కావలసినవస్తువులు సరుకులు సరఫరాచేసి వారికిక్షేమముకలిగించినచో వారు రాజకీయస్వాతంత్ర్యమును కోరరని బెల్జియంజాతివారు పొరబాటుఅభిప్రాయము కలిగియుండిరి. అయితే లియోపాల్డువిల్లీలో 80 వేలమంది పారిశ్రామికులలో 25 వేలమందికి ప్రతిదినము సరిగా పనిలేకుండెను. రెండవప్రపంచయుద్ధానంతరము జరిగిన ఆర్థికాభివృద్ధిసందర్భమునందు కోంగోలో పనిలేనిపారిశ్రామికులసంఖ్య తక్కిన ఆఫ్రికారాజ్యములకన్న హెచ్చుగానుండెను. చిన్నచిన్న పరిశ్రమలుచేయు ఆటంర్ప్రనర్లు(Entrepreneurs)యొక్క జనసంఖ్యయు నొక మధ్యతరగతి ప్రజలుగానుండిరి. పరిశ్రమలలో లాభముతక్కువగావచ్చు సంవత్సరములందు పనిలేని నల్లవారికిని తెల్లయజమానులకుమధ్యగల తారతమ్యము మఱింత స్ఫుటముగా గోచరించుచుండును.

కోంగోదేశములోని బకొంగో (Bakongo) జాతి నల్లవారికథ చాలా చిత్రమైనది. పూర్వము ఫ్రెంచివారును పోర్చుగీసువారును బెల్జియం

వారును ఆఫ్రికాఖండమునాక్రమించి పంచుకొనుటలో నీ జాతిప్రజలలో కొంతమంది బెల్జియంకాంగోరాజ్యములోను మఱికొంతమంది ఫ్రెంచివారి మొయెన్‌కాంగో (Moyen Congo) రాజ్యములోను ఇంకనుకొంతమంది పోర్చుగీసువారి అంగోలారాజ్యములోను గొఱ్ఱెలమందలవలె విభజింపబడిరి. ఇటీవల నొక తీరములోనే కింబంగ్వా (Kimbangui), మత్స్వ (Matswa), మ్పడి (Mpadi) అను ముగ్గురు విప్లవనాయకులు బకొంగో జాతివారిలో బయలుదేరి ఈ మూడుప్రాంతములందున్న బకొంగోజాతిప్రజలలోను వలసరాజ్యవిధానమునకువ్యతిరేకముగా గొప్ప ప్రచారముచేసిరి. ఈ ప్రచారమునందు వీరికి క్రైస్తవచర్చివ్యవస్థ బాగా తోడ్పడినది. అబ్బె ఫుల్బర్టు యౌలౌ (Abbe Fulbert youlou) అను నొక దేశీయక్యాతలిక్కుమతప్రచారకుడు స్వపరిపాలనముగల ఫ్రెంచిరిపబ్లికురాజ్యమైన మొయెన్ కోంగోరాజ్యమునకు ప్రధానమంత్రియై నల్లవారిలో గొప్ప రాజనీతిజ్ఞుడని పేరుపొందెను. బెల్జియన్ కోంగోలో జాతీయప్రజాసంస్థయైన అబకో మొదట నొక నల్లవారి సాంస్కృతికసంస్థగా ప్రారంభమై క్రమక్రమముగా రాజకీయప్రజాసంస్థగా మారి ప్రజాసేవచేయసాగెను. దీనినాయకుడైన కసవుబు గారు పైనచెప్పిన యౌలౌగారికి మిత్రుడైనాడు.

బెల్జియన్‌కోంగోకుఅనుకొని నదియావలియొడ్డున ఆఫ్రికాదేశీయుల జాతీయప్రతినిధులుగల ప్రజాప్రభుత్వము నల్లప్రధానమంత్రి ఇతరమంత్రులు పరిపాలించు స్వతంత్రరిపబ్లికొకటి వర్ధిల్లుచుండుట బెల్జియన్ కోంగోలోని దేశీయులలోను లియోపాల్డువిల్లీలోని నల్లవారిలోను తమజాతియైన బకొంగో జాతివారందఱును ఏకముగానుండిన పూర్వకాలమునాటి కోంగోరాజ్యమును జ్ఞాపకమునకుతెచ్చి, దేశమునేకముచేసి స్వాతంత్ర్యమునుస్థాపించవలెనను వాంఛను కలిగించుటలో నాశ్చర్యములేదు.

1958 డిశంబరునెలలో ఆఫ్రికాలోజరిగిన రాజకీయమహాసభకు కాంగోలోని దేశీయులప్రతినిధులుగా ముగ్గురునల్లవారుపోవగా అందులో నొకరైన లుముంబా (Lumumba) గారి నా సభ కార్యనిర్వాహకసంఘమున కార్యకర్తలలోనొకరిగ(Executive Committee of the Xecretariat) నెన్నుకొనిరి. ఇది కోంగోలోనినల్లవారికి చాలా సంతోషమును కలిగించెను.

లియోపాల్డువిల్లీ లోనేగాక దేశములోని అన్నిముఖ్యపట్టణములందలి నల్లవారి లోను సంచలనము కలిగెను. ఇదివఱకు బాహ్యప్రపంచముతో సంబంధము లేకుండా అసహాయులుగానున్న తమ కిప్పుడు ఆఫ్రికాలోనినల్లజాతివా రందరిసహాయము బలముచేకూరినదని, ఇక తాము స్వతంత్రులమగుటకవకా శముకలదనుభావము కలిగెను.

ఈపరిస్థితులలో జనవరి 4 వ తేదీన జరిగిన ఘోరసంఘటనము తట స్థించెను.

అంతట బెల్జియంప్రభుత్వమువారు ఏదోకొంత రాజ్యాంగసంస్కర ణముచేసినగాని, లాభములేదని గ్రహించి కోంగోరాజ్యమునకు స్వపరిపాల నమునొసగుటయే తమఉద్దేశమని, దానికొరకు క్రమక్రమముగా మెల్లగా కొన్ని చర్యలుతీసికొందుమనియు, ముందుగా పరిపాలన విధానమున ప్రజాప్రతినిధులుగల కొన్నిసంస్థలను నెలకొల్పదలచినామనియు ప్రకటించిరి. జాతివిచక్షణను వర్ణభేదమును రద్దుచేయుదుమనిరి. పారిశ్రామికులకు కొన్ని సౌకర్యములు కలిగించు శాసనవిధులను చేయుదుమనిరి. విద్యాభివృద్ధిచేయుదు మనిరి ఇంక నేమేమో వాగ్దానములుచేసిరి. ఇట్లొక్కసారిగా కోంగోలోని నల్లవారు ఘనరాజ్యములోనల్లవారు 1948 ఫిబ్రవరిలోనుండినస్థితికివచ్చిరి. అయితే, ఘనరాజ్యములోనినల్లవా రవలంబించినమార్గముల నవలంబించుట కిక్కడ కొన్నిచిక్కులుండెను. తమను యుక్తాయుక్తములెరుగని పిల్లలను చూచినట్లు చూడవలదని వీరు ప్రభుత్వముతో గట్టిగా చెప్పజాలరైరి. బ్రిటీషుజాతిలోనున్నట్లు బెల్జియంజాతివారిలో ఉదారరాజకీయభావములుగల "క్రిష్టోఫేబియన్" సామాజికవాదులు లేరు. పైగా ఇక్కడిసమస్యలు కొన్ని చాలా క్లిష్టములైనవి కలవు. కివులోతప్ప రైతులనిచెప్పతగిన తెల్లవారు హెచ్చుమంది లేరు. వీరిలో దళారీలుకూడా కొందఱున్నారు. వా రిదివఱకు బెల్జియంరాజధానియైన బ్రసెల్సునుండివచ్చిన నిరంకుశ ఆర్డరుప్రకారము వర్తించుచుండిరి. ఈ నూతనవిధానమునకు సుముఖులుకారు.

కోంగోరాజ్యములోని నల్లవారిలోకూడా అనేకవిధములైనవారున్నారు. వీరిలో కులతత్వమువంటి జాత్యభిమానమును తెగపైనభిమానమును కలవారు

హెచ్చుగానున్నారు. వీరిలో ముఖ్యముగా ప్రాంతీయాభిమానము విపరీతముగ నున్నది. అందువలన పరిపాలకవర్గమువా రాటంకములుకలిగింపకపోయి ననుకూడా కోంగోలోని దేశీయులలో జాతీయభావమునుకలిగించుట జాతీయ సంస్థను స్థాపించుట కష్టము. అటువంటిపరిస్థితులలో ప్రభుత్వమువారు దేశీయుల కాటంకముకలిగించుచుండగా నిట్టి జాతీయసంస్థ ఏర్పడుట జాతీయ కార్యక్రమము కొనసాగుట దుస్తరము. కోంగోలోని జాతీయనాయకులు మాత్రము గట్టివారే. వీరు క్లాస్ (Classe) మొయెన్నె (Meyenne) జాతీయులు. చాలాకష్టపడి పైకివచ్చినవారు. డేనియల్ కంజా (Daniel kanza) సమర్థుడు. నీతిపరుడు. కోంగోలోని మధ్యతరగతిజనులలో ఘనలోను నైజీరియాలోను ఉన్నవారివలె దేశాభిమానముకలిగి పాటుపడగలనాయకులు బయలుదేరలేదు. అన్నిటికన్నను కోంగోదేశములోని నల్లవారికిగల పెద్ద చిక్కు కోంగోయొక్క ప్రకృతిసంపద, అది ఆఫ్రికాఖండమధ్యముననుండి బలవంతులగు పాశ్చాత్యులకు కన్నుకుట్టునట్టిదిగా నుండుట కోంగోరాజ్యము స్వతంత్రఆఫ్రికారాజ్యసమ్మేళనమున చేరినచో నది చాలాముఖ్యమైనభాగముగా నుండగలదు. అందువలన బెల్జియందేశీయులగు యజమాను లీ దేశమును జారవిడుచుకొందురా యనునది ముఖ్యమైనప్రశ్నయని తామస్ హడ్జ్‌కిన్ గారు న్యూస్టేట్సుమనులో నొకవ్యాసమును వ్రాసియున్నారు.

1959 జనవరి నెలాఖరులో మరల అల్లరులు జరిగెను. బెల్జియం ప్రభుత్వాధికారులు లియోపాల్డువిల్లీపరిసరములందు 1500 మంది నల్లవారిని పట్టుకొని నిర్బంధించిరని జనవరి 31 వ తేదీన ప్రకటింపబడినది. 30 వ తేదీన డెండేల్ (Dendale) పరిసరములందు 620 మందిని అరెస్టుచేసినారనియు, ఇందులో 200 మందిని కారాగారామున నిర్బంధించి మిగిలినవారిని వారివారిగ్రామములకు పంపుదురనియు పోలీసువారు చెప్పిరి.

లియోపాల్డువిల్లీకి 120 కిలోమీటరులదూరమునగల తిస్‌విల్లీ (Thysville)లో మిషనరీపాఠశాలలుగా నుపయోగింపబడుచున్న రెండు పూరిపాకలను ఆఫ్రికావారెవ్వరో బుధవారమునాడు తగులబెట్టినారని, ఇంకను ఇట్టిఅల్లరులు సాగుచున్నవని తెలిసినది. లియోపాల్డువిల్లీనగరపరిస

రములందు 1959 జనవరి 31 తేదిరాత్రి నూరుమంది ఆఫ్రికావారిని "కర్ఫ్యూ" ఉత్తర్వు ఉల్లంఘించిననేరమునకు పట్టుకొనిరి.

ఫిబ్రవరినెలలో ఆఫ్రికాదేశీయులైన వివిధజాతిప్రజలలో నుధ్భవించిన విరోధములఫలితముగా జరిగిన అల్లరులును తిరుగుబాటులును దేశశాంతికి భంగముకలిగించినందున కాంగోరిపబ్లికును ఉత్తరభాగము దక్షిణభాగము అనురెండురాజ్యములుగావిడదీయుటనుగూర్చి విసిదనల్లజాతులవారి యభిమత ప్రకటనమునకై రిఫరెండము నేర్పాటుచేయుదుమని కోంగోప్రభుత్వమువారు 1959 మార్చి 8 వ తేదీన ప్రకటించిరి.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## పంద్రెండవ ప్రకరణము

### అఖిలాఫ్రికా దేశీయుల విమోచనోద్యమము

స్వతంత్ర ఘనరాజ్య ప్రధానమంత్రి క్వామే న్క్రూమాగారు 1958 డిశంబరునెల చివరభాగమున భారతదేశమునకు వచ్చి పర్యటనముచేసి వెళ్ళినారు. క్రొత్తఢిల్లీనగరమున ఆయనగౌరవార్థము జరిగిన విందులో మన ప్రధానమంత్రి నెహ్రూగారిప్రశంసకు జవాబుచెప్పుచు న్క్రూమాగా రిట్లు ప్రసంగించిరి.

"ఘనదేశము స్వతంత్రరాజ్యమైనపిమ్మట అఖిలాఫ్రికాప్రజలు దాస్యమునుండి విముక్తిచెందుటకు తోడ్పడగలశక్తులు కొన్ని యుద్భవించినవి. ఆఫ్రికాఖండవిమోచనకు స్వతంత్రఘనరాజ్యమే మూలపీఠమగుసూచనలును కనబడుచున్నవి. 1957లో మేము స్వతంత్రులమైనపిమ్మట మేముచేసిన మొదటికార్యము ఆఫ్రికాలోని ఎనిమిది స్వతంత్రరాజ్యములప్రతినిధుల నొక చోట సమావేశపరచుట. అట్లు అక్రాలోజరిగిన సమావేశఫలితముగా ఆఫ్రికా వ్యక్తిత్వమనునది యొకటి యుద్భవించినది ఎన్నోశతాబ్దములతరువాత మరల ఆఫ్రికాపక్షమున మాట్లాడగల ఒక జాతీయవ్యక్తిత్వ ముద్భవించినది. నే నిక్కడికివచ్చుటకుముందుగా నింకొక ప్రతినిధులమహాసభకూడా జరిపితిమి. ఆ మహాసభకు పైనచెప్పిన ఎనిమిదిరాజ్యములప్రతినిధులేగాక, ఆఫ్రికాలో నున్న పాశ్చాత్యవలసరాజ్యములందలి నల్లజాతులవారిలోనున్న అన్నిరాజకీయపక్షములప్రతినిధులును వచ్చిరి. మేముజరిపిన చర్చలఫలితముగా పైన చెప్పిన ఆఫ్రికావ్యక్తిత్వమేగాక ఇంకను కొన్నివిశేషఫలితము లుద్భవించినవి. అందులో యావదాఫ్రికాదేశీయసౌభ్రాతృత్వము ప్రధానమైనది.



క్వామే న్క్రూమా

( ఘన ప్రధాని )

విశాలమైన ఆఫ్రికాఖండములోని వివిధ పాశ్చాత్యవలసరాజ్యముల వశముననున్న భాగములందలి ఆఫ్రికాదేశీయులెల్లరు స్వతంత్రులైనగాని, ఆఫ్రికాలో నేదో యొకమూలనున్న చిన్నరాజ్యమొకటి స్వతంత్రమగుటవలన ప్రయోజనముండదని ఆఫ్రికాలోని దేశీయులందఱును గ్రహించిరి. ఇందువలన మే మిప్పు డనేకసమస్యలను పరిష్కరింపవలసియున్నది. వీనినిగూర్చి అనుభవజ్ఞుడైన శ్రీ నెహ్రూగారితో చర్చింపదలచినాను.

ఆఫ్రికాఖండ మిప్పుడు ఆరు, ఏడు పాశ్చాత్యజాతుల వలసరాజ్యాధికారముక్రింద నున్నది ఈ వివిధప్రాంతములన్నిటిలో పనిచేయగల రాజకీయసంస్థ నొకదానిని మేము ఏర్పాటుచేయదలచియున్నాము. ఈ స్వతంత్రయుగములో అచిరకాలములోనే యావదాఫ్రికాప్రజలు దాస్యవిముక్తినిగాంచి, స్వతంత్రులుకాగలరని ఆశించుచున్నాము." అని న్క్రూమాగా రనిరి.

19.8 డిశంబరు 29 వ తేదీన ఢిల్లీ నగరమునం దొక పత్రికావిలేఖరులమహాసభలో ప్రసంగించుచు ఆయన ఇట్లుచెప్పిరి:

"ఆఫ్రికాలోని అన్నిప్రాంతములందును ఘనరాజ్యము స్వాతంత్ర్యోద్యమమును నడుపుట అనునది అసంభవమైనకార్యము. ఆఫ్రికాలోని ప్రతిప్రాంతమునందు దేశీయులును స్వాతంత్ర్యమును సంపాదించుటకు స్వయం కృషిచేయవలెను. ఏప్రాంతములోనున్న ప్రజ లాప్రాంతమునందలి స్థానికపరిస్థితులనుబట్టి తమ స్వాతంత్ర్యోద్యమకార్యక్రమమును నిర్ణయించుకొని పాటుపడుదురు. వారికి ఘనరాజ్యము శక్తివంచనలేకుండా తోడ్పడగలదు. ఆఫ్రికాలో వివిధరాజ్యములమధ్య నిర్ణయింపబడియున్న సరిహద్దులు పాశ్చాత్యులీ దేశమునాక్రమించి దీనిని పంచుకొనుటలో తమకిచ్చవచ్చినట్లు నిర్మించినవే గాని, దేశముయొక్క నైసర్గికమైనఎల్లలుగాని దేశములోనివసించు ప్రజలజాతులతారతమ్యమునుబట్టి నిర్మించినవిగాని కావు. అందువలన నీ సరిహద్దులను సరిగా యేర్పాటుచేసికొనవలెనని ఆఫ్రికాదేశీయులు కోరుచున్నారు. ఆఫ్రికాలోని వివిధరాజ్యములసమితి లేక సమ్మేళనమొకటి స్థాపించుట అవసరమని తోచి ఆఫ్రికావా రందులకు సుముఖులుగానున్నారు.

అక్రానగరములో జరిగిన మహాసభకు హాజరైన నైజీరియారాజ్య ప్రతినిధులుకూడా ఆఫ్రికాలోని వివిధరాజ్యములు కలిపి యొక సమితిరాజ్యం

గము నేర్పరచుకొనుటయే కర్తవ్యమని నిర్ణయించినారు. ఘన గినిరాజ్యము లొకవిధమైన సహకారసమ్మేళనము నేర్పరచుకొనుటకు ఇష్టపడుచున్నవి. లైబేరియా, ఘన, గిని రాజ్యములనాయకులు ఈవిషయమై ఆలోచింప దలచినారు.

ఆఫ్రికాలోని అరబ్బీరాజ్యములవారుకూడా తమ కిష్టమైనచో నీ సమ్మేళనమునందు చేరవచ్చును. ఘనరాజ్యము తనప్రజలపట్లనేగాక స్వాతంత్ర్యమునుపొందదలచిన ఆఫ్రికాదేశీయులందరిపట్లను కూడా కొంత బాధ్యతను కలిగియున్నది.

ఘనరాజ్యప్రభుత్వమువారును గినిరాజ్యప్రభుత్వమువారు నాలోచించి పశ్చిమాఫ్రికాలోనిరాజ్యములకలయికకు ప్రాతిపదికగానుండగలదను భావముతో ముందుగా ఘన - గినిరాజ్యముల సహకారసమితిని స్థాపించదలచినారు. ఆఫ్రికాలోని అన్నిదేశములును మునుముందు ఈ సమితిలో చేరగలవని ఘన, గినిరాజ్యములవారము ఆశించుచున్నాము. ప్రస్తుతము ఘన, గిని రాజ్యముల సమ్మేళనమునుగూర్చిన అన్నివిషయములనుగూర్చియు విచారించి, తగిన సూచనలనుగావించుటకై ప్రస్తుతము ఘన, గినిరాజ్యప్రతినిధులసమిష్టిరాజ్యాంగవిచారణసంఘమును నియమించుటకు ఈ రెండురాజ్యములు నంగీకరించినవి. దేశరక్షణము, విదేశవ్యవహారములు, చెలామణి, అర్థికాభివృద్ధిప్రణాళికలవిషయమున సమష్టిగా వ్యవహరించుటకును, తమ వ్యక్తిత్వమును ఆంతరంగికప్రభుత్వను పోగొట్టుకొనకుండుటకును అవకాశములుండు మృదువైన సమష్టిరాజ్యాంగమును నిర్మింపవలెనని మా యుద్దేశము. దీనివిషయమై ఆలోచించుటకు జరిగినసభలో ఆఫ్రికాలోని అన్నిదేశములందలి వివిధ రాజకీయప్రజాపక్షములప్రతినిధులును ట్రేడ్ యూనియన్లయొక్క పార్శ్రామికులప్రతినిధులును, మొత్తము 200 మంది ఈ సభకు వచ్చిరి. ఆఫ్రికాకువెలుపల దేశములు స్నేహభావముతోపంపిన సోదరప్రతినిధులుకూడా హాజరైనారు. ఈ మహాసభవారీ క్రిందితీర్మానములను గావించిరి.

1. ఆఫ్రికాలో పాశ్చాత్యులుస్థాపించిన వలసరాజ్యవిధానముపైనను సామ్రాజ్యతత్వముపైనను ఆఖరుయుద్ధమునుచేసి దానినంతమొందించుటకు నిశ్చయించిరి.

2. రాజకీయస్వాతంత్ర్యమును సంపాదించుటకు ప్రథానముగా అహింసావిధానములనే యవలంబించుటకు నిశ్చయించిరి. కాని, వలస రాజ్యములవారు బలప్రయోగమునుచేసి హింసాపద్ధతు లవలంబించినచో మాత్రము తాముకూడా ఆ పద్ధతుల నుపయోగించుటకు నిశ్చయించిరి.

3. ఆఫ్రికాలోని అన్నిప్రాంతములందలిప్రజలును స్వాతంత్ర్యము కొఱకై నడుపుఉద్యమములకు సహకరించుటకై ఒక స్థిరమైన కార్యనిర్వాహకవర్గకార్యాలయమును (Permanent Secretariat) స్థాపించుటకు నిశ్చయించిరి.

4. జాతివిచక్షణపద్ధతి, వర్ణభేదవిధానములను, జాతి, వర్ణ అభిమాన తత్వములను ప్రతిఘటించి వానిని నిర్మూలించుటకై కృషిచేయదలచిరి. ముఖ్యముగా దక్షిణాఫ్రికాసమితిప్రభుత్వమువా రవలంబించిన వర్ణభేద జాతి విభజన "అపార్తీడ్" విధానమును ఖండించిరి.

5. ఉత్తరోత్తరా ఆఫ్రికాఖండములోని వివిధరాజ్యములసమితి లేక కామన్వెల్తు అను స్వతంత్రరాజ్యసమ్మేళన- రాజ్యాంగస్థాపనమును సాధించుటకై కృషిచేయుటకు నిశ్చయించినారు.

ఈ సంగతులను శ్రీ న్క్రూమాగారు ప్రెస్‌కాన్ఫరెన్సులో వివరింపగా, పత్రికావిలేఖరు లాయన ననేకప్రశ్నలువేసిరి. ముఖ్యముగా ఘన రాజ్యమును దక్షిణాఫ్రికాసమితియు, బ్రిటీషుకామన్వెల్తులో సరిసమానప్రతిపత్తిగల స్వతంత్రరాజ్యములుగా సభ్యత్వముకలిగియుండగా, దక్షిణాఫ్రికా వారు తీవ్రమైన వర్ణభేద జాతివిభజనవిధానమును అమలుజరుపుటను మీ రెట్లు సహించి, ఆ కామన్వెల్తులో నుండగలిగిరని అడిగినప్రశ్నకు జవాబు చెప్పుట యుక్తముకాదని న్క్రూమాగారు దానినిగూర్చి ప్రసంగించలేదు. అయితే పైనచెప్పిన కాన్ఫరెన్సువారి తీర్మానములవలన న్క్రూమాగారిఅభిప్రాయములు వెల్లడియగుచునేయున్నవి. స్వాతంత్ర్యసంపాదనకై చేయు కృషిలో అహింసామార్గమునేగాక హింసామార్గములవలంబించుటకు ఆఫ్రికా

లోని వివిధప్రాంతప్రజలు ఆలోచించుచున్నారని ఆయన ప్రెస్‌కాన్ఫరెన్సులో చెప్పిరిగాని. ఆఫ్రికాప్రజలు నిర్మాణాత్మకమైన శాంతియుతవిధానము లవలననే స్వాతంత్ర్యముపొందగలరని న్క్రూమాగారును నెహ్రూగారును ఆలోచించి 3-1-1959 వ తేదీన చేసిన జాయింటుప్రకటనలో స్పష్టముగా నుద్ఘాటించిరి.

యునైటెడ్‌నేషన్సువారు ఆఫ్రికాదేశముయొక్క ఆర్థికాభివృద్ధిని గూర్చి విచారించి, అవసరమైన చర్యలుతీసికొనుటకై నియమించిన కమిషన్ (United Nations Economic Commision) అను అంతర్జాతీయ సంస్థయొక్క ప్రథమసమావేశము అడిస్‌అబాబాలో 1958 డిశంబరు 29వ తేదీన జరిగినది. యునైటెడ్‌నేషన్సు సెక్రటరీ జనరల్‌గారైన డాగ్ హామ ర్షోల్డు గారు సభనుప్రారంభించుచు జాగ్రత్తగా వ్రాసికొనివచ్చిన ఒక ఉప న్యాసమును చదివిరి.

ఆ సమావేశము పదిదినములపాటు జరిగెను. ఆ సమావేశము నందలి చర్చనీయాంశములలో ఆఫ్రికాయొక్క ఆర్థికప్రతిపత్తి, ఆర్థికాభి వృద్ధికొఱకై ఈ సంస్థవారుచేయుకృషియు ముఖ్యమైనది.

ఈ సమావేశమునందు పాల్గొనుటకు సభ్యత్వముకలరాజ్యములవారు యునైటెడ్‌నేషన్సులో సభ్యత్వముగల బెల్జియం, ఎతియోపియా, ఫ్రాన్సు, ఘన, ఇటలీ, లైబేరియా, మొరాకో, పోర్చుగల్లు, స్పెయిను, సూడాను, ట్యునీసియా, దక్షిణాఫ్రికా, యునైటెడ్ అరబ్‌రిపబ్లికు (అనగా ఈజిప్టు ఇరాకురాజ్యములు) బ్రిటనుదేశమును ఈ ప్రాంతములందున్న ఇతరదేశ ములేవైనను ఇకముందు యునైటెడ్‌నేషన్సు రాజ్యసమ్మేళనసభయందు సభ్యులగుట తటస్థించినచో అట్టిరాజ్యములును పాల్గొనును. ఆఫ్రికాలో రాజ్యాధికారములను గోల్పోయిన రాజ్యములు సభ్యత్వమునుండి వైదొ లగును.

ఈ కమిషనుసంస్థవారి ప్రధానకార్యాలయము అడిస్‌అబాబానగరమున నుండును. దీని ప్రధానకార్యదర్శి (Executive Secretary) సూడాను దేశీయుడైన శ్రీ మెక్కి అబ్బాస్‌గారు. ఈ సంస్థనిర్మాణము ప్రపంచప్రజా సంఘమునందు ఆఫ్రికాపాల్గొనుట ప్రారంభించినముహూర్తమునకు తార్కా

ణముగనున్నదని శ్రీ హెమర్షోల్డుగారు తమయుపన్యాసమున చెప్పిరి.ఆయన ఇంక నిట్లనిరి.

"ప్రపంచములోని ఇతరఖండములందుకన్న ఆఫ్రికాఖండమునందలి కొన్నిప్రాంతములలో వలసరాజ్యవిధానము చాలా త్వరితముగా ముగియునట్టి సూచనలు కనబడుచున్నవి. ఇతరప్రాంతములందలి వలసరాజ్యవిధానము యొక్క పూర్వరూపము పూర్తిగా మారిపోయినది. ఆఫ్రికాలో రాజకీయము లందును రాజ్యాంగవిషయములందును అత్యంతవేగముగా మార్పులు కలుగు చున్నవి. అందువలన నేర్పడుచున్న అనేక నూతనసమస్యలను పరిష్కరిం చుటకు ఇటువంటి అంతర్జాతీయసంస్థ యుండుట చాలా అవసరము. దీని వలన చాలా ఉపయోగములు కలుగగలవు. చారిత్రకకారణములవలన క్రొత్తరాజ్యములు స్థాపింపబడుచున్నవి. దీని భూగోళపరిస్థితి సరిహద్దులు సరియైనపద్ధతిలోగాక విపరీతముగా నేర్పడియున్నవి. అవి ఆయాప్రాంతము లను త్వరగా అభివృద్ధిచేయుటకు తోడ్పడవు. అట్టి ఆర్థికాభివృద్ధి జరుగవలె నన్నచో ప్రత్యక్షమైన కార్యాచరణము జరుగవలెను. వివిధదేశభాగములు రాజ్యములు సామరస్యముతో సహకరింపవలెను. ప్రతిప్రాంతమునకుగల ప్రత్యేకసమస్యలను ఆవశ్యకతలను రాజకీయప్రతిపత్తిని గమనించుచు, సమష్టి క్షేమలాభములకొఱకు కృషిజరుగవలెను. వివిధప్రభుత్వములవారి ఆర్థికసమస్యలను పరిష్కరించుటలో సహాయముచేయుటకు సందర్భానుసార ముగా పనిచేయగల నిర్మాణాత్మకమైన వ్యవస్థను ఈ కమిషన్ ఏర్పాటుచేయ గలదని నా యాశ" అని హెమర్షోల్డుగారు చెప్పి తమనెదుర్కొనుసమస్యలను పరిష్కరించుటలో గట్టిచర్యనుతీసికొనుట కీ సంస్థ వెనుదీయకూడదని గట్టిగా హెచ్చరించిరి.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## పదమూడవ ప్రకరణము

### రోడీశియా న్యాసాలాండు * ఫెడరేషన్

ఆఫ్రికాఖండమున దక్షిణార్ధమునను మధ్యను గల దేశములో ట్రాన్సువాలుసరిహద్దునుండి ఉత్తరమున బెల్జియన్‌కోంగో(కాంగో)వరకును, టంగనీయికాదేశమువరకును వ్యాపించియున్న భూభాగము 443000 చదరపుమైళ్ళ విస్తీర్ణముగల దేశము నేడు ఉత్తర దక్షిణ రొడీశియాలని వ్యవహరింపబడు రాజ్యముగా నున్నది.

క్రీస్తుశకమునకుపూర్వము చాలాకాలముక్రిందట ప్రపంచములో పురాతనమైన గొప్ప బంగారుగను లిక్కడ నుండెను. బంగారుఉత్పత్తియగు కొండరాయిప్రదేశమునందు నూటయేబదిఅడుగులలోతున త్రవ్విన గనుల అవశేషములు ఇప్పటికిని 500 మైళ్ళపొడవును, 400 మైళ్ళ వెడల్పును గల విశాలప్రదేశమునందు కనబడుచున్నవి. ఇప్పటివలెగాక పూర్వకాలములో నవలంబింపబడిన మోటుపద్ధతులలోనే జరిగిన బంగారుఉత్పత్తియందు రమారమి 75000000 పౌనులు (నవరసులు) విలువగల బంగారము ఈ గనులనుండి త్రవ్వియెత్తబడియున్నట్లు నేటి మైనింగుఇంజనీరులు అంచనావేసి యున్నారు.

ఈ గను లిట్లు చాలావరకు నుపయోగింపబడి, ఖాళీయైనను ఇందులో మిగిలిన బంగారమే ఇటీవల స్థాపింపబడిన ఆంగ్లేయవలసరాజ్యమైన దక్షిణ రొడీశియాప్రభుత్వమువారికి లాభకరమైన ఆదాయము నిచ్చుచు ఆ దేశాభివృద్ధికి తోడ్పడెను.

---

* న్యాసాలాండుకు నయాసాలాండ్ అని ఉచ్చరింతురు.

బంగారుఉత్పత్తియగు నీ ప్రాంతమునందు ఆఫ్రికాదేశములోని చెట్లు చేమలు గాక హిందూదేశములోని చెట్లు, మొక్కలు, ఫలవృక్షములు కనబడినవి. పూర్వము మహమ్మదీయులు జావాద్వీపములో వలసరాజ్యము స్థాపించునాటికి అక్కడ కనబడినట్లే ఇక్కడను హిందూదేశీయులు వలస నెలకొనిన నిదర్శనములు కనబడినవి. హిందూదేశపు పనివారిసహాయముతో సెబెయో ఫొనీషియను లీ బంగారుగనులను త్రవ్వించి వ్యాపారము చేసిరనికూడా కొందరు సిద్ధాంతీకరించిరి. పూర్వము గ్రీసు రోము సామ్రాజ్యములలో నుపయోగింపబడిన బంగారమంతయు నీ ఆగ్నేయాఫ్రికాలోని బంగారుగనులనుండి వచ్చినదేయని చరిత్రకారులు చెప్పుచున్నారు.

ఈ ప్రాంతమునందు ఆఫ్రికాదేశములోని ఆదిమవాసులగు పొదలవారు క్రీస్తుకుపూర్వము వేయిసంవత్సరములక్రిందట నీప్రాంతములందు వసించినట్లు నిదర్శనములున్నవి. ఈ పొదలజాతివారు కొండరాళ్ళపైన చిత్రించినబొమ్మలు 428 ఇక్కడ కనబడినవి. అందులో అడవిజంతువుల బొమ్మలు, వేటదృశ్యములే గాక, విక్టోరియాజలపాతముయొక్క బొమ్మలు తొమ్మిది కనబడినవి. దీనినిబట్టి అప్పటికే వారు కొంత నాగరికతచెంది యుండిరని తెలియగలదు. ఇదిగాక గ్లేసియల్ పీరియడ్ అనబడు హిమానీనదయుగము తుదికాలమునాటి మానవజాతివంటి మానవశిథిలములు 1920లో కనుగొనబడినవి. పేలియోలైతికుయుగమునాటి రాతిగండ్రగొడ్డళ్ళతలలు మొదలైన పరికరములుకూడా కనబడినందున పొదలజాతులకుపూర్వము చాలా వేలసంవత్సరములక్రిందటనే ఇక్కడ మానవనాగరకత యుండినట్లు రుజువైనది.

ఆఫ్రికాఖండతూర్పుసముద్రతీరమునందు క్రీస్తుశకము మధ్యయుగమునందు అరబ్బీవారు వ్యాపారముచేయుచుండిరి. వీరిని క్రీ.శ. 1500–1520 మధ్య పోర్చుగీసువారు వెనుకకుత్రోసి, యీ ప్రాంతముల నాక్రమించిరి. అప్పటి కీ దేశమున కోస్తానంటియున్నప్రదేశములు అనారోగ్యకరములై యుండెను. వీనివెనుక ఎత్తైనప్రదేశములు ఆరోగ్యకరములై, సారవంతములై యుండెను. ఆ ప్రాంతములం దప్పటికి పనిపాటులుచేసికొను బాంటూలను నల్లజాతులప్రజ లుండిరి. వీరు చాలా శతాబ్దములక్రిందటనే ఉత్తరము

నుండి వచ్చి, స్థిరనివాసము లేర్పరచుకొనియుండిరి. పూర్వులవలె బంగారు గనులను త్రవ్వుట వీరికి తెలియకపోయినను, బంగారుకలిసిన రాతిపొరలను నలుగగొట్టి ఆ పొడిని నదులలో కడిగి బంగారుతీయుచుండిరి. వీరు వ్యవసాయము, గృహపరిశ్రమలు చేసి బ్రదుకుచుండిరి. ఈజాతివారిముఖ్యనాయకుని "మొనొమొటపా" అనగా "సర్వజనప్రభువు"అని వ్యవహరించుచుండిరి.

పోర్చుగీసువా రీ బంగారుగనులప్రాంతముల నాక్రమింపదలచిరి గాని, వారు జంబేజీనదిద్వారమున సులభముగా పోవుటకువీలైన ప్రదేశములలోనికే పోయిరి గాని, దేశములోపలి దూరప్రాంతములకు చొచ్చుకొని పోవలేదు. క్రైస్తవమతబోధకులగు మిషనరీలుమాత్రము దేశములోపలి భాగములకు పోయి 'మొనొటొపా'గారి దర్బారుకుకూడా పోయి ఆయనను సందర్శించిరి. ఈ పరిచయమువలనను వారిప్రయత్నములవలనను 1679 లో నప్పటి సర్వజనప్రభువగు మొనొమొటపాగారు పోర్చుగీసురాజుతోచేసికొనిన సంధిపత్రమునం దీ బంగారుగనుల నా రాజు కిచ్చినట్లు వ్రాయించిరి. ఆకాలమున నీ గనులవలన ఎక్కువఆదాయము రాకపోయినను ఈ సంధిషరతు వలన తరువాత 1875 లో పోర్చుగీసువారు డెలగోఅఖాతముప్రాంతములందు హక్కులను ప్రతిపాదించుటకును వారి కా ప్రాంతమునందు హక్కులుస్థిరపడుటకును ఉపయోగించెను. ఈప్రాంతములందు పనిపాటులుచేసికొని బ్రదుకుచుండిన బాంటూజనమును వెనుకకుపారద్రోలి, యుద్ధప్రియులగు బాంటూజాతులవారు వచ్చి ఆక్రమించిరి. తరువాత దక్షిణాఫ్రికాలో ప్రసిద్ధిచెందిన జూలూ జాతివారివంటి అమండెబెల్ జాతియొక్క నాయకుడైన మొసలెకట్సీ బలవంతుడై ఇక్కడ నుండిన మా-కలంగ మషోనా మొదలగు ఇతర"బాంటూ"జాతులవారిపైన దండెత్తి ఒకరితరువాతనొకరిని నాశనముచేయుచు కొందరిని బానిసలుగచేసి విజృంభించెను. ఇతడు తెల్లవారినిమాత్రము నిగ్రహింపలేకపోయెను. నల్లజాతులవారు వదలివెళ్ళినభూములను తెల్లవా రాక్రమింపసాగిరి.

సిసల్‌రోడ్సు అను ఆంగ్లేయుడొకడు ఆఫ్రికాలోని రొడీశియా ప్రాంతమునందుగల బంగారుగనులపైన కన్నువేసి, కొంత కుటిలరాజ్యతంత్రమునునడిపి అక్రమపుదాడినిచేసి బలవంతముగా కొంతదేశము నాక్రమించెను. అతడుచేసిన దుర్మార్గమునకు అతనిని గర్హించుటకుబదులుగా పాశ్చా

లాతనిని పొగడిరి. అతనిపథకము ప్రకారము పదునైదువందలమంది తెల్ల వారుబయలుదేరి రొడీశియాలోని కొన్నిప్రాంతములందు వలసగానెలకొనిరి.

ఆఫ్రికాలో రొడీశియాప్రాంతమునందు భూములను గనులను ఆక్ర మించి లాభమార్జించుటకు స్థాపింపబడిన బ్రిటిష్ సౌత్ఆఫ్రికాకంపెనీవారికి ఇంగ్లాండుప్రభుత్వమువారు 1889లో పట్టానొసగిరి. ఈ కంపెనీ సామదానభేద దండోపాయముల నుపయోగించి నల్లజాతులవారిని వెనుకకుత్రోసి, బంగారు గనుల నాక్రమించెను. క్రొత్తగా ఆక్రమింపబడినదేశమును రొడీశియాఅని వ్యవహరించిరి. 1905 నాటికి రొడీశియా బంగారునుత్పత్తిచేయుదేశములలో నొక ముఖ్యమైనస్థానము నాక్రమించెను. అటుపిమ్మట నీ రొడీశియాకంపెనీ వారు 18 సంవత్సరము లీ దేశమును పరిపాలించిరి. వీరికి మొదట 25 సం వత్సరములవరకు రాజ్యాధికారవ్యాపారపట్టా నొసగిరి. అది 1914 అక్టో బరులో అంతమగుచుండగా వీరి కింకొక పదేండ్లపాటుపట్టాను మఱలనొస గిరి. 1921 నాటి కా దేశమున 32000మంది తెల్లవా రుండిరి. వీరు దేశము లోని ఏబదివేలమందినల్లవారిచేత పనిచేయించుకొని, అమితలాభములను పొందసాగిరి.

తుదకు ఈ కంపెనీవారు కొంత ప్రతిఫలముపుచ్చుకొని తమ రాజ్యా ధికారములను వదలుకొనుట కంగీకరించిరి. అయితే తమకు ఆర్థికముగా గల హక్కులనుమాత్రము వదలుకొనుట కిష్టపడలేదు. 1923 అక్టోబరు 31వ తేదీన రొడీశియాకంపెనీవారికి 3750000 పౌనులు (నవరసులు) రొక్కముగా నివ్వగా, వారు రాజ్యాధికారమును వదలుకొనిరి. ఇందులో 1750000 పౌనుల నింగ్లీషుప్రభుత్వమువా రిచ్చిరి. మిగిలిన 20 లక్షలపౌనులు ఋణముచేసిరి. అయితే, దక్షిణ రొడీశియా వలసరాజ్యప్రభుత్వ మీ సొమ్మును చెల్లించిన బ్రిటీషువారికి పరిపాలనావ్యయముక్రింద మరికొంత సొమ్ము చెల్లించెను. దక్షిణరొడీశియా విస్తీర్ణము 150344 చదరపుమైళ్ళు. ఇందులో మటాబెలులాండును మషోనాలాండును చేరియున్నవి. దీనిముఖ్య పట్టణము శాలిసుబరీ.

1923 అక్టోబరు 31వ తేదీన ఇంగ్లాండురాజుపేరున ఒసగబడిన "లెటర్సుపేటెంటు"ప్రకారము దీనికి వలసరాజ్యస్వపరిపాలనమునిచ్చుచు

ఒక క్రొత్తరాజ్యాంగము స్థాపింపబడినది. దీనినిబట్టి ఆఫ్రికాదేశీయులను గూర్చియు, అంతవరకు అన్యాక్రాంతముచేయకుండా మిగిలియున్నభూము లనుగూర్చియు రైలుమార్గములనుగూర్చియు, పూర్వము రొడీశియాకంపెనీ వారికుండిన ఖనిజములహక్కులనుగూర్చియు చేయబడు శాసనములను ఇంగ్లాండురాజప్రతినిధియగు గవర్నరు అనుమతింపకపోవచ్చును. మిగిలిన వ్యవహారములందు బ్రిటీషుసామ్రాజ్యములోని ఇతర వలసరాజ్యములవలెనే దక్షిణ రొడీశియావలసరాజ్యమునకుకూడా ప్రజాప్రతినిధులకు బాధ్యతగల స్వపరిపాలన యొసగబడినది. ప్రజాప్రతినిధులనగా వోటుచేయుటకు హక్కుగల తెల్లవారే. అక్కడిశాసనసభకు పదునొకండు నియోజకవర్గముల నుండి 30మంది సభ్యుల నెన్నుకొందురు. 1926లో జనసంఖ్యలో 834473 మంది నల్లవారును, 39174మంది తెల్లవారు నున్నట్లు అంచనావేయబడినది.

ఈదేశముశీతోష్ణస్థితి ఆరోగ్యకరమైనది. ఇందు పొగాకు, మొక్కజొన్న, పండ్లు,పశువులు, బంగారు, రాక్షసిబొగ్గు, అజ్‌బెస్టాస్, క్రోము ఖనిజములరజము (ore) చాలా విలువగలఉత్పత్తులుగ నున్నవి.

బ్రిటిష్ సౌత్ఆఫ్రికాకంపెనీవారిరాజ్యములోని ఉత్తరభాగము 287950 చదరపుమైళ్ళవైశాల్యము కలిగియుండెను. ఇది ఉష్ణదేశము. ఇందులో పనిపాటులుచేసికొనిబ్రతుకు బాంటూజను లుండిరి. 1911 వరకును ఈ దేశమును పశ్చిమోత్తర ఈశాన్యభాగము లను రెండుభాగములుగా విభజింపబడియుండెను. అటుపిమ్మట నా రెండుభాగములు నొకే ఉత్తరరొడీశియా రాజ్యముగా పరిపాలింపబడుచున్నవి. ఆనాటి కిక్కడ 1434 మంది తెల్లవారు మాత్ర ముండిరి. నల్లవా రెనిమిదిలక్షలమంది యుండిరి. ఈదేశము లోనికి దిగుమతియగుసరుకులవిలువ 127664 పౌనులుగను, ఎగుమతుల విలువ 128458 పౌనులుగను ఉండెను. 1924 లో నీ రాజ్యమును బ్రిటీషు ప్రభుత్వమువారు స్వాధీనముచేసికొనిరి.

1924 ఫిబ్రవరి 20 వ తేదీన జారీచేయబడిన ఆర్డర్ ఇన్ కవున్సిల్ అను ఉత్తరువునుబట్టి యొకరాజ్యాంగము స్థాపింపబడినది. ఈరాజ్యమును పరిపాలించుట కొక గవర్నరు, ముఖ్యోద్యోగులుగల ఎగ్జిక్యూటివుకవున్సిలు లేక కార్యనిర్వాహకసభయు, 14 మందిగల శాసనసభయు ఏర్పాటుచేయ

బడెను. ఈ శాసనసభ్యులలో నైదుమంది మాత్రము ఎన్నుకొనబడు ఉద్యో గేతరసభ్యులు. తక్కినవారు నియమింపబడిన ఉద్యోగసభ్యులే. ఈ రాజ్య మునందలి నల్లవారిని సాధ్యమైనంతవరకు వివిధజాతుల పూర్వవంశీయనాయ కులఅధికారమునకే వదలిరి. దేశమును తొమ్మిదిజిల్లాలుగా విభజించి, ప్రతి జిల్లాకును ఒక తెల్ల మేజిస్ట్రేటును నియమించిరి. వారికి క్రిమినల్ అధికా రము లొసగబడినవి. బారొట్సె (Barotse) జిల్లా కేవలము నల్లవారి రిజ ర్వుఅనఎడు ప్రత్యేకస్థావరము. దీనిని పరిపాలించునది నల్లజాతులయొక్క పారమౌంటుచీఫ్ అనబడు బాంటూప్రజల సర్వాధికారముఖ్యనాయకుడు. అతనికి సామాన్యనాయకుల కార్యాలోచనసభ యుండెను. ఈసభను అధికార రీత్యా బ్రిటిషువా రంగీకరించిరి. ఈరాజ్యమును ట్రాన్సుఫరుచేయునప్పుడు బ్రిటీష్ సౌత్ఆఫ్రికా కంపెనీవారితో చేసికొనిన ఏర్పాటునుబట్టి, భూమిశిస్తులో నూటికి 50వంతులు ఖనిజములరాయల్టీలక్రింద కంపెనీవారు హక్కుకలిగి యున్నందున నీ దేశపరిపాలనకు తగిన ఆదాయము లేకున్నది.

దేశమంతయు నొకేపరిపాలనక్రింద నున్నను, నూటికి 85 వంతుల మంది పాశ్చాత్యులును, ప్రభుత్వముయొక్క ప్రధానస్థానమును పశ్చిమోత్తర భాగముననే యున్నందువల్లను దేశముయొక్కముఖ్యపట్టణమైన లివింగ్ స్టోన్నుండి బెల్జియన్కాంగోరాజ్యమునకు పోవుటకు జంబేజినదికి అడ్డముగా విక్టోరియాజలపాతపుబ్రిడ్జికి రైలుమార్గమున నున్నందువల్లను ఈభాగమునకే అన్నిసౌకర్యములు నున్నవి. ఈశాన్యభాగములో రాకపోకమార్గములు తక్కువ. పాశ్చాత్యులు చాలా స్వల్పసంఖ్యాకులుగ నున్నారు.

ఈశాన్యభాగములోని పొగాకుపంటను లారీలలో మూడువందలమైళ్ళ దూరమునగల న్యాసాలాండులోని బ్లాంటైరురైలుస్టేషనుకు తీసికొనిపోవు దురు. అక్కడనుండి బెయిరాలో ఓడలకెక్కింతురు. అందువలన పశ్చిమో త్తరప్రాంతము దక్షిణరొడీశియాతో సంబంధముకలిగియుండగా ఈశాన్య భాగము న్యాసాలాండుతో సంబంధముకలిగియున్నది.

1927లో నియమింపబడిన హిల్టన్ యంగ్ కమిషనువారు విచారించ వలసినఅంశములలో ఉత్తరరొడీశియాకుతూర్పునగల బ్రిటీషువలసరాజ్య ముల గుంపునకు చేర్చిరి. అయితే, ఈ కమిషనువా రన్నిసంగతులను ఆలో

చించి, రాజకీయముగాను ఆర్థికముగాను న్యాసాలాండును, ఉత్తరరొడీశియాను బ్రిటీషువారి తూర్పుఆఫ్రికావలసరాజ్యములతోగాక, స్వపరిపాలనము గల దక్షిణరొడీశియావలసరాజ్యముతోనే సన్నిహితసంబంధమునేర్పరచుట యుక్తమని సూచించిరి.

రాజ్యాంగవిధానమునుబట్టి ఉత్తరరొడీశియా బ్రిటీషుప్రొటెక్టరేటు అనగా వారిసంరక్షితరాజ్యముగ నున్నది. దీనిని సాక్షాత్తుగా తమరాజ్యమున చేర్చినట్లు ప్రకటింపకపోయినను, వారిసామ్రాజ్యభాగమై వారిఆధిపత్యము క్రిందనున్న తాబేదారీరాజ్యములగు వలసరాజ్యములకన్నను తక్కువస్థాయి లోని రాజ్యము. ఇట్లే న్యాసాలాండుకూడా ఒక సంరక్షితరాజ్యమే.

న్యాసాలాండుయొక్కవిస్తీర్ణము 37374 చదరపుమైళ్ళు. దీని ముఖ్య పట్టణము జొంబ. దీని జనసంఖ్య రమారమి 23 లక్షలు. 1925 లో నిక్కడ 1210344 నల్లవారును, 1420 తెల్లవారును, 669 మంది ఆశియావారు నుండిరి. ఇక్కడ అడవులున్నవి. ఇందు పొగాకు, ప్రత్తి, కాఫీ, దంతము ఉత్పత్తియగుచున్నవి.

న్యాసాలాండు బ్రిటీషువారిసంరక్షితరాజ్యము. దీనిని పరిపాలించుటకు ఇంగ్లాండుప్రభుత్వమువా రొక గవర్నరు నేర్పరచిరి. ఇక్కడకూడానొక ఎగ్జిక్యూటివుకవున్సిలు అనబడు కార్యనిర్వాహకసభను ఏర్పరచిరి. ఇందలి సభ్యులను గవర్నరే నియమించును. న్యాసాలాండు మూడురాష్ట్రములుగా విభజింపబడి, అవి ఒక్కొక రాష్ట్రీయకమిషనరుక్రింద నుంచబడినవి. వీరి క్రింద నల్లవారివ్యవహారములను చూచు ఇంగ్లీషుజాతిరెసిడెంటు లున్నారు. నల్లజాతివారి పూర్వవంశీయనాయకులకును హెడ్‌మెన్ అనబడు గ్రామ ముఖ్యోద్యోగులకును చాలా బాధ్యతల నొసగి వారిని అక్కడితెల్లవారికిని నల్లవారికినిమధ్య అనుసంధాయకులుగా చేసినారు.

స్వపరిపాలనముగల వలసరాజ్యమైన దక్షిణరొడీశియాను, ప్రొటెక్ట రేటులు లేక సంరక్షితరాజ్యములైన ఉత్తరరొడీశియా, న్యాసాలాండులను కలిపి బ్రిటిషువారు 1953 లో "రొడీశియా న్యాసాలాండు ఫెడరేషన్" అన బడు నొక సంయుక్తరాజ్యముగా చేసిరి. ఇంగ్లాండుపార్లమెంటువారు శాసిం చిన రాజ్యాంగచట్టముక్రింద ఈ ఫెడరేషనుకు బాధ్యతాయుత స్వపరిపాలన

మున్నది. రాజ్యాంగచట్టమును మార్చువిషయములోను నల్లవారినిగూర్చి శాసనములుచేయువిషయములోను మాత్రము ఈ ఫెడరేషనుకు సంపూర్ణాధికారములు లేవు. అట్టిశాసనములు సరిగాలేవని తోచినచో, బ్రిటీషురాజప్రతినిధి వానిని నిలుపుచేయవచ్చును. పునరాలోచనకు పంపవచ్చును. ఇంగ్లాండు పార్లమెంటుకే పైయధికారమున్నది. రాజ్యాంగచట్టమునుబట్టి ఉత్తరరొడీశియారాజ్యమును, న్యాసాలాండురాజ్యమును పూర్వమువలెనే సంరక్షితరాజ్యములుగా నుంచబడి, మొదటినుండి స్వపరిపాలనముగల వలసరాజ్యమగు దక్షిణరొడీశియాకు ఎప్పటివలెనే స్వపరిపాలనాధికారములను ఉంచినారు. దక్షిణరొడీశియాశాసనసభలోని తెల్లవారిప్రజాప్రతినిధులకు బాధ్యతవహించిన మంత్రులే ఆ రాజ్యమును పరిపాలింతురు. వారికి సంపూర్ణ ఆంతరంగికప్రభుత్వాధికారము లున్నవి.

క్రొత్తగా స్థాపింపబడిన ఫెడరేషన్ లేక సంయుక్తరాజ్యవ్యవహారములం దీ ఫెడరేషనుప్రభుత్వమువారు ఇంగ్లాండులోని కామన్‌వెల్తు రిలేషన్సుఆఫీసు అనగా స్వతంత్రరాజ్యసమ్మేళనముయొక్క పరస్పరసంబంధములకార్యాలయమువారితో సంబంధముకలిగియుందురు. సంయుక్తరాజ్యమునకుసంబంధించని ఇతరవ్యవహారములందు, ఇంగ్లాండులోని కలోనియల్ ఆఫీసు అనగా వలసరాజ్యాంగకార్యాలయముతో సంబంధముకలిగియుందురు. దీని అంతరార్థము తెల్లవారి ప్రతినిధులుగల ఫెడరేషనురాజ్యప్రభుత్వమునకు రాజ్యాంగవ్యవహారములందు ఉన్నతస్థాయినొసగిరన్నమాట. సంరక్షితరాజ్యములోని నల్లవారు ఎప్పటివలెనే నిరంకుశప్రభుత్వపరిపాలనక్రింద నుందురు. ఇంగ్లాండుప్రభుత్వమువారికి అంతర్జాతీయముగాగల బాధ్యతలకులోబడి ఈ ఫెడరేషనుప్రభుత్వమువారికి విదేశవ్యవహారములనుకూడా వశపరచెదమని ఇంగ్లాండుప్రభుత్వమువారు 1957 ఏప్రిలులో ప్రకటించిరి.

రొడీశియా న్యాసాలాండు ఫెడరేషన్‌ప్రభుత్వమువారి కా ఫెడరేషన్ వ్యవహారములకు సంబంధించినంతవరకు అధినివేశరాజ్యప్రభుత్వమునకుగల స్వతంత్రాధికారము లివ్వదలచినట్లు చెప్పుటలో అక్కడితెల్లవారికే ఈ అధికారములు ఇవ్వదలచినట్లైనది గాని, నల్లవారిస్థితిలో నేవిధమైనమార్పును చేయదలచినట్లు కనబడలేదు. ఆఫ్రికాదేశీయులైన నల్లవారికి హెచ్చు అధి

కారములుండవలెననియు, న్యాసాలాండును దక్షిణరొడీశియానుండి విడదీయ వలెననియు ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్‌వారు ఆందోళనముచేయుట ప్రారంభించిరి.

డాక్టర్ హేస్టింగ్సు 'బాండా' అను నాయన కాంగ్రెసుసంఘఅధ్యక్షుడు. ఆయనకు 53 సంవత్సరములు. ఆయన జాతీయవాదియైన నల్లవాడు. ఆయన నలుబదియేండ్లనుండి లండనులో వాయవ్యమూల నొకచోట దేశాంతరవాసముచేయుచు, 1958 జూలై నెలలో తనదేశమునకు తిరిగివచ్చి, న్యాసాలాండులో బ్లాంటైరుపట్టణమున తన కార్యస్థానము నేర్పరచెను.

ఆరేండ్లక్రిందట బ్రిటీషువా రేర్పఱచిన రొడీశియా న్యాసాలాండు ఫెడరేషనులో పాశ్చాత్యప్రజలకు సంపూర్ణమైన పౌరస్వత్వములు చేకూరగనే వారు దక్షిణాఫ్రికాసమితిలోని తెల్లవారివలెనే స్వతంత్రులైన అక్కడి నల్లవారి ననేకవిధములుగా బాధలుపెట్టగలరని నల్లవారిజాతీయనాయకులు భయపడిరి. అందువలన నీ ఫెడరేషనును రద్దుచేయవలసినదని బాండాగారును తక్కిన దేశీయనాయకులును ఆందోళనచేయసాగిరి.

ఆఫ్రికన్ నేషనల్‌కాంగ్రెసు న్యాసాలాండులోనేగాక, ఉత్తరరొడీశియాలోను దక్షిణరొడీశియాలోను గల నల్లవారిలో ప్రచారముచేయుచున్నందున తెల్లవారికి కంటకమైనది.

మధ్యఆఫ్రికాదేశమునకు స్వపరిపాలనమొసగవలసినదని కోరు ఆఫ్రికన్ నేషనల్‌కాంగ్రెసుయొక్క దక్షిణరొడీశియాశాఖ 1957లో స్థాపింపబడినది. దానినాయకుడు శ్రీ జోషువా న్కోమోగారు (Mr. Josua Nkomo) ఆయన ఒక భీమాఎస్టేటు ఏజంటు. పూర్వ మితడు ట్రేడ్‌యూనియన్ లేక వ్యాపారవృత్తి కట్టడిసంఘములో నొక కార్యనిర్వాహకోద్యోగిగా నుండెను. ఇతడు 1959 ఫిబ్రవరినెల ప్రారంభమున స్వతంత్ర ఘనరాజ్యమునకు వెళ్ళివచ్చెను. ఇది అధికారులకు అనుమానకారణమయ్యెను. కాంగ్రెసు నాయకులు కొంతకాలమునుండి చాలా తీవ్రమైన యుపన్యాసములనొసగుచు నల్లవారిని ఉద్రేకపూరితులుగ చేయుచుండిరి.

న్యాసాలాండులోని బ్లాంటైర్‌పట్టణమున ఆఫ్రికన్ నేషనల్‌కాంగ్రెసు సభ జరిగెను. శాసనసభలోని ఆఫ్రికాజాతిసభ్యుడగు హెచ్. బి. ఛిపెంబెర్

(H. B. Chipembere) గారు ఆ సభలో గొప్ప యుపన్యాసమునుచేసిరి. చాలా క్రూరులైన పోలీసువారును సైనికదళమువారును ఆ సభదగ్గర హాజరుగనుందురనియు, తమకు ప్రాణభయముకూడా కలిగింతురనియు ఎరిగియున్నను ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెసుయొక్క 32 శాఖలలోని ప్రతినిధి సభ్యు లీ కాంగ్రెసుసమావేశమునకు వచ్చిరనియు, ఆఫ్రికాదేశీయులు తమ జన్మభూమికొరకు ప్రాణములనర్పించుటకుకూడా సంసిద్ధులైయున్నారని దీని వలన తెలియుచున్నదనియు చిపెంబెర్ గారు చెప్పిరి.

ఈ నల్లవారు తమపట్ల దౌర్జన్యములుచేయగలరని తెల్లవారు భయపడి, న్యాసాలాండులోని మారుమూలప్రాంతములందున్న వ్యవసాయక్షేత్రములందు జీవించు తెల్లవారు తమభార్యలను బిడ్డలను దేశములోని ముఖ్య పట్టణములకు పంపిరి. ఇక్కడ తెల్లఉయుద్యోగులు పోలీసువారు లేనందున తమ కుటుంబములకు తగురక్షణ లేదని వీరియుద్దేశము. బ్లాంటైరులోను, జోంబాలోను కాపురమున్న తెల్లవారినాయకులు ప్రభుత్వాధికారులలోని సీనియరుఉద్యోగులతో నీవిషయమై సమాలోచనములు జరిపి, దేశములోని నల్లవారు తెల్లవారికి అపాయముకలిగింపకుండా తెల్లవారిని సంరంక్షించుటకు అవసరములైన ఏర్పాటులను చేయించిరి.

బ్లాంటైరులో ఆఫ్రికా నేషనల్ కాంగ్రెసుసభ జరిగినపిమ్మట బ్లాంటైర్ గడియారస్తంభముదగ్గర ఆఫ్రికాదేశీయులు చాలామంది గుంపులుగా చేరియుండిరి. కాంగ్రెసువారు ప్రభుత్వమునకు వ్యతిరేకప్రదర్శనములు జరిపిరి. అంతట పోలీసువా రీ ప్రజలగుంపులను చెదరగొట్టవలెనని నిశ్చయించి, ప్రజలను బ్యాటనులను పొట్టి లాటీకర్రలతో కొట్టుటప్రారంభించిరి. నిరాయుధులగు నల్ల వా రిటునటు పరుగెత్తుచుండిరి. వీరిపైన పోలీసువారు టియర్ గ్యాసుబాంబులను వేసిరి. ప్రత్యేకపోలీసుదళము వారిని రప్పించిరి.

న్యాసాసరస్సు ఉత్తరపుకొననుగల కరొంగాదగ్గర ప్రజలు తిరుగుబాటు చేయుచున్నారని తెలిసి, రొడీశియన్ ఫెడరేషనులోని రెండురాజ్యముల నుండి ఫిబ్రవరి 20 వ తేదీన సైనికదళముల నంపిరి. రొడీశియన్ ఫెడరేషను ప్రధానమంత్రియైన సర్ రాయ్ వెలెన్‌స్కి (Sir Roy Wellensky) గారు కింగ్సు ఆఫ్రికన్‌రైఫిల్సు మొదటిపటాలము అనబడు తుపాకీసైనిక

దళమును న్యాసాలాండులోనికి పంపెను. ఈ సైనికదళము చేరులోపలనే ఫిబ్రవరి 20 వ తేదీన ఆఫ్రికాదేశీయులు న్యాసాలాండువిమానాశ్రయమును స్వాధీనముచేసికొనిరి,

ఫిబ్రవరి 22 వ తేదీన న్యాసాలాండులోని బ్లాంటైరులోను దగ్గరలో నున్న లింబె (Limbe) లోను కొట్లాటలు చెలరేగెను. ఈ అల్లరులలో రాళ్ళదెబ్బలవలనను పోలీసువారి బేటనుదెబ్బలవలనను చాలామంది గాయపడిరి. న్యాసాలాండులోని వివిధప్రాంతములందు మొత్తము ముప్పదిమంది దేశీయులను అరెస్టుచేసిరి.

ఫిబ్రవరి 24 వ తేదీన దక్షిణన్యాసాలాండులో లిలాంగ్వే (Lilongwe )లోని మార్కెట్టుప్రదేశములో ఆఫ్రికాగుంపులపైన కింగ్సు ఆఫ్రికన్ రైఫిల్సుసైనికదళమువారు తుపాకులుప్రేల్చిరి. నల్లవారిద్దరు గాయపడిరి.

ఈలోపుగా రొడీశియా ఎయిర్‌ఫోర్సువారి విమానములు వచ్చి, పోలీసువారికోరికపైన ఆకాశమునుండి టియర్‌గ్యాస్‌బాంబుల సీనారేకుక్యానులను వేయుట ప్రారంభించిరి.

1959 ఫిబ్రవరి 17వ తేదీనుండి న్యాసాలండులో నీ అల్లరు లిట్లు సాగుచునే యుండెను.

బలక (Balaka) లోని పరిస్థితులుకుడా బాగుగలేవు. అక్కడ నొక ఆఫ్రికన్‌పోలీసువాని నెవరో పొడిచిరనియు, వానికి స్వల్పమైన గాయముతగిలినదనియు తెలిసినది. అరువదిమంది ఆఫ్రికాదేశీయులు బలక రైల్వేస్టేషనుపైన దాడిచేసిరనియు, ఐదుగురు ఆఫ్రికాదేశీయులు ఒక స్త్రీ సహా అరెస్టుచేయబడిరనియు ఫిబ్రవరి 24వ తేదీన నొకవార్త ప్రకటింపబడినది. దక్షిణరొడీశియాలో అత్యవసరపరిస్థితి యేర్పడినట్లు ప్రభుత్వము వారిపక్షమున దక్షిణరొడీశియా ప్రధానమంత్రి సర్ ఎడ్గర్ వైట్‌హెడ్ గారు ఫిబ్రవరి 26వ తేదీన రేడియోద్వారా ప్రకటించిరి.

ఆఫ్రికా నేషనల్‌కాంగ్రెసును అశాస్త్రీయసంఘముగ ప్రకటించి నిషేధించిరి. పోలీసువారు అర్ధరాత్రమున కాంగ్రెసుకార్యనిర్వాహకోద్యోగులను అరెస్టుచేసిరి. కాంగ్రెసును అశాస్త్రీయసంఘముగా ప్రకటించిన ఈ ఉత్తరువు రొడీశియాలోనే చేయబడినది. నిజమునకు ఈ ఉత్తరువు న్యాసాలాండుకుగాని, ఉత్తరరొడీశియాకుగాని వర్తింపదు. అయితే, ఫెడరేషను

లోని మూడురాజ్యముల ప్రభుత్వములవారును ఏకనిర్ణయమునకువచ్చి చర్యజరుపుచున్నారనియు, ఆఫ్రికన్ కాంగ్రెసు అన్నిప్రాంతములందును నిషేధింపబడినదనియు, సర్ ఎడ్గర్ వైట్‌హెడ్‌గారు తమరేడియోప్రసంగమునందు ప్రకటించిరి.

దక్షిణరొడీశియానుండి సైనికదళములను న్యాసాలాండులోనికి విమానములపైన తెచ్చిరి. టెరిటోరియల్ స్వచ్ఛందసైనికులను తెల్లవారిలో చాలా మందిని సేకరించిరి.

ఫిబ్రవరినెల 26 వ తేదీన ప్రభుత్వమువారు ప్రకటించిన అత్యవసర పరిస్థితి (స్టేట్ ఆఫ్ ఎమర్జెన్సీ) ని పురస్కరించుకొని దక్షిణరొడీశియాలో 430 మంది దేశీయులను అరెస్టుచేసి నిర్బంధమునందుంచిరని అధికారరీత్యా ఫిబ్రవరి 27వ తేదీన ప్రకటింపబడినది. ఇట్లు నిర్బంధింపబడినవారిని గాక, దేశములో నింకను మారుమూలప్రాంతములందున్నవారిని పట్టుకొనవలసియున్నదనియు, రాకపోకమార్గములు కష్టమైనందువలన అది ఇంకను జరుగలేదనియు ప్రకటించిరి. దక్షిణరొడీశియాప్రభుత్వమువారు ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెసునేగాక, ఇంకను మూడు దేశీయప్రజాసంస్థలనుకూడా అక్రమసంఘములుగా నిషేధించిరి.

టంగనీయికాలోనుండి ఒక పోలీసుదళము 18-2-59 తేదీన న్యాసాలాండులోనికి పోయి, 19 తేదీనుండి ఆఫ్రికాదేశీయులస్వాధీనములోనున్న ఫోర్టుహిల్ విమానాశ్రయమును లాగికొనిరి. ఈ విమానాశ్రయమును రక్షించుకొనుటకు విప్లవకారులు కొండరాళ్ళను, పెట్రోలుడ్రమ్ములను దారిలో అడ్డముగాపెట్టిరి. ఇదివరకు రెండుమారులు పోలీసువారు ప్రయత్నించినను ఇది స్వాధీనముకాలేదు. ఆఫ్రికాజాతీయోద్యమమున చేరినవారిలో రెండు వందలమంది నల్లవారు చిగరు (Chigaru) అనుచోటనున్న న్యాయస్థానముపైన దాడిచేసిరి. అప్పుడు పోలీసువారు తుపాకులుపేల్చగా కొందరికి గాయములుతగిలెను. ఒకడు చనిపోయెను. ఎట్టి కర్ఫ్యూఉత్తరువు లేకపోయినను బ్లాంటైరులో పోలీసువారు మోటారుట్రక్కులలో లౌడ్‌స్పీకరు యంత్రములలో ప్రజలను మధ్యాహ్నమునుండి వీధులలోతిరుగవలదని అక్రమముగా ప్రచారముచేసిరని, అందువలన దేశీయులు చాలా యిబ్బందిపడినా

రనియు డాక్టర్ హేస్టింగ్సు బాండాగారు పత్రికావిలేఖరులకు చెప్పి ఈ చిక్కులకన్నిటికిని కారణము జిల్లాలలోనున్న కమీషనరులేయనిరి.

న్యాసాలాండుప్రభుత్వమువారు 3-3-1959 తేదీన అత్యవసరపరిస్థితి సంభవించినట్లు ప్రకటనచేసి, న్యాసాలాండు ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెసు అధ్యక్షుడైన డాక్టర్ హేస్టింగ్సు బాండాగారిని ఇతర ఆఫ్రికాదేశీయ నాయకులను న్యాసాలాండునుండి దేశాంతరమునకంపినట్లు ప్రకటించిరి.

ఆఫ్రికాలో వివిధప్రాంతములందలి దేశీయులలో తీవ్రమైన జాతీయాభిమానము వ్యాపించియున్నది. పాశ్చాత్యులు తమహక్కులు నిలువబెట్టుకొనుట కీ జాతీయోద్యమము నణచివేయుటకు ప్రయత్నించుచున్నారు. వా రెన్ని అత్యాచారములుచేసినను దేశీయులు ప్రాణములకుతెగించి పోరాడుచునేయున్నారు. ఆఫ్రికాదేశీయులయుద్దేశము ఆఫ్రికాలోనితెల్లవారిని దేశములోనుండి తరిమివేయవలెనని కాదు. దేశములోని అధికసంఖ్యాకప్రజల కధిమతమగు ప్రజాప్రభుత్వమును స్థాపింపవలెననియే.

"మేము తెల్లవారిని వెడలగొట్టదలపలేదు. ఈ దేశములోని అధికసంఖ్యాకప్రజలే ఈదేశము నేలవలెనని మా యభిప్రాయము. న్యాసాలాండులో ఆఫ్రికావారే అధికసంఖ్యాకులు"అని డాక్టర్ బాండాగారు స్పష్టముగా చెప్పినారు.

న్యాసాలాండులో అత్యవసరపరిస్థితిని ప్రకటించి, వివిధప్రాంతములందు తిరుగుబాటుదారులపైన పోలీసువారు తుపాకులుకాల్చినదానిఫలితముగా మార్చి 4వ తేదీన 26 మంది ఆఫ్రికావారు హతులైరి. న్యాసాలాండ్ ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెసు అక్రమసంఘముగా నిషేధింపబడినది. దాని నాయకులు 149 మందిని అరెస్టుచేసిరి. అందులో ఏబదిమందిని డాకరు బాండాగారితోకలిపి విమానముపైనెక్కించి దేశాంతరప్రవాసమునకంపిరి.

జొంబాలో ఆఫ్రికాదేశీయులగుంపులు మార్చి 5 వ తేదీన బల్లెములు పుచ్చుకొని తిరుగుచుండగా "సెక్యూరిటీఫోర్సెస్" అను రక్షకదళమువారు వారిపైన తుపాకులుకాల్చిరి. అయిదుగురు హతులైరి. రెండుదినముల క్రిందట న్యాసాలాండులో అత్యవసరపరిస్థితి ప్రకటింపబడినప్పటినుండి మొత్తముమీద 36 మంది చనిపోయిరి.

ఆఫ్రికాదేశీయులగుంపులు క్రొత్తవిధానముల నవలంబించిరి. అత్యవసరశాసనవిధులక్రింద నిర్బంధింపబడిన తమ తోడిదేశీయులను విడిపించుటకు ప్రయత్నించుటకుబదులుగా వారు రోడ్లకు అడ్డకట్టలువేయుచు, బ్రిడ్జిలను నాశనముచేయుట ప్రారంభించిరి. ఇకముందు జరుగు అల్లరులలో రోడ్లకును బ్రిడ్జిలకును బిల్డింగులకును వారుచేయునష్టమునకు నల్లవారే ప్రతిహారమునిచ్చుకోవలసియుండురని ముప్పదివేలకరపత్రములను విమానములనుండి మార్చి 5 వ తేదీన ప్రభుత్వమువారు వెదజల్లిరి.

ఈ అల్లరులనుగూర్చి తనవిచారమును ప్రకటించుచు శాసనసభలో ఆఫ్రికాదేశీయప్రతినిధియైన ఎన్. డి. క్వ్యాంజేగారు న్యాసాలాండును రొడీశియాఫెడరేషనులోనుండి తొలగించినగాని దేశములో శాంతిచేకూరదని చెప్పిరి.

దక్షిణరొడీశియా ఆఫ్రికన్ నేషనల్‌కాంగ్రెసుసంఘమును శాశ్వతముగా అక్రమసంఘముగచేయుటకు దక్షిణరొడీశియా పార్లమెంటులో నొక చిత్తుచట్టమును ప్రవేశపెట్టిరి. దానిని 1959 మార్చి 11 వ తేదీన మొదటిసారి చదివిరి, ముమ్మారు చదివినపిమ్మట నది చట్టమగును.

అశాస్త్రీయవ్యవస్థలబిల్లు (Unlawful Organizations Bill) అనబడు ఈ శాసనమునుబట్టి ఆఫ్రికన్ నేషనల్‌కాంగ్రెసులోగాని దక్షిణరొడీశియాసరిహద్దులవెలుపల వివిధయుద్యమములకు అనుబంధములుగనుండునట్టి, లేదా వానిఅదుపుఆజ్ఞలక్రిందనుండునట్టి ఏసంస్థలోనైననుగాని, సభ్యులుగానుండువారికిని, దానికి సహాయముచేయువారికిని, వేయినవరసులజరిమానాగాని ఐదుసంవత్సరములశిక్షనుగాని విధింపవచ్చును. ఇట్లు అక్రమసంఘములుగా నిషేధింపబడుసంస్థలలో నీ క్రిందివి కలవు: దక్షిణాఫ్రికానేషనల్‌కాంగ్రెసు, వరల్డుఫెడరేషన్ ఆఫ్ ట్రేడ్‌యూనియన్సు, ది వరల్డుపీస్‌కవున్సిలు; ది వరల్డుఫెడరేషన్ ఆఫ్ డెమాక్రటిక్‌యూత్, ది వుమన్సు ఇంటర్నేషనల్ డెమాక్రటిక్ ఫెడరేషన్; ది ఇంటర్నేషనల్ యూనియన్ ఆఫ్ స్టూడెంట్సు."

దక్షిణరొడీశియాలో మధ్యరాష్ట్రములందు అనుమానమున్న ఆఫ్రికా దేశీయుల నింకను అరెస్టుచేయుచునేయున్నారు. అక్కడ అసమ్మతిప్రదర్శనములు గావించు కొందఱు దేశీయులగుంపులపైన సెక్యూరిటీఫోర్సెస్ అను రక్షణసైనికబలములు తుపాకులనుప్రేల్చగా నొకడు చచ్చెననియు అధికారుల ప్రకటనునుబట్టి చనిపోయినవారిసంఖ్య మొత్తము 4) మందిఅనియు ప్రకటింపపడినది.

మధ్యఆఫ్రికాపరిస్థితులనుగూర్చి ఇంగ్లాండుదేశప్రజలలో అభిప్రాయభేదములు వ్యాపించియున్నవి. అక్కడ నల్లవారికి న్యాయముకలిగింపవలెనను ఉదారవాదులు కొందరున్నారు. కొందరు ఆఫ్రికాలోను ప్రపంచములోను తెల్లవార్ల ఆధిపత్యమును చిరస్థాయిగా చేయవలెననువా రున్నారు.

వలసరాజ్యప్రజలకు స్వాతంత్ర్యము నొసగవలెనను ఉద్యమమునకు నాయకుడు ఫెన్నర్‌బ్రాక్వేగారు. ఈయన ఇంగ్లాండుపార్లమెంటులో లేబరుపక్షసభ్యుడు. భారతదేశస్వాతంత్ర్యముపట్లకూడా సానుభూతిని కనబరచినవాడు. "1958 డిశంబరునుండియు దక్షిణరొడీశియాప్రభుత్వమువారును రొడీశియాఫెడరేషనుప్రభుత్వమువారును ఆలోచించుకొనుచు ప్రవర్తించుచున్నట్లు కనబడుచున్నదనియు తెల్లవార్లఆధిపత్యమును స్థాపించుటకే అక్కడి తెల్లయధికారులు కృతనిశ్చయులై చర్యలుజరుపుచున్నారనియు, ఇంగ్లాండులో లేబరుపక్షమువారు 1960లో అధికారము వహింపగలరనియు, ఆఫ్రికాలో ప్రజాప్రభుత్వవిధానమును అమలుజరుపనియెడల లేబరుపక్షమువారు రొడీశియా ఫెడరేషన్‌ప్రభుత్వమునకు అధినివేశప్రతిపత్తి అనగా సంపూర్ణస్వాతంత్ర్యమును ఒసగరనియు, అందువలన నీలోపుగనే ఆ ప్రతిపత్తిని సంపాదించుకొని తెల్లవారిఆధిపత్యమును స్థాపించవలెనని అక్కడితెల్లవారందరు కలిసి ఆలోచించుచున్నారనియు బ్రాక్వేగారు 20-3-59 తేదీన లండనులోజరిగినసభయందు చెప్పిరి.

వైట్ డిఫెన్సులీగ్ (White Defence League)నేషనల్, లేబర్ పార్టీ అను రెండు సంఘములవారికి వలసరాజ్యములోని ప్రజలకు స్వాతంత్ర్యమొసగుట యిష్టములేదు. వలసరాజ్యములప్రజలు ఇంగ్లాండుకు వలసవచ్చుటయు గిట్టదు. వైట్ డిఫెన్సులీగునకు కాలిన్ జోర్డన్ (Mr. Colin

Jordan)గారు సంచాలకుడు. మైకెనామ హక్కుమెన్ (Mykenama Hquman) అను నాయన న్యాసాలాండుశాసనసభలో మాటలాడుటకు లేచి నిలువగనే కాలిన్ జోర్డన్‌గా రొక యీలవేసిరి. అంతట అల్లరి చెల రేగినది. 600 మంది శ్రోతలుగల ఆ సభలో టపాకాయలువేసి బ్రిటనుదేశ మును తెల్లవారిదేశముగనే యుంచవలెననునినాదములు చేయసాగిరి. అల్లరి చేయుచున్నవారిని ముప్పదిమందిని స్టివార్డు లను రక్షకోద్యోగులు బలవంత ముగా బయటకు త్రోసివైచిరి. అల్లరిచేయువా రీ స్టివార్డులముక్కులపైన పిడి గ్రుద్దులు గ్రుద్దిరి. వారి ముక్కులవెంట రక్తముకారెను.

ఆఫ్రికాలో అత్యవసరపరిస్థితిని ప్రకటించుటకు కారణము న్యాసా లాండులోని బ్రిటీషుగవర్నరును, తెల్లఉద్యోగులను మిషనరీలనుస్త్రీలను పిల్ల లను హత్యచేయుటకు అక్కడినల్లవారుకుట్రచేయుచున్నట్లు బయల్పడుటయే యని ప్రచారముగావింపబడెను. నల్లజాతులవారు తిరుగుబాటుచేసి తెల్లవారిని వధింపదలచినారని టెలిఫోనుతీగెలను, రోడ్లను, రైలుబ్రిడ్జీలను, విమానాశ్ర యములను, పెట్రోలుబంకులను, బ్లాంటైరుపట్టణములోని విద్యుచ్ఛక్తియు త్పాదకస్టేషనును నాశనముచేయదలచినారని, జిల్లాకమీషనర్లను, రాష్ట్రీయ కమీషనర్లను ఇతరఉద్యోగులను, తెల్లమిషనరీలను, పాశ్చాత్యపక్షపాతులగు కొందరు నల్లజాతినాయకులను, పట్టణములలోని ఐరోపావారిని ఆశియా వారిస్త్రీలను పిల్లలనుకూడా వధింపదలచినారనియు, గవర్నరును ఇతరపెద్ద మనుష్యులను హత్యచేయదలచినారనియు, ఈ కుట్ర 1959 జనవరి 24, 25 తేదీలలో నొకరహస్యసమావేశమున నిర్ణయింపబడినదనియు,ఆఫ్రికాజాతీయ నాయకుడైన బాండాగారిని, ఇతరనాయకులను నిర్బధించినవెంటనే ఈ కార్య క్రమమును అమలుజరుపుటకు దేశీయులు నిశ్చయించిరనియు, దేశములో రైల్వేరోడ్డురవాణా మొదలగుసంస్థలందును ఇతరపనులందును పనిచేయు నల్లవారందరును సర్వవ్యాప్తసమ్మె చేయదలచినారనియు, జనవరి 25వ తేదీన జరిగిన సభకు బాండాగారు హాజరుకాకపోయినను, ఈ కుట్రయంతయు ఆయనఎఱుకతోనే జరిగినదనియు గవర్నరుగారు వ్రాసినదానినిబట్టి ఇంగ్లాండుప్రభుత్వమువారు 23-3-59 తేదీన నొక వైట్‌పేపరు అను

అధికారపూర్వకశ్వేతపత్రమున ప్రకటించిరి. తమకు చేరినసమాచారములు చాలా విశ్వసనీయములైనవని వారు చెప్పిరి. అయితే దీని కెట్టి ఆధారమును లేదనియు ఇది కేవలము అభూతకల్పనమనియు ఇంగ్లాండులోని పత్రికలు ప్రకటించెను.

పూర్వము కెన్యారాజ్యములో మావ్‌మావ్‌ఉద్యమమునుగూర్చి నల్లవారిపైన లేనిపోని నేరములుమోపి దుష్ప్రచారముగావించి, వేలకొలది నల్లవారిని చిత్రవధలుగావించి బాధించినట్లే, ఇప్పు డిక్కడినల్లవారిపైనకూడా కుట్రనేరముమోపి, అత్యాచారముగావించుటకే ఈ ప్రచారముచేయుచున్నారనుభావము ఇంగ్లాండులోని బుద్ధిమంతులకు అవగతమైనది.

అంతట దీనినిగూర్చి నిష్పక్షపాతమైనవిచారణను జరుపవలసినదని లేబరుపక్షనాయకులును, స్వతంత్రవార్తాపత్రికలవారును ఆందోళనముచేయసాగిరి. ఆఫ్రికా వలసరాజ్యప్రభుత్వమువారిచ్చిన సంజాయిషీపైన బ్రిటీషు ప్రభుత్వమువారు జారీచేసిన శ్వేతపత్రము ఇంగ్లీషుపార్లమెంటువారు హర్షింపతగినట్టిదిగ లేదనియు, అది వారివిచక్షణజ్ఞానమునకును బుద్ధిసూక్ష్మతకును భంగమునుకలిగించునట్టిదిగ నున్నదనియు, ఒక నిష్పక్షపాతవిచారణసంఘము నేర్పరచి కుట్రనేరమునకు నిర్బంధింపబడిన ఆఫ్రికాజాతీయనాయకుడైన డాక్టరు.బాండాగారియొక్క సంజాయిషీకూడా సాక్ష్యముగాగ్రహించుట అవసరమనియు "డెయిలీహెరాల్డు" పత్రిక ఉద్ఘాటించినది. మధ్యఆఫ్రికాలోని బ్రిటీషు సంరక్షితరాజ్యమగు న్యాసాలాండులోని కల్లోలస్థితిగతులనుగూర్చి అధికారపూర్వకముగా విచారించుటకై ఒక "అఫీషియల్ కమీషను"ను నియమించుచున్నామనియు, దానికి ఇంగ్లాండులోని న్యాయాధిపతియైన డెవిలిన్ (Mr. Justice Devlin)గారు అధ్యక్షులుగనుందురనియు ఇంగ్లాండువలసరాజ్యాంగకార్యదర్శియైన అలెన్‌లెనాక్సుబాయిడ్‌గారు మార్చి 24వ తేదీన కామన్సుసభలో చెప్పిరి.

ఈ కల్లోలములనుగూర్చి విచారించుట కొక విచారణసంఘమును నియమించుటకు తాము సంతసించినను, అది ప్రభుత్వమువారు నియమించు సంఘముగ గాక, పార్లమెంటుసభవారు నియమించిన సంఘముగ నున్నచో చాలా బాగుండెడిదనియు లేబర్‌పక్షనాయకుడైన గెయిట్‌స్కెల్‌గారు చెప్పిరి.

శ్వేతపత్రములో వివరింపబడిన అంశముల నిజానిజములను గూర్చి విచారించుటకుకూడా అవకాశమొసగబడునాయని గెయిట్ స్కెల్ గారు ప్రశ్నింపగా, ఆ విచారణసంఘమువా రన్నిసంగతులను విచారించెదరని కార్యదర్శిగా రనిరి.

ఈ కల్లోలములకన్నిటికిని ఆఫ్రికాలో తెల్లవారియాధిపత్యము నెలకొల్పుటకై వర్ణభేద జాతివిభజన "అపార్తీడ్" విధానమును నెలకొల్పజూచిన తెల్ల వారే కారణభూతులు. వారు నల్లవారిపట్ల అవలంబింపదలచిన విధానములు చాలా అన్యాయముగానున్నందున ధర్మశీలురగు కొందరు తెల్లవారుకూడా ఈ అక్రమవిధానములను ప్రతిఘటించిరి. అందువలన దక్షిణ రొడీశియాప్రభుత్వమువారు చేయతలపెట్టిన వ్యక్తిస్వాతంత్రనిరోధక రౌలటు చట్టమువంటి ప్రివెంటివు డిటెన్షనుబిల్లును ఉపసంహరించుకొనవలసివచ్చెను. నల్లవారిపట్ల సానుభూతి కనబరచిన పాశ్చాత్యప్రముఖుడైన గైకట్టన్ బ్రాక్ గారిని (Mr. Guy Cuttan Brock) ఇతరులను ఆ ప్రభుత్వమువారు నిర్బంధమునుండి విడుదలచేయవలసివచ్చెను.

దక్షిణరొడీశియాప్రభుత్వమువారు అట్లు నిర్బంధమున నుంచిన ఏబదిమందిని 40 గంటలలో విడుదలచేయుచున్నామని 23వ తేదీన ప్రకటించిరి. ఇంతేకాదు, ఉత్తరరొడీశియా, న్యాసాలాండురాజ్యములకుచెంది దక్షిణరొడీశియాలో అరెష్టుచేయబడిన 180 మందినికూడా విడుదలచేయుటకు నిశ్చయించిరి.

రొడీశియాదేశములోనినల్లవారిలో జాతీయోద్యమ మనేకరూపములు దాల్చుచున్నది. దానినణచుటకు తెల్లప్రభుత్వమువారును అత్యాచారములు గావించుచున్నారు. రొడీశియా ఉత్తరపరగణాలోని చిన్సలిలో ముప్పదేండ్ల వయస్సుగల లెన్షినా ఎలైస్ (Lenshina Alice) అను నొక ఆఫ్రికాదేశ స్త్రీ యొకవిధమైన జాతీయక్రైస్తవమతశాఖను ఉద్యమమును ప్రారంభించినది. కొన్నివేలమందినల్లవారామెకు శిష్యులైరి. చిన్సలిలో నీ మతశాఖవారుండుట కొక గొప్పమఠమును నిర్మించిరి. నల్లవారెవ్వరైన రాజకీయమత సంఘముల నేర్పరచుకొన్నచో రిజిస్టరుచేసికొనవలెనను ఒక నిర్బంధమున్నది. ఏ రాప్రకారము రిజిష్టరుచేయించుకొనలేదు. అంతట 1959

మే నెలారంభమున డెనిస్ ఫ్రాస్టు (Mr Denis Frost) అను జిల్లాయధికారి కొంతమందిపోలీసువారిని వెంటబెట్టుకొనివెళ్ళి, ఈక్రొత్తమతమువారిని రిజిష్టరుచేయించుకొనమని బెదిరించెను. అప్పుడక్కడ మూడువందలమంది బెమ్డా (Bemda) జాతి ఆఫ్రికావారితనిపైన తిరుగబడిరి. ఆ సందర్భమున జరిగిన కొట్లాటలో నొక నల్ల హెడ్‌కానిస్టేబులును, ముగ్గురు నల్లజాతి జిల్లామెసెంజరులును గాయపడిరి. పోలీసువారు టియర్‌గ్యాస్‌బాంబులువేసినను దేశీయులగుంపులు చెదరిపోలేదు. అందువలన వారు తుపాకులు కాల్చిరి. ముగ్గురునల్లవారికి గుండుదెబ్బలుతగిలెను. షుమారు రెండువందలమంది బెమ్డాజాతివారిని పట్టుకొని, ఖైదువేసిరని మే 8 వ తేదీన వార్త ప్రకటింపబడినది. ఈ మతప్రవర్తకురాలు భయంకరపరిస్థితి కలుగకుండా ఆపుటకు ఆఫ్రికాదేశీయులకు పోలీసులకు మధ్య దుమికి సాహసమొనరించినది.

దక్షిణరొడీశియాప్రభుత్వమువారు శాసనసభలో ప్రవేశపెట్టిన దక్షిణ రొడీశియన్ ప్రివెంటివుడిటెన్షన్‌ఆక్టు అనగా నేరములనునివారించుటకొరకు స్త్రీపురుషులను విచారణలేకుండా నిర్బంధములోనుంచుటకు చేయబడిన శాసనమును అన్‌లాఫుల్ ఆర్గనైజేషన్సుఆక్టు అనబడు అక్రమసంఘముల శాసనమును 15-5-1960 వ తేదీన శాసనములైనవి.

ఈ శాసనములను ప్రభుత్వమువారు గెజెటులో ముద్రించినారు. వీనివలన ఆఫ్రికన్ నేషనల్‌కాంగ్రెస్‌ఉద్యమమును దేశముసరిహద్దువెలుపలనున్న కొన్ని కమ్యూనిస్టుప్రాబల్యముగలసంస్థలును శాశ్వతముగా నిషేధింపబడినవి. ఎవరినైనను ఎట్టివిచారణయులేకుండా తమచిత్తమువచ్చినంత కాలము నిర్బంధమునసుంచుటకు ప్రభుత్వమున కధికారములు ఒసగబడినవి. ప్రివెంటివు డిటెన్షను ఆక్టుక్రింద నిర్బంధింపబడినవారికేసులను విమర్శించుటకు ఒక ప్రత్యేకన్యాయస్థాన మేర్పరుపబడినది.

ఈ శాసనములు మే 22వ తేదీన అమలులోనికి వచ్చుచున్నందువల్ల గత ఫిబ్రవరి 26 వ తేదీన ప్రకటింపబడిన అత్యవసరపరిస్థితి అనునది అంతటితో రదుఅగును.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## పదునాలుగవ ప్రకరణము

### ఫ్రెంచి ఇక్వెటోరియల్ ఆఫ్రికా

భూమధ్యరేఖప్రాంత ఆఫ్రికాలో నీక్రింది నాలుగు రాజ్యభాగములు చేరియున్నవి.

1. గేబన్ దేశము విస్తీర్ణము 92218 చ. మైళ్లు, జనసంఖ్య 421000 ఆఫ్రికాదేశీయులు, 1517 తెల్లవారు. రాజధాని: లిబ్రెవిల్లి.
2. మధ్యకాంగోదేశము విస్తీర్ణము 166069 చ. మైళ్ళు. జనసంఖ్య 626000 ఆఫ్రికావారు, 3624 తెల్లవారు. రాజధాని: బ్రెజ్జవిల్లి.
3. ఉబంగి షారిదేశము విస్తీర్ణము238767 చ. మైళ్ళు. జనసంఖ్య 1063000 ఆఫ్రికావారు, 1606 తెల్లవారు. రాజధాని: బంగ్యుయి.
4. చాద్ దేశము విస్తీర్ణము 461202 చ. మైళ్ళు. జనసంఖ్య 2010000 ఆఫ్రికావారు, 1081 తెల్లవారు. రాజధాని: ఫోర్టులామి.

మొత్తము విస్తీర్ణము 959256, జనసంఖ్య 4120000

ఈరాజ్యములోని ఆఫ్రికాదేశీయులలో హెచ్చుమంది నీగ్రోలు దక్షిణమున బాంటూభాషలను, ఉత్తరమున సుడానీసుభాషలను మాట్లాడుదురు. అడవిజాతులలో ఒకండి, ఫియాట్, ఫాంగ్ జాతులవారు గేబనురాజ్యభాగములో నున్నారు. బటెక, బండా జాతులవారు తూర్పుననున్నారు. జంపే జాతివారు నియంనియం అని వ్యవహరింపబడువారు నైలునదినీటివనరులో నున్నారు. సరాజాతివారు షరీప్రాంతమున నున్నారు. హౌసా, ఫులాజాతులవారు, వివిధ మిశ్రమజాతులవారును చాద్ సరస్సుదగ్గర నున్నారు. టిబ్బుజాతి

వారు చాద్ వలసరాజ్యమున నున్నారు. కొందఱు పొట్టిగుజ్జువారుకూడా ఉన్నారు.

ఈదేశము చాలా సారవంతమైనభూమి. రబ్బరు, దంతము, ప్రత్తి, కోకో, నూనె, కలప మొదలైనవానిలో వ్యాపారముజరుగుచున్నది.

పూర్వము ఫ్రెంచిప్రభుత్వమువారు ఫ్రెంచిజాతితెల్లవారికి చాలా విలువగలభూముల నిచ్చుటవలన బలవంతులైన తెల్లభూకామందులు బయలు దేరిరి. నల్లవారికి బాధలుకలిగెను. నల్లవారిలో అజ్ఞానము అనారోగ్యము విప రీతముగా నుండెను. దీర్ఘ నిద్రరోగము, గ్రహణి, కుష్ఠు మొదలగువ్యాధులు ప్రబలముగానుండెను. చాలామంది దేశీయులను తెల్లవారు బరువులుమోయు పోర్టరుకూలీలుగా నుపయోగించుచుండిరి. అందువలన వ్యవసాయకూలీలు తగ్గిపోయిరి. రాకపోకమార్గములు వృద్ధిచేయువరకు రవాణాలు కష్టముగా నుండెను.

ఈదేశమునకంతకు గవర్నరుజనరలు ప్రధానపరిపాలకుడుగా నియ మింపబడెను. ఆయనక్రింద వివిధరాజ్యభాగములకు లెఫ్టినెంటుగవర్నరులు నియమింపబడిరి. మధ్యకాంగో వలసరాజ్యమునకు గవర్నరుజనరలే లెఫ్టి నెంట్గవర్నరుగా నియమింపబడెను.

దేశమునకంతకును కలిపి ఒకజనరల్ ఆదాయవ్యయపట్టిక తయారు చేసి, ప్రతివలసరాజ్యమునకు వేరువేరు ఆదాయవ్యయపట్టికలు తయారుచేయు దురు. శాసననిర్మాణాధికారము ఫ్రెంచిఛేంబర్సువారికే కలదు. కార్యనిర్వా హకవర్గమునకు లోబడని న్యాయపరిపాలనాధికారమున్నది. విద్యాసౌకర్యము చాలా తక్కువగానున్నది. ప్రభుత్వపాఠశాలలున్నను క్రైస్తవమిషన రీలే హెచ్చుగా విద్యాబోధనమునుచేయుచున్నారు.

ఫ్రెంచివారిప్రజాస్వామికములో నొకభాగముగా కాంగోరిపబ్లికుఏర్పాటు చేయబడినది. ఇది బెల్జియన్కాంగోరాజ్యమునకు దగ్గరలోనే కాంగోనది కావలియొడ్డుననున్నది. ఫ్రెంచిప్రజాస్వామిక(రిపబ్లికు)విధానములో వర్ణభేద ముతోగాని జాతిభేదముతోగాని నిమిత్తములేకుండా ప్రజారాజ్యములు స్థాపింపబడి, వానికి ప్రత్యేక స్వతంత్రప్రభుత్వము లేర్పాటుచేయబడు చుండును. అయితే అక్కడ ఫ్రెంచివారి ప్రజాప్రభుత్వపద్ధతులును ఫ్రెంచి

వారి న్యాయపరిపాలనావిధానమును అమలుజరుగును. ఆఫ్రికాదేశప్రజలలో హెచ్చుమంది నల్లజాతులవారేయైనందున వారి ప్రతినిధులనాయకుడే ప్రధాన మంత్రిగా నియమింపబడి, ఫ్రెంచి హైకమీషనరుసలహాసహాయములతో దేశపరిపాలనము జరిగించుచుండును. దీనిఫలితముగా నల్లవారిలోనే చీలిక లేర్పడి ప్రత్యేక రాజకీయకక్షలు బయలుదేరెను. ఈ పక్షములవారిలో స్పర్థలు తీవ్రమై విరోధములుగా పరిణమించి, కొట్లాటలు జరిగి దేశశాంతికే భంగముకలిగించుపరిస్థితు లేర్పడెను.

పూర్వము మాన్సర్ ఒపన్‌గాల్టుగారు ప్రధానమంత్రిగానుండగా ఆయనకువ్యతిరేకరాజకీయపక్షమువారినాయకుడైన అబెయూవోలొగారు 1958 నవంబరు 28 వ తేదీన ప్రధానమంత్రియయ్యెను. ఆయనపక్షమువారికి రెండవవారికన్న ఒకసభ్యుడుమాత్రమే హెచ్చుగానుండెను. అంతట రాజధాని నగరమైన బ్రజ్జవిల్లిలో నీ రెండుపక్షములువారు పోరాడుకొనసాగిరి.

1959 జనవరినెలలో కొట్లాటలు జరిగెను. అందులో 47 మంది నల్లవారు హతులైరి.

క్రొత్తప్రధానమంత్రియైన ఉల్లిగారు ప్రతిపక్షనాయకుడైన ఒపన్‌గాల్టుగారి పక్షీయులు ప్రబలముగానున్న పాయింట్ నోయిర్ Point Noire) నుండి ప్రభుత్వకార్యస్థానమును బ్రజ్జవిల్లికి మార్చిరి. అప్పటినుండి ప్రతిపక్షమువారీ క్రొత్తప్రభుత్వమునకు పలుకుబడిలేదనియు శాసనసభను డిజాల్వు చేసి క్రొత్తఎన్నికలు జరిపించవలసినదనియు ఆందోళనముచేయసాగిరి.

ఫ్రెంచికాంగోరాజధానియైన బ్రజ్జవిల్లి నగరమున పైనజెప్పిన ఉభయ పక్షములవారిలో విరోధములు తీవ్రరూపముదాల్చెను. బలాలీలనువారు ప్రధాన మంత్రియైన అబెపుల్‌బెట్ యువోలొగారిపక్షమునకుచెందినవారు. వీరు ఆఫ్రికన్ డెమోక్రాటికురాలీ అను సంఘమున సభ్యులైయుండిరి. ప్రతిపక్షనాయకుడైన జాక్విస్ ఒపన్‌గాల్టుగారిపక్షమువారు వెల్యూచీలు. వీరు కాంగో పాప్యులర్‌పార్టీకి చెందినవారు. ఈ పార్టీ ఆఫ్రికన్ సోషలిస్టుపార్టీయొక్క శాఖయే.

అబెయూవోలొగారికి శాసనసభలో నొకవోటుమాత్రమే అధికముగా నున్నందున ప్రతిపక్షమువా రా ప్రభుత్వముతో సహకరించుటకు నిరాక

రించి, శాసనసభనే బహిష్కరించిరి. అంతట 1959 ఆదాయవ్యయపట్టికను ప్రభుత్వసభ్యులే ఆమోదించి ప్యాసుచేసిరి. దీనిఫలితముగా 1959 ఫిబ్రవరి 16 వ తేదీన దేశములో అసంతృప్తి వ్యాపించి కల్లోలముకలిగెను. 16 వ తేదీన కొన్నిచోట్లలో కొట్లాటజరిగెను. 17, 18 తేదీలలోను బకోంగో (Bacongo) లోను పొటొపొటోలోను విరోధివర్గనాయకులఇండ్లకు నిప్పు ముట్టించి తగులబెట్టిరి. మూడుదినములపాటు ఈ రెండురాజకీయపక్షములవారును వారిపక్షమువహించినవారును కలిసి షాట్‌గన్‌లనుతుపాకులతోను బల్లెములతోను కత్తులతోను పోరాడుకొనిరి. అంతట బ్రజ్జవిల్లిలోని ముఖ్య ప్రదేశములందు పోలీసువారును సైనికదళములవారును ఆయుధములతో కాపలాకాయుట ప్రారంభించిరి.

ఈ కొట్లాటలో 50మంది హతులైరని, 120మంది గాయపడిరని అధికారరీత్యా ప్రకటనచేసిరి. రక్షణసేనల సంఖ్యను హెచ్చుచేసిరి. బ్రజ్జవిల్లినగరరక్షణకై కొన్ని ప్రత్యేకమైన ఏర్పాటులుచేసిరి. నగరములోని లక్ష నల్లవారిని తొమ్మిదివేలమంది పాశ్చాత్యులను అనవసరముగా వీథులలో తిరుగవలదని ఇంటీరియర్‌శాఖామాత్యుడు హెచ్చరించెను.

సాధారణముగా శాసనసభాసభ్యులేవైననేరములు చేసినచో వారికి పార్లమెంటరీ ఇమ్యూనిటీ అనబడు ప్రత్యేకరక్షణమనునది యున్నందున వారిని అరెస్టుచేసి శిక్షించుటకువీలులేదు. అందువలన నీ ప్రతిబంధకమును పదునైదుదినములపాటు సస్పెండుచేయుచు ప్రభుత్వపక్షమువారు 1959 ఫిబ్రవరి 17 వ తేదీన నొక అత్యవసరశాసనమును చేసిరి. దీనిని పురస్కరించుకొని ముగ్గురు ప్రతిపక్షశాసనసభ్యులను అరెస్టుచేసిరి. అయితే వారిని 18వ తేదీన వదలివేసిరి. ప్రతిపక్షనాయకుడైన ఒపన్‌గాల్టుగారిని పోలీసువారు 18వ తేదీన ఆపుచేసి కొంతసేపు ప్రశ్నించిరి గాని, తరువాత ఆయన నింటికిపోనిచ్చిరి.

ఈ కొట్లాటలు కేవలము దేశశాంతికి భంగముకలిగించు క్రిమినలు నేరములక్రిందికివచ్చుననియు ఫ్రెంచిప్రజాస్వామికమువారీ దేశములో అరాజకములను సహింపజాలరనియు ఫ్రెంచిహైకమీషనరుగారు 17వ తేదీన గట్టిగా హెచ్చరించిరి. అయితే ఉభయపక్షములవారిలోను రోషావేశము

ప్రబలియున్నందున 18వ తేదీన నగరములో ఆఫ్రికాదేశీయులు కాపురమున్న ప్రదేశములందు అశాంతి వ్యాపించియుండెను. అంతట పోలీసువారు జాగ్రత్త కొరకై నగరములోని చౌరస్తాలదగ్గర అడ్డులనుకట్టి ఇటునటుపోవువారి గురుతుపత్రములను పరిశీలింపసాగిరి.

బ్రజ్జవిల్లిలో నైదురినములు వివిధజాతులమధ్యను తెగలవారి మధ్యను కొట్లాటలు జరిగెను. ఇందులో 98 మంది చనిపోయిరని 170మంది గాయపడిరని ఫిబ్రవరి 20వ తేదీన అధికారప్రకటనము చేయబడెను. మొత్తము 350 మందిని అరెస్టుచేసిరి. అయినను నగరములో అశాంతిచల్లార లేదు. పోలీసువారును సైనికులు ఆయుధములకొరకు ప్రతియింటిని సోదా చేయసాగిరి. ఫిబ్రవరి 19వ తేదీరాత్రి ప్రతిపక్షనాయకుడైన ఒపన్‌గాల్బుగారిని అరెస్టుచేసి క్రిమినలునేరములకు ప్రోత్సహించుచున్నాడని రాజద్రోహశాసనముక్రింద నేరమునుమోపిరి.

పోలీసువారును సైనికదళములును అప్రమత్తులై గస్తీతిరుగుచుండుటవలన 120 మంది చనిపోవుటతో నీ కొట్లాటలు ఆగినవి. రాత్రి 8 గంటలనుండి తెల్లవారుజామున 5 గంటలవరకును ఎవ్వరును వీధులలోనికి రాకూడదని "కర్ఫ్యూ" ఉత్తర్వులను జారీచేసిరి. ఇది యొకవారము అమలు జరిగినది. దీనిని ఉల్లంఘించినందుల కిరువదిమందిని అరెస్టుచేసిరి.

ఫిబ్రవరి 22వతేదీన నగరములోని మార్కెట్లను నృత్యమందిరములను తెరచిరి. ఇండ్లు వాకిండ్లు గోల్పోయినవారికి సహాయముచేయుటకై కొన్నిసంఘములవారు పాటుపడిరి. నూరుశవములనుమాత్రము గుర్తుపట్టిరి. ఇంకను 20 మంది హతులైరని అధికారు లనిరి. కాని మొత్తము 250మంది చనిపోయిరని అనధికారవార్తలనుబట్టి తెలియుచున్నది.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## పదునైదవ ప్రకరణము

### కెమెరూన్సు

ఆఫ్రికాఖండమున పశ్చిమభాగమునందు అట్లాంటికుసముద్రము, బియాఫ్రఅఖాతమునానుకొనిన వంకరకోస్తాదగ్గర పడమరఅట్లాంటికుసముద్రము, వాయవ్యమూలను నైజీరియారాజ్యము ఉత్తరమున చాడ్ సరస్సు దక్షిణమునను తూర్పునను ఫ్రెంచిఇక్వెటోరియల్ ఆఫ్రికాయును, నైఋతిభాగమున కొంతవరకు స్పెయినుదేశమువారి గినియారాజ్యమును హద్దులుగా గలిగి, 190000 చదరపుమైళ్ళవిస్తీర్ణముగల దేశమునకు కెమెర్సూను అని పేరు.

పూర్వ మక్కడనుండిన డ్యూయాలా (Duala) మొదలైన తీరవాసులగు ఆఫ్రికాజాతులవారు పాశ్చాత్యులను చాలాకాలమువరకు లోపలికి రానివ్వక వారివలన కొన్నిసరకులను పుచ్చుకొని, వానికిబదులుగా దంతము, రబ్బరు మొదలగుసరకులను బానిసలను ఇచ్చుచుండిరి. 1837 నాటికిక్కడ బ్రిటీషువర్తకులు కొంత పలుకుబడి సంపాదించిరి.

1845లో బాప్టిస్టుమిషనరీసొసైటీవారి క్రైస్తవమతబోధకుడు ఆక్వా కుటుంబమువలన కొంతభూమి పుచ్చుకొని క్రైస్తవమతబోధకుల కార్యస్థానము నేర్పరచెను. బానిసవ్యాపారము నిషేధింపబడినను, ఈ ప్రాంతములం దది 1858 వరకు దొంగతనముగా జరుగుచునే యుండెను. దేశీయజాతినాయకులపైన నూనెనదులపైన అధికారము గల బ్రిటీషుకాన్సలు కొంత అధికారము చెలాయించుచుండెను. 1882 లో ఈ దేశమును బ్రిటీషురాజ్యమున కలుపుకొనవలసినదని డ్యూయాలానాయ

కులు కోరినను వా రట్లుచేయలేదు. అంతట జర్మనీవా రీప్రాంతమున తమ ఆధిపత్యమును స్థాపించగా, 1884 నుండి 1919 వరకును ఇది జర్మనీవారి సంరక్షితరాజ్యముగా నుండెను. ఆకాలమున నిక్కడ వివిధ పాశ్చాత్యాదేశముల కంపెనీలఏజంట్లు స్థిరపడిరి.

ఐరోపాసంగ్రామమునందు జర్మనీవారు దేశీయులలో 1550 మందికి సైనికతర్ఫీతునిచ్చిరి. 1235 మందిని పోలీసు దళమున చేర్చిరి. ఇంకాకొందరిని ఇతరపనులకు నియోగించిరి. యుద్ధమునందు బ్రిటీషువారు ఫ్రెంచివారు కెమెరూన్సును ఆక్రమించిరి జర్మనీవారు ఓడిపోగా 1919లో జరిగిన వర్సైల్స్సంధిషరతులప్రకారము జర్మనీవారు తమ రాజ్యాధికారమును వదలుకొనగా, నీ దేశమును ఫ్రెంచివారును బ్రిటీషువారును ధర్మకర్తలుగా పరిపాలించునట్లు ఏర్పాటుజరిగెను.

జర్మనీవారిప్రభుత్వకాలమున తెల్లవర్తకులు దేశములోపలకు పోయి వ్యాపారముచేయుచుండిరి. కోకో, రబ్బరు, నూనెచెట్లతోటలు చాలా లాభప్రదముగా నుండెను. దంతములు, రబ్బరు, కురిడీలు, వృక్షతైలము, కోకో ఎగుమతియగుచుండెను.

బ్రిటీషుకెమెరూన్సుయొక్క విస్తీర్ణము 33750 చదరపుమైళ్ళు వైశాల్యముండెను. 1925నాటికి 687000 మంది నల్లవారైన ఆఫ్రికాదేశీయులును, 183 మంది పాశ్చాత్యులు నుండిరి. ఈరాజ్యమును బ్రిటీషువారు నైజీరియారాజ్యముతోకలిపి పరిపాలింపసాగిరి. 1915 మొదలు 1924 వరకును ప్లాంటేషను లను తోటల వ్యవహారములుచక్కబెట్టుటకు ప్రభుత్వ శాఖా కార్యాలయ ముండెను. దేశీయులు కోకోతోటలను పెంచుచుండిరి. కాఫీ, అరటి, రబ్బరు తోటలు నుండెను. దేశములో మోటారురోడ్లను వేసిరి. 1926 నాటికి ఎగుమతులవిలువ 220000 పౌనులవిలువ కలిగియుండెను. వస్త్రములు, తినుబండారములు, పొగాకు మోటారుస్పిరిటు, యంత్రసామగ్రి దిగుమతిచేయబడుచుండెను. వీనివిలువ 275000 పౌనులుండెను.

ఫ్రెంచికెమెరూన్సుయొక్క విస్తీర్ణము 160000 చదరపుమైళ్ళు. అక్కడ 1924 నాటికి 2700000 జనసంఖ్య యుండెను, ఇందులో రెండు

వేలమందిమాత్రము పాశ్చాత్యులు. మిగిలినవారు దేశీయులైన నల్లవారు. సగముమంది పాశ్చాత్యులు డ్యూయాలా అను రేవుపట్టణమున నుండిరి. 1921 వరకు నిదియె ఆ దేశమునకు ముఖ్యపట్టణముగానుండెను. తరువాత యౌండె (Younde) ముఖ్యపట్టణముగా చేసిరి. ఫ్రెంచికెమెరూన్సును పరిపాలించుటకు ప్యారిసులోని ఫ్రెంచి ప్రజాస్వామికప్రభుత్వమువారికి బాధ్యతవహించు ఒక కమిషనరును, ఆయన కొక సలహాసంఘమును నియమించిరి. అంత రంగికపరిపాలనవ్యవహారములందును, ఆర్థికవ్యవహారములందును కెమెరూన్సులోని ఫ్రెంచిప్రభుత్వమువారికి రాష్ట్రీయస్వాతంత్ర్యముండెను. 1925లో ఎగుమతులు 113000000 ఫ్రాంకులవిలువ కలిగియుండెను. దిగుమతులు 126000000 ఫ్రాంకులవిలువ కలిగియుండెను. దేశములో రెండు వందల మైళ్ళపొడవు రైలుదారియు 1200 మైళ్ళపొడవు రోడ్లు నుండెను.

ఫ్రెంచిరిపబ్లికు లేక ప్రజాస్వామికమువారి యధికారముక్రింద నుంచబడిన కెమెరూన్సులో ఫ్రెంచివారియధికారమును తీసివేసి, సత్వర స్వాతంత్ర్యమును స్థాపించవలసినదని యూనియన్‌నేషనల్ (Union Nationale) అను ప్రజాసంఘమువారు కోరినకోర్కె సఫలముగాంచలేదు. యు. పి. సి. అను పొడియక్షరములతో ప్రసిద్ధిచెంచిన యూనియన్సు డెస్ పాప్యులేషన్సు కెమెరౌనెయిసెస్ (Union des Populations Camerounaises) అను ప్రజాసంఘమునందు కమ్యూనిస్టులపలుకుబడి చాలా అధికముగానుండెను. వి రా దేశములో శాంతికిభంగముకలిగించు అల్లరులను కొట్లాటలను ప్రోత్సహించుచున్నారని. ప్రభుత్వమువా రీ సంఘమును అణచివేసి, శాంతిభద్రతలను స్థాపించిరి. కొంతమందిని అరెస్టుచేసి ఖైదుచేసిరి. దేశములో ఫ్రెంచిప్రజాస్వామికవిధానమునకనుసరించి ఎన్నికలుజరుపుటకు ఫ్రెంచిపరిపాలకులు నిశ్చయించి, రాజకీయనేరములు చేసినవారిపట్ల కొంత దాక్షిణ్యమునుచూపి చాలామందిని విడుదలచేసిరి. అంతట 1956లో ఎన్నికలు ఎట్టి ఒడుదుడుకులును లేకుండా జరిగెను. ఈ ఎన్నికలయందు ఆ రాజ్యములోని దేశీయులలో మితవాదులే అధికసంఖ్యాకులుగా నెన్నుకొనబడిరి. అయితే ప్రతిపక్షములవారు ఎన్నికలు న్యాయముగాజరుగలేదని, యునైటెడ్‌నేషన్సువారికి ఫిర్యాదుచేసిరి. అప్పుడు యునైటెడ్‌నేషన్సు వా

రాక విచారణజరిపిరి. ఎన్నికలలో పెద్ద అక్రమములేవియు జరుగలేదని ఆ విచారణాధికారులు నిర్ణయించిరి. నాలుగునియోజకవర్గములందుమాత్రము పశుబలప్రయోగముతో అల్లరి జరిగినందువలన అక్కడమాత్రము ఎన్నికలు జరుగలేదు. అయితే ఆ నాలుగు ఎన్నికవర్గములలోనిప్రతినిధిసభ్యులు మిత వాదపక్షమునకు వ్యతిరేకులే ఎన్నుకొనబడుదురని ఎంచిననుకూడా మిత వాదులకు అధికసంఖ్యయున్నందున మితవాదులపక్షనాయకుడైన అహమ్మదౌ అహిద్జోగారి ప్రధానమంత్రిత్వముక్రింద నేర్పడిన ప్రభుత్వము రాజ్యాంగ ధర్మవిరుద్ధముకాదని తేలినది.

కెమెరూన్సులో ఎన్నికలు జరిపినపిమ్మట తమ వశమునగల కెమెరూన్సులో ప్రజాప్రతినిధి ప్రభుత్వమును స్థాపించుటకు ఫ్రెంచివా రిష్టపడియుండినందున ఎన్నికలందు జయముపొందిన మితవాదులప్రభుత్వము క్రింద కెమెరూన్సుదేశమునకు స్వాతంత్ర్యము నొసగవలసినదని యునై టెడ్ నేషన్సువారికి సిఫారసుచేసిరి. యునైటెడ్ నేషన్సువా రక్కడి పరిస్థి తులు విచారించుటకు పంపిన "మిషన్" అనబడు విచారణసంఘమువారును ఫ్రెంచిప్రభుత్వమువారిసిఫారసును బలపరచిరి. దేశము సంపూర్ణస్వాతం త్ర్యముపొందుటకు సిద్ధముగానేయున్నదనియు దేశములోని ప్రజల యభి మతమునుగూర్చి తెలిసికొనవలసినపంగతులెవ్వియు లేవనియు, 1959 జన వరినెలలో కెమెరూన్సుకు స్వాతంత్ర్యమునొసగవలసినదనియు నీ మిషన్ వారు సూచించిరి. భారతదేశప్రభుత్వమువారుకూడా కెమెరూన్సు విషయ ములో నిట్లే యభిప్రాయపడిరి. భారతదేశప్రభుత్వమువారిసలహానసరించి కెమెరూన్సుప్రధానమంత్రియైన అహిద్జోగా రా దేశములో ఇరువదిసంవత్స రములశిక్ష విధింపబడినవారికి సర్వక్షమ (Amnesty) నొసగి విడుదల చేసిరి.

పశుబలప్రయోగము (Violence) కు మరణదండనవిధింపబడిన వారికేసులను న్యాయస్థానమువారు పునర్విమర్శచేయుటకును అంగీకరించిరి. దేశస్వాతంత్ర్యమునొసగుసందర్భమున దేశములో శాంతిపరిస్థితులను నెల కొల్పుటయే ఈ చర్యలయొక్కఉద్దేశము. అయితే ఆఫ్రికాఖండములోని స్వతంత్రరాజ్యములగు ఈజిప్టు మొదలగు అరబ్బీరాజ్యములవారికిని,క్రొత్తగా

సంపూర్ణస్వాతంత్ర్యముపొందిన ఘనరాజ్యమువారికిని కెమెరూన్సులో మిత వాదులపక్షమువారు ప్రభుత్వమువహించుట యిష్టములేదు. వీరు కేవలము ఫ్రెంచిజాతివారికి దాసులై యుందురనియు, దేశప్రజలయొక్క క్షేమలాభము నకు పాటుపడరనియు వీరియూహ. ఎన్నికలకుపూర్వము అణచివేయబడిన యు. పి. సి పక్షమువార్కినాయకుడైన మాన్సర్ ఫెలిక్సుమౌమి (M. Felix Moumie) గారు ఈజిప్టురాజధానినగరమైన కెయిరోలోనే కాపురముండి కెమెరూన్సురాజకీయములనుగూర్చి అక్కడ ప్రచారముచేయుచుండెను. అందువలన అరబ్బీరాజ్యమువారును ఘనరాజ్యమువారును యునైటెడ్ నేషన్సుఅధ్వర్యవమున కెమెరూన్సులో మరల ఎన్నికలుజరిపి, అందులో గెలుపొందిన రాజకీయపక్షమువారిక్రింద నేర్పడు ప్రభుత్వమునకే సంపూర్ణస్వాతంత్ర్యాధికారముల నివ్వవలెనని పట్టుపట్టిరి. దీనివలన కెమెరూన్సు లోని దేశీయులలో మరల సంచలనముకలిగినది. అయితే దేశములోని రాజకీయములందు నిలుకడలేనిపరిస్థితు లేర్పడినచో ఆఫ్రికాదేశములోని ఇతర భాగములందువలెనే ఇక్కడివారుకూడా పశుబలమునుపయోగించి, అశాంతిని అల్లరులను సాగించి తమరాజకీయపక్షమునకు బలముచేకూర్చుకొని అధికారముచేజిక్కించుకొనుటకు ప్రయత్నింపవచ్చుననియు, దీనివలన దేశములో శాంతిభద్రతలు నశించి అధివృద్ధికి ఆటంకముకలుగుననియు రాజ్యతంత్రజ్ఞులభిప్రాయపడుచున్నారు. ఇదియునుగాక, కెమెరూన్సులోని మితవాదపక్షప్రభుత్వమునకు ఫ్రెంచివారు తోడ్పడి, అర్థికాధివృద్ధి కలిగింపగలరని, క్రొత్తగా స్వతంత్రమైన ఘనరాజ్యము అట్లుచేయజాలదనియు, వారిఅభిప్రాయము.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## ద్వితీయ భాగము

### మొదటి ప్రకరణము

#### దక్షిణాఫ్రికా చరిత్ర సమీక్ష

దక్షిణాఫ్రికాలోని ప్రజలందరు నొకేజాతికి చెందినవారుకారు. అక్కడి వారిలో రమారమి ఇరువదియైదులక్షలమంది వివిధ ఐరోపాజాతులసంతతి వారై మంచి విద్య, జీవనసౌఖ్యప్రమాణమును కలిగియున్నవారు. ఎనుబది లక్షలమంది "బాంటూ" అను ఆదిమజాతులకు చెందిన ఆఫ్రికాదేశీయులు. బాంటూప్రజలలోకూడా వందలకొలది జాతిభేదములున్నవి. అందులో జూలూలు, క్షోసాలు, బసూటోలు మొదలైనవారికి వేరువేరుభాషలు ఆచారములు నున్నవి. ఈ బాంటూప్రజలలో సగముమంది యింకను పూర్వకాలము నాటి అనాగరకజాతివ్యవస్థలనే కలిగియున్నారు. మిగిలిన సగముమంది ఐరోపాజాతులవారిక్రింద వ్యవసాయపరిశ్రమలందు పనిచేయుచున్నారు. మఱియొక పదిలక్షలమంది రంగుప్రజలని వ్యవహరింపబడు మిశ్రమజాతివారో లేదా భారతీయులో అయియున్నారు. కడచిన ముప్పదేండ్లమధ్య ఐరోపాజాతులకుచెందనివారిలో కూడా కొంత విద్యాభివృద్ధి కలిగినను, వారందరును ఐరోపావారికన్న చాలా వెనుకబడియున్నారు. ఇతరవిషయములలో కూడా ఆ దేశమున చాలా తారతమ్యము లున్నవి. అక్కడి తెల్లప్రజలలో నూటికరువదిమంది 'ఆఫ్రికాన్' అనబడు మిశ్రమ డచ్చిభాషను మాట్లాడుదురు. మిగిలినవారింగ్లీషుభాషను మాట్లాడుదురు. దేశముయొక్క శీతోష్ణస్థితిలోకూడా చాలా హెచ్చుతగ్గులు కనబడుచున్నవి. అందులో కేవలము ఎడారిప్రదేశము, సమధరాతలప్రదేశము, ఉష్ణప్రదేశములు నున్నవి. సగము

దేశములో తగినంత వర్షపాతము లేదు. దేశములోని జనసంఖ్యలో సగము గనులపైన పరిశ్రమలపైన ఆధారపడినవారు. మిగిలినవారు వ్యవసాయము పైన బ్రతుకువారు.

దక్షిణాఫ్రికాభౌగోళికస్థానమును, నైసర్గికస్థితియు, శీతోష్ణస్థితిలోని తారతమ్యములును ఆ దేశచరిత్రపైన అభివృద్ధిపైన తమ ప్రభావమును కనబరచినవి. ఆరెంజిముఖద్వారమునుండి తూర్పున లారెంకోమార్క్వెస్‌వరకు 25 మొదలు 100 మైళ్ళవెడల్పువరకు వ్యాపించిన కోస్తాతీరభూమి యున్నది. అక్కడనుండి అంచెలుఅంచెలుగా ఎత్తుకుపెరిగిన పీఠభూమిమీద దరిదాపు ఉష్ణమండలమువరకును వ్యాపించుచున్నది. పడమటితీరము ఎడారిప్రాంతమై యున్నది. అక్కడికోస్తాలో వర్షపాతమే లేదని చెప్పవచ్చును. నైఋతితీరమున పడమటి వర్షవాయువులకు దగ్గరలోనున్నందున అమెరికాలోని కాలిఫోర్నియాలోవలెనే ఇక్కడ శీతాకాలమున వర్షము కురియును. మిగిలినదేశ భాగములో వేసవికాలములోనే వర్షములు కురియును. అది తీరమున హెచ్చుగానుండును. పోర్టుఎలిజబెత్తులో సాలుకు 25 అంగుళములు మొదలు డర్బను దగ్గర 40 అంగుళము వరకును వర్షముకురియును. దేశములలోనాలుగింట మూడువంతులు సముద్రముపైన 3500 అడుగులఎత్తుండును. వేసవిలో 12 మొదలు 35 అంగుళములవర్షము కురియును. అందువలన చెట్లుపెరుగని చిట్టడవి యుండును. కాబట్టి పశువులనుమేపుటకేగాని. వ్యవసాయమునకు పనికిరాదు. దేశములో పదింట తొమ్మిదివంతులు హిందూమహాసముద్రము నుండివచ్చు వర్షవాయువులప్రభావమునకు లోబడినది. ఇందు ప్రధాన కేంద్రము కేపుటవును. అందువలన తూర్పునుండి పడమటికి పోయినకొలది, వర్షపాతము తగ్గిపోవుచుండును. ఉత్తరనేటాలు, ఉత్తరట్రాన్స్వాలుదేశములలో ఉష్ణదేశములలోని చెట్లుచేమలు పెరుగును. మిగిలినదేశములో సాలుకు తొంబదిదినములు మంచు కురియును.

19వ శతాబ్దములో వజ్రపుగనులును బంగారుగనులును బయల్పడునటకును ప్రజలు వర్షపాతము బాగుగానుండుప్రదేశములకు వలసపోవుచుండిరి. ఉత్తరభాగమునుండి పదునారవశతాబ్దములో వచ్చిన బాంటూజాతుల వారు తూర్పుదేశములో చక్కని వర్షపాతముగల ప్రాంతమునకే తరలి

వచ్చిరి గాని, ఆరెంజినది వాల్‌నదీసంగమమునకు పడమటిప్రక్కకు పోవ లేదు. వారు తమకన్న బలహీనులగు హట్టెంటాటు పొదలజాతులవారిని వర్షములేని పడమర ఉత్తరభాగములలోనికి తరిమిరి. పదునేడవశతాబ్ది మధ్యలో కేపుటవునుకు వచ్చిన పాశ్చాత్యులు కోస్తాతీరమున పోర్టుఎలిజ బెత్తురేవువరకును తరలిపోయిరి. వర్షములులేని పడమటి తీరప్రాంతములోప లికి పోవలేదు.

దక్షిణాఫ్రికాలో మొదట వలసనెలకొనినవారు క్యాల్విన్(Calvinist) సంప్రదాయమునకుచెందిన క్రైస్తవహాలెండరులు. తరువాత ఫ్రెంచిహ్యూజి నాటుప్రజలు కొందరు వచ్చి వీరినికలిసిరి. అటుపిమ్మట కొందరు జర్మనీ దేశీయులు వచ్చిరి. వీరందరును కర్షకులైరి. కేపుటవునుప్రాంతమున శీత కాలవర్షములు కురియుచుండును. వీరు మొదట నక్కడ గోధుమపంటను వేసి, ద్రాక్షతీగెలను పెంచుట ప్రారంభించిరి. వేసవికాలమునాటివర్షములు వచ్చునప్పటికి వీ రా ప్రాంతమున ఆ కృషిని మాని, పశువులపెంపకముపైకి మనస్సులుమరల్చిరి. వీరు తూర్పువైపునకు ఈశాన్యమునకు చొచ్చుకొని పోవుచు, 1750నాటికి ఉత్తరమునుండి దక్షిణమునకు వచ్చుచున్న బాంటూ జాతులవారిని సంధించిరి. ఈ రెండుజాతులమధ్యను దేశములోద్రిమ్మరు హట్టెంటాటులును పొదలవారును నలిగిపోయిరి. బోయరు లనుహాలెండు దేశపు దచ్చిజాతి తెల్లవారగు వ్యవసాయకులకు ఆఫ్రికాదేశీయులైన బాంటూ జాతుల నల్లవారికి ఆచారవ్యవహారములందును వర్ణమునందును చాలా భేద ముండెను. అయితే వారిరువురకును ఒకపోలికమాత్ర ముండెను. ఈ రెండు జాతులప్రజలును పశుసంపదనే జీవనాధారముగా కలిగియుండిరి. అందువలన నుభయులపశువులకును మేయుటకు విశాలమైన పచ్చికబయళ్ళు కావలసి యుండెను. ఈ సమయమున కప్పటికే బ్రిటీషువారు ఫ్రెంచివీరుడైన నెపో లియన్ చక్రవర్తి నోడించి, కేపుకాలనీకి అధికారులైరి. అంతట బ్రిటీషు వారు 1820లో నీదేశమున వలసనెలకొనిరి. అప్పటినుండి ఇంగ్లీషుప్రజలు క్రమక్రమముగా నీదేములోనికి వచ్చుట ప్రారంభించిరి. ఇట్లు క్రొత్తగా వచ్చిన తెల్లవారిజనసంఖ్యకు మరింత భూమి కావలసివచ్చెను.

1836 నాటికి భూమికొరకు తెల్లజాతులవారును నల్లజాతులవారును కేపుకాలనీతూర్పుసరిహద్దులలో తీవ్రముగా పోరాడుకొనసాగిరి. డచ్చిజాతి బోయరులు ఇంగ్లీషుపరిపాలనపట్ల అసంతృప్తివహించిరి. ఇంగ్లీషువారిలో ఉదారభావములుకలవారు హెచ్చుగానుండినందువలన వారు బాంటూజాతివారి పట్ల కొంత సానుభూతికలవారై బోయరులు బాంటూజాతివారిదగ్గరనుండి లాగికొన్న ప్రదేశములందు తెల్లవారికి హక్కులు స్థిరపరచుట కిష్టపడకుండిరి. అందువలన బోయరులు అసంతృప్తివహించి, ఉత్తరపువైపునకు వలసపోవుట ప్రారంభించిరి. దీనికి "గ్రేట్ట్రెక్" లేక మహాప్రస్థానము అని పేరువచ్చెను. ఈ బోయరులు నల్లవారితో యుద్ధములుచేసియు వారితో సంధియేర్పాటులుచేసికొనియు ఉత్తరపీఠభూమిలోని విశాలదేశమును వశపరచుకొనిరి. అదియే ఆరెంజిఫ్రీస్టేటు, ట్రాన్సువాలురాజ్యములుగా అభివృద్ధి చెందెను. అదిగాక, వారు నేటాలు అని వ్యవహరింపబడినప్రాంతమును గూడా స్వాధీనపరచుకొనిరి.

పశుగ్రాసమున కుపయోగించు విశాలమైన ఈ బంజరుభూములలో అనేకజాతులవారు ఇరువదేండ్లు తీవ్రమైన యుద్ధములుచేసిరి. వారు తమ పశువులను మేపుకొనుటకు ఇంకను విశాలప్రాంతముల నాక్రమింవగోరిరి. ఈయుద్ధములందు తీవ్రముగా పాల్గొనినజాతులవారిలో ఛాకా, డింగాన్ అను ఇటువురు మహావీరులనాయకత్వముక్రింద జూలూజాతివారును, మొసలెకట్సీ అను వీరునిక్రింద మటాబెల్ (Matabele) జాతివారును ముఖ్యులు. బలహీనులైన బసూటోలు మొదలగుజాతులవారు క్రమక్రమముగా కొండలవైపునకు పోయిరి. వారు వదలివెళ్లిన ఖాళీభూములలో బోయరుకృషీవలురు సంతోషముతో ప్రవేశించి, తమ 'నెటాలియా'రిపబ్లికును 1839లో స్థాపించిరి. ఆరెంజిఫ్రీస్టేటు 1854లోను, దక్షిణాఫ్రికారిపబ్లికు అని మొదట వ్యవహరింపబడిన ట్రాన్సువాలురాజ్యము 1852లోను స్థాపించిరి. అయితే, బ్రిటీషు వారు చూచుచు నూరకొనలేదు. ఈ బోయరుసీమల నాక్రమించుటకు ఇంగ్లీషువారు 1846 నుండి 1852 వరకును కొన్నిప్రయత్నములు చేసిరి. కాని కొలదికాలముపాటు ఇంగ్లాండులో ప్రభుత్వమువహించిన కొందరు రాజకీయ నాయకులకు సామ్రాజ్యవిస్తరణముపైన విముఖత్వము కలిగినందున, ఈ

ప్రయత్నమును విరమించిరి. 1870 నాటికి దక్షిణాఫ్రికాలో కేపుటవునుండి డర్బను రేవుపట్టణమువరకును గల దేశము ఇంగ్లీషువారి వశములోను, పర్వతములకు త్తరమునగల పీఠభూమి బోయరులస్వాధీనములోను ఉండెను. వీరి మధ్యను చుట్టును బాంటూజాతులవా రుండిరి. ఇప్పుడు 'లింపోపో' నది కుత్తర దేశమున నుండిన మటాబెలుజాతివారు, ఇతరజాతివారును కేవలము తెల్లవారితో సంబంధములేకుండా స్వతంత్రులై యుండిరి. జూలూజాతివారును, బాపెడిజాతివారు మొదలైన మరికొన్నిజాతులవారు పేరునకు స్వతంత్రులుగానుండిరి గాని, నిజమునకు బ్రిటీషువారిఅధికారమండలముతోనో, బోయరులఅధికారమండలముతోనో సన్నిహితసంబంధమును కలిగియుండిరి. కేపుసరిహద్దుదగ్గర తూర్పుననుండిన క్షోసాజాతివారు పూర్తిగా బ్రిటీషువారిఅధికారముక్రిందకి వచ్చిరి. ఈదేశములోనిజనులందరును చాలామటుకు పశుపాల్యమునే జీవనముగా కలిగియుండిరి. రేవులలోమాత్రము కొందరు కొన్ని ప్రాథమికపరిశ్రమలందు జీవించుచుండిరి. బోయరులు, బ్రిటీషువారు, జూలూలు, క్షోసాలు, సమస్తజనులును భూమిపైననే ఆధారపడి, యేదోవిధముగా జీవనముచేయుచుండిరి. అప్పటికింకను భూగోళరీత్యాను విద్యరీత్యాను చాలా తారతమ్యములు ప్రబలియుండెను. 1834లో బానిసత్వము రద్దుచేయబడిననాటినుండియు చాలామంది తెల్లకర్షకులు బాంటూజాతివారిని తమ పాలేర్లుగాను, గృహకృత్యములు నిర్వహించు సేవకులుగాను నియమించుచుండిరి అయితే మొదట తెల్లవారును నల్లవారును సంధించినప్పుడు ప్రారంభమైన వర్ణభేదఫలితమైన విముఖత్వమును ఒకరితోనొకరికి పరస్పరసంబంధములేకుండా వేరువేరుగా జీవించువిధానమును మార్పుచెందలేదు. ఈజాతుల మధ్య స్నేహసంబంధము లేకుండెను. ఇంగ్లాండు, ఫ్రాన్సు, జర్మనీ, అమెరికా దేశములనుండి వచ్చిన క్రైస్తవమిషనరీమతబోధకులు బాంటూజాతివారిలో ఏకొలదిమందికో మతబోధచేసి, అక్షరజ్ఞానము కలిగింపగలిగిరే గాని, ఆ జాతులలో అధికసంఖ్యాకజనము వారివారి మతధర్మములను ఆచారవ్యవహారములనే యవలంబించియుండిరి. ఇంతేగాక, అప్పటికింకను బాంటూజాతులవారి తెల్లవారిని చూచి వారిలోని మంచిపద్ధతులనుగాని, దుర్వ్యసనములనుగాని, పాశ్చాత్యనాగరికతనుగాని, అనుకరించుట ప్రారంభింపలేదు.

తెల్లవారికి తమజీవితములందు నిర్నిరోధమైన స్వాతంత్ర్యము స్వేచ్ఛయు నుండెను. ఆఫ్రికావారి కట్లుగాక తమతమ జాతికట్టుబాటులకు లోబడి తమ జాతులయొక్క వంశపారంపర్యపునాయకుల నిరంకుశాధికారముక్రింద నుండిరి.

ఇట్టిపరిస్థితులలో దక్షిణాఫ్రికాయొక్క రాజకీయ సాంఘిక ఆర్థిక వ్యవస్థను ప్రజాజీవనమును చరిత్రనుకూడా తారుమారుచేసిన రెండు గొప్ప విశేషములు బయటపడెను. కింబర్లీలో ప్రపంచములోకెల్ల విలువగల వజ్రపు గనులున్నట్లు 1870 లో బయటపడుట యొకవిశేషము. ఇట్లే ట్రాన్సువా లులో విట్‌వాటర్స్‌రాండుదగ్గర అమూల్యములైన బంగారుగనులు 1886 లో బయల్పడుట రెండవవిశేషము.

ప్రపంచములోని అన్నిదేశములందును పారిశ్రామికవిప్లవమొకటి సంభవించి, అంతర్జాతీయవ్యాపారము వర్ధిల్లి అందులో పరస్పరము ఇచ్చి పుచ్చుకోవ్వలోను లావాదేవీలలోను ముఖ్యముగా బంగారమునే ప్రధానమార కపుసాధనముగా చేసికొన్నపరిస్థితులలో బంగారుకు అమితమైనవిలువ యేర్ప డెను. అందువలన 1886 లో ట్రాన్సువాలులో బయల్పడిన బంగారుగనుల ప్రాముఖ్య మింతింతయని చెప్పుటకువీలులేదు. ఈ బంగారుగనులలో స్థిర ముగా నింతబంగారము లభించగలదని ధ్రువపడగానే, అచ్చటికి మనుష్యులు తండోపతండములుగా రాసాగిరి. ఆ బంగారుగనులకు పెట్టుబడిక్రింద అమిత ధనప్రవాహము రాసాగెను. రాజకీయముగా వ్యాపారాభివృద్ధితోపాటు వివిధ రాజ్యపతాకములు ఎగురసాగెను. ఈ బంగారుగనులు బోయరులస్వతంత్ర రాజ్యములలో బయల్పడినవి. తత్క్షణమే బ్రిటీషువారీ దేశమును తమ సామ్రాజ్యములో కలుపుకొనిరి. తరువాత వారు బోయరుల చిన్నప్రజాస్వామి కము,(రిపబ్లికు)నకు నష్టపరిహారముక్రింద 90 వేల నవరసులిచ్చి సమాధాన పరచిరి.

ఈ బంగారుగనులు బయల్పడినపిమ్మట 14 సంవత్సరములవరకును ట్రాన్సువాలుప్రజాస్వామికముయొక్క అధ్యక్షుడైన పాల్ క్రూగరుగారు పశు పాల్యార్థికవ్యవస్థకొరకేర్పడిన రాజ్యవిధానమును పారిశ్రామికవ్యవస్థను నడు పుట కుపయోగించుటకు ప్రయత్నించెను. తన దేశస్వాతంత్ర్యమును కాపాడు

కొనవలెనని క్రూగరుగారు చేసిన ప్రయత్నముయొక్క ఫలితముగా నింగ్లీషు వారు 1899 మొదలు 1902 వరకును బోయరులతో యుద్ధముచేసిరి. ఈ యుద్ధమునందు ట్రాన్సువాలుబోయరులును దానిప్రక్కనేయున్న ఆరెంజి ఫ్రీస్టేటుబోయరులును పరాజయముపొందిరి. ఈ బోయరుయుద్ధమునందు క్రిస్టియన్ డీవెట్ అను నొక బోయరునాయకుని శౌర్యధైర్యపరాక్రమములు జగద్విఖ్యాతిచెందెను. ఈ యుద్ధమునం దోడిపోయిన డచ్చిజాతివారైన బోయరులతో తీవ్రమైన మానసికవ్యధ కలిగి, ఆ యుద్ధముజరిగి అర్ధశతాబ్దమైనప్పటకి, ఇంగ్లీషుజాతివారికిని బోయరులకును మధ్య నేర్పడిన విరోధాగ్ని చల్లారలేదు. ఈ తెల్లజాతులవారిరువురిలోను అసహనము ప్రబలెను. దీనిఫలితముగా దక్షిణాఫ్రికాలోని బోయరులలో బ్రిటీషుసామ్రాజ్యముపట్ల గౌరవము భక్తియు పోయి దక్షిణాఫ్రికాదేశభక్తి. జాతీయతయు ప్రబలినవి.

బంగారుగనులు బయల్పడుటవలన దక్షిణాఫ్రికాలో సాంఘికముగాను ఆర్థికముగాను చాలా గొప్పమార్పులు కలిగెను. దక్షిణాఫ్రికాలో నదులకిరు ప్రక్కలనుగల సీతభూమిని "ర్యాండ్" అని వ్యవహరింతురు. ఇక్కడనె బంగారుగనులు చాలా లోతుగానున్నవి దీనిలోని అమూల్యమైనఖనిజమును త్రవ్వి బయటకుతీయుటకు చాలా పెట్టుబడి కావలసివచ్చెను. ఈ పరిశ్రమను నడుపుటకు శక్తిసామర్థ్యములుగల పరిపాలకవర్గము కావలసియుండెను. ఇందులో చాలాభాగము ఇంగ్లాండునుండి వచ్చెను. దగ్గరలోనే బొగ్గుగను లుండుటవలన హానిని త్రవ్వ బంగారుగనులపరిశ్రమ కుపయోగించుటకు వీలుకలిగెను. అన్నిటికన్నను ముఖ్యముగా మోటుపనులుచేయుటకు చౌక బారుకూలివారు కావలసియుండిరి. మొదట చీనాదేశమునుండి యీ కూలి జనమును దిగుమతిచేయుటకు ప్రయత్నించిరి. కాని ఇది సాధ్యపడలేదు. భూగర్భమునుండి బొగ్గును, బంగారమును త్రవ్వుటకును ఈ గనులనుండి వ్యవసాయక్షేత్రములనుండి దక్షిణాఫ్రికాలోని ఓడరేవులవరకును రవాణాల నిమిత్తము రాకపోకలనిమిత్తము రైళ్ళునునిర్మించుటకును విద్యుచ్ఛక్తిపవరు స్టేషనులు నిర్మించుటకును, ఇండ్లను నిర్మించుటకును క్రొత్తగా నిర్మాణములైన నగరములలోని విలాసప్రదేశములను నిర్మించుటకును దేశములోని తెల్లవారు బాంటూజనములచేతనే కూలిపనిచేయించసాగిరి. ఈ గనులపరి

శ్రమ వర్ధిల్లుచుండగా, ఇరువదవశతాబ్దియారంభమునందు ఉక్కుపరిశ్రమయు ఇతరఅనుగతపరిశ్రమలు (Secondary industries) అభివృద్ధిచెందెను. మరల పాశ్చాత్యులు క్రొత్తపెట్టుబడిపెట్టి వానిని మేనేజిమెంటుచేయుటకు పాశ్చాత్యఉద్యోగులను నియమించి, అందుకొఱకు కావలసిన కూలివారుగా బాంటూజనమునే ఉపయోగింపసాగిరి. ఇందువలన పూర్వము 19వ శతాబ్దిలో తమతోసంబంధములేకుండా వేరుగానుంచిన నల్లవారి నీ తెల్లవారు ఈ నూతన పరిస్థితులలో తమతో సహకరించుటకొరకై చేరదీయవలసినవారైరి. అయితే కేవలము పరిశ్రమలలోపనిచేయుటకే ఈ దేశీయులను తమదగ్గరకు రానిచ్చిరి గాని, సాంఘికప్రజాజీవనమునందు పరస్పరసంబంధము కలిగియుండుటకు అంగీకరింపక వారిని వేరుగా ప్రత్యేకమైన పేటల యందుండునట్లు ఏర్పాటుచేసిరి. వారితో వివాహసంబంధములను కలిగియుండుట కిష్టపడలేదు. ఆటపాటలందు వారిని పాల్గొననీయలేదు. మతాచారములందు విద్యాబోధనమునందుకూడా వారితో సంపర్కము లేకుండా కొన్ని కట్టుబాటులుచేయుటయేగాక, వానిని నిషేధించుచు కొన్ని శాసనములనుచేసిరి. పూర్వపుకట్టుబాటులుగల పశుపాల్యప్రజాజీవనము నందుండిన లక్షలకొలది తెల్లవారును బాంటూజనమును పట్టణములందలి పారిశ్రామిక ప్రజాజీనమునందు స్వేచ్ఛాచారులైనందున ప్రపంచములో ఆధునికనాగరకత యవతరించిన అన్నిదేశములందువలెనే యిక్కడకూడా క్రొత్త సమస్యలు బయలుదేరెను. తక్కినదేశములలో నేదో యొకటి రెండు జాతి మతములు ఉండగా, దక్షిణాఫ్రికాలో ననేకజాతి మతధర్మము లుండుటవలనను, అనేకవర్గములవా రీ పట్టణములలోని నాగరికతలో ప్రవేశించినందువల్లను, ఇక్కడ క్రొత్తక్రొత్తసమస్యలుకూడా తలలెత్తెను. దేశములోని కొన్నిభాగములందు ముఖ్యముగా నింగ్లీషుభాషమాటలాడు నేటాలులోను చెరుకుపంటలకొరకై వలసకూలీలుగా తీసికొనివచ్చిన భారతీయప్రజలు ఈ సమస్యలను మరింత క్లిష్టమగునట్లుచేసిరి.

బోయరుయుద్ధము తరువాత వెనిమిదిసంవత్సరములకు అనగా 1910లో దక్షిణాఫ్రికాలో నాలుగురాజ్యములుకలిసిన ఒక నూతనరాజ్యసమితి యేర్పడెను. సౌత్ఆఫ్రికాయూనియన్ లేక దక్షిణాఫ్రికాసమితి పార్లమెంటు

సభయందువలెనే దక్షిణాఫ్రికా దేశములోకూడా 'ఆఫ్రికాన్సు' అను డచ్చి జన్యమైన తెల్లజాతివారిభాష మాట్లాడువారిజనసంఖ్య యింగ్లీషుభాషమాట్లాడు వారిజనసంఖ్యకంటె హెచ్చుగానున్నది. దేశములో ముగ్గురు ఆఫ్రికాన్సుభాష మాట్లాడువారైనచో, నిద్దరు ఇంగ్లీషుభాష మాట్లాడుదురు. ఈ శతాబ్దములో ఆఫ్రికాన్సుభాష ప్రజలవాడుకభాషనుండి గ్రాంథికభాషగా మార్పుచెంది, ఆధునికవిజ్ఞానమునుకూడా వ్యక్తపరుపగలిగి అభివృద్ధిచెందినది. దీనిఫలితముగా ఆఫ్రికాన్సు లేక బోయరుజాతీయత యొకటి వర్ధిల్లినది. ఆఫ్రికాన్సుభాషయు ఇంగ్లీషుభాషయు ప్రభుత్వభాషలైనవి.

అదివరకు వ్యవసాయజీవనమునందుండిన ఆఫ్రికాన్సుప్రజలు 1910 సంవత్సరమునుండి క్రమక్రమముగా పెద్దనగరములలోనికి వచ్చి స్థిరనివాసములేర్పరచుకొని, పరిశ్రమలందును భారీవ్యాపారమునందును ప్రబలులైరి. ఇంతేగాక దక్షిణాఫ్రికాసమితి యేర్పడినప్పటినుండి ప్రతిప్రధానమంత్రియు ప్రతిపక్షనాయకుడును ఆఫ్రికాన్సుపేరుగలవాడే యగుట తటస్థించినది. మఱియు దక్షిణాఫ్రికాసమితికి బ్రిటీషుసామ్రాజ్యములోని సమానప్రతిపత్తి గల అధినివేశరాజ్యప్రతిపత్తి కలిగి, ఆ సామ్రాజ్యవ్యవహారములందును తరువాత నేర్పడిన బ్రిటీషుస్వతంత్రరాజ్యములసమ్మేళనము ( Commonwealth ) అనబడు కామన్వెల్తువ్యవహారములందును కలిగిన పరిణామమున పాల్గొని బలవంతమైనది. అందులో ముఖ్యముగా బ్రిటీషుసామ్రాజ్యమునందును స్వతంత్రరాజ్యసమ్మేళనవ్యవహారములందును దక్షిణాఫ్రికాప్రధానమంత్రులలో స్మట్సుగారును, హెర్ట్జుగారును చాలా పలుకుబడికలిగి, దానిపరిణామమునందు గొప్పపాత్ర వహించిరి.

గత 150 సంవత్సరములనుండి దక్షిణాఫ్రికాచరిత్ర సంఘర్షణలచరిత్రగను, పోరాటములచరిత్రగను ఉండినది. నల్లవానికి 'నల్లవానికి, నల్లవానికి తెల్లవానికి, తెల్లవానికి తెల్లవానికి మధ్య తగవులు సంఘర్షణలతో నిండియున్నది. తెల్లవారికి నల్లవారికి మధ్య సంఘర్షణము సౌమ్యముగాకూడా లేదు. దక్షిణాఫ్రికాలోని సమస్యలకన్నిటికిని ఈ సంఘర్షణమే మూలకారణముగా నున్నది.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## రెండవ ప్రకరణము

### బాంటూజనులు

'బాంటూ' అనగా 'జనులు' అని అర్థము. ఆఫ్రికాదేశీయులలోని వివిధజాతులవారు తమను'బాంటూ'లని వ్యవహరించుకొందురు. ఈమాటను "బాహ్నూ" అని యుచ్చరింతురు. ఈ పదము ఆఫ్రికాలో దక్షిణమునను తూర్పునను వశించు అన్నిజాతులవారిభాషలోను ఉన్నది. ఇప్పుడు పాశ్చాత్యులీ పేరును దేశీయులభాషలలో కొన్నిలక్షణములుగలమాటలున్నభాషలకు పెట్టినారు. అయితే, ఇప్పటికిని వివిధజాతులనల్లవా రీ పదమును 'జనము' అను అర్థములోనే ఉపయోగించుచున్నారు. బాంటూప్రజలచరిత్రకు ముఖ్యాధారములు ఆయా జాతులలో ప్రచారములోనున్న పూర్వగాథలే. పాశ్చాత్య విద్వాంసులు మానవజాతుల కపాలములు ఎముకలు వారి పూర్వనివాసములందు కనబడిన పరికరములు, వారిఆచారములు, భాషలు పరిశోధించి మానవజాతులక్షణమునుగూర్చిన శాస్త్రము నొకదానిని సిద్ధాంతీకరించియున్నారు. దీనివలనకూడా బాంటూజాతులచరిత్ర కొంత నిర్మాణమైనది.

బాంటూజాతుల ఆదిమనివాసస్థానము ఆఫ్రికాఖండములోని మధ్యభాగమేయని విశ్వసింపబడుచున్నది. ముఖ్యముగా పశ్చిమమున కాంగోనది యొక్క ఉపశాఖలును ఉత్తరమున నైలునదియు, తూర్పునగల గొప్పసరస్సులును మధ్యనున్నపదేశమే బాంటూప్రజలనివాసస్థానముగా నుండెనని పాశ్చాత్య చరిత్రపరిశోధకులు నిర్ణయించినారు*

ఆసమయమున నీ బాంటూజనులు కొంత గొప్పజనసంఖ్య కలిగి, వ్యవసాయమును గనులత్రవ్వకమును ఎరిగి కొంత పారిశ్రామికశక్తిని కలిగి

* Schapera: The Bantu Speaking Tribes of South Africa pp 6-8

వారికికావలసిన పరికరములను నిర్మించుకొను ప్రావీణ్యమును కలిగియుండు టయేగాక, వారికి రాజ్యాంగవ్యవస్థకూడా ఉండెనని తేలినది. అయితే అప్పటికే ఈ బాంటూలు కేవలము నీగ్రోయిడు (Negroid) జాతికి చెందియుండక ఉత్తరాఫ్రికాజాతులయొక్కయు అరబ్బీజాతులయొక్కయు సంపర్కముకలిగి మిశ్రమరక్తప్పుర్శకలిగినవారై యున్నట్లు తెలియుచున్నది.

జూలూలాండు, నేటాలు దేశముల పరిస్థితులనుగూర్చి పరిశోధించిన ఫాదర్ బ్రయాంట్‌గారు బాంటూలు దక్షిణమునకు వచ్చుటలో జంబేజీనదిని దాటినపిమ్మట చీలికలై రనియు, కొందరు నైఋతిప్రాంతమున స్థిరపడిరనియు వారు మఱల లింపోపోనదీతీరము దగ్గర విడిపోయి, వారిలోకొందఱు "పోర్చుగీసు తూర్పుఆఫ్రికా" జూలూలాండు, నేటాలు, ట్రాన్స్వెయిలలోను, కేపు పరగణాలోని తూర్పుభాగములందును నెలకొనిరనియు వ్రాసినాడు.

దక్షిణ బాంటూజాతులలోని ముఖ్యవిభాగము లీక్రిందిరీతిగానున్నవి:

(1) పడమరవిభాగము. ఓకవాంగోనదికి ఉత్తరమువైపునను దక్షిణమువైపునను వ్యాపించిన అంబో హెరెరో, మ్బుకుజాతులవారు చేరియున్నారు.

(2) దక్షిణమునందలి మధ్యభాగము. ఇందులో దక్షిణరొడీశియాలోని షోనజాతులు చేరియున్నవి.

(3) దక్షిణభాగము-తూర్పుభాగము. (ప్రాగ్దక్షిణము). వీరు ముఖ్యముగా దక్షిణాఫ్రికాసమితిలోను, బెచూనాలాండులోను, జంబేజినదీముఖము (Headwaters) దగ్గర నున్నవారు. ఇందులో నీ క్రింది జాతులముఠాలు చేరియున్నవి.

(i) గునిముఠావారు: ఇందులో క్షోసా. టెంబు, ఫింగో,పోండో, జూలూ, స్వాజీతెగలజాతు లున్నవి. వీరందరు డ్రాకెన్సుబర్గుపర్వతములకును సముద్రమునకును మధ్య స్వాజీలాండుదగ్గరనుంచి కేపురాష్ట్రమున సిస్కెయివఱకును వ్యాపించియున్నారు. ఈజాతులవారు మాట్లాడుభాషలలో ఆదిమవాసులైన హాటెంటాటుజాతివారిభాషనుండి గ్రహించిన వింతశబ్దములు (Clicks) ఉన్నవి. (Sharp Nonvocal sucking sound as articulation. )

(ii) షంగన-టొంగాముఠావారు. ఇందులో చాలామంది పోర్చుగీసు తూర్పుఆఫ్రికాలో జీవింతురు. కొన్నితెగలు ఇప్పుడు జూలూలాండులోను ట్రాన్సువాలులోను, ఉత్తరభాగములందును కనబడుచున్నారు. వీరిభాషలో పైనచెప్పిన వింతశబ్దములు లేవు.

(iii) సోతోముఠావారు. ఇందులో బసూటోలాండులోని బసూటో జాతివారు, ట్రాన్సువాలులో ఉత్తరభాగమునను ఈశాన్యభాగమునను గల బాపెదిజాతివారును ట్రాన్సువాలుపడమరసరిహద్దుదగ్గరనున్న బెచూనా లేక ట్స్వానా జాతివా రున్నారు.

(iv) వెండాముఠావారు. వీరు ట్రాన్సువాలులో నీశాన్యభాగమున నున్నారు. వీరికి ప్రత్యేక సంస్కృతి సంప్రదాయము లున్నవి. ఈ జాతు లొండొరులను నాశనముచేసికొనుటకు చేసిన ఘోరయుద్ధములవలనను పాశ్చాత్యసంపర్కమువలనను ఆదిమవాసులలో మార్పులుకలిగినవి.

ఈ ముఠాలకుచెందిన జాతులందు స్థూలమైనపోలిక లున్నవి. జ్ఞాతి సంబంధము, వయోవృద్ధులకుగల అధికారములు, వారిపట్లగలగౌరవము ప్రధానమైన లక్షణములు. కొన్నికొన్నిజాతులలో మాతృవంశసంప్రదాయము లున్నను పితృవంశసంప్రదాయమునే చాలాజాతులవా రవలంబించుచున్నారు. బాంటూజాతులవారందరును బహుభార్యావివాహవిధానమును కలిగియున్నారు. వివాహముజరిగినప్పుడు వధువుతండ్రి కా కుమార్తె కుటుంబమునుండి వెళ్ళి పోయినందువలన కలిగిననష్టమునకు పరిహారముగా కొన్నిపశువులనిచ్చు ఆచారము లొబొలా అనునది వివాహమును శాస్త్రీయముగాచేయుట కవస రమైయున్నది, అన్నిజాతులవారిలోను ఆ జాతినేలువర్గమువారిపై నాధార పడిన రాజకీయవ్యవస్థయొకటి కనబడుచున్నది, అన్నిప్రాంతములందును భూమి, జాతికంతకు సమష్టిహక్కుగలట్టిదిగా పరిగణింపబడుచున్నది. బాంటూప్రజలెల్లరును పితృదేవతల నారాధింతురు.

ఈ జాతులవారిలో కొన్ని స్థూలమైన భేదములున్నవి, చరిత్రరీత్యా కలిగిన ఆచారభేదములు నున్నవి. వారి సెటిల్మెంటుపద్ధతులు, క్రోల్ (Kroal) గ్రామనిర్మాణవ్యవస్థ, వివాహాచారములు సాంఘికవ్యవస్థలయందు కొన్ని తారతమ్యములున్నవి.

స్వనిజాతివారు అన్నదమ్ములు అక్కచెల్లెండ్రు మొదలైన బంధువుల పిల్లలమధ్య వివాహములను నిషేధింతురు. సోతోజాతివారు కులదేవతా చిహ్నములను (totem) కలిగియున్నారు. స్వనిజాతివారి కా పద్ధతి లేదు. స్వనిజాతివారిలో పశువులపట్టింపు లున్నవి. సున్నతుపద్ధతి నంతగా పాటింపరు. సోతోజాతివారు ఒక్కొక్కభార్య కొక్కొక గౌరవస్థానము నొసగుదురు. స్వనిజాతివారివలె తమ క్రోల్ (Kroal) లేక గ్రామములోని ఇండ్లను వేరువేరువర్గములుగా విభజింపరు.

ముఖ్యమైనసుతాలలోని జాతులవారికి స్థానికప్రాంతీయాభిమానము మెండుగా నుండును. తామువసించుప్రాంతములోని నదులపైన పర్వతములపైన, తమతోడిప్రజలపైన తమభాషపైన ఆచారముపైన గాథలపైన అభిమానము అత్యధికముగా నుండును. తమ జాతియొక్కనాయకునిపైన భయభక్తులు మెండుగా నుండును. తమపిత్రార్జితపుభూములను సంరక్షించుటకొరకు ప్రాణములర్పింతురు. వీనికి నిదర్శనములు వారినిత్యసంభాషణలయందు కనబడును వారు తమవంశపరంపరను, తమనాయకుని చాలా గౌరవముతో స్మరింతురు. బాంటూజాతులసుతాలవారందరును తాముమాత్రమే బాంటూలు లేక జనులని అర్థమువచ్చుమాటతో వ్యవహరింతురు. ఉదాహరణమునకు స్వనిభాషలో "అబాంటూ" సోతోభాషలో "బాథో" అనుమాటలకు "జనులు" అనియే అర్థము.

జూలూలు తాముమాత్రమే జనులమనియు తక్కినజాతులవారు మృగతుల్యులనియు చెప్పుదురు. ఖోసాజాతివారు తమజాతివారినే మర్యాదగాచూచి తక్కినజాతులవారిని తక్కువగాచూతురు. సోతోజాతివారు తక్కినజాతులవారిని నీచులనియు మానవమాత్రులుకారనియు పలుకుదురు.

పాశ్చాత్యులుఅమలులోపెట్టిన న్యాయశాస్త్రవిధులప్రకారము పూర్వము వివిధజాతులనాయకులకుండిన అధికారము గౌరవముకూడా పోయినవి. క్రైస్తవమతప్రచారము, పట్టణములలోని నాగరికజీవనము, ప్రజలభావములందు మార్పు కలిగించెను. వారి కొండొరులపైన వెట్టిభావములున్నను వారు ఇప్పుడు తమఅభిప్రాయములను బహిరంగముగా ప్రకటింపరు.

బాంటూ ప్రజలందరును సద్గుణములుగను సత్సంప్రదాయములుగను ఎంచువిషయములు కొన్నియున్నవి.

(1) ధైర్యసాహసములు. ఆపదయందును కష్టసమయమందును ప్రమాదపరిస్థితులందును నిర్భయత్వము

(2) కార్యాలోచనయందు నిశితబుద్ధిని ప్రదర్శించుట. కుశాగ్ర బుద్ధిని చూపినవారికి జాతినాయకుడు తనకార్యాలోచనసభ్యులుగా గైకొనును.

(3) నిశ్చలత్వము; దర్జా. ఇది క్రోల్ అను గ్రామప్రజలనాయకు నందు ప్రదర్శింపబడును.

(4) ఔదార్యము, దాక్షిణ్యము. ఇతరులకష్టసుఖములను కనిపెట్టి కాపాడుట. ముఖ్యముగా దురదృష్టవంతులను రక్షించుట.

(5) పరస్పరసహకారము. బాంటూలు ఒండొరులకు పరస్పరసహాయముచేసికొనుబుద్ధికలవారు.

కష్టపడి పనులను చక్కబెట్టుచు భర్తనొప్పించకుండు స్త్రీని బాంటూలు గౌరవింతురు. వటవటవాగు స్త్రీని చీటికిమాటికి దెబ్బలాడుదానిని, పెంకి దానిని, సోమరియగుస్త్రీని నీచముగా చూతురు.

ఇంకను పూర్వపు జాతికట్టుబాటులకు లోబడియుండు ప్రజ లీ సత్సంప్రదాయముల నవలంబింతురు.

క్రొత్తగా దేశములోనెలకొనిన డచ్చిజాతీయలైన ఆఫ్రికాన్సుప్రజలకును బ్రిటీషువారికిని బాంటూలు సహాయముచేసినట్లు చరిత్రగ్రంథముల వలన తెలియుచున్నది. 1820లో నేటాలురేవులోను దర్బనులోను నెలకొనిన ఇంగ్లీషువారికి ఆఫ్రికాజాతినాయకుడగు ఛాకా అభయమొసగి వారికి భూములనుకూడా ఇచ్చెను. ఈ రేవుచుట్టుపట్ల జీవించు బాంటూలు ఇంగ్లీషు వారిక్రింద పనిచేసిరి. తమ పశువులను, కోళ్ళను, గ్రుడ్లను, పాలు మొదలైనపదార్థములను తెచ్చి తెల్లవారికిచ్చి తమకుకావలసిన సరుకులను వానికి బదులుగా పుచ్చుకొనుచుండిరి. అందువలననే ఇంగ్లీషు రక్కడ జీవింప గలిగిరి. "వూర్ట్రెకర్సు" అనబడు డచ్చిజాతివారు కూడా తమచుట్టునుగల నల్లజాతులవారివలన నిట్టి సహాయమునే పొందిరి. ముఖ్యముగా ఆరెంజి

ఫ్రీస్టేటుప్రాంతమున తాబాన్చుజాతివారినాయకుడైన మొరొకా వారి కెంతో సహాయముచేసెను.

బాంటూలను జయించుటలో పాశ్చాత్యులకు బాంటూలే తోడ్పడిరి. వారు దేశములోవ్యాపించుటకును బలవంతులగుటకును మార్గముచూపిరి. వారికికావలసినపనులు చేసిపెట్టిరి. బాంటూలు తమకాయకష్టమువలన ఆఫ్రికా దేశములోనిగ్రామముల యభివృద్ధికిని పట్టణములయభివృద్ధికిని తోడ్పడిరి.

ఇంగ్లీషుభాషలోను ఆఫ్రికేనరుభాషలోను బాంటూప్రజ లుపయోగించు చక్కని భావగర్భితములగుమాట లెన్నో వచ్చిచేరినవి. కొన్నిపదములు కవిత్వవర్ణనములం దుపయోగించునట్టివిగా నున్నవి. దేశములోని నదీనదముల పేర్లు అడవులపేర్లు, బాంటూభాషనుండి తెల్లవారు గ్రహించియున్నారు. ఇంగ్లీషు ఆఫ్రికేనరుభాషల యభివృద్ధికి ఆఫ్రికాదేశీయులగు నల్లవారిపదజాల మెంతో తోడ్పడినది*

బాంటూజాతులవారందరికిని రాజకీయ సాంఘికవ్యవహారములకు ప్రధానమైనవ్యవస్థ వారి జాతి లేక తెగ. ఇవి స్వతంత్రుడైన ఒక ముఖ్య నాయకుని పరిపాలనక్రింద నుండును. ప్రతిజాతికిని లేక తెగకును ఒకపేరుం డును. వా రొకప్రదేశమున స్థిరనివాస మేర్పరచుకొందురు. తమవ్యవహార ములను చక్కబెట్టుకొందురు. యుద్ధసమయములందు వా రొక కట్టుగా వ్యవహరింతురు. వారిలోకనబడు ఐకమత్యము సంఘీభావము వారినాయకుని పట్లగల భయభక్తులద్వారా ప్రదర్శింపబడును. ఆ తెగలోనివ్యక్తుల శరీర ములుకూడా జాతినాయకునిసొత్తుగానే పరిగణింపబడును. ఆచరణమునందు కొంత సడలినట్లు కనబడినను వా రీ కట్టుబాటునకు లోబడియుందురు. వారి జాతిధర్మమునుబట్టి వ్యక్తులకు స్వంతఆస్తిహక్కులు లేవు. ఒక తెగలోని వ్యక్తులందరియొక్క ఆస్తియు జాతియొక్క ముఖ్యనాయకునిదే. అందువలన నా నాయకునియొక్కఆస్తిని ఆన్యాక్రాంతముచేయుటకు వ్యక్తులకు అధికా రములేదు. అయితే జాతియొక్క సమష్టిక్షేమలాభములకు భంగములేకుండా వ్యక్తులకు స్వంతఆస్తిగాని, పశువులు కాని ఉండవచ్చును. తన తెగ లేక

* బాంటూబాషలను మాటలాడు ఆఫ్రికాదేశపు జాతు లను గ్రంథ మునురచించిన శ్చపెరా (Schapera)

జాతియొక్క క్షేమమునిమిత్తము వ్యక్తులు తనసర్వస్వమును త్యాగము చేయుట, బాంటూ లేక కాఫర్ జాతివారియొక్క పరమధర్మముగా నున్నది. తనయొక్క వ్యక్తిగతహక్కులన్నియు తానునిర్వహింపదలచినబాధ్యతలకు లోబడియుండును. ఇట్టికట్టుబాటు లున్నందువలననే ఈ బాంటూ లేక కాఫర్ జనసంఘము ఇన్నిశతాబ్దములపాటు చెక్కుచెదరక నిలువగలిగినది.

బాంటూలు అందఱు నొకేజాతివారని కొందరుపాశ్చాత్యులు అనుకొనిరి. కాని, నిజమునకు వా రనేకజాతులకు తెగలకు చెందిన ప్రజలుగా నున్నారు. వారిఆచారములు భాషలుకూడా వేరువేరుగా నున్నవి. అటువంటి జాతులు తెగలు వందలకొలది యున్నవి. నల్లజాతులవారు అనేకతెగలుగా విభజింపబడి, ప్రతితెగయు కొన్నికుటుంబములుగా విభజింపబడును. ఈ కుటుంబములలోనిపిల్లలు కుటుంబయజమానుడగు తంత్రికి లోబడి యుందురు. కొన్నికుటుంబముల కొక పెత్తనదారు డుండును. ఈ పెత్తనదారుకు కుటుంబయజమానులు లోబడుదురు. పెత్తనదారులపైన తెగలయొక్క ఉపనాయకుడుండును. ఈ ఉపనాయకులందరు ఆ జాతియొక్క ముఖ్యనాయకునికి లోబడియుందురు.

జాతియొక్కముఖ్యనాయకులు వంశపారంపర్యముగా నా హోదాను పొందుదురు. అయితే వారసత్వపుహక్కులు ఒక్కొక్కజాతిలోను తెగలోను మతాలోను వేరువేరుగా నుండును. ముఖ్యనాయకునియొక్క పితృవంశీయులైనజ్ఞాతులు కొంచెముగానో గొప్పగానో అతనియధికారములందు ప్రత్యేకహక్కులందును భాగస్వాములుగా నుందురు.

జాతియొక్కవ్యవహారములను పరిపాలించుటలో ప్రధాననాయకునికి సలహానిచ్చుటకు రెండువిధములైన కార్యాలోచనసభ లుండును. మొదటి తరగతిసభలో అతని దగ్గరబంధువులుగానుండి రహస్యాలోచనమున పాల్గొని కార్యక్రమములను నిర్ణయింతురు. రెండవసభ కొంచెము పెద్దది. ఇది కొన్ని క్రమపద్ధతులతో నిర్మింపబడినసభ. ఇందులో ముఖ్యనాయకుని రహస్యకార్యాలోచనసభ్యులే గాక, దూరపుబంధువులును ఆ జాతి లేక తెగలోని వివిధభాగముల ఉపనాయకులును పెత్తనదారులును కొంతమంది సమర్థులైనవ్యక్తులు నుందురు.

కేంద్రపరిపాలనముచేయు కార్యాలోచనసభాయుతుడైన ముఖ్యనాయకుడుగాక ప్రతిజాతికిని తెగకును స్థానికప్రభుత్వముకూడా ఉండును. ప్రతి జాతి లేక తెగ, జీవించు దేశభాగము స్థానిక "యునిట్లు" లేక మండలములుగా విభజింపబడి, స్థానికులైన పెత్తనదారులయధికారముక్రింద నుండును. ఈ పెత్తనదారులు ముఖ్యనాయకుని సన్నిహితబంధువులైనందు వల్లగాని శక్తిసామర్థ్యములుగల వ్యక్తులైనందువలనగాని నియమింపబడి వా రాతనికి బాధ్యతవహించి శాంతిని కాపాడుచు క్రమపరిపాలనమును నిర్వహింతురు. అయా పెత్తనదారులకుకూడా వారివారి ముఖ్యబంధువులుగల కార్యాలోచనసభ లుండును.

ఈ జాతివ్యవస్థావిధానము పాశ్చాత్యులరాకవలన వారి రాజ్యతంత్రము వలన దెబ్బతిన్నది. తెల్లవారు మొట్టమొదట చేసినపని జాతులయొక్క ముఖ్యనాయకుల పరువుప్రతిష్ఠలకు అధికారములకు భంగముకలిగించుపద్ధతులను ప్రవేశపెట్టుటయే. తెల్లవారు దేశాక్రమణముచేసి వలసరాజ్యములు స్థాపించినప్రాంతములందు నల్లజాతులనాయకుల కదివరకుండిన యుద్ధప్రకటనాధికారమును తీసివేసిరి. అనగా ఒకనల్లజాతివారిపట్ల ఇంకొకజాతివారు అన్యాయముచేసినచో మొదటిజాతివారినాయకుడు రెండవజాతివారితో యుద్ధముచేయరాదు. దీనివలన ఆ ప్రజలదృష్టిలో నాయకునిగౌరవము నశించినది. ఇంతేగాక అదివరకు ఈ ముఖ్యనాయకులు తమజాతివారు చేయు నేరములకు మరణదండనమును గొప్పశిక్షలనుకూడా విధించుటకు వారికుండినసర్వాధికారములను తీసివేసి, క్రిమినలు మేజస్ట్రేటులను నియమించుటతో నీ ముఖ్యనాయకులకుగల మర్యాదయే పోయినది. వీరిగౌరవమును పలుకుబడిని నాశనముచేయుటకు తెల్లవారవలంబించిన మూడవయుపాయము ఇంకను చిత్రమైనది. ప్రతినాయకునికి అతడు సత్ప్రవర్తనము కలిగియుండునంతకాలము కొంత గౌరవవేతనము నిచ్చుట. దీనివలన ఆ నాయకులు ధనమునకాశపడి తెల్లవారిసదభిప్రాయము సంపాదించుటకు అణగిమణగియుండునట్టి గతిపట్టినది. ఇంతేగాక ఈ నాయకులలో కొందరిని తెల్లఅధికారులు బలవంతముగా పదభ్రష్టులనుగావించి, వారిస్థానమునందు వారిబంధుగులనో పరాయివారినో గద్దెయెక్కించుట నాలుగవయుపాయము.

దీనివలన దేశీయులలో వంశపారంపర్యపుహక్కులపైనగల గౌరవము పూర్తిగా నశించెను. తెల్లవారు ప్రయోగించిన కడపటిఅస్త్రము పూర్వము స్వతంత్రులుగానుండిన ఈ ముఖ్యనాయకులందరిపైనను రాజాధిరాజుగా పాశ్చాత్యులరాష్ట్రగవర్నరుజనరలును నియమించుట. ఈ పాశ్చాత్యగవర్నరు జనరలు నల్లజాతుల ముఖ్యనాయకులపైన అధికారమును చెలాయించుచు వారియధికారములనన్నిటిని నిర్మూలించెను. దీనితో నల్లజాతులవారి పూర్వపు కట్టుబాటులన్నియు క్రమక్రమముగా సడలిపోయి వారిలో మార్పులు కలిగెను.

ఇదిజరిగినపిమ్మట తెల్లవారు నల్లవారి భూస్వామిత్వవిధానమును విచ్ఛిన్నముచేయుటకు పూనుకొనిరి. వివిధ ఆఫ్రికాజాతులువసించు దేశసరిహద్దులతో నిమిత్తములేకుండాను వారిభూమిహక్కులతో నిమిత్తములేకుండాను వివిధజిల్లాలసరిహద్దుల నీ పాశ్చాత్యప్రభువులు పునర్నిర్మాణముచేసిరి. అందువలన వివిధజాతులు తెగలు వేరువేరుజిల్లాలలో ముక్కలు ముక్కలుగా తెగకొట్టబడి వేరువేరుజిల్లా అధికారులకు లోబడవలసినవారైరి.

ఇంతలో క్రైస్తవమతబోధకులైన మిషనరీలు చేసిన ప్రచారము వలన నల్లవారిమనస్సులందు మార్పులు కలుగసాగెను. తరతరములనుండి వారువిశ్వసించు ఆచారధర్మములందు అపనమ్మకముకలిగించి, క్రైస్తవమత ధర్మములు బోధించుటతో మానసికమైనవిప్లవమే కలిగెను. ఇట్టిపరిస్థితులలో దేశీయుల ఆర్థికవ్యవస్థలో కలిగినమార్పులవలన నల్లప్రజలలో నొక సాంఘికవిప్లవము కలిగెను. పూర్వము స్వంతఆస్తిలో హక్కులను జాతి కొరకు త్యాగముచేయు నల్లజాతులవారికి స్వంతఆస్తిని స్వప్రయోజనము క్రింద నుపయోగించు నవీన ఆర్థికవిధానము అలవాటుఅయినది. అందు ముఖ్యముగా తెల్లవారవలంబించిన పద్ధతులవలన నల్లవారు ఊసరక్షేత్రము లలో కాలక్షేపము చేయవలసినవారై కొంతసొమ్మును సంపాదించినగాని జీవనముజరుగనిస్థితి కలిగెను. అందువలన వారు తమ స్వంతసంపాదన మును సమష్టిలాభముకొరకు వినియోగించుట కిష్టపడనిస్థితి కలిగెను. పాశ్చాత్యులనుచూచి నల్లవారుకూడా క్రొత్తరుచులను నూతనజీవితవిధానములను అవలంబించిరి. అందుకొరకు సొమ్ముకావలసి, గ్రామములువిడచి పట్టణములు

చేరి రొక్కముకూలిని సంపాదించి జీవించవలసిన నవీన ఆర్థికవిధానము వారిలో నొక గొప్ప విప్లవమును కలిగించినది.

క్రమక్రమముగా ఏ నల్లజాతివారందరును నయముననుభయము నను మోసవిధముగను పాశ్చాత్యులయధికారమునకు లోబరుపబడి వారికి వశులై దారిద్ర్యమునమునిగి తెల్లవారికి అణగిమణగి యుండవలసిన వారైరి. ఈ నల్లజాతివారిముఖ్యనాయకు డిప్పుడు పాశ్చాత్యరాజాధిరాజైన గవర్నరుజనరలుగారి ప్రతినిధిగా పనిచేయుచు నొక యుద్యోగియై సేవకా వృత్తిలోని హైన్యమునెల్ల అనుభవింపసాగెను. అతనిస్వాతంత్ర్యము, ఔదార్యము, ధైర్యసాహసములు అడుగంటి పాశ్చాత్యులకులోబడి పీచముగా ప్రవర్తింపవలసివచ్చెను. చిన్నచిన్నతగవులను పరిష్కరించుటకు అతనికి మిగిలిన యధికారముకూడా తెల్లవారి న్యాయశాస్త్రవిధులకులోబడి పరిమితము చేయబడినది.

తెల్లఅధికారులప్రతినిధిగా, వారిక్రిందియుద్యోగిగా అతని కిప్పుడున్న కార్యనిర్వాహకాధికారములు పాశ్చాత్యుల న్యాయశాస్త్రవిధులలో స్పష్టముగా నిర్వచింపబడని సందర్భములందు మాత్రము నల్లవారిఆచారమునుబట్టి శాస్త్ర ధర్మమునుబట్టి నిర్వహింపవచ్చును. సాధారణముగా ఆయా నల్లజాతులవారి ఆంతరంగిక కులాచారములయందుమాత్రము ముఖ్యనాయకుడు తనజాతివారి ఆచారధర్మములప్రకారము జరిగింపవీలున్నది. నల్లజాతులవారి ఆచారధర్మములు లిఖితములుకావు. అవి అనుశ్రుతముగా పెద్దలవలన పిన్నలకు సంక్రమించును. పెద్దవారినోటివాక్యముపైన నవి యాధారపడియుండును. కేవలము నల్లవారిమధ్య కలిగిన వివాదములను పరిష్కరించుటకు సివిలు క్రిమినలు అధికారములు గల స్పెషల్‌కోర్టులు స్థాపింపబడినవి.

నల్లజాతులవారిముఖ్యనాయకులు తమజాతివారి సత్ప్రవర్తనమునకు బాధ్యతవహింపవలసియున్నారు. అంతేగాక రాజాధిరాజులైన పాశ్చాత్యప్రభుత్వమువారు జారీచేయు స్థానిక 'ప్రొక్లమేషన్'లనబడు అధికారపూర్వకమైన తాకీదులలో నిర్ణయింపబడినప్రకారము స్థానికపరిపాలనమును నిర్వహింపవలెను. ఇంతేగాక ప్రతిజిల్లాలోను నేటివ్‌కమీషనర్ అనుపేరుతో నియమింప

బడిన ఒక పాశ్చాత్యఅధికారియొక్క సూచనలనన్నిటిని శిరసావహించి వ్యవ హరింపవలసియుండును. వీనికి "డై రెక్షన్సు"అని పేరు. అనగా తాకీదు సూచనలు.

స్థానికవిషయములందు ఈ "డైరెక్షనులు" స్థానికకార్యాలోచనసభ లేక కవున్సిలు వారికిచ్చు సలహాసూచనలుగా నుండును. ఈ కార్యాలోచన కవున్సిలుసభ లీ క్రిందివిధముగా నిర్మింపబడి వ్యవహరించును. నేటివుస్థావర ములు అనగా కేవలము నల్లవారునివసించు ప్రాంతములందు గవర్నరుజనరలు అట్టి కార్యాలోచనసభలను నియమింపవచ్చును. అందులో ఆరుగురుగాని తొమ్మిదిమందిగాని నల్లజాతిసభ్యు లుందురు. అందులో మూడువవంతు మందిని నేటివువ్యవహారములమంత్రిగారు నియమింతురు మిగిలినవారిని నల్లవారు ఎన్నుకొందురు. ఈ కవున్సిలుసభలలో ఆ జిల్లాయొక్క నేటివుకమి షనరు అను పాశ్చాత్యోద్యోగి అధ్యక్షతవహించును. వారు నిర్వహించుకార్య ములు కొన్ని వివరింపబడియున్నవి. అవిగాక గవర్నరుజనరలు వారి నింక నేమైనకార్యములను నిర్వహింపమని ఆజ్ఞాపించవచ్చును. 1920 సంవత్స రపు నేటివు ఎఫెయిర్సు అక్టుప్రకారము ఈ కవున్సిలుసభల కివ్వబడిన అధి కారములయం దేవైనను వివిధ స్థానికకవున్సిళ్ళప్రతినిధులుగల జనరల్ కవు న్సిల్ అనబడు ఒక కేంద్రసంఘము నిర్వహింపవచ్చునని శాసింపబడినది. కేంద్రప్రభుత్వమువారి సర్వాధికారముక్రింద నా కేంద్రసంఘములు ప్రవర్తిం చును. ఆ సంఘమున కధ్యక్షతవహించుటకు కేంద్రమంత్రి యొక తెల్ల యుద్యోగిని నియమించును. ఆ సంఘమువా రతనిని తమసలహాదారుగా చేయవచ్చును.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## మూడవ ప్రకరణము

### మిశ్రమజాతి 'రంగు' జనము

దక్షిణాఫ్రికాలో పదిలక్షలమంది మిశ్రమజాతులసంతతివా రున్నారు. వీరిని తెల్లవారు "రంగుప్రజ"లని వ్యవహరింతురు. ఈ జనులలో కొలది భాగము కేపుమలయజాతివారు. వీరి నీ తరగతిలో చేర్చినను వీరు మతము నందు మహమ్మదీయులు. తూర్పుమలయాద్వీపకల్పమును మాతృదేశముగా గలవారు. వీరు సంస్కృతియందు తక్కిన మిశ్రమజాతివారికి కేవలము భిన్నమైనజనులు.

మిశ్రమజాతి 'రంగువారి'ని గూర్చి ప్రభుత్వనివేదిక లెవ్వియు సరి యైననిర్వచనము నొసగవు. ఈ ప్రజలు మూడుతరగతుల తల్లిదండ్రులకు పుట్టిన మిశ్రమజాతివారు. దక్షిణాఫ్రికాఅగ్రము లేక కేపు దగ్గర ఓడలుదిగిన వివిధ పాశ్చాత్యులును (2) కేపులోనికి దిగుమతిచేసిన తూర్పుదేశముల బానిసలును (3) ఆఫ్రికాదేశములోని ఆదిమవాసులగు హాటెంటాటులు, పొదలవారు, ఆఫ్రికా దేశీయులగు బాంటూ మొదలగు నల్లజాతులవారును ఈ వివిధతరగతులవారు చేసికొనిన అనులోమవిలోమవివాహములవలన నిప్పు డొక మిశ్రమజాతివారు ఒక బలమైన జనసంఘముగా నుండి, దక్షిణాఫ్రికాజనసంఘమునందు అన్నిస్థాయిలలోను వివిధవృత్తులలోను, వ్యాపారములలోను ఉద్యోగములలోను వ్యాపించియున్నారు. ఈ తరగతి జనులు కేపురాష్ట్రములో గుడ్‌హోపుఅగ్రమునను పడమరరాష్ట్రమునను అత్యధికసంఖ్యాకులుగా నున్నారు. వీరిలో నూటికి 60 మంది కేపునకు పడ

మరభాగమునను కొంతజనము తూర్పురాష్ట్రమునను కొలదిమందిమాత్రము ట్రాన్సువాలు ఆరెంజిఫ్రీస్టేటురాజ్యములలోను ఉన్నారు.

మిశ్రమజాతిజనముయొక్క స్వరూప జాతిలక్షణములను బట్టి వీరిని మూడువిభాగములుగా చేయవచ్చును.

(1) స్వరూపమునందును జాతిలక్షణములందులను కేవలము పాశ్చాత్యులనుపోలినవర్గమువారు.

(2) ఆఫ్రికాదేశీయులతో పోలికగలవారు.

(3) పై రెండుతరగతులకును మధ్యరకమువారు.

మొదటివర్గమువారు సాధారణముగా పాశ్చాత్యులవలెనే కనబడుదురు. ఇందులో ఇంగ్లాండు వేల్సు స్కాట్లాండుదేశీయులు,ఫ్రెంచివారు,జర్మనీవారు, డచ్చివారును, భారతీయులును, చీనావారును, ఆదిమవాసులు మొదలైనవారి కలయికవలన జన్మించినవారు. వీరిచర్మము చాలా తెల్లగానుండును. వీరి తలవెండ్రుకలుదీర్ఘముగాను నలుపు,గోధుమరంగుగాను లేతరంగుగాను ఉండును. వీరిముక్కులు తీర్చినట్లుండును. పెదవులు సన్నముగా నుండును. వీరికన్నుల రంగుకూడా లేతగానుండును. ఈ వర్గమునకుచేరి యింకొకతరగతిజనమువారున్నారు. వీరు మొదటితరగతివారికన్న కొంచెము చాయ తక్కువయను మాటయేకాని, తక్కిన జాతిలక్షణములన్నియు మొదటితరగతివారివంటి వానినే కలిగియున్నారు.

ఇప్పుడు దక్షిణాఫ్రికాలో కనబడు ఈ తరగతి మిశ్రమజనము రెండవతరమువారుగానో మూడవతరమువారుగానో ఉండి, ఇటువంటివర్గముల వారితో వివాహములుచేసికొన్నందువలన పాశ్చాత్యజాతివారిపిల్లలవంటి పిల్లలనే కలిగియున్నారు.

రెండవవర్గమునకుచెందిన మిశ్రమజాతిజనము చాలా లేతగోధుమ రంగునుండి ముదురుగోధుమవన్నె కలవారు. వీరినే నిజముగా రంగుప్రజ లని పిలువవచ్చును. వీరితలవెండ్రుకలు నల్లగాను నిడుపుగాను ఉండును. వీరికన్నులు గోధుమవన్నెగానో నల్లగానో ఉండును. వీరినుదురు విశాలమై యుండును. వీరిముక్కులు కొంచెము అణగియుండును, పెదవులు ఆఫ్రికా జాతివారికన్న కొంచెము సన్నముగనే యుండును. ఈవర్గమునందు చాలా

తారతమ్యములుగల తరగతులవారు కనబడుదురు. వీరిశరీరచ్ఛాయలు లేత రంగునుండి నలుపురంగువరకును మారుచుండును తలవెండ్రుకలు కొంద రివి కేవలము నిడుపుగానుండగా, కొందరివి కురుచగాను వంకెవంకెలుగను ఉండును. మరికొందరివి కురుచవలె చుట్టలుచుట్టుకొనియుండి లేతగోధుమ వన్నెనుండి నల్లనిరంగువరకును తేడాలు కనబడును. వీరి స్వరూపలక్షణము లందు చాలా తేడాలు కనబడును. వీరిపెదవులయొక్క ఆకారమునందును ముక్కువంపునందును కన్నులరంగులోనుకూడా తారతమ్యములు కనబడును.

ఈ మిశ్రమజాతివారిలో ఒకేకుటుంబమునందలి స్త్రీపురుషులలో వేరు వేరు జాతిలక్షణములు కనబడును. వేరువేరు కుటుంబములందును వేరువేరు తరగతులందును జిల్లాలయందును గల తేడాలమాట చెప్పనక్కరయేలేదు.

మూడవపద్గమువారు కేవలము ఆఫ్రికాదేశీయులకు సన్నిహితమైన జాతిలక్షణములు పోలికలుగల మిశ్రమజనము. వీరు బాంటూజాతులకు, హాటెంటాటులకు, పొదలవారికి సన్నిహితమైనపోలికలు కలిగియున్నారు. వీరిలో చాలామంది చాలా నల్లగా నుందురు. వీరిని ఆఫ్రికా నేటివు దేశీయు లనియే అనుకొనుటకు వీలుండును. వీరితలవెండ్రుకలు చాలా కురుచగా (గొఱ్ఱెబొచ్చు) ఉన్నవలె నుండును. వీరిముక్కులు చాలా వెడల్పుగాను చప్పిగా నుండును. వీరిపెదవులు లావైన తుట్టపెదవులు. వీరిలోని యొక వ్యక్తి గోధుమరంగుగల ఆఫ్రికాదేశీయులతో సంబంధముకలిగినవాడైనచో శరీరచ్ఛాయ అంత నల్లగా నుండదు. తలవెండ్రుక లంత కురుచగాను ఉన్నవలెను ఉండక, కొంచెము నిడుపుగా నుండును. ఈ తరగతి మిశ్రమ జనమునకును అసలుదేశీయులకును గల తారతమ్యములనుగూర్చి చెప్పుట క్రమక్రమముగా కష్టమగుచున్నది. దీనికికారణము ఈదేశములోని స్త్రీపురు షులసంపర్కమే.

ఇటువంటి స్వరూపభేదములు, జాతిలక్షణభేదములు నిన్నితరగతులు నింతమిశ్రముజనము గల దేశములో వర్ణభేదసిద్ధాంతము ప్రబలి, కొంచెము మంచిలక్షణములుగల భాగ్యశాలురు తమకన్న హీనములగులక్షణములుగల దురదృష్టవంతులను తక్కువగా చూచుటయు, తెల్లవారికిదగ్గరలక్షణములు

గలవారు నల్లవారికిదగ్గరలక్షణములుగలవారిని హీనముగాచూచుటయు ప్రారంభమగుటలో నాశ్చర్యములేదు.

చాలామంది మిశ్రమజాతిరంగువారు భారతీయులకన్న తాము గొప్ప జాతివారమని విర్రవీగుచు భారతీయవైద్యులవలన మందుపుచ్చుకొనుటకు, భారతీయన్యాయవాదులవలన సలహాపొందుటకు నిరాకరించుచుందురు.

ఆఫ్రికాజనసంఘమునందు మిశ్రమజాతివర్గమువారియొక్క స్థానము కూడా చాలా చిత్రమైనదిగా నున్నది. అందలి హెచ్చుతగ్గులు వారుచేయు వ్యాపారమునుబట్టియు, వృత్తులనుబట్టియు మారుచుండును. వారికిలభించిన విద్యనుబట్టి, వారికి వ్యాపారములందును వృత్తులందును మంచిస్థానము లభించుచుండును. చాలామంది మిశ్రమజాతిరంగువారు చాలా హీనమగువేతనములుగల చిన్నచిన్నపనులు చేయుచుందురు. వీరు సామాన్యకూలీలుగాను, గృహసేవకులుగాను, పనిచేయుచుందురు. ఇందులో కొందరు కొంచెము ప్రావీణ్యముకలిగిన పారిశ్రామికులుగాను ఫ్యాక్టరీపనివారుగాను పనిచేయుచుందురు.

మిశ్రమజాతిరంగుప్రజలలో చాలామంది ప్రవీణులైన తాపీపనివారుగాను, మేస్త్రీలుగను వడ్రంగిపనివారుగను, మేస్త్రీలుగను, ముద్రాక్షరశాల పనివారుగాను, ఉక్కులోహకారులుగాను, కంచరిమేస్త్రీలుగాను, మెకానిక్కులుగాను, వెల్డర్లుగాను, డ్యూకో స్ప్రేయర్లుగాను, సోఫాలు వగైరాలకు చర్మపుమెత్తలపని వగైరాలనుచేయు "అప్‌హోల్‌స్టరర్లు"గాను ఫ్రెంచిపాలిషర్లుగాను పనిచేయుచున్నారు. వారికివచ్చువేతనములు కూలి, వారుచేసికొను కంట్రాక్టుయేర్పాటులనుబట్టి యుండును.

మిశ్రమజాతిరంగువారు పైకివచ్చుట కవకాశమునిచ్చుటకును మంచి వేతనములుగల పెద్దనౌకరీలు మొదలైనవి యొసగుటకును తెల్లవారికిష్టము లేదు. తెల్లవారిపిల్లలుచేయనిపనులందే వీరిని నియోగింతురు. శ్వేతపాలకవర్గమువారు, హార్బరుపరిపాలకులును సాధ్యమైనంతవరకు పాశ్చాత్య జాతివారికే యుద్యోగములు నౌకరీలు నిచ్చుచుందురు. మిశ్రమజాతిరంగు వారు పాశ్చాత్యజనులకును దేశీయులకును మధ్య నేదోయొకస్థాయిలో నివసించుచున్నారు. మిశ్రమజాతికి ఇటీవల నొక ప్రత్యేకనియోజకవర్గము నేర్ప

రచి వారిపేళ్ళను ప్రత్యేక ఎన్నికపట్టికలందు నమోదుచేసి వారు తమప్రత్యే కప్రతినిధులను ఎన్నుకొనుటకు వారి కవకాశమునిచ్చిరి. అయితే ఆ ప్రతి నిధి పార్లమెంటుసభలో కూర్చుండుటకు వీలులేదు. ఆ ప్రతినిధులుకొందరు ఐరోపాజాతివారిని పార్లమెంటుకు ఎన్నుకొనవలెను. వారే పార్లమెంటులో ఆసీనులగుదురు. ఈ పార్లమెంటుసభ్యులకు మిశ్రమజాతిప్రతినిధులని పేరు అయితే పార్లమెంటు వ్యవహారములందు వీ్కి చాలా పరిమితము లైన హక్కులుమాత్రమే యున్నవి. యుద్ధవిషయములందు సంధివిషయ ములందు పార్లమెంటులో వీరు వోటుచేయరాదు. పాశ్చాత్యులుకానివారి రాజకీయస్థితి ( Status ) కి హక్కులకు సంబంధించిన విషయములందు వీరు వోటుచేయరాదు. అనగా నల్లవారిస్థితిగతులనుగూర్చిన తీర్మానములందు వీరు వోటుచేయుటకు వీలులేదు. దక్షిణాఫ్రికాలోని వివిధజాతులవారి నొకరి నుండియొకరిని వేరుపరచుటకు ఆయాజాతులు వేరువేరుగా జీవించునట్లును తెల్లజాతి వలనప్రభుత్వమువారు "అపార్తీడ్‌పాలసీ" అనబడు వర్ణభేద జాతి విభజనవిధానము నవలంబించినసందర్భమునం దీ మిశ్రమజాతిరంగుజనము ఇతరజాతులనుండి తెల్లవారినుండి వేరుపరచుప్రణాళికలో చేర్చబడినారు. దక్షిణాఫ్రికాప్రభుత్వపార్లమెంటులోనున్న తెల్లవారి రాజకీయపక్షములందు "నేషనలిస్టుపార్టీ"వారును ఆఫ్రికేనరుపార్టీవారునుకూడా ఈవిషయమున నొకవిధమైన ఒప్పందముచేసికొని, 1950 అక్టోబరునెలలో నొక ప్రకటన గావించియున్నారు.

1951 మే 14వ తేదీన "సెపరేట్ రిప్రజంటేషన్ ఆఫ్ వోటర్సు బిల్లు"యొక్క సవరణచట్ట మనుదానివలన మిశ్రమజాతిరంగుప్రజలను సమష్టినియోజకవర్గ వోటరులజాబితానుండి తొలగించి ప్రత్యేకవోటరుల జాబితాలో చేర్చదలచిరి. ఇది దక్షిణాఫ్రికాఅసెంబ్లీవారివలనను సెనేటుసభ వలనను అంగీకరింపబడి చట్టమైనది.

1952 మార్చి 20 తేదీన దక్షిణాఫ్రికాలోని పరమోన్నతన్యాయస్థాన మువారు వోటరుల ప్రత్యేకనియోజకవర్గములచట్టము రాజ్యాంగసూత్రము నకు విరుద్ధమని నిర్ణయించిరి. అంతట దక్షిణాఫ్రికాలోని తెల్లజాతిరాజకీయ నాయకులకు ఆగ్రహముకలిగినది. ఈచట్టముయొక్క శాస్త్రీయతనుగూర్చి

నిర్ణయించుటకు సుప్రీముకోర్టుకు అధికారములేదని కొందరు వాదింప సాగిరి. 1931 లో బ్రిటీషు అధినివేశరాజ్యముల సంపూర్ణస్వాతంత్ర్యమును అంగీకరించిన వెస్టుమినిస్టర్ స్టాట్యూటు అను ఆంగ్లపార్లమెంటువారి శాసన విధిననుసరించి, దక్షిణాఫ్రికాపార్లమెంటు సర్వస్వాతంత్ర్యములుగల శాస నాధికారసంస్థ గనుక దానిశాసనమునకు తిరుగులేదనిరి. ఈ సుప్రీముకోర్టు వారియధికారములను తగ్గించుచు పార్లమెంటులో శాసనమునొకదానిని చేయించెదమనిరి.

కేపురాష్ట్రములోని మిశ్రమజాతివారినాయకుడును మిశ్రమజాతి ప్రజల జాతీయయూనియన్ అధ్యక్షుడును అగు శ్రీ. జి. జే గోర్డింగుగారు మాటలాడుచు. దక్షిణాఫ్రికాప్రభుత్వమువారు మిశ్రమజాతి జనుల హక్కు లను తీసివేసినచో యునైటెడ్ నేషన్సువారికి ఫిర్యాదుచేయుదుమనిరి. అయితే ఇది ఆ రాజ్యముయొక్క అంతరంగికవిషయమైనందువలన వారు జోక్యము కలిగించుకొనరు.

దక్షిణాఫ్రికాసమితిలో వివిధజాతులు వేరువేరుగా అభివృద్ధిచెందవలె నను వర్ణభేద జాతివిభజనసిద్ధాంతమును సఫలీకృతముచేయవలెనని ప్రధాన మంత్రియైన డాక్టర్ మాలన్‌గారు దేశములో నెక్కడనుకూడా వివిధజాతులు కలిసినివసించు మిశ్రమనివేశనస్థలములుగల పేటలుగాని గ్రామములుగాని యుండరాదనియు. మిశ్రమజాతిరంగుప్రజలు వేరుగాజీవించు నివేశనములు గల పేటలు గ్రామములు ప్రత్యేకముగా నుండవలెననియు ఆ ప్రాంతముల యొక్క వ్యవహారములను జరిగించుటకు మిశ్రమజాతి రంగుఉద్యోగులే నియమింపబడవలెననియు స్పష్టముగా చెప్పిరి.

దక్షిణాఫ్రికా ప్రభుత్వమునందధికారమువహించిన నేషనలిస్టుపార్టీ వారు వేరువేరుజాతులకు పరిశ్రమలందుకూడా సంపర్కములేకుండా వేరు చేయవలెనని తలపెట్టిరి. దీనికికారణము కొన్నికొన్నిప్రాంతములందు పాశ్చాత్యేతరయజమానులక్రింద పాశ్చాత్యస్త్రీలు పనిచేయుచుండుటవలన ఆ జాతివారికి తలవంపుగా తోచుటయే. వివిధజాతుల స్త్రీపురుషులు పరస్పరము వివాహములుచేసికొనరాదనికూడా నేషనలిస్టుప్రభుత్వమువారు 1948 లో నొకబిల్లును ప్రవేశపెట్టి చట్టముగాచేసిరి.

దేశములోని జనుల పుట్టుపూర్వోత్తరములనుగూర్చి నమోదుచేయుటకుగాను ఒక శాసనమును చేయదలచి "పాప్యులేషన్ రిజిస్ట్రేషన్ బిల్" అను నొక చిత్తుచట్టమును 1950 మార్చినెలలో అసెంబ్లీలో ప్రవేశపెట్టిరి. ఈ సందర్భమున మంత్రి డాక్టర్ టి. ఈ. డొంగేస్‌గారు "ఈ రిజిస్టరులో నమోదుచేయబడు ప్రతి వ్యక్తియొక్క జీవితవిశేషములన్నియు నిందు కనబడవలెను" అనిరి. ఇది మిశ్రమజాతి రంగుప్రజలపట్ల వర్ణభేదమునుచూపు చట్టముగానున్నదని జనరల్ స్మట్సుగారు దీనిని ప్రతిఘటించిరి.

నేషనలిస్టుప్రభుత్వమువారు కేపురాష్ట్రములోని రైళ్ళలో వర్ణభేదవిధానమును ప్రవేశపెట్టుటకు నిశ్చయించి, 1948 ఆగస్టునెలలో నొక అడ్మినిస్ట్రేటివుఆర్డరు అను ప్రభుత్వాజ్ఞను క్రొత్తగా జారీచేసిరి. రాకపోకల మంత్రి దానినిగూర్చి చెప్పుచు "తాము చేయదలచిన శాసనమున కిది ప్రారంభచర్యయనియు దీనినిగూర్చి పూర్తియైన ప్రణాళికను తరువాత ప్రవేశపెట్టెదమనియు, సంఘర్షణములేకుండా దేశములోని జాతులను వేరుపరచుటయే తమ యుద్దేశమనియు చెప్పిరి.

మిశ్రమజాతిరంగువారికి అదివరకుగల స్థాయినుండి వారిని తగ్గించి, వర్ణభేదవిధానమునందు వారి నధోగతిలోనికి దింపుచున్నారని ఆ జాతిప్రజలు చాలా అసంతృప్తిచెందిరి. 1948 సెప్టెంబరునెలలో కేపురైల్వేస్టేషన్‌దగ్గర "ఐరోపావారికిమాత్రమే" అని ప్రత్యేకింపబడిన రైలుబండ్లలో మిశ్రమజాతి రంగువారు ప్రవేశించి ఈ క్రొత్తయుత్తరువులకు తమఅసమ్మతిని ప్రదర్శించిరి. దీనిఫలితముగా ఐరోపావారికిమాత్రమే అని వ్రాయబడిన నోటీసు బల్లలు రైళ్ళలోను రైలుస్టేషనులలోను మఱింత ఎక్కువఅయినవి.

వర్ణభేదవిధానము మిశ్రమజాతి రంగుప్రజలపట్లకూడా ప్రయోగించు పద్ధతిని దక్షిణాఫ్రికాప్రభుత్వమువా రొక స్వల్పవిషయముగా పరిగణించుచున్నారు. నిజమునకు వారియుద్దేశము దేశములోని తొంబదిలక్షల నల్లవారికి తెల్లవారితో సంపర్కములేకుండా వేరుపరచి, వారికి రాజకీయ ఆర్థికసౌకర్యములుగాని అభివృద్ధిగాని లేకుండాచేయవలెననియే. అందుకొరకే వా రీ విధానమును అవలంబించిరి. అదివఱకు మిశ్రమజాతి రంగుప్రజలకు దేశములో

కొన్ని ప్రత్యేకసౌకర్యము లొసగబడుచున్నందువలన ముందుగా వానిని కొంతతగ్గించినగాని నల్లవారివిషయములో నీ విధానమును తీవ్రముగా ప్రయోగించుటకు వీలుండదని తలచియే నేషనలిస్టుప్రభుత్వమువా రీపనికి పూనుకొనిరి.

కేపురాష్ట్రములో నివసించక ఇతరప్రాంతములందు జీవించుచున్న మిశ్రమజాతి రంగుప్రజలు కొందరు, ప్రధానమంత్రిగారు రంగుప్రజలపట్ల ప్రయోగించిన వర్ణభేదవిధానమును సమర్థించిరి. దీనికికారణము ఈ క్రొత్త విధానమువలన తామున్నప్రాంతములందు గల కొలదిమంది రంగుజాతివారికి స్వల్పమైన కొన్ని ప్రత్యేకసౌకర్యములు లభింపగలవని వారియాశ. కేపురాష్ట్రములోని అసంఖ్యాకులైన మిశ్రమజాతిరంగువారికి అదివరకుండిన అనేక ప్రత్యేకసౌకర్యములు నశించిపోవుననుసంగతి వీరు గమనింపరైరి. ప్రభుత్వమువారి వర్ణభేదవిధానము నిట్లు కొందరు స్వార్థపరులు సమర్థించుటవలన కేపురాష్ట్రములోని అసంఖ్యాకులైన మిశ్రమజాతిప్రజల ప్రతిఘటనము బలహీనమయ్యెను. ట్రాన్సువాలు పీపుల్సు విజిలెన్సు కౌన్సిలువారి కార్యదర్శియైన ఆల్బర్టస్ పాప్గా రిట్లు వ్రాసిరి. "మిశ్రమజాతిరంగువారు కమ్యూనిస్టులచేతులలోను ప్రభుత్వమునుప్రతిఘటించుచు ఆందోళనముచేయుచున్న భారతీయులచేతులలోను ఇతర ఆఫ్రికాజాతులవారిచేతులలోను కీలుబొమ్మలైనందువలన వారిహక్కు లుపేక్షింపబడుచున్నవి. డాక్టర్ మాలన్ గారు సూచించిన విధానముయొక్క సంగ్రహస్వరూపమునందు మిశ్రమజాతి ప్రజలయొక్క-ముఖ్యముగా ఉత్తరరాష్ట్రములందున్న మిశ్రమజాతివారి పురోభివృద్ధికి గొప్ప అవకాశములు కనబడుచున్నవి" అనిరి.

పాప్గారివంటి మిశ్రమజాతివారు కేపురాష్ట్రములోనున్న మిశ్రమజాతి రంగుప్రజలవలె శాసనసభలకును స్థానికసంస్థలకును ఎన్నికహక్కులలాభమును ఎన్నడును అనుభవించియెఱుగరు. మొదటినుండియు వారు అక్కడి మునిసిపాలిటీవారు నడిపిన మోటారుబస్సులు వగైరాలలో ప్రత్యేకస్థలములందే కూర్చుండి ప్రయాణముచేయుచుండిరి. మొదటినుండియు వారు మాలగూడెములవంటి ప్రత్యేకనివేశములయందే కాపురముండిరి. ప్రథమమునుం

డియు వీరు ఆఫ్రికాదేశీయులగు నల్లవారితో సమానులుగనే పరిగణింప బడుచునచ్చిరి. అందువలన వారు కేపురాష్ట్రములోని మిశ్రమజాతివారు అనుభవించిన సౌకర్యములు, హక్కులు, రుచిచూచియెరుగరు. అట్టి హక్కులు సౌకర్యములు నిప్పుడు తీసివేయుటవలన వారికికలుగుబాధను వీరు గ్రహింపజాలరు ఇటీవల ప్రభుత్వమువారవలంబించిన వర్ణభేద జాతివిభజన విధానమునందు ప్రత్యేకస్థలములలో నివసించుచు వేరుగా వృత్తులుచేసికొను నల్లవారికన్న రంగుప్రజల కేవో కొన్ని స్వల్పసౌకర్యము లిచ్చినట్లు బులి పించినందువలన మిశ్రమజాతివారు కొందరు మోసపోయిరి.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## నాలుగవ ప్రకరణము

### వర్ణభేదము

హాలెండు దేశపు దచ్చివర్తకుల తూర్పుఇండియాకంపెనీవారు దక్షిణాఫ్రికాఅగ్రమును చుట్టి, తూర్పుసముద్రములోని దీవులతో జరుపు ఓడ వ్యాపారమునందు దీర్ఘప్రయాణములలో ఓడలకు ఆహారపదార్థములును ఇతర సరకులును ఎక్కించుకొనుటకై దక్షిణాఫ్రికాఅగ్రమున 'టేబిల్ బే' అను చోట క్రీ. శ. 1652లో నొక రేవుస్థానమును స్థాపించిరి. అక్కడివ్యవహారములను చూచుటకు సైనికపరిపాలకవర్గమును నియమించిరి. తరువాత అక్కడకు వలసవచ్చిన దచ్చిజాతివారు కొందరు స్థిరనివాసము లేర్పరచుకొనిరి. వారు స్వతంత్ర ప్రజాప్రభుత్వవిధానమునకు అలవాటుపడినవారైనందువలన నిక్కడి సైనికప్రభుత్వపద్ధతికి అసంతృప్తిచెందిరి. అక్కడ నెలకొనిన దచ్చివర్తకులకు ఎగుమతి దిగుమతిపనులలోను ఇంటిపనులలోను సహాయముచేయుటకు మనుష్యులు కావలసివచ్చిరి. దక్షిణాఫ్రికాలోని ఆదిమవాసులు హాటెంటాటులు పొదలవారు బలహీనులును సోమరిపోతులునైనందువలనను వారు తెల్లవారినిచూచి బెదిరి పారిపోవుచున్నందునను పోర్చుగీసువారు ఆఫ్రికాఖండములోని పశ్చిమభాగమునందున్న దృఢకాయులగు నీగ్రోజాతివారిని పట్టుకొని బానిసలుగా విక్రయింపసాగిరి. ఈ దచ్చివారా బానిసలను కొని 1658 నుండి వారిచేత వెట్టిచాకిరి చేయించుకొనసాగిరి. దీనిఫలితముగా దక్షిణాఫ్రికాలో నెలకొనిన తెల్లజాతివారు నల్లవారిచేత పనులు చేయించుకొనుచు సుఖముమరగి సోమరులుగా జీవించుట ప్రారంభమయ్యెను. ఇందువలన అక్కడ ఆఫ్రికాలోని వివిధప్రాంతములనుండి

వచ్చిన నల్లవారిజనసంఖ్యయు పెరిగెను. అటుపిమ్మట డచ్చి తూర్పు ఇండియాకంపెనీవారు తూర్పున మలయాద్వీపకల్పమునుండియు భారత దేశమునుండియు తెచ్చిన ఖైదీలచేత పనిచేయించుకొనసాగిరి. దీనిఫలిత ముగానిచ్చట ఆశియాదేశీయుల మిశ్రమజాతియొకటి యేర్పడినది.

1689 లో హాలెండునుండి 300మంది హ్యూజినాటులను క్రైస్తవ పౌరులు ఐరోపాదేశములో మతస్వాతంత్ర్యము లేనందువలన నిక్కడ స్వేచ్ఛగా జీవింపవచ్చునను భావముతో వలసకువచ్చిరి. వీరు కేపుకాలనీఅను దక్షిణాఫ్రికాఅగ్రవలసరాజ్యమున స్థిరనివాసము లేర్పరచుకొనిరి. వీరందరును పదునెనిమిదవశతాబ్దినాటికిదక్షిణాఫ్రికాలోని డచ్చిప్రజలతో భాషలోను మతము లోను రాజకీయములందును కలిసిపోయిరి. ఈ వలసదేశమునందలి తెల్లవారి జనసంఖ్య క్రమక్రమముగా పెరిగెను, తెల్లవారితోపాటు నల్లజాతి బానిసల సంఖ్యకూడా వృద్ధిచెందెను

డచ్చి తూర్పుఇండియాకంపెనీవా రేర్పరచిన గవర్నరుపరిపాలనము ఈ వలసప్రజలకు సుఖకరముగా లేదు. స్వతంత్రభావములుగల ఈ ప్రజల కావంతయైన రాజకీయస్వాతంత్ర్యము లేదు. అందువలన ఈ ప్రజలు ఐరోపాదేశీయులకు భిన్నమైన ఒక క్రొత్త దేశాభిమానముగల డచ్చివ్యవసా యకుల పశుపాలకజాతిలక్షణములతో నభివృద్ధిచెంది. స్వతంత్రాభిలాషులై సముద్రతీరమునుండి దేశములోపలిభాగమునకు వలసకేగుట ప్రారంభించిరి. ఈ క్రొత్తజాతివారిని తరువాత "బోయరు"లనియు"ఆఫ్రికేనరు" లనియు పాశ్చాత్యులు వ్యవహరించిరి.

నెపోలియన్‌చక్రవర్తితో ఇంగ్లీషువారు యుద్ధముచేయుచున్నసంద ర్భమున నింగ్లీషువారు దక్షిణాఫ్రికాఅగ్రమును 1806లో పట్టుకొనిరి. ఇంగ్లీషుసైనికులును నావికులును, వర్తకులు, ప్రజలు, క్రమక్రమముగా వచ్చి నెలకొనిరి. ఈలోపున 'బోయరు' జాతివారికి హాలెండురాజ్యముతో సంబంధములు తెగిపోయెను. వారికి ఇంగ్లీషుప్రభుత్వముపైనను ప్రేమ లేదు. అంతట వీరు ఆ దేశములోని బలహీనులైన హటెంటాటు లను ఆదిమవాసులను క్రమక్రమముగా వెనుకకుతరిమి, వారిభూముల నాక్రమించి తమపశువులను మేపుకొనసాగిరి. ఈ ఆదిమవాసులను కొందరినిపట్టుకొని బానిసలుగాచేసిరి.

ఇంగ్లీషువారిలో బానిసత్వము కూడదనుభావములు కలవారు అక్కడి అధికారులను ప్రోత్సహించి, 1828 సం॥నుండి హంటెంటాటులను పొదల వారిని బానిసత్వమునుండి విముక్తిచేయసాగిరి. ఇది డచ్చివారికి చాలా నష్ట కరముగానుండెను. అంతట 1833నాటికి బానిసత్వము పూర్తిగా నిషేధింప బడి, విముక్తిచేయబడిన హటెంటాటువారును పొదలవారును తెల్లవారిసంప ర్కమువలనే జనించిన మిశ్రమజాతి రంగుప్రజలును దక్షిణాఫ్రికాజన సంఖ్యలో ముఖ్యమైనవర్గములుగా నేర్పడిరి.

బానిసత్వమును రద్దుచేసినప్పుడు ఇంగ్లీషుఅధికారులు విడిపించిన బానిసలను, వారినివదలిన డచ్చివారికి సరియైన నష్టపరిహారమునివ్వలేదని బోయరులకు కష్టముగానుండెను. ఇంతలో ఉత్తరమునుండి దక్షిణమునకు వచ్చుచుండిన "బాంటూ," "కాఫరు"లను ఆఫ్రికాదేశీయులైన నల్లజాతుల వారు బోయరులపశువులను ఎత్తుకొనిపోయి, ఆస్తిని దొంగిలించుచుండగా వారితో యుద్ధముచేయవలసినదని బోయరు లింగ్లీషుఅధికారులను కోరిరి. ఇది చాలా ధనవ్యయకారణమైనందువలన నింగ్లీషుఅధికారులు ఆ యుద్ధము లను జయప్రదముగా కొనసాగింపరైరి. ఈ యింగ్లీషుఅధికారు లిట్లు నల్ల వారిపైన ఉదారులై బానిసలను విడిపించుటయు బాంటూజాతులవారిని అణచి వేయక ఉపేక్షించుటయు, పైగా బాంటూ కాఫరుజాతులవారినుండి బోయ రులు భూములను లాగికొనుచుండగా అందుల కింగ్లీషుఅధికారు లిష్టపడక, ఆటంకపరచుటయు చూచి బోయరులు సహింపలేక ఈ బాధలులేకుండా తా మీ దేశమును విడిచిపెట్టి ఉత్తరప్రాంతమునగల పీఠభూములలోనికి వలస కుపోయి క్రొత్తరాజ్యములను స్థాపించుకొనుటకు నిశ్చయించి తమకుటుం బములను సామానులను తీసికొని పెద్దపెద్ద గూడుబండ్లలో ప్రయాణము చేయుచు తమ కుటుంబములను పశువులను తీసికొని బయలుదేరిపోయిరి. దీనికే "గ్రేట్ట్రెక్" లేక మహాప్రస్థానము అని పేరువచ్చినది. ఇది 1837 లో జరిగెను. దీనిఫలితముగానే ఆరెంజిఫ్రీస్టేటు అను నొక స్వతంత్ర బోయరురాజ్యమును దక్షిణాఫ్రికారిపబ్లికు అనియు తరువాత ట్రాన్సువాలు అనియు వ్యవహరింపబడిన ఇంకొక స్వతంత్ర బోయరురాజ్యమును స్థాపింప బడినవి.

1838 డిశంబరు 16 వ తేదీన బోయరులు జూలూజాతివారిరాజైన డింగాన్ అనునతనిని యుద్ధమునందు ఓడించినదానిఫలితముగా నేటాలు "రిపబ్లికు" అను మఱియొక ప్రజాస్వామ్యము స్థాపింపబడినది. అక్కడ ఆరువేలమంది తెల్లవారు ఇరువదియైదువేలమంది నల్లవారిపైన నీ నూతన రాజ్యాధిపత్యమును వహించిరి. అన్నిటికన్నను ముఖ్యమైనవిషయ మేమనగా, దక్షిణాఫ్రికాచరిత్రలో క్రొత్తగా నా దేశమునకువలసవచ్చి నెలకొనిన తెల్లజాతివారు స్వతంత్రులై ఒక ప్రత్యేకవలసరాజ్యమును స్థాపించుకొనుట వలనను అక్కడ కొంత సంఘబలముకూడా కలిగియున్నందువలనను అక్కడనున్న నల్లజాతులప్రజలపైన నీ తెల్లవారు అధికారమువహించి, వారిని తమస్వప్రయోజనముకొరకు ఉపయోగించుకొని లాభమును పొందుటకు వీలైన కట్టుబాటులుగల రాజ్యనీతిని అవలంబించుటకు గొప్ప అవకాశము కలిగెను. అంతట దక్షిణాఫ్రికాలో నాటినుండి నేటివరకును అమలుజరుగుచున్న వర్ణభేద జాతిభేదవిధానమునకు అంకురారోపణము జరిగినది.

బ్రిటీషువారు 1843 లో నేటాలును తమరాజ్యమున గలుపుకొనునాటికి పైనచెప్పినట్లు తమ పూర్వనివాసస్థానములను విడిచి మహాప్రస్థానమునెరపిన "హూర్ ట్రెకర్సు" అనబడు తెల్లజాతి బోయరుప్రజలు నల్లజాతివారిపట్ల అవలంబించిన రాజ్యతంత్రవిధాన మీ క్రిందివిధముగ నుండెను. (1) తాము స్థాపించిన వలసరాజ్యములో కొంతభాగము కేవలము తెల్లజాతివారి సౌకర్యముకొరకు ప్రత్యేకించి అక్కడ తెల్లజాతివారికి నివాసములేర్పరచుట (2) ఈ ప్రదేశములో తెల్లవారికి వ్యవసాయపుపనులకు కావలసినంతమంది నల్లవారినిమాత్రము అక్కడ నుండనిచ్చుట (3) ఈ నల్లకూలివారిని తెల్లవారికి లాభకరముగా పంచుట (4) మిగిలిన నల్లప్రజలను తెల్లవారితో సంబంధములేకుండా వేరుచేయుట (5) తెల్లవారినివాసప్రదేశములందు జీవించు నల్లవారు తెల్లవారికన్న సాంఘికముగాను రాజకీయముగాను, ఆర్థికముగాను మతవిషయముననుకూడా తక్కువజాతివా రను ప్రధానసూత్రముపైననే వ్యవహరించుట. అయితే ఇట్లు చేయుటలో వారిపట్ల న్యాయముగను దయగాను ప్రవర్తించుట అను విధానముల నవలంబించిరి. ఈవిషయమును

గూర్చియు, సమస్యనుగూర్చియు ఆంగ్లేయగ్రంథకర్తలు వివరముగా వ్రాసి యున్నారు *

ఆకాలమున నొక్కొక బోయరుకర్షకుడు ఆరువేలయకరములభూమి నాక్రమించి తనపశువులను తనయిచ్ఛవచ్చినచోటులలో మేపుకొనుచు, తన క్షేమమునకు చెందిన యీ భూమినంతయు తనస్వంతహక్కుగా అనుభవింప సాగెను. అందువలన మంచిభూమియంతయు తెల్లవారివశమున నుండెను. తెల్లవా రాక్రమింపగా మిగిలిన పనికిమాలిన యూషరక్షేత్రములలో నల్లవారి నుండనిచ్చిరి

బ్రిటీషువారు నేటాలునాక్రమించినపిమ్మట నల్లజాతిజనులు జీవనాధారమునిమిత్తము కొన్నిభూములను ప్రత్యేకించుటకు ఒక "లాండ్‌కమీషన్" అను భూములవిచారణసంఘమును నియమించిరి. వారు నల్లవారికొరకు కేటాయింపుచేసిన "రిజర్వు"లను ప్రత్యేకస్థావరములందలి భూములు కొన్ని తమవని బోయరులు తగవులాడసాగిరి. బ్రిటీషుఅధికారులు వారివాదన కంగీకరింపనప్పుడు బోయరు లాగ్రహించి క్రొత్తప్రాంతములకు పోయి, క్రొత్త భూముల నాక్రమించుచుండిరి.

ఈసందర్భమున కొన్ని అన్యాయములు జరిగెను. నల్లజాతివారికని ప్రత్యేకింపబడిన కొన్ని 'రిజర్వు' ప్రాంతములందలి భూములు తెల్లవారి యాక్రమణనిమిత్తము వారిలాభముకొరకు వినియోగింపబడెను.

నేటాలులో తటస్థించిన పరిస్థితులే ట్రాన్సువాలులోకూడా సంభవించెను.

ఈసమయమున "ప్లాకర్సువెట్ లేక స్క్వాటర్సులా (Squatters Law) అనబడు శాసనమొకటి నేటాలు వోక్సురాడ్ అను శాసనసభవలన చట్టముగాచేయబడెను. దీనిప్రకారము కమాండెంట్ జనరల్ అను సైనికాధికారిక్రింద తప్ప తెల్లవారెవ్వరిక్రిందనుకూడా ఐదుగునల్లవారికుటుంబములకన్న హెచ్చుకుటుంబములవారు వ్యవసాయక్షేత్రములలో పనిచేయరాదని శాసింప

* South Africa-its History, Heros and wars; W. Douglas Mackenzie 1899. Sanfransisco. Bantu Boer and Briton. The Making of South African Native Problem - William Miller, Macmillan, London. 1929.

బడెను. నల్లజాతిపనివారిని తెల్లవ్యవసాయకులకు అందుబాటుచేయుటకై ఈ శాసనముచేయబడినట్లు చెప్పబడినను అధికసంఖ్యగల నల్లజాతిప్రజలకు తగినన్ని రిజర్వుభూములు లేనిపరిస్థితులలో నీ చట్టముచేయుటవలన నల్ల వారికుటుంబములకు జీవనాధారమే లేకుండాచేయబడెను. నియమితసంఖ్యకు పైబడి తెల్లవారిప్రాంతములందు వారు జీవించుటకు వీలులేదు. పరిమిత సంఖ్యకు పైబడినవారిని 'స్క్వాటర్సు' లేక ఆక్రమణదారులని నిర్ణయించి వెడలగొట్టుదురు, శిక్షింతురు. తరువాత నిఋవంటిశాసనములు చాలా చేయ బడెను.

ట్రాన్సువాలురాజ్యమునందుకూడా పైనచెప్పబడినవిధముగానే 1885 లో ఐదునల్లకుటుంబములకన్న ఒక్కొక్క తెల్లవ్యవసాయకుడు సేవకులను నియమింపరాదను చట్టము చేయబడెను. అయితే నల్లజాతిజనమునకు సరిపోవురిజర్వులు లేనందునను తెల్లవారికి పనివారు కావలసినందునను ఈ శాసనవిధిని ఎక్కడను కఠినముగా అమలుజరుపలేకపోయిరి. పరిమిత సంఖ్యకన్న హెచ్చుమందినల్లవారు తెల్లవారిక్షేత్రములందును ప్రదేశములం దును పనిపాటులుచేయుచు జీవించుచునేయుండిరి. దీనివలన క్రొత్తనిర్బంధ ములు క్రొత్తశాసనవిధులు చేయబడుచు వర్ణభేదసమస్య వివిధరూపములు తాల్చుచుండెను. భూమిహక్కులనిర్ణయసమస్య పరిష్కారముగాక మును ముందు చాలా చిక్కులకు కారణమయ్యెను.

ఆరెంజిఫ్రీస్టేటులో తెల్లయజమానులు నియమించిన నల్లజాతి కూలి పనివారికన్న హెచ్చుమంది నల్లజాతిప్రజలు మొదట లేరు. చుట్టుపక్కల రాజ్యములలోనున్న నల్లవారు కొంద రిక్కడికి వచ్చుటవలన వారిసంఖ్య కొంత పెరిగినది. తరువాత నీ రాజ్యమువారు మిశ్రమజాతిరంగుప్రజలెవ్వరు భూకామందులుగా నుండరాదనియు స్వతంత్రపౌరునిహక్కులు కలిగియుండ రాదనియు 1854లో నొకశాసనమును చేసిరి. ఈ ఫ్రీస్టేటువారు నల్లజాతి వారిపట్ల అవలంబించిన రాజనీతి ఈ క్రిందిసంగతులవలన తెలియగలదు. తా మీదేశమును జయించి సంపాదించితిమనుభావముతో అందలి భూముల నన్నిటిని బోయరుజాతి కృషీవలురకే వీరు పంచియిచ్చిరి. బసూటోజాతివారి దేశములో మిగిలినప్రాంతమునందు 1868లో బ్రిటీషువారు నెలకొల్పిన

ప్రొటెక్టరేటులనబడు రక్షితరాజ్యమునందు బ్రిటీషువా రీ విధానము నవలంబింపక బసూటోలాండులో నల్లజాతిప్రజలకు రిజర్వుభూములను కేటాయించిరి. దీనివలన ఆరెంజిఫ్రీస్టేటువారికి నల్లవారియొత్తిడి తగ్గెను. ఈరాజ్యము తెల్లవారికి సంపూర్ణనిర్నిరోధహక్కులుగల రాజ్యమయ్యెను. అటుపిమ్మట కూడా మిశ్రమజాతిరంగువారికిని భారతీయులకును ఎన్నికహక్కులు లేకుండా బోయరు లదివరకు అమలుజరిపిన అన్యాయపువిధానములను బ్రిటీషువారు రద్దుచేయకపోవుటకుగలకారణము ఈ వలసరాజ్యమునందుగల డచ్చి బ్రిటీషు జాతుల తెల్లవారిమనస్సులకు కష్టముకలుగకుండా వారిని బుజ్జగించి తమ ప్రభుత్వమునకు సుముఖులుగాచేయవలెనను ఉద్దేశమే.

బోయరుయుద్ధానంతరముకూడా అక్కడి రంగుజాతివారిస్థితి పూర్వమున్న స్థితిలోనే యుండెను. తరువాత దక్షిణాఫ్రికాసమితిలో అధికారము వహించి వర్ణభేదసిద్ధాంతములను కఠినముగా అమలుజరిపిన "నేషనలిస్టు' పార్టీ రాజకీయనాయకులనేకులు ఆరెంజిఫ్రీస్టేటువారే. 'పూర్ట్రెకర్' అని పేరుపొంది పూర్వము మహాప్రస్థానమొనరించి వలసవచ్చిన బోయరులు నల్లవారిపట్ల అవలంబించిన వర్ణవిభేదవిధానము దక్షిణాఫ్రికారాజకీయములందు వ్రేళ్ళుపారియున్నది. ట్రాన్సువాలు లేక దక్షిణాఫ్రికావారి రిపబ్లికు రాజ్యము వాండ్నది సంధి జరిగిన 1852నుండి ఒక స్వతంత్రవలసరాజ్యమైనది. ఆ సంధి వాల్నదికుత్తరమున వలసనెలకొన్న "ఆఫ్రికేనరు" డచ్చిబోయరుసేనాధిపతికిని బ్రిటీషుప్రభుత్వప్రతినిధికిని మధ్య జరిగినది. ఆ సంధిలోని నాలుగవషరతుప్రకారము వాల్నదికుత్తరప్రాంతములందు వలసనెలకొనిన బోయరువ్యవసాయకుల దేశములో బానిసత్వముండకూడదని అంగీకరింపబడెను. అయితే 1858లో దక్షిణాఫ్రికా రిపబ్లికురాజ్యాంగమును సిద్ధముచేసినప్పుడు దానిని స్థిరపరచినప్పుడును అక్కడి బోయరులు తమ మతవ్యవస్థయందుగాని నల్లవారుగాని, తెల్లవారితోసమానముగా పరిగణించుట కంగీకరించని మిశ్రమజాతిరంగువారుగాని వోక్సురాడ్ శాసనసభలో పాల్గొనుటకును సివిలుసౌకర్యములు పొందుటకును అర్హులుకారనియు శాసించిరి. అయితే అవసరమైనప్పుడు ఈ దేశమునకులోబడిన నల్లజాతి నాయకుల క్రిందనున్నవారందరును సైన్యమున పనిచేయవలెనని శాసించిరి. నల్లజాతి

వారికి సంబంధించిన వ్యవహారములను సైనికబలములు (కోర్టుమార్షల్) సైనికశాసనన్యాయపరిపాలనము అను శీర్షికక్రింద చేర్చి, శాంతి భద్రతలను క్రమపరిపాలనమును 'ఫీల్డుకార్నెటులకు' వప్పగించిరి. కార్నెటు అనగా జెండానుపుచ్చుకొని తిరుగు ఐదవతరగతి చిన్న సైనికోద్యోగి. మిశ్రమ జాతి రంగుప్రజలు తిరుగుబాటుచేసినచో వారిని అణచు అధికారము సేనాధిపతులకు 'కమాండో'లకు అప్పగించిరి. తెల్లవారు తిరుగుబాటుచేసినచో పెద్దయుద్యోగియగు సర్వసేనాని (Commander general) చర్యతీసికొనునట్లు నిర్ణయించిరి. కమాండో అధికారులనగా శాంతిభద్రతలను కాపాడుటకు బాధ్యతవహించు నల్లజాతులనాయకులని భావము.

నేటివులు లేక నల్లవారిని కట్టుబాటులోనుంచి వారు తమకర్తవ్యములను సక్రమముగా నెరవేర్చునట్లుచేయుటయే ఆ ప్రభుత్వమువారు అవలంబించిన రాజ్యనీతి. 'కర్తవ్య' మనగా తెల్లవారుకోరినప్పుడు నల్లవారు వచ్చి పనిపాటులుచేయవలెనని భావము. ఈ బాధ్యతను నిర్వహించుటలో నల్లవారికి ప్రత్యేకింపబడిన భూములలోనిహక్కులు భద్రముగానుండునట్లు చూతురు. నల్లజాతులవారియొక్కయు తెగలయొక్కయు కట్టుబాటులను తొలగించుటతో నల్లప్రజలజాతివ్యవస్థ విచ్ఛిన్నమయ్యెను. అంతట వారిబాధ్యతలు నశించెను. ట్రాన్సువాలులోనినల్లవారి కెట్టిహక్కులును లేవు. వారు స్వేచ్ఛగా తిరుగుటకు వీలులేదు. ఆస్తిని సంపాదించుటకు వీలులేదు. ఏదైన కొంచెము డబ్బు సంపాదించిననల్లవారు, మంచివారని విశ్వాసపాత్రులని తమకు తోచిన తెల్లవారిపేరుతో భూమిని కొనుచుండిరి.

బోయరులకృషిక్షేత్రములందు వసించు నల్లవారి కూలి, పని, కూలి డబ్బులు, విక్రయములు, తెల్లవారి దయాదాక్షిణ్యములపైననే ఆధారపడియుండెను.

1884 వసం॥ము లండన్ కన్వెన్షన్‌యొక్క 19 వ ఆర్టికిల్‌లో నిట్లు వ్రాయబడినది: "దక్షిణాఫ్రికా రిపబ్లికుప్రభుత్వమువారు మూడుపక్షముల అధికారులసమక్షమున ప్రిటోరియా పెట్రోసదగ్గర రాయల్‌కమిషన్‌వారు నల్లవారికి చేసిన వాగ్దానములను చెల్లించుట కంగీకరించుచున్నారు.

(1) కొన్నిషరతులకులోబడి నల్లవారు భూమినిసంపాదింపవచ్చును.

(2) నల్లవారుండునట్టిప్రదేశములు నిర్ణయించుట కొక కమిషన్ నియమింపబడును.

(3) నల్లవారు న్యాయస్థానములందు న్యాయమునుపొందుట కవకాశ మివ్వబడును.

(4) నల్లవారు దేశములో స్వేచ్ఛగాసంచరించుటకు ఏదైన న్యాయ సమ్మతమైనకార్యమునిమిత్తము దేశమువదలిపోవుటకు అనుమతిపత్రము లివ్వబడును. మానవులకు న్యాయముగానుండవలసిన ఈ హక్కులను ట్రాన్సువాలువారు సక్రమముగా అమలుజరిగించలేదు. ట్రాన్సువాలుబోయ రులు ప్రధానముగాచూచుకొనువిషయములు వారికికావలసినంత మంచిభూమి యుండుట; వారికి అవసరమైన కూలిజనమును సమకూర్చుకొనుట;యజమా నులమధ్యను నౌకరులమధ్యను సక్రమమైన సేవ్య సేవకసంబంధములు అమలుజరుపుట. అంతేగాని, నాగరికతయందు వెనుకబడి, అసహాయు లుగానున్న నల్లవారు ఎన్నటికైనను నాగరకతనుపొంది, రాజకీయసమ స్యను కలిగింపగలుగుదురనుతలంపు బోయరు లెంతమాత్రము సహింపరైరి.

నల్ల జాతిప్రజలలో చాలామంది కూలిపనిపన్ను నొకదానిని చెల్లింపవలసి యుండిరి. ఈపన్ను అనిర్ణీతముగానుండి తరుచుగా మారుచుండెను. బలహీను లైన నల్ల జాతులవారు కొందరు తమస్వాతంత్ర్యమును స్వేచ్ఛాజీవనమును వదలుకొని వచ్చి ఈ వలసరాజ్యమువారిసంరక్షణము నపేక్షించి హక్కులు లేని దురవస్థలోపడి స్వల్పప్రతిఫలము ననుభవించుచుండిరి. బోయరులు రాజ్యపరిపాలనాభారమును వహించిరి. అయితే, ఈ ప్రభుత్వము కొలది మంది తెల్లజాతికర్షకులు యజమానులును స్వలాభముకొరకుచేయు నిరంకుశ పరిపాలనముగా నుండెను. దీనిలో బలవంతులకేగాని సామాన్యులకు ఆలన పాలనలు లేవు. అందులో నల్ల వారికి మొదలేలేవు. సరియైన న్యాయపరిపాల నము లేదు. అక్కడి కూలిజనులపరిస్థితులు యజమానుల దయాదాక్షిణ్యము పైన నాధారపడియుండెనేగాని. దాని కొక తీరులేదు. ఫీల్డు కార్నెటు లను చిన్నతరగతి సైనికోద్యోగులు పారిశ్రామికులను హింసించినయుదాహరణము లెన్నియేని కలవు. పైకి ఎన్నిపేరులు చెప్పినను, ఏవిధమైన నిబంధనలు చేసినను, నల్ల వారగు కూలిపనివారిస్థితి కేవల మొక బానిసత్వపద్ధతిగానే

పరిణమించెను. దానికిపీలుగా "అప్రెంటిస్‌షిప్పు" లేక ఉమ్మేదువారీవిధాన మనునదియొకటి అమలుజరిపిరి.

ట్రాన్సువాలులోను నేటాలులోను అమలులోపెట్టబడిన ఉమ్మేదువారీ పద్ధతిలో నల్లజాతివారిపైన బోయరులుచేసిన దండయాత్రలందు పట్టుకొనిన చిన్నవయస్సువారైన స్త్రీలను పిల్లలను ఉమ్మేదువారీనౌకరులుగా నుంచుకొని వారిచేత చాకిరిచేయించు ఈపద్ధతి ట్రాన్సువాలు రాజ్యములో పండ్రెండు సంవత్సరములు అవిచ్ఛిన్నముగా అమలుజరిగెను. దీనికిని బానిసత్వమునకును భేదములేకుండెను. నల్లజాతివారితో యుద్ధములందు వధింపబడిన వారిపిల్లలను పట్టుకొని బోయరు- ఆఫ్రికేనరు యజమానులక్రింద కొన్ని సంవత్సరములపాటు ఉమ్మేదువారీ అనగా వారికి పనిపాటులునేర్పునెపముతో వారిచేత చాకిరిచేయించుకొనుచుండిరి. చాలాసందర్భములలో బోయరులు తుపాకితో అక్రమముగా కాల్చిచంపిన నలవ్వారిపిల్లలు ఇట్టి యుమ్మేదువారీకూలిపనివారుగా చేయబడుచుండిరి. ఈ ఉమ్మేదువారీ ఆ పిల్లలకు 21 లేక 22 సంవత్సరములువచ్చువరకును అమలుజరుగును. సాధారణముగా బాంటూ లేక కాఫరుజాతుల నల్లవారిపిల్లలు తమవయస్సు చెప్పలేరు. అందువలన నీ దురదృష్టవంతుల కెన్నేండ్లువచ్చినను ఉమ్మేదువారీ యంతమగు వయస్సు రాదు. ఈ బానిసత్వబంధమునుండి వారు వెలువడవలసినసమయమును నిర్ణయించి, వారికి సహాయముచేయుధర్మాత్ము లెవ్వరును లేకుండిరి. ఈ బాధల ననుభవించువా రిదియొక క్రొత్తవిధమైన బానిసత్వమని గ్రహించగలిగిరి.

1866 లో బ్రిటీషు హైకమీషనరుగారు ట్రాన్సువాలురాజ్యముయొక్క అధ్యక్షుడైన ప్రిటోరియస్‌గారి కిట్లువ్రాసిరి:"తమ తల్లిదండ్రులు వధింపబడి, అసహాయులుగానున్న నల్లవారిపిల్లలును యువజనులును ఉమ్మేదువారు (అప్రెంటిస్‌లు)గా నమోదుచేయబడుచు 21 సంవత్సరములునిండువరకును అట్టినిర్బంధమున నుంచబడి ఈలోపుగా పశువులవలె విక్రయింపబడుచున్నారని నాకు తెలియవచ్చినది." .

"ఏపేరుతో జరిగినను దీని నెంతదాచినను ఇది ప్రత్యక్షమైన బానిసత్వమేయగుటకు సందేహములేదు. అందువలన మీ ప్రభుత్వమునకును

బ్రిటీషుసామ్రాజ్యప్రభుత్వమునకును జరిగిన సంధిషరతుల కిది విరుద్ధము" అని వ్రాసెను.

బోయరుయుద్ధానంతరము బ్రిటీషువారివలన దక్షిణాఫ్రికాలోనిరాజ్యము లన్నింటిని ఏకముచేసి ఒక సమితిప్రభుత్వ మేర్పాటుచేయబడెను. ఈలోపున దీనినిగూర్చిన రాజీమాటలును రాజ్యాంగచర్చలును జరిగెను. ఆ రాజ్యమున అంతకుముందు 1903-5 మధ్య నల్లజాతివారిపరిస్థితులనుగూర్చి విచారించిన నేటివ్ ఎఫెయిర్సు కమీషన్‌వారి నివేదికలో అధికసంఖ్యాకులుచేసిన సూచనలప్రకారమే దక్షిణాఫ్రికాసమితిలోని నల్లవారివ్యవహారములు నిర్ణయింపబడెను.

ఈ విచారణసంఘమునందు పాల్గొని, ఆ నివేదికను తయారుచేసిన వారిలో చాలామంది ధనవంతులైన భూస్వాములయొక్కయు గనులయజమానులయొక్కయు అభిప్రాయములను మన్నించువారై యుండిరి. దక్షిణాఫ్రికా నభివృద్ధిపరచి తమకు లాభకరముగాచేయుటకై ఆ దేశములోనిగనులను రోడ్లను రైల్వేలను కృషిక్షేత్రములను అభివృద్ధిచేయుట కొక పంచవర్షప్రణాళికవంటి కార్యక్రమమును అమలుజరుపుట కీ ధనవంతులు ప్రయత్నించుచుండిరి. ఈ నివేదికలో బాంటూప్రజలకు ఎన్నికహక్కుల నివ్వదలచినచో ప్రత్యేకనియోజకవర్గములను నిర్మించుట మంచిదనియు, నల్లవారు భూములను స్వేచ్ఛగా విక్రయముపొందుటకు వీలులేకుండా హద్దులేర్పరుపవలెననియు, నల్లవారు తెల్లవారుండుప్రాంతములలో స్వేచ్ఛగా నివసించి స్వతంత్రజీవనమును జరుపుకొనుటను నిషేధించినగాని తెల్లవారి కవసరమైన కూలిపనివారు దొరకరనియు వ్రాసిరి. ఈ నివేదికలోని సూచనల నప్పుడు చర్చించుటవలన తగవులుకలుగునని తలచి ఊరకొనిరి.

తరువాత దక్షిణాఫ్రికాసమితిచట్టమును బ్రిటీషుపార్లమెంటువారు శాసించినప్పుడు అప్పటి కా రాజ్యములోని వివిధభాగములందు నల్లవారి స్థితినిగూర్చి అమలుజరుగుచున్న శాసనవిధులను యథాప్రకారముగా నుండనివ్వవలెననిరి. దానినిబట్టి కేపురాష్ట్రమునందు నల్లవారికి వోటుహక్కులుండెను. ఇతరరాజ్యములం దా హక్కులేదు. క్రొత్తశాసనమునందు కేపులోనున్నహక్కును తీసివేయకుండాను ఆ హక్కును క్రొత్తరాజ్య

భాగములలోకూడా ప్రవేశపెట్టకుండాను శాసనవిధులను చేయవలెననిరి. కేపులోనినల్లవారికి సిద్ధాంతరీత్యా పార్లమెంటుకు ప్రతినిధులుగానెన్నుకొన బడుటకు హక్కుండెనుగాని, క్రొత్తరాజ్యాంగమునందు దీనిని తీసివేయ వలసివచ్చెను. వివిధరాజ్యభాగములలోని తెల్లవారు నేషనల్కన్వెన్షన్లో చేసినచర్చలును తీర్మానములును దీనికికారణము.

కేపురాష్ట్రమునందలి మిశ్రమజాతి రంగువోటరులహక్కులను పార్ల మెంటువారి రెండుసభలలో మూడింట రెండుపంతులమందిసభ్యులు అంగీక రించినగాని మార్చుటకు వీలులేదను నొక నిబంధన రాజ్యాంగచట్టమునందు చేర్చబడెను. కేపులోని నల్లవారివలెనే మిశ్రమజాతిరంగువారును పార్లమెం టుకు అభ్యర్థులుగా నిలుచుటకు వీలులేకుండచేసిరి. ట్రాన్సువాలు ఆరెంజి ఫ్రీస్టేటు రాజ్యములందుండిన వర్ణభేదనిషేధమును నేటాలులోనున్ననిషేధ ములను ఎప్పటివలెనే యుంచిరి. కన్నీరుతుడుచుటకై, మిశ్రమజాతిరంగు వారికోర్కెలను ఆశయములను ఎరిగియుండి అనుభవమున్నతెల్లవారిని నలుగురిని సెనేటులో వారు ప్రత్యామ్నాయప్రతినిధిసభ్యులుగా నెన్నుకొన వలెనని శాసించిరి.

దక్షిణాఫ్రికాసమితిరాజ్యాంగమునందు చేరిన వివిధవలసరాజ్యములలో నదివరకు అమలులోనుండిన జాతిభేదవిధానములను క్రొత్తరాజ్యాంగము మార్చలేదు సరికదా, వివిధరాజ్యములలోని పరస్పరవిరుద్ధములైన పద్ధతులనైనను సమన్వయముచేయలేదు. నల్లవారి హక్కులను నిర్వచించలేదు.

నూతనరాజ్యాంగము 147వ సెక్షనునుబట్టి దక్షిణాఫ్రికాసమితిరాజ్యము లోని అన్నిభాగములందునుగల నల్లజాతులవారి వ్యవహారములను కట్టుబాటు చేయుటకును పరిపాలించుటకును సమితి గవర్నరుజనరలు కధికారమొసగ బడెను. 85వ సెక్షనునుబట్టి మునిసిపలు లేక స్థానికచట్టములు చేయుటకును పరిపాలనముజరిగించుటకును రాష్ట్రీయకవున్సిళ్ళకు అధికారమివ్వబడినది. అయితే కేంద్రప్రభుత్వమునకు పైతనిఖీయధికార ముండునను సూత్రము మాత్రము అంగీకరింపబడినది. కేంద్రప్రభుత్వముయొక్క అధికారములను న్యాయస్థానములుకూడా గమనించి, నల్లవారినిగూర్చిన అన్నిశాసనవిధులను కేంద్రప్రభుత్వము ఆమోదింపవలెనని తీర్మానించిరి. అయితే కేంద్రప్రభు

త్వమువా రీవిషయములనుగూర్చి చేసినసూచనలను రాష్ట్రీయప్రభుత్వములు అమలుజరుపునట్లు చేయు అధికారము లా రాజ్యాంగమునందు కనబడలేదు.

దక్షిణాఫ్రికాసమితిచరిత్రలో మొదట కొంతకాలమువరకును నల్లవారిహక్కులనుగూర్చిన సందర్భములే పొడసూపలేదు. దానిని గూర్చి ఆలోచించినవారును లేరు. ట్రాన్సువాలు, ఆరెంజిఫ్రీస్టేటులకు సంబంధించిన 'మైన్సు అండ్ వర్క్సు' ఆక్టు అనబడు గనులకుసంబంధించిన చట్టము 1911లో శాసింపబడెను. తక్కినరాష్ట్రములందుకన్న ఆ రాష్ట్రములో బాంటూజాతులవారు భూములనుసంపాదించుటకు హెచ్చుఆటంకము లుండెను. ఈ చట్టముప్రకారము తెల్లవారికిని నల్లవారికిని సంబంధము లేకుండాఉండునట్లు వేరువేరుప్రదేశములందు మాత్రమే ఆస్తినిసంపాదింపవచ్చునను శాసనవిధిని చేసిరి. ఇది తెల్లవారు నల్లవారు కాపురముండుటను గూర్చిన చట్టముకాదు. ఆస్తిహక్కులనుగూర్చినది మాత్రమే. ఈచట్టము 'రిజర్వు' భూములకు హద్దులనిర్ణయమునుచేసి, ఆ ప్రాంతములందలి భూములను తెల్లవారికి విక్రయింపరాదని శాసించినది. ఇది బాగుగనేయున్నదని నల్లవారు తలచిరి. అయితే ఆశాసనములోనే ఇంకొకనిబంధనవలన నల్లవారా రిజర్వులకువెలుపల నెట్టిభూములను కొనరాదని విధింపబడుటవలన వారికి బాధకలిగినది. అప్పటికే నల్లవారిరిజర్వులలో జనసంఖ్య మితిమీరి స్థలము లేకుండెను. ఈ చట్టము తాత్కాలికముగా యథాతథస్థితిని కాపాడుటకే చేయబడినదనియు, దీనినిగూర్చి పార్లమెంటువారు తరువాత నొక శాశ్వత శాసనమును చేయుదురనియు చెప్పి వారి నూరడించిరి. నల్లవారికి భూములు చాలవని యంగీకరించి వారికికేటాయించతగిన రిజర్వులనుగూర్చి విచారించుట కొక ఉపసంఘమును నియమించుటకు నిర్ణయింపబడెను. ఈ చట్టము నల్లవారికి క్రొత్తభూములను సంపాదించు అవకాశములేకుండా చేసెను. ఈశాసనము 1936 వరకు నెట్టిమార్పులేకుండా అట్లే అమలులో నుండెను. అప్పుడు "నేటివుట్రస్టు అండ్ లాండ్ఆక్టు" అను నొక క్రొత్త చట్టమును హెర్టుజాగ్‌గారు తాముతలపెట్టిన వర్ణభేద జాతిభేదవిధానమును అమలుజరుపుటకై తీసికొనదలచిన చర్యలభాగముగా 1936 లో ప్రవేశ

పెట్టిరి. ప్రాతచట్టమునాటినుండి ఇప్పటివరకు గతించిన ఇరువదిమూడుసంవత్సరములకాలమున తెల్లవా రొకయకరముభూమినైనను నల్లవారికి వదలలేదు.

నదులకిరుప్రక్కలనుగల దక్షిణాఫ్రికా రాండ్ అనబడు పీఠభూముల లోని గనులందు పనిచేయు తెల్లవారు, తెల్లవారుకానట్టి మిశ్రమజాతిరంగు వారినిగాని నల్లవారినిగాని హెచ్చు ప్రావీణ్యముచూపనక్కరలేని పనులందు నియోగింపకుండా తెల్లయజమానులవలన 1918లో వాగ్దానముచేయించుకొనిరి. నల్లజాతులవారైన పనివారు సమ్మెచేసినచో తెల్లజాతిపనివారివలె గాక యజమానులును నౌకరులును బద్ధులుగానుండు సామాన్య క్రిమినలు నేరముల క్రింద శిక్షలకుగురియగుచుండిరి. దీనివలన తెల్లపనివారితో నల్ల పనివారు పోటీచేయజాలనిపరిస్థితులేర్పడినవి

1920లో జనరల్ జాన్. సి. స్మట్సుగారు నల్లవారివ్యవహారములను గూర్చిన పరిపాలనావిధానములను క్రమబద్ధముచేయదలచి అనుభవజ్ఞులైన ముగ్గురు పాశ్చాత్యులుగల ఒక 'నేటివ్‌కమిషన్' అను నొక సంఘమును ప్రధానమంత్రికి సలహానిచ్చుటకు నియమించెను. అయితే, కేపురాష్ట్రము లోవలె బాంటూలయొక్కయు మేజస్ట్రేటులయొక్కయు స్థానికకవున్సిళ్ళు దేశములో వ్యాపించియున్న తెల్లవారికృషిక్షేత్రములం దక్కడక్కడనున్న నల్లవారి కీ సంఘ మెట్టి లాభమును కలిగింపలేకపోయెను. నిజమున కీ నల్లవారిస్థితిగతులే దేశములోని జాతిభేదసమస్యలో ముఖ్యముగా గమనింప తగినసమస్యగా నుండెను.

దక్షిణాఫ్రికారాండులోని ఐరోపాపనివారు 1922లో తిరుగుబాటు చేసిరి. 1911 సం. నాటి మైన్సు అండ్ వర్క్సు ఆక్టు చెల్లదని న్యాయస్థానమువారు నిర్ణయించినను జాతిభేదమును సుస్థిరముగాచేయవలెనని ఈ తెల్లవారు ప్రయత్నించిరి. చాలా రక్తపాతమైనతరువాత వర్ణభేదవిధానముకొంత సడలింపబడి. గనులవ్యవస్థ పునర్నిర్మాణముచేయబడెను. అక్కడి లేబరు పార్టీవారు రాజకీయ నేషనలిస్టుపార్టీతో పొత్తుకుదుర్చుకొని తెల్లవారికి లాభముకలిగించుటకై కృషిచేసిరి. 1921 జనాభాలెక్కలవలన నల్లవారిజన సంఖ్య త్వరితముగా పెరుగుచున్నట్లు భ్రమపడి వారు కొలదికాలములోనే

తెల్లవారిని ముంచివేయుదురని భయపడిరి. అంతట జాతిభేదము వర్ణభేదము మఱింత తీవ్రరూపముదాల్చెను.

జీవనాధారములేక ద్రిమ్మరు నల్లజాతివారు పట్టణములలోనికి వచ్చుచున్నందున దీనినిగూర్చి కొంత కట్టుబాటుచేయుటకని స్మట్సుప్రభుత్వము వారు 1923లో 'అర్బన్‌ఏరియాస్ బిల్'అను చిత్తుచట్టమును ప్రవేశపెట్టిరి. చాలామంది నల్లవారియభిప్రాయములను సేకరించి నల్లవారిని ప్రత్యేకమైన పేటలలో నివసించునట్లు కట్టుబాటుచేయుటకు మునిసిపాలిటీలకు అధికారమివ్వబడెను. అట్టిపేటలలో నల్లవారు ఆస్తిని కవులుకు పుచ్చుకొనవచ్చును గాని, విక్రయమునుమాత్రము పొందరాదు. అందువలన నల్లవారికి ఆస్తిలో హక్కులుండుట తెల్లవా రంగీకరింపరనుసంగతి స్పష్టమయ్యెను. పట్టణములు తెల్లవారికే హక్కుగలట్టివిగా నుండవలెను. బాంటూజాతివారు తాత్కాలికముగామాత్రము కాపురముండవచ్చును. ఇది వారియుద్దేశము.

1924 లో నేషనలిస్టులేబరుప్రభుత్వ మధికారములోనికివచ్చెను. అదివరకు నల్లవారిపైనచేయబడిన నిషేధములు చెల్లవని న్యాయస్థానము నిర్ణయించినందువలన నిరుపయోగమైననిషేధములనెల్ల పునరుజ్జీవింపచేయుచునొక వర్ణభేదశాసనమును చేయుటయే ఈ క్రొత్తప్రభుత్వమువారు మొదట చేసిన ఘనకార్యము. ప్రధానమంత్రి జనరల్ జె. బి. ఎం. హెర్టుజాగుగారు వివిధజాతులను వేరువేరుగా విభజించు ఒకవిధానమును 1925 లోనే నిర్మించియుండిరి. దక్షిణాఫ్రికాలో జాతిభేదసమస్యను వర్ణభేదసమస్యను 1912 లో జనరల్ బోథాగారి ప్రభుత్వమునందు నేటివువ్యవహారములమంత్రిగా నుండగానే ఈ హెర్టుజాగుగారు జాగ్రత్తగా అవగాహనచేసికొనియుండిరి. ఆయన తన జాతిభేదసిద్ధాంతములను 1925 లో అమలులోపెట్టదలచెను. రాజకీయ ఆర్థిక సాంఘికవ్యవహారములయందు తెల్లవారికిని నల్లవారికిని మధ్యగల జాతిభేదమునుబట్టి వర్ణభేదమునుబట్టి తారతమ్యములనేర్పరచుటయేగాక నల్లవారికిని మిశ్రమజాతిరంగుప్రజలకును మధ్యకూడా వర్ణభేదమునుబట్టి తారతమ్యములనేర్పరచి నల్లవారికన్న రంగువారిని కొంచెము హెచ్చుస్థాయికి తీసికొనిరావలెననియే హెర్టుజాగుగారియుద్దేశము. పూర్వము దక్షిణాఫ్రికాలోని రాజకీయనాయకులు జాతిసాంకర్యముగలప్రజలను నల్లవారిని కలిపి ఒకే

స్థాయిలోనుంచి, అసలుపాశ్చాత్యులను ఉన్నతస్థాయిలోనుంచు అమెరికావారి పద్ధతిని అవలంబించియుండిరి. అయితే హెర్టుజాగుగారు ఆఫ్రికాదేశీయులైన నల్లజాతులవారిని ఒకస్థాయిలోను, అందుకుభిన్నమైనజాతివారి నింకొకస్థాయి లోను పరిగణింపదలచెను. అనగా మిశ్రమజాతివారైన రంగుప్రజలను ఐరోపావారికి సన్నిహితులుగాచేయదలచెను. పార్లమెంటుఎన్నికహక్కులందు, భూములనుకొనుటలోను, రాకపోకలు వగైరాలకు అనుమతిపత్రములిచ్చుట ఇంకను ఇతరవిషయములందును విచక్షణ చూపదలచెను. భూములనుకొను విషయములోను వేరువేరుగా జీవింపవలెననువిషయములోను ఇదివరకే జనరల్ బోథాగారిప్రభుత్వమువారు నేటివ్స్ లాండ్ అక్టును 1913 లోను, స్మట్సుప్రభుత్వమువారు నేటివ్స్ అర్బన్ఏరియాస్ అక్టును 1923 లోను చేసియుండిరి. ఇప్పుడు హెర్టుజాగ్‌గారికి మిగిలినకార్యము ఎన్నికహక్కుల విషయము.

తెల్లవారికిని రంగు ప్రజలకును కలిపి కొన్ని ప్రత్యేకసంస్థలును, నల్లవారికి కొన్ని ప్రత్యేకసంస్థలును స్థాపింపవలెనని హెర్టుజాగుగారు కృతనిశ్చయులైరి. విద్యావంతులైన నల్లజాతివారుకూడా తమజాతినాయకులుగానుండి తమ ప్రత్యేకసంస్థలందు పనిచేయవలసినదేగాని, ఐరోపావారికిని రంగు ప్రజలకును సంబంధించిన వివిధసంస్థలందు ప్రవేశింపదలపరాదని హెర్టుజాగుగారిసిద్ధాంతమును సమర్థించువారు చెప్పిరి.

రాష్ట్రీయ కేంద్రపరిపాలనములందు నల్లవారికిని తెల్లవారికిని సంబంధములేకుండా వేరువేరువ్యవస్థల నేర్పాటుచేసి, నల్లవారికి పార్లమెంటులో కొలదిపాటిప్రాతినిధ్య మిచ్చుటకు హెర్టుజాగుగారు నిశ్చయించిరి. నల్లవారికిని తెల్లవారికిని సంబంధించిన సమష్టిసమస్యలనుగూర్చి చర్చించుటకును తీర్మానించుటకును ఈ స్వల్పప్రాతినిధ్యహక్కు లుపయోగించును. నల్లవారిప్రతినిధులు వారిసంస్థలకును పార్లమెంటుకునుమధ్య అనుసంధాయకోద్యోగులుగా నుపయోగింతురు. ఇందులోని ముఖ్యవిషయము నల్లవారికి ఎన్నికహక్కులను ప్రాతినిధ్యమును ఒసగుటకాదు. నల్లవారివలన అప్రత్యక్షముగా నెన్నుకొను నొకశాసనసభను నల్లవారిప్రాంతముల కేర్పరుపవలెనని హెర్టుజాగుగారి యుద్దేశము.

నల్లవారికి పార్లమెంటుతోగల సంబంధమువిషయమున హెర్టుజాగుగారు కేపురాష్ట్రములో నిదివరకు నల్లవారికుండిన ఎన్నికహక్కులకు బదులుగా పార్లమెంటులో నల్లవారిప్రత్యామ్నాయప్రతినిధులుగా నేడుగురు ఐరోపా జాతివారిని అప్రత్యక్షము (Indirect) గా నెన్నుకొనుపద్ధతిని ప్రవేశపెట్ట దలచిరి. దీనివలన కేపురాష్ట్రములోని నల్లవారికి ప్రత్యేకముగాగాక దేశము లోనివారందరికిని కొంత యుపయోగముగానుండును. ఈ నల్లవారిప్రతి నిధులు వారిహక్కులనుగూర్చిన విషయములందుగాని విశ్వాసరాహిత్యతీర్మా నములందుగాని వోటుచేయుటకు వీలులేదు. తెల్లవారితోపాటు నల్లవారికి వేరుగా రాజకీయసంస్థలను నిర్మించుటయనునది ఈ యుభయజాతులవారికిని వేరువేరురాజ్యభాగము లేర్పాటుచేసిననే లాభకరముగా పరిణమించునుగాని లేనిచో లాభించదు.

హెర్టుజాగుగారు చేయదలచిన భూస్వామ్యసంస్కరణవిధానములో పూర్వము 1913లోనే ఈ రెండుజాతులవారిని వేరుపరచుసూత్రము కొంత వరకు అంగీకరింపబడియున్నందువలన నల్లప్రజలకు ప్రత్యేక"రిజర్వు" ప్రదేశములను కేటాయించుట దుస్తరకార్యమైనది. అందువలన హెర్టు జాగుగారు 1913సం.పు చట్టముయొక్క అమలులోనుండి కొన్నిప్రాంతముల నిప్పుడు మినహాయింపదలచిరి. దీనివలన అక్కడ నల్లవారికిని తెల్లవారికిని బహిరంగముగా పోటీచేయుటకు వీలుకలుగును. ఈప్రాంతములందలి ప్రభుత్వభూములు నల్లవారికిమాత్రమే కేటాయింపబడును.

హెర్టుజాగుగారి భూములబిల్లులోని రెండవభాగము తెల్లవారిప్రాంత ములందు తిష్టవేసికొనియున్న నల్లవారిని తమకొరకు ప్రత్యేకింపబడినప్రాంత ములకు పోవునట్లుచేయుటకొరకు ఉద్దేశింపబడినది. ఈబిల్లు నల్లవారిహక్కు లకు భంగముకలిగించుచున్నదని స్మట్సుగారు దాని నాక్షేపించి ప్రతిఘటిం చిరి. అయితే దేశములోని గ్రామములందున్న తెల్లవారి బిల్లు నల్లవారిపట్ల చాలా పక్షపాతముచూపునట్టి ఉదారనిబంధనలను కలిగియున్నదని విమర్శిం చిరి. నల్లవారి'రిజర్వు'లలో వ్యవసాయాభివృద్ధిచేసి అవి వారికి చాలనప్పుడే ఐరోపావారిప్రాంతములలోనికి వారు రావచ్చునను నిబంధనచేయుదని కోరిరి.

దక్షిణాఫ్రికాప్రధానమంత్రియైన హెర్టుజాగుగారు తనయుద్దేశానుసారముగా 1926 లో నాలుగుబిల్లులను పార్లమెంటులో ప్రవేశపెట్టిరి. (The Representation of Nati ves Bill; The Native Council Bill, The Coloured Persons Rights Bill and The Native Land Bill) ఈబిల్లులను పార్లమెంటు సెలెక్టుకమిటీకి పంపిరి. 1926 లో హెర్టుజాగుప్రభుత్వమువారు చేసిన (Colour Bar Bill) వర్ణభేదచట్టమువలన నల్లవా రికముందు శక్తిసామర్థ్యములుగలవని యోగ్యతాపత్రికలు పొందవలసిన పనులందును, ప్రావీణ్యముచూపవలసిన పరిశ్రమలందును ప్రవేశించుటకు పీలులేదని ప్రకటించినట్లైయైనది. ఈవిధానమునందు దక్షిణాఫ్రికాలోని తెల్లవారును వారి "ట్రేడ్ యూనియన్"లును హెర్టుజాగుగారిని పూర్తిగా సమర్థించిరి.

1929 లో హెర్టుజాగుగారు సెనేటులోను అసెంబ్లీలోను "నేటివ్ ఫ్రాంచైజ్ బిల్"అను నల్లవారి ఎన్నికహక్కులబిల్లును మిశ్రమజాతిరంగు ప్రజల హక్కులబిల్లును ప్రవేశపెట్టిరి.

ఎన్నికహక్కులబిల్లుకు దక్షిణాఫ్రికా రాజ్యాంగచట్టముప్రకారము మూడింట రెండువంతులమందిసభ్యులు ఆమోదించవలసియుండెను. అయితే ఆసంఖ్య లభింపలేదు. అందువలన నా బిల్లును దానితోడిబిల్లును ఉపసంహరించుకొనిరి.

1930లో హెర్టుజాగుగారు తన నాలుగు బిల్లులను రెండుసభలవారి ప్రతినిధులుగల సెలెక్టుకమిటీకి పంపగా, వారు 1935 వరకును ఇదమిత్థమని తేల్చక తమనివేదికను సమర్పింపరైరి. తరువాత తమనివేదికలో మిశ్రమజాతి రంగుప్రజలనుగూర్చి ప్రశంసింపక తక్కిన మూడుబిల్లులను రెండుగా మార్చిరి. అయితే యీ బిల్లులలో మార్పులేవియు చేయలేదు.

1936లో హెర్టుజాగుగారు లాండ్ ఆక్టు అనబడు భూములచట్టమునందు నల్లవారి రిజర్వులను నిర్ధారణముచేసి హద్దులనేర్పరచుటకును నల్లవారికి అప్పుడు నిర్ణయించురిజర్వులు స్థిరముగానుంచి ఇకముందు ఎట్టి భూములు వారికి కేటాయించకుండాఉండుటకును నిశ్చయించెను. పార్లమెంటువారు నల్లవారికి 7250000 మోర్గెన్ (Morgens)లభూమిని కేటాయించి, దానిని 10000000 మోర్గెనులకు హెచ్చించుటకు అధికారమిచ్చిరి.

కేపురాష్ట్రమునందలి నల్లవారి కదివరకు తమ రిజర్వులవెలుపల భూములనుకొనుట కుండిన హక్కులను రద్దుపరచెను. వారిస్థితిని తక్కిన రాష్ట్రములలోని నల్లవారిస్థితికి దింపెను. నల్లవారివోటుహక్కులనుగూర్చిన రిప్రజెంటేషన్‌బిల్లు అనునదికూడా శాసనమైనది. దీనివలన అదివరకు కేపు రాష్ట్రములో విద్యావంతులైన నల్లవారికుండిన వోటుహక్కు రద్దుచేయబడెను. దీనికిబదులుగా 'నేటివ్ రిప్రజెంటేటివ్ కవున్సిల్సు' అనబడు ప్రతినిధిసంస్థలు స్థాపించి, వీనిలో నల్లవారిఅవసరములను కష్టములను చర్చించుటకు అవకాశమొసగబడెను. ఇంతేగాక, సమితిపార్లమెంటులో తమఅభిప్రాయములు ప్రకటించుటకు నలుగురు సెనెటరుల నెన్నుకొనుహక్కు ఒసగబడెను.

నేటివుల ప్రతినిధికవున్సిళ్ళలో వారివ్యవహారములనుగూర్చి చర్చించుటకుగల అవకాశము బాగున్నదని స్మట్సుగారికి తోచి దానికి ఆయన తన సమ్మతిని ప్రకటించెను.

1937లో హెర్టుజాగుగారు "నేటివ్స్ అర్బన్‌ఏరియాస్ అమెండ్‌మెంటుబిల్లు' అను నొక చట్టమును పార్లమెంటుద్వారా శాసించెను. దానివలన నల్లవారిని రిజర్వులకు పంపివేయవచ్చును. పట్టణములలో పనిచేయుటకు రాదలచినవారికి అనుమతిపత్రములివ్వకుండా నిరాకరింపవచ్చును. దీనివలన 1923 నాటి'అర్బన్‌ఏరియాస్' చట్టమును, బాంటూజాతులవారు పట్టణములలోనికిరాకుండా నిషేధించు 1930నాటి చట్టమును గట్టిగా అమలుపరుపవీలుకలిగెను.

దక్షిణాఫ్రికాసమితి స్థాపింపబడినప్పటినుండియు నల్లవారివిషయములో తెల్లవారవలంబించిన రాజ్యనీతినిగూర్చి వాగ్వాదములకు తావిచ్చిన విషయము నల్లవారిస్థావరములందు సారాయమును సరఫరాచేయువిధానమే. "కాఫర్‌బీర్" అను సారాయమును బాంటూజాతులవారు పుష్టినిచ్చుపానీయముగా పరిగణించుచుండిరి. 1937 సం॥ నేటివ్ అర్బన్‌ఏరియాస్ అమెండ్‌మెంట్ చట్టముక్రింద కాఫర్‌బీరు సరఫరాలో మూడువిధానములు శాస్త్రసమ్మతములుగా నిర్ణయింపబడెను. అందులోమొదటిది, బాంటూజాతులవారు తమగృహములందు సారాయమును తయారుచేసికొనుపద్ధతి. రెండవది,

నల్లవారిలో కొందరువ్యక్తులకు సారా విక్రయించుటకు లైసెన్సులిచ్చుపద్ధతి. మూడవది, మునిసిపాలిటీవారు సారాయము తయారుచేసి విక్రయించు సర్వ మక్తాయిజారాపద్ధతి. ఇట్టి మూడుపద్ధతులును శాస్త్రీయములైనను ఆచట్టము క్రింద స్థానికఅధికారులు రెండుమూడుపద్ధతులను అమలుజరుపనప్పుడే మొదటిపద్ధతిప్రకారము అనగా బాంటూవారు తమయిండ్లలో సారా తయారు చేసికొనవచ్చునని విధింపబడినది. మునిసిపాలిటీవా రా పై రెండుపద్ధతు లలో దేనినైనను అమలుజరిపినచో బాంటూలు సారా తయారుచేయుట నేర మగును. ఇదిగాక ఆచట్టముక్రింద బాంటూజాతివారు మునిసిపాలిటీవారితో కలిసి సారా తయారుచేయుటకు లైసెన్సుపుచ్చుకొని అమ్మవచ్చును. తమ తండ్రి తాతలకాలమునాటినుండియు సారాతయారుచేసికొనుట ఒక గృహ పరిశ్రమగానున్నదనియు, మునిసిపాలిటీవారు దీనినితయారుచేయించి అమ్మ విధానము చాలా అక్రమమైనదనియు బాంటూజాతిప్రజలు మొదటినుండియు గోలపెట్టుచుండిరి.

అయినను వారిమాట వినిపించుకొనక తెల్లప్రభుత్వమువారు ఈ నిబం ధనలను చేసిరి. 1940 నాటికి నలుబదియొక్క మునిసిపాలిటీ లీ వ్యాపార మును చేయుచుండెను. వ్యక్తులకు లైసెన్సులిచ్చుపద్ధతిని అమలుజరుపనే లేదు. బాంటూలతోకలిసి సారావ్యాపారముచేయుపద్ధతినికూడా అమలుజరిగిం పలేదు. అందువలన బాంటూలు సారాతయారుచేసికొనుటకు వీలులేక హెచ్చు వెలపెట్టి మునిసిపాలిటీవారిసారా కొని, త్రాగవలసివచ్చుచుండెను. దీనివలన బాంటూప్రజలలో చాలా అసంతృప్తి వ్యాపించి, దీనినిగూర్చి వారు ఆందోళ నముచేయుచుండిరి,

ఈ సారావిక్రయసమస్య కేవలము అబ్కారీసమస్యగాగాక మునిసి పాలిటీలకు గొప్ప ఆదాయమునిచ్చు ఆర్థికసమస్యగా పరిణమించినది. కాఫర్ బీరుసారాయము బాంటూజాతివారికి సాంఘికమతాచారములలోఅంతర్భాగమైన ఒక పానీయమనియు, అది వారికి పుష్టినిచ్చు ఆహారపదార్థమనియు దానిని తయారుచేయుటకు అగు ఖరీదుకన్న ఎన్నోరెట్లు ఖరీదుకు వారు దానిని కొనవలసివచ్చుచున్నదనియు గోలపెట్టిరి.

1923 సం॥ అర్బన్ఏరియాస్‌అక్టు 'నేటివు రివిన్యూ అకౌంటు' అను నొకలెక్కను మునిసిపాలిటీవారు తయారుచేయవలెననియు అందులో మునిసిపాలిటీవారు నడుపు నల్లవారిస్థావరములు, పేటలు, హాస్టలులు, కాఫరుబీరు సరఫరావివరములు నమోదుచేయవలెనని విధించుచుండెను. అయితే మునిసిపాలిటీలు సారాగృహములలాభమునంతయు వారిసామాన్యవ్యయములక్రిందనే వినియోగించుకొనుచుండిరి. ఇది న్యాయముకాదనియు, ఆ వ్యయములన్నియు వారికివచ్చు సాధారణఆదాయమునుండియే ఖర్చుపెట్టవలెననియు, కాఫర్‌బీర్ లాభము బాంటూప్రజలకుసంబంధించిన పైనచెప్పినపద్దులక్రిందనే వినియోగింపవలెననియు ఒక విచారణసంఘమువారు హెచ్చరించియుండిరి.

1944 లో కాఫర్‌బీర్ అకౌంటు అనబడు నొకలెక్కను ప్రత్యేక నేటివ్‌రివిన్యూఅకౌంటులో భాగముగా నేర్పరచి, మునిసిపాలిటీలు సారాసరఫరాలెక్కలు తయారుచేయవలెననియు దీనివలనవచ్చు ఆదాయమును సారా తయారు, అమ్మకము, సరఫరాలకైన ఖర్చులుపోను మిగిలినదానిని నల్లవారి వ్యవహారములమంత్రి నిర్ణయించిన బాంటూజాతివారి సాంఘికాభివృద్ధికార్యములకును వారివినోదములనిమిత్తమును వారిక్షేమముకొరకును ఖర్చుపెట్టవలెననియు నిర్ణయించిరి.

# ఆఫ్రికా జాత్యుద్యమము

## ఐదవ ప్రకరణము

### 5 అపార్తీడ్ విధానము

దక్షిణాఫ్రికాసమితికి నేషనలిస్టుపార్టీనాయకుడైన డాక్టర్ మాలన్ గారు 1948లో ప్రధానమంత్రియైరి. ఈ పక్షమువారు వర్ణభేదవిధానమును రాజకీయార్థికసాంఘికవిషయములందు సంపూర్ణముగా అమలుజరుపుటకు కృతనిశ్చయులైనారు. వీ రవలంబించిన వర్ణభేద జాతివిభజనవిధానమునకు "అపార్తీడ్‌పాలసీ" అని పేరువచ్చినది. నల్లవారిబాధలనుగూర్చి దక్షిణాఫ్రికాలోని నల్లవారిపక్షమున పండ్రెండుగురు ఆఫ్రికాదేశీయులు మాలన్‌గారికి కేపు నేషనలిస్టుపార్టీకాంగ్రెస్‌లో 1948 అక్టోబరు 26వ తేదీన ఒక వినతి పత్రమును సమర్పించగా, ఆయన తన ప్రత్యుత్తరమునం దిట్లు చెప్పిరి:

"బాంటూలను పరాయిప్రజలుగాగాని తెల్లవారికి నష్టముకలిగించు విరోధివర్గమువారుగాగాని పరిగణించము. వారిని మా బిడ్డలుగానెంచి వారి క్షేమమునకు మేము బాధ్యతవహించవలసినవారని తలంచెదము. వారీ దేశమునకుచెందిన సంపదగా నెంచుదుము. మాప్రభుత్వము మీహక్కులను తీసివేయతలపలేదు. మిమ్ములను పీడింపదలపలేదు. మీ కిదివరకున్నదాని కన్న మంచిహక్కుల నొసగనిది మీకున్నవానిని తీసివేయము. మీ ప్రత్యేకస్థావరములు తగ్గింపబడక స్థిరముగానుండును. అవసరమునుబట్టి అవి పెంపుచేయబడును. మీభూములు మీకొసగబడును. మీ చిన్నపిల్లలును మీస్త్రీలును అభివృద్ధికరములైన వ్యవసాయపద్ధతులందు తర్ఫీదుపొందుదురు. దానివలన మీ రిజర్వులు హెచ్చుజనసంఖ్యను భరింపగలుగును. మీకు కావలసినది మీ జాతియొక్క పునర్వ్యవస్థీకరణముగాని, ఇతరులతో పోటీ

కాదు. తెల్లజాతివారితో సమ్మిశ్రణముకాదు. తెల్లవారుండుప్రాంతములలో సమానత్వముకాదు" అని చాలా భావగర్భితముగా చెప్పిరి.

నేషనలిస్టుపక్షమువారు తమ వర్ణభేద జాతివిభజన "అపార్థీడ్" విధానమును ఈ క్రింది ఎనిమిదిముఖ్యాంశములపైన నాధారపరచియున్నారు:

(1) రిజర్వులను నల్లజాతివారికి ఆవాసములుగాచేయుట,

(2) నల్లవారికి వారిజాతితోను తెగలతోనుగల సన్నిహితసంబంధమును నిలువబెట్టుకొనుటకు అన్నివిధములైన అవకాశములును ప్రోత్సాహమును కలిగించుట.

(3) పట్టణములందు పారిశ్రామికాభివృద్ధికి అవసరమైనంతమట్టుకు మాత్రమే నల్లజాతివారి నుండనిచ్చుట.

(4) నల్లవారు పట్టణములలోనికి వచ్చుచుండుటనుగూర్చి తగిన కట్టుబాటులుచేయుట, దేశమునకు లాభకరమైనవిధముగా నల్లవారికి తగు పనుల నిచ్చుటకు 'లేబర్ బ్యూరో' లను శ్రామికసంస్థల నేర్పరచుట.

(5) కేపురాష్ట్రములోని మిశ్రమజాతిరంగుప్రజలను నల్లజాతిప్రజల నుండి వేరుచేసి, ఉభయప్రజలు స్వతంత్రముగా నభివృద్ధిచెందుట కవకాశము కలిగించుట.

(6) పట్టణములలో పరిశ్రమలను నడుపు తెల్లయజమానులు తమ క్రింద కూలిపనిచేయు శ్రామికులు నివసించుటకు ఏర్పాటుచేయుబాధ్యతను వహించునట్లుచేయుట.

పైనవివరించిన ఆరు ప్రధానసిద్ధాంతములును 1948లో నేషనలిస్టు పక్షమువారు ప్రభుత్వమువహించగానే సూత్రీకరించిరి. అటుతరువాత దీనికి మరి రెండు క్రొత్తఅంశములనుకూడా చేర్చిరి.

(7) నల్లజాతివారికి రిజర్వులలో పరిశ్రమలను నెలకొల్పి, తెల్లవారితో సంబంధములేకుండా నల్లవారి కవకాశములుకలిగించుట.

(8) కవున్సిలుసభలపద్ధతిని పెంపుచేసి నల్లజాతివారికి స్థానికవ్యవహారములందు బాధ్యతకలిగించుట.

నల్లవారిరిజర్వులు వారిజాతీయావకాశములు పెంపొందించునట్టివిగ నుండవలెను. తమజాతికట్టుబాటులనుండి విడివడి స్వతంత్రులై ఆ రిజర్వు

లకు పోవదలచినవారికికూడా అవి జన్మభూములుగా నుండవలెను. ఆప్రాంతములందు నల్లవారికి అన్నిహక్కులును అవకాశములును ఉండవలెను.... ఆప్రదేశములం దన్నిపనులును నల్లవారే చేయవలెను. *

నల్లవారు తమ నేటిపురిజర్వ్‌స్థావరములనుండి ఐరోపాజాతులవారి పట్టణములలోని వివిధప్రదేశములలోనికి వచ్చుట వృద్ధియయ్యెను. అంతట నేషనలిస్టుప్రభుత్వమువారు క్రొత్తపట్టణములను క్రొత్తప్రదేశములనుఅర్బన్ ఏరియాస్‌చట్టముక్రింద చేర్చిరి.

"నల్లజాతిప్రజలనందరిని తెల్లవారినుండి విడదీసి నేటివు రిజర్వ్ స్థావరములందుంచుట అనునది జరుగునట్టికార్యముకాదు. అట్లుచేయుదుమని నేషనలిస్టులు చెప్పుట రాజకీయప్రచారము" అని స్మట్సుగా రనిరి.

"ఆర్థికముగా స్వయంపోషకములుగానుండు రిజర్వ్‌స్థావరములను స్థాపించుట తెల్లవారి ధర్మకర్తృత్వసిద్ధాంతమునకు అనుగుణమైనకార్యమే గాని, ఈ కల నిజమగునట్లుచేయుట దుస్తరకార్యము. తెల్లవారికి కావలసిన నల్లకూలివారు చౌకగాదొరుకుటను అరికట్టినగాని ఇది సాధ్యపడదు. నల్లవారు ఆర్థికముగా అభివృద్ధిచెందలేని రిజర్వులలో వారికి జీవనముజరుగ నందుననే తెల్లవారిక్రింద పనిచేయుటకు వత్తురు. అందువలన దక్షిణాఫ్రికా దేశముయొక్క ఆర్థికవ్యవస్థ కిట్టి రిజర్వులే అవసరములైయున్నవి" అని ప్రొఫెసర్ హోర్నెల్‌గారు స్పష్టముగా వ్రాసిరి. ఈనిర్ణయము జరిగినపిమ్మటనే చౌకబారు నల్లకూలివారు దొరుకుటకు వీలగునట్లును అక్కరతీరిన పిమ్మట నల్లవారిని మరల రిజర్వ్‌స్థావరములకు పంపివేయుటకును వీలగునట్లు శాసనవిధులనుచేసిరి. నల్లవారికి చాలినన్నిస్థావరములు లేవని ప్రభుత్వమువా రెఱిగియున్నందుననే వారికొరకు కొన్ని క్రొత్తభూములను కొని, రిజర్వులుగాచేయు కార్యక్రమమునుకూడా ప్రభుత్వమువారు తలపెట్టిరి,

బాంటూజాతివా రవలంబించు వ్యవసాయపద్ధతులు పూర్వము లెక్కలేనంతసాగుభూమి యున్నప్పటివలెనే యున్నవి. భూమి పరిమితముచేయబడిన నేటిపరిస్థితులకు తగినట్లులేవు.

---

*** Places for developing Unions, Native Reserves Weekly News Letter No 457. 6-9-1948.p. 8**

(1) భూమిలోని సహజమైనసారమంతయు తగ్గిపోయి ఊషరక్షేత్ర ములగువరకును వానినుపయోగించి వారు క్రొత్త ప్రాంతములందు తమపశువు లను మేపుకొనుచు క్రొత్తభూములను సాగుచేయుచుందురు.

(2) వ్యవసాయములో అభిరుచియున్నను లేకపోయినను కృషివిధా నము తెలిసినను తెలియకపోయినను ప్రతినల్లవాడును తనపొట్టకొరకు కావ లసిన మొక్కజొన్నను పండించితీరవలెను. అందువలన వారికృషి అధ్వా న్నముగానుండును.

(3) ఇక నీ నల్లవారిసంపద తమదగ్గరనున్న పశువులు బలిసి మాం సాహారమునకుపయోగించునా లేదా, పాలు బాగా ఇచ్చునా లేదా అను విష యముపైనగాక కేవలము తనమందలో నెన్నిపశువులున్నవి అనిమాత్రమే లెక్కకట్టుకొనుపద్ధతిపైననే ఆధారపడుట వారికి అలవాటు. పనికిమాలిన పశువులను అసంఖ్యాకముగా పెంచుటవలన మేత చాలక నష్టముకలుగు చుండును.

ఈ పశుపాలనవిధానము ఆర్థికముగా నష్టకరమైనదిగా నున్నది, గత ఇరువదేండ్లలో మనుష్యులును పశువులును వృద్ధిచెందగా మేతకును సాగు నకును పనికివచ్చు భూములు మూడవవంతుకు క్షీణించినవి.

నల్లవారికి ఆహారముకొరత యేర్పడి, ఇతరప్రాంతములనుండి మొక్కజొన్న దిగుమతిచేయవలసివచ్చుచున్నది. పూర్వమువలె పాలు పులియబెట్టి మజ్జిగచేసిఉపయోగించు ఆహారముకూడా కొరతయైనది.నల్లవారికి కడుపునిండ కూడులేనందువలననే వారు దూరప్రాంతములకు పోయి తెల్ల వారిక్రింద కూలిపనిచేసి జీవించవలసివచ్చుచున్నది.లేనిచో వారు పనిచేయరు.

నేషనలిస్టుప్రభుత్వమువారివిధానము సక్రమముగా అమలుజరుగవలె నన్నచో నల్లవారికి వారిస్థావరములందు తగినఆహారము లభింపవలెను. దేశ ములోని మంచిభూమినంతయు తమచేతులలోనుంచుకొన్న తెల్లవారు నల్ల వారికవసరమైన భూములను వదలవలెను. ఇదియంతయు కేవలము పరస్పర విరుద్ధములైన కార్యకర్తవ్యములతోకూడినసమస్యగా పరిణమించినది.

**దేశములో ననేకజాతులపశువు లున్నవి. తగిన మేతలేక మరుగుజ్జులై**

పనిచేయలేనివానిని వధించి తినుటకుకూడా పనికిరానిపశుగణము వృద్ధిచెందినది. అందువలన పశువులమేతకు చాలినభూములు లేవు.

బాంటూజాతివారికి పశుగణముపైన చాలా ప్రేమ. వారుపితృదేవతల అనుగ్రహముపొందుటకును, తమకు ఆరోగ్యము, ఐశ్వర్యము కలుగుటకును పశువులు వారికి చాలాఅవసరము. వారికథలలోని కథానాయకులను సాధారణముగా నొక ఎద్దు రక్షించుచుండును.

బాంటూప్రజలలో పెండ్లిండ్లుజరుగునప్పుడు పశువులనిచ్చినగాని ఆ వివాహసంస్కారము సశాస్త్రీయముగ నుండదు. వారిలో వ్యభిచారదోషమునకు పరిహారముగా పశువులనిచ్చునట్లు నిర్ణయింతురు. ఒకమనుష్యునికిగల పశువులనుబట్టియే సంఘమునందు వానిగౌరవము నిర్ణయింపబడును. పశుసంపదనుబట్టియే భార్యలు పరివారజనము లభింతురు. అతిథి అభ్యాగతులను ఆదరించుటకు వీలుండును పశుసంపద కుటుంబయజమానునిగౌరవమును పెంచును. ఒకమేకనుకాయుపనినుండి పశువులమందనుకాయుపనికి నియోగించినచో గోచిపెట్టనిపిల్లవాడు గర్వపడును. పశుసంపదయొక్క ప్రాముఖ్యము నందరు గమనింతురు.

మేతకు బీళ్ళుచాలక పశువులజాతి క్షీణించినను, నేటికికూడా పశుసంపదయొక్కప్రాముఖ్యము తగ్గలేదు. సరియైనమేతలేని రిజర్వులలో బ్రదుకు మొండిజాతిపశువులు పనికిమాలినవిగ నున్నప్పటికిని, ఆ పశువులనుబట్టియే నల్లవారు తమపరువుప్రతిష్ఠలను పరిగణించుకొని ఆచారవ్యవహారములను జరుపుకొనుచున్నారు. పనికిమాలినపశువులను వధించి, మంచిపశువులకు ముద్రలుకాల్చి పశుజాతిని చక్కబరచి పటిష్ఠముచేయవలెనని నేషనలిస్టుప్రభుత్వమువారు ప్రయత్నింపగా, నల్లజాతులవారు తిరుగుబాటుచేసి అధికారులపైన దౌర్జన్యముచేసిరి. ఆరెంజిఫ్రీస్టేటులో విట్‌జీషోక్ నేటివురిజర్వులో పశువులను తనిఖీచేసి ముద్రలువేయు ప్రభుత్వోద్యోగులపైనపడి నల్లవారు 1950 అగస్టులో దౌర్జన్యముచేసిరి. ప్లాంటేషన్‌తోటలను తగులబెట్టిరి. అంతట నొక పెద్ద పోలీసుదళము నక్కడకుపంపి శాంతిని కాపాడవలసివచ్చెను.

వ్యవసాయపశుశాఖఅధికారు లెంతచెప్పినను వినక నల్లవారు తమ రిజర్వులలోనికి బయటనుండి పశువులను తెచ్చుచుండిరి. అధికారు లెంత బోధించినను నల్లవా రెప్పటివలెనే భూసారమునుపోగొట్టుపనులు చేయుచుండిరి.

సిస్కెయిలో 1949లో అనావృష్టివలన బాధలుపడి వర్షములు కురియగానే అంతకుముందు చచ్చిపోయిన పశువులకుబదులుగా నల్లవారు క్రొత్తపశువులను తెచ్చి నింపుటకు ప్రయత్నించిరి. ఆ యనావృష్టిలో 50 వేల పశువులు చచ్చినవి. దీనివలన పనికిమాలినపశుజాతి కొంత హరించినదని అధికారులు సంతోషించిరి. ఐదు బీదఆవులకుబదులు మంచిదానినొకదానిని కొనినచో మంచిదని ఉద్యోగు లెంత బ్రతిమాలినను నల్లవారు తమ పూర్వపద్ధతులు మానక, పనికిమాలినపశువులనే చౌకగా కొనుచుండిరి.

నల్లవారికి కొంత ఉపకారముచేయగలందులకే 1950లో నేటివ్ ఎఫెయిర్స్ డిపార్టుమెంటు అనబడు నల్లవారివ్యవహారముల ప్రభుత్వశాఖ పునర్నిర్మాణముచేయబడెను.

అయితే ప్రభుత్వోద్యోగులసలహాలను నల్లజాతివారు వినసందువలన హెచ్చులాభము కలుగలేదు.

గత ఇరువదైదేండ్లనుండి నల్లజాతులవారు తమ పూర్వావాసములను వదలి పట్టణములకు చేరుచున్నందువలన వారిజాతికట్టుబాటులు సడలిపోవుచున్నవి. నూటికి 60మంది నల్లవా రిప్పుడు తమజాతికట్టుబాటులనుండి తొలగినారని చెప్పవచ్చును. దీనిఫలితముగా పాశ్చాత్య పారిశ్రామికార్థిక విధానమునందు వారు పాల్గొనుచు క్రొత్తభావములను కలిగి, తెల్లపారిశ్రామికుల వ్యాపారవృత్తికట్టడిసంఘములకట్టుబాటులును వారిచర్యలును అందువలనిఫలితములును చూచి తాముకూడా వారివలె ఆర్థికాభివృద్ధిని పొందగోరిరి. ఇదిచూచితెల్లప్రభుత్వమువారు వీరి నేదోవిధముగా నల్లవారిరిజర్వులకు పంపి యూపీడను వదలించుకొనవలెనని ప్రయత్నించుచున్నారు.

దక్షిణాఫ్రికాలోని తెల్లవారి వలసప్రభుత్వమువారవలంబించిన వర్ణభేద జాతివిభజనవిధానమునందు వారు ప్రయోగించిన మిత్రభేద దమననీతిలోని భాగముగా నల్లవారిని తెల్లజాతివారిని మిశ్రమజాతిరంగుప్రజలను విడ

దీసియుంచి, రాజకీయార్థికసాంఘిక విషయములందు పరస్పరసంబంధము లేకుండాచేయుటయేగాక, వివిధజాతులకును తెగలకును చెందిన నల్లవారిని కూడా విడదీసి ఒకరితోనొకరికి సంబంధములేకుండాచేయవలెనని సమ కట్టిరి.

ఈ ప్రణాళికననుసరించి జూలూలను బసూటోలు మొదలైనజాతుల వారిని తెగలవారిని విడదీసి వేరువేరుస్థావరములం దుంచదలచినారు. ఈ జాతివిభజనవిధానము జయప్రదమగుట కవకాశములేదు. వివిధజాతులను తెగల నిట్లు విడదీయుటవలన నేషనలిస్టుపక్షమువారు చెప్పునట్లు నల్లవారి జాతీయతయొకటి వర్ధిల్లుటకు కృషిచేయుచున్నారనుమాటకూడా నిజముకాదని తేలుచున్నది.

భూగోళపరిస్థితుల నాలోచించినను నల్లజాతివారిరిజర్వు లొకతీరు గాను ఒకచోటను లేక అవి తెల్లవారిరాజ్యములో అక్కడక్కడ దూరముగా వెదజల్లబడియున్నందువల్లను నల్లవారికదలికలనుగూర్చి కట్టుబాటులుచేయుట కూడా చాలా కష్టసాధ్యముగానున్నది. దీనివలన నల్లవారిలో నొక రితోనొకరికి సన్నిహితసంబంధము కలిగించుటకూడా సాధ్యముకాదు. నల్ల వారు వివిధప్రాంతములనుండి పట్టణములకువచ్చి కూలిపనిచేసికొనుపద్ధతిని కట్టుబాటులోనుంచవలెనని నేషనలిస్టుప్రభుత్వము ప్రయత్నించుచున్నది. ఈ సందర్భమున కొన్ని శాసనవిధులనుచేసి తమ వర్ణభేద జాతివిభజన 'అపా ర్తీడ్'విధానమును పట్టణములలో ప్రవేశపెట్టియున్నది. దీనికొరకు వీ రవలం బించినవిధానములు అంతబాగుగలేవు. తెల్లవారికిని నల్లకూలివారికిని సరఫరా చేయుటకై దేశమంతటికి పబ్లికుసర్వీసుకమిషన్ద్వారా కొన్నిఏర్పాటులు చేయదలచిరి. ఈప్రణాళికక్రింద నేటివుకమీషనరుకార్యాలయములు నేటివ్ లేబర్ బ్యూరోలుగా పనిచేయును. అనగా నల్లవారివ్యవహారములనుచూచుట కేర్పరచిన యుద్యోగికార్యాలయము నల్లకూలివారివ్యవస్థగా పనిచేయును. కూలిపనికావలసిన నల్లవారు తమపేళ్ళ నీ కార్యాలయములో రిజిష్టరు చేయించుకొందురు. వీరు స్థానికావసరములుతీర్చి మిగిలిన కూలిజనమును గూర్చినవివరములను సమితిలోని ఆరుగురు నేటివుకమిషనరులకు పంపుచుం దురు. ఆ కమీషనర్లు తమ అధికారమండలములోని అక్కరున్నుదర్చుకొని

ఆ వివరములను ప్రిటోరియాలోని నేటివువ్యవహారములకార్యదర్శికి పంపుదురు.

ఇట్లీ నల్లకూలిజనముపైన కేంద్రప్రభుత్వము అధికారముకలిగి యుండును. అయితే ఈ కూలివారు తెల్లయజమానులతో కూలికంట్రాక్టులు ఖరారులుచేసికొని పనులుచేయుదురు. ప్రస్తుతము పట్టణములలో యజమానులు పారిశ్రామికులును వ్రాసుకొను ఖరారులలో పారిశ్రామికునివివరములు వ్రాయబడియుండును. ఇటువంటిఖరారులనే తెల్ల వ్యవసాయకులు తమ క్షేత్రములలోపనిచేయు నల్ల కూలివారును కలిసి వ్రాసుకొందురు. ఈ ఖరారు పత్రములవలన నల్లవా రొకచోటునుండి మఱియొకచోటునకు పోవుటకు వీలుండదు.

1948 జూలై 1 వ తేదీన అనగా నేషనలిస్టులు ఎన్నికలలో విజయముపొందినకొలదినెలలకు స్టెలెన్‌బాష్ విశ్వవిద్యాలయములో ప్రొఫెసరు అగు ఎ. సి. సిలీయర్సుగారు కేపుటవును సిటిజన్‌షిప్పు ఇన్‌స్టిట్యూటులో ప్రసంగించుచు తెలుపు నలుపుజాతులను విడదీయవలెననియు నల్ల వారిరిజర్వులందు పరిశ్రమలను నెలకొల్పవలెననియు చెప్పిరి.

ఇట్లే ప్రిటోరియావిశ్వవిద్యాలయాచార్యులగు డబ్లియు. డబ్లియు. ఎల్. ఎయిసెలెన్‌గారును దక్షిణాఫ్రికాభాషల అకాడెమీలో కొలదిదినములలోనే ప్రసంగించుచు "నల్ల కూలివారిపనిమీదనే ఆధారపడు ఫ్యాక్టరీలను నల్లవారిస్థావరములలో స్థాపించవలె"ననిరి. స్వయంపోషకములగు ఫ్యాక్టరీలు నల్ల జాతిజనమునకు ప్రత్యేకముగా కొన్నిపట్టణములలోకూడా ఉండవలెనని ఆయన చెప్పిరి. ఆ మరుసటిసంవత్సరమే ఆయన నేటివుఎఫెయిర్సుసెక్రటరీగా నియమింపబడుటవలన నీ విధానమును ప్రభుత్వమువారామోదించిరని తేలుచున్నది.

1949 అక్టోబరులో నేటాలు చీఫ్ నేటివుకమిషనరుగారు మాటలాడుచు నల్ల జాతులప్రజలను వ్యవసాయకుటుంబములుగాను పారిశ్రామికులుగాను విభజింపవలెనని చెప్పి, వ్యవసాయకులు రిజర్వులలోను పారిశ్రామికులు సెటిల్మెంటులలోను జీవింపవలెననిరి.

నల్లవారివ్యవహారములమంత్రి డాక్టర్ హేచ్. ఎఫ్. వెర్వార్డుగారు 1950 నవంబరు 1 వ తేదీన జోహానసుబర్గు రోటరీక్లబ్బులో ప్రసంగించుచు, "ప్రతినల్లవాడు నొక వ్యవసాయకుడుగనే యుండునను నభిప్రాయముతో భూములనుకొనుట పొసగదనియు, నల్లవారిరిజర్వుస్థావరములందు పారిశ్రామికాభివృద్ధిచేయవలెననియు నల్లపారిశ్రామికులుగల గ్రామములు పట్టణములు నిర్మింపబడుననియు చెప్పిరి. దీనిఫలితముగా దక్షిణాఫ్రికాప్రభుత్వమువారు నేటివ్ ఇండస్ట్రియల్ డెవలప్మెంటు కార్పొరేషన్ అను నొక సంస్థను నెలకొల్పి నల్లవారిస్థావరములందు పారిశ్రామికాభివృద్ధిచేయించదలచినారనియు ప్రభుత్వమువారు 1951 ప్రారంభములో ప్రకటించిరి.

ఇదివరకు తెల్లవారి పారిశ్రామికకార్పొరేషనువలెనే ఈ క్రొత్తసంస్థ కూడా నల్లవారిపరిశ్రమలకు దీర్ఘకాలవాయిదాఋణములనిచ్చి నల్లవారిస్థావరములలోనే పారిశ్రామికాభివృద్ధిచేయును. దీనికి మొదట ప్రభుత్వమువారును తెల్లవారును పెట్టుబడిపెట్టుదురు. కాని, తరువాత నల్లవారినికూడా పెట్టుబడిపెట్టుడని ప్రోత్సహింతురు.

నల్లవారిరిజర్వులలోని పరిశ్రమలు తెల్లవారిపరిశ్రమలతో పోటీచేయవనియే తెల్లవారియూహ. అయితే ఆచరణములో నిది యెట్లుపరిణమించునో ఎవ్వరును చెప్పజాలరు. నల్లవారిఫ్యాక్టరీలు నల్లవారిఅవసరములకుమాత్రమే సరుకులు తయారుచేయునని తెల్లవారిఫ్యాక్టరీలు తెల్లవారికొరకే సరుకు లుత్పత్తిచేయునని తలచి యీపద్ధతిని ప్రోత్సహించుటలో చాలా పొరబాటు లున్నవి. దీనికి తెల్లవా రెంతవరకు హర్షింతురో ఎవ్వరును చెప్పజాలరు. పాశ్చాత్య క్యాపిటలిస్టు ధనికవర్గపారిశ్రామికవిధానములో లాభసంపాదనమే ప్రధానోద్దేశము. అది ఎట్లు లభించినను న్యాయమే. అందువలన నీ నల్లవారిరిజర్వులందలి పారిశ్రామికాభివృద్ధి తమకు లాభకరముకాదని దీనిని విసర్జించినచో చేసినపనియు, పెట్టినపెట్టుబడియు వృధయగును.

తెల్లవారు తమ పరిశ్రమలఅభివృద్ధినిమిత్తము కావలసినంతమంది నల్లకూలీలను పనివారిని మాత్రము తమపట్టణములందుంచుకొని, మిగిలినవారిని నల్లవారిరిజర్వులకుపంపువిధానము అమలుజరుగుచున్నది. పాశ్చాత్యులపరిశ్రమలు, గనులు, వ్యవసాయము మొదలైనవానిలో తెల్లవారితోపాటు నల్ల

వారు పనిచేయనిది క్షణమైనసాగదు. చౌకబారు నల్లకూలిజనమువలననే పాశ్చాత్యులు లాభముపొందుచున్నారు. అందువలన వారికి నల్లకూలిజనము చాలా అవసరము. అయితే, వారు తమపట్టణములందు స్థిరముగా జీవించ రాదు. అందువలన పాశ్చాత్య లోకఉపాయము నాలోచించిరి. తమ ప్రాంత ములలోనుండిగాక ఇతరప్రాంతములనుండి నల్లకూలివారిని తెచ్చుకొని వారిచేత కొంతకాలము పనిచేయించుకొనుట కేర్పాటులుచేసికొని. వారిని సాగనంపుచుందురు. వారి కిక్కడ నెట్టి సాంఘిక ఆర్థిక రాజకీయహక్కులు లేకుండాచేయుదురు. ఈవిధానమువలన తెల్లవారు తమ అక్కరతీరినపిమ్మట గాని తమకు అక్కరలేనివారినిగాని వెళ్ళగొట్టి నల్లవారిస్థావరములకు పంపి వేయగలుగుదురు. దీనికి అవసరమైనకట్టుబాటులు శాసనవిధులు చేయబడు ననిచెప్పి, ద్రనినిగ్గూర్చి దక్షిణాఫ్రికాసమితిప్రభుత్వమువారు తగుబందోబస్తులు చేసియున్నారు. చౌకబారు నల్లకూలిజనమున్నగాని దక్షిణాఫ్రికాలోవి తెల్ల వారిపరిశ్రమలును గనులును వ్యాపారమును లాభకరముగా పనిచేయలేవని అందరు అంగీకరించినవిషయమే. దక్షిణాఫ్రికాలోని బంగారుగనులు నగమునాగరికతగల చౌకబారు నల్లకూలిజనమువలననే వర్ధిల్లగలిగినవి. ప్రవీణులుగాని సామాన్యకూలిజనమునంతయు దక్షిణాఫ్రికాసమితిరాజ్యము లోని రిజర్వుస్థావరములనుండియు, నైఋతిఆఫ్రికా, న్యాసాలాండు, పోర్చు గీసు తూర్పుఆఫ్రికా,ఉత్తరదక్షిణరొడీశియారాజ్యములనుండియుతెచ్చి యుప యోగించుకొనుచున్నారు. ఈ నల్లకూలిజనమును సేకరించుటకు దేశములో గొప్ప నిర్మాణవ్యవస్థ స్థాపింపబడినది. దానికి 120 సేకరణకేంద్రములు ఉన్నవి. ఇవి దక్షిణాఫ్రికాలోని వివిధప్రాంతములం దున్నవి. అందులో కొన్ని రాకపోకలకువీలులేని దూరమైన దుర్గమారణ్యములమధ్య నున్నవి. వానితో రేడియోద్వారానే ఉత్తరప్రత్యుత్తరములు జరుపుదురు. ఎంతో కష్ట పడి పడవలపైన అక్కడనుండి నల్లజాతులకూలివారిని దిగుమతిచేయు దురు. ఈ నల్లకూలివారు ఒకసంవత్సరముపాటు పనిచేయునట్లు ఒడంబడి కలు వ్రాయించుదురు. *

* This is South Africa: Leslie Blackwell and Henry John May; Pietermaritzburg, Shutter & Shooter 1947 pp 140-1.

భారీయెత్తున పరిశ్రమలు జరిగించుట, సాంకేతికప్రావీణ్యము, కొన్ని పరిశ్రమలు కలిసిన మొత్తాల నొకఅధికారముక్రింద నుంచుట, అపరిమితమైన ఖనిజసంపద యుండుట, అపరిమితమైన చౌకబారు నల్ల కూలిజనముండుట, అను పంచప్రాణములపైననే తెల్లవారి పారిశ్రామికవ్యవస్థ వర్ధిల్లుచు అత్యధికలాభకరముగా నడుచుచున్నది. ఈసంగతిని గ్రహించియే మాలన్ ప్రభుత్వము తెల్లవారి సాంఘిక రాజకీయాధిపత్యమునకు భంగకరముగా నుండనిరీతిగా దూరదేశములనుండి నల్ల కూలిజనమును ఎగుమతిచేయువిధానమును ప్రోత్సహింప నిశ్చయించెను.

ఈ ప్రభుత్వమువా రవలంబించిన వర్ణభేద జాతివిభజనవిధానమునకిది సరిపడినను లేకున్నను దీనివలన తెల్లవారికి చాలా లాభములున్నవి. దక్షిణాఫ్రికాసమితిలోని నల్లవారు పట్టణములలోనికివచ్చి పాశ్చాత్యులహక్కులకు భంగముకలిగించు భయము లేకుండా వారినందరిని మెల్లగా నల్లస్థావరములకు వెళ్ళగొట్టి వారికిబదులుగా దూరప్రాంతములనుండి దిగుమతిచేసిన నల్లకూలిజనముచేత పనిచేయించుటవలన పాశ్చాత్యుల కేవిధమైనచిక్కులును కలుగవు. కూలిఒడంబడికలగడువు సంవత్సరము పూర్తికాగానే ఈ నల్లవారిని సాగనంపివేయవచ్చును. వీరు స్థిరముగానుందురను భయములేదు. వీరిని కట్టుబాటులోనుంచవచ్చును.

దక్షిణాఫ్రికాసమితిలో దగ్గరలోనేయున్న కూలివారిచేత పనిచేయించుటవలన వారీ పట్టణములలో స్థిరనివాసములేర్పరచుకొని తిష్టవేసికొనియుండి ఇక్కడనుండి కదలరు. వారిని స్థావరములకంపుట చాలా కష్టసాధ్యమైనకార్యక్రమమగును. వారువదలివచ్చిన రిజర్వులలో నల్లజాతివారికట్టుబాటులు విచ్ఛిన్నమగును. సాంఘికక్షేమముకొరకు నిర్మింపబడిన రిజర్వులయొక్కఉద్దేశమే విఫలమగును. ఈ స్థిరమైనకూలిజనమునకు వసతులు,వైద్యసహాయము కలిగించవలసియుండును. దానికి చాలా సొమ్ము వ్యయమగును. దూరములో తమకుటుంబములను వదలివచ్చిన నల్లవారివలెగాక వీరికి సంతాన మమితముగా వృద్ధియై, పాశ్చాత్యులకు పీడాకరమగును. అయితే విజమునకు దిగుమతిచేయు నల్లకూలిజనముచేత పనిచేయించువిధానములోకూడా చాలా లోపములున్నవి. ఇది ఆర్థికముగా నష్టకరమైనది. సాంఘికముగా

నాశకరమైనది. ఛనివలన అవినీతి వ్యాపించును. వీరిలో బాధ్యతయుండదు. పూర్వము 'లీగ్ ఆఫ్ నేషన్సు' అను నానారాజ్యసమితివారును, న్యాసాలాండు ప్రభుత్వకమిటీవారును, ట్రాన్సువాల్ చేంబర్ ఆఫ్ మైన్సుసంఘమువారును, ఈవిధానమును నిష్పక్షపాతబుద్ధితో పరిశీలించిన ప్రతిసంఘమువారునుకూడా దీనిని కఠినముగా నిరసించినారు. పూర్వము వలసరాజ్యప్రభుత్వములు చేసి నంతమాత్రమైనను దక్షిణాఫ్రికాసమితిప్రభుత్వమువారు పట్టణములలో పనిచేయు నల్లవారికి గృహవసతి కలిగించుటకు ప్రయత్నింపలేదు. నల్ల కూలివారియజమానులు వీరినిగూర్చి బాధ్యతవహించుటకు అంగీకరింపరు. ఈ బాధ్యతను మునిసిపాలిటీలు స్థానికసంస్థలు వహించవలెనని న్యాయశాస్త్ర విధులున్నను తమకు చాలా నష్టముకలుగుచున్నదనియు, భరింపలేమనియు పెద్దనగరముల మునిసిపాలిటీ స్థానికసంస్థలు చెప్పుచు నీబాధ్యత నుపేక్షించు చున్నవి.

ఈ గృహనిర్మాణప్రణాళికలకు కొంతధనమిచ్చుటకు భారీవ్యాపారపరి శ్రమలవారుకూడా ఇష్టపడరు. కారణమేమనగా ఈవిషయములందు తమకు పలుకుబడిలేదనియే. అందువలన దీనినిగూర్చి చర్యగైకొనుటకు ప్రభుత్వ మువారొక ప్రత్యేకబోర్డును స్థాపించుటకు నిశ్చయించిరి. ప్రవీణులగు తెల్ల పనివారికి గృహవసతిని తామే నిర్మించి నల్లకూలివారిని తాము కాపురముండు టకు ఇండ్లనునిర్మించుకొనవలసినదని వీరు ప్రోత్సహింతురట!

'కాఫర్ బీరు' సారాయివ్యాపారమువలన స్థానికసంస్థలకు వచ్చుచున్న లాభములలో మూడువంతులలో రెండువంతులైనను సామాన్యకార్యముల కొరకు వినియోగించుటకు అనగా నల్లవారికి గృహవసతి నేర్పాటుచేయు టకైనవ్యయములో వచ్చిననష్టమును పూడ్చుటకును, నల్లవారిఇంటిఅద్దెలలో తగ్గింపులుచేయుటకును, నల్లవారిపేటలు, గ్రామములు, హాస్టల్సు నడుపుట కును వినియోగింపగలందులకు చర్యతీసుకొనుటకై శాసనవిధులను మార్చు టకు కేంద్రప్రభుత్వమువారాలోచింపవలసివచ్చెను.

అయితే కాఫరుబీరు సారాయివ్యాపారలాభము కొంత నల్లవారి గృహ నిర్మాణములకొరకు మునిసిపాలిటీవారొసగువిరాళములు క్షీణించునని కేంద్ర

ప్రభుత్వమువారొసగు సబ్సిడీలుమాత్రమే నల్లవారికి మిగులుననియు కొందరు విమర్శించిరి.

దక్షిణాఫ్రికా నేషనలిస్టుపార్టీప్రభుత్వమువారు నల్లకూలివారి గృహ నిర్మాణమునకు బాధ్యతవహించనందువలన కేంద్రప్రభుత్వమువారిచ్చువిరాళ ములు బహుస్వల్పముగా నుండును. అవి చాలవు. శాసనవిధులమార్పు ఫలిత ముగా స్థానికసంస్థల అధికారు లిప్పుడు భరించువష్టమును ఇకముందు భరింప నందువలన నిజమునకీ భారమునెల్ల తుదకు దరిద్రులైన నల్లకూలివారే భరింపవలసినవారగుదురు. ఈకారణములవలన సమితిప్రభుత్వమువారు చట్ట ములో చేయదలచినమార్పును మునిసిపాలిటీవారును తెల్లయజమానులును సంతోషముతో సమర్థింతురు. ఏలనన అది తమబాధ్యతను తగ్గించును.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## ఆరవ ప్రకరణము

### గాంధిమహాత్ముడు చూపినదారి

దక్షిణాఫ్రికాలోని పాశ్చాత్యకర్షకులకు వ్యవసాయమునందును తోట పనులందును పనిచేయుటకు మనుష్యులు కావలసియుండిరి. దేశము చాలా సారవంతమైనదేయైనను ఆఫ్రికాదేశీయులైన నల్లజాతులవారు తెల్లవారి క్రింద నిలుకడగనుండి పనిచేయరైరి. పైగా వారు సోమఱులుగానుండిరి. బ్రిటీషువారు పదునెనిమిదవశతాబ్దినాటికి భారతదేశమున రాజ్యాక్రమణము చేసియుండినందునను, అక్కడిజనులు కఱవులవలన బాధపడుచు, పాపభీతి కలిగినవారును కష్టపడిపనిచేయుస్వభావముకలవారు నైనందునను మెల్లగా అచ్చటి బీదవారిని ప్రోత్సహించి దక్షిణాఫ్రికాలో కూలిపనిచేయుటకై ఒడంబడికలు వ్రాయించి తీసికొనివచ్చుట ప్రారంభించిరి. క్రీ. శ 1860 లో మొదట మనదేశమునుండి యిట్లు కూలివారి నా దేశమునకు తీసికొనివెళ్ళిరి. ఆకాలమున చెన్నరాజధాని, కలకత్తారాజధానులనుండిమాత్రమే కూలిజనమును తీసికొనివెళ్ళుటకు వీలుండెను.

మనకూలివారివలన దక్షిణాఫ్రికాలో పంటలు వృద్ధిచెందినవి, ధరలు పెరిగినవి. వీరివలననే చెఱకు తేయాకు తోటలును పంచదార తేయాకు పరిశ్రమలును అభివృద్ధిచెందినవి. అక్కడి కూరగాయలు, చేపలవర్తకము మొదలైనవి బాగుపడినవి. వీరినిచూచివచ్చిన హిందూదేశపువర్తకులు, వీరికి కావలసిన వస్తువులనమ్ముటకే మొదట అక్కడికి వెళ్ళిరిగాని, తరువాత అక్కడి బాంటూజాతులవారితోకూడా వ్యాపారముచేయుట సాగించిరి. ఈ వర్తకులు సాధారణముగా బొంబాయినుండి వెళ్ళిన మెమన్‌మహమ్మదీయులు,

వీరు తమదేశమునుండివచ్చిన కూలిజనముకన్న గౌరవముగనుండి, ధనము కలవారై యుండినందువలన వారిక్షేమలాభములు వీరియధీనములై యుండెను.

మొత్తముమీద దూరదేశమునకుపోయి కష్టజీవనముచేయు భారతీయులు బొంబాయి, కలకత్తా,మద్రాసుపరగణాలనుండి వచ్చి గుజరాతీ,తెలుగు, అరవము, బంగాళీభాషలను మాట్లాడువారైనను అక్కడిపరిస్థితులలో సీ భేదములను మరచి యైకమత్యముతో భారతీయులమనుజాతీయభావము కలిగి ప్రవర్తింపసాగిరి.

దక్షిణాఫ్రికాలోనిభూమి సారవంతమైనది. భరతఖండమునందువలెనే ఫలవంతమైనది. భారతదేశమున గంగా సింధు గోదావరి కావేరీనదులున్నచో దక్షిణాఫ్రికాలోను జంబేసీ, లింపోపో, ఆరెంజి, ట్యుగేలా నదు లున్నవి. అక్కడిపాడిపంటలు ఫలవృక్షములు నవధాన్యములు సస్యములే ఇక్కడను కలవు. అక్కడివలెనే ఇక్కడను పాశ్చాత్త్యులప్రభుత్వము. అంతట, కూలి చేయుటకు, వర్తకముచేయుటకు ఉద్యోగములకొరకు వచ్చిన భారతీయు లెల్లరు దక్షిణాఫ్రికాను తమ దత్తభూమిగాచేసికొని జీవింపసాగిరి. ఇది తెల్లవారికి గిట్టదయ్యెను. అంతట తెలుపు నలుపు వర్ణభేదము బయలుదేరినది. ఇందు బ్రిటీషువారును బోయరులును ఏకమైరి. అది తెల్లవారికిహక్కు గలదేశమనియు పరులు దానివలన లాభముపొందరాదనియు, నల్లవారి కెట్టి హక్కులును ఉండరాదనియు ఆశియానుండివచ్చినవారందరు నల్లవారే యనియు తెల్లవా రనిరి. విద్యావంతులైన భారతీయులనుకూడా తెల్లవా రేవగించుకొనసాగిరి.

1890 నాటి కొకలక్షమంది భారతీయులు దక్షిణాఫ్రికాకు వలసవచ్చి స్థిరపడిరి. నేటాలులో 51000 మంది భారతీయు లుండిరి. అందులో 30000 మంది వలసకూలియొడంబడికలగడువుకాలము తీరిపోయినపిమ్మట ఆ దేశములో స్థిరనివాసమేర్పరచుకొని, వివిధవృత్తులవలన జీవించుచుండిరి. వీరిలో చాలామంది సేవకులుగను తోటకూలీలుగను వర్తకులుగను పని చేయుచుండిరి. అందులో 5 వేలమంది అక్కడ వర్తకముచేయుటకు వెళ్ళినవారు. వీరుగాక ఉపాధ్యాయులుగ, ద్విభాషులుగ, గుమాస్తాలుగ, జీవించువారు నుండిరి. కేపుకాలనీరాజ్యమునందు పదివేలమంది భారతీయు

లును, ట్రాన్సువాలు బోయరుప్రజాస్వామునందు పదునైదువేలమంది భార తీయులు నుండిరి.

1911వసంవత్సరమువరకును అమలులోనుండిన వలసకూలి యొడం బడికలపద్ధతి(Indentured Labour) శాశ్వత బానిసవిధానమువంటిదేయని నిష్పక్షపాతులగు పాశ్చాత్యరాజ్యనీతిజ్ఞులు అంగీకరించియున్నారు. వలసకూలి ఒడంబడికలను వలసరాజ్యములవారిఏజంట్లు అక్షరజ్ఞానములేని భారతీయుల చేత వ్రాయించుకొందురు. వ్రాయునప్పుడా కూలివాని కా యొడంబడికలోని షరతుల అంతరార్థము తెలియదు. ఏ యజమానిదగ్గరకు తనను పంపుదురో తెలియదు. నెలకేడున్నరరూపాయలు వేతనమువచ్చునను ఆశతో అతడు పోవును. ఆ దేశము భూతలస్వర్గమువలె నుండునని ఏజెంట్లు చెప్పుమాటలు నమ్మును. పోయినపిమ్మట దాస్యమునబడి దుఃఖములనుభవించును.

దక్షిణాఫ్రికాలోని తోటలయజమానులు భారతీయకూలివారిని పశువు లనుచూచినట్లు చూచుచుండిరి. వీరికి శ్రమ యధికముగనుండును. కడుపు నిండ తిండియుండదు. త్రాగుటకు మంచినీరుగాని, ఉండుటకు మంచి యిండ్లుగాని లేకుండెను. వీరు అనారోగ్యకరములైన మాలగూడెములవంటి గూడెములందు నివసింపవలసియుండిరి. పురుషులతోపాటు నూటికి నలుబది మందిస్త్రీలనుకూడా కూలిచేయుటకు తీసికొనిపోవుపద్ధతివలన మరికొన్ని కష్టములు కలిగెను. కూలివారివివాహములను దక్షిణాఫ్రికావారు అంగీకరింప రైరి. హిందువులును మహమ్మదీయులును బహుభార్యత్వవిధానము నంగీక రించువారుగావున, ఒకేభార్యను వివాహమాడుపద్ధతిగల పాశ్చాత్యన్యాయ శాస్త్రమునకు విరుద్ధముగనుక ఇవి చెల్లవనిరి. భార్యాభర్తలను వేరువేరుయజ మానులకు పంచియివ్వసాగిరి. వారు పనివిడిచిపోవరాదు. గ్రామాంతరములకు పోవరాదు. ఈపరిస్థితులలో భారతీయ స్త్రీపురుషులు బాధలుపడిరి. వ్యభిచా రము వర్ధిల్లెను. పురుషుడు జబ్బుగానున్నను, స్త్రీ గర్భిణియైయున్ననుకూడా వారిని బాధించి పనిచేయించుకొనిన తెల్లవారుండిరి. పాలను హెచ్చుధరకు అమ్మలేదనియో, గుఱ్ఱమునకు దాణాపెట్టుట కాలస్యముచేసెననియో, ఏదో చిన్న తప్పిదమునుచేసెననియో వీరిని చీటికిమాటికి ఖడ్గమృగచర్మపుకొరడా

లతో రక్తమువచ్చునట్లు చావగొట్టుచుందురు. వీరికి వైద్యసహాయము లేదు. విద్యలేదు.

వలసకూలిషరతుకాలమైనపిమ్మట వీరు స్వేచ్ఛగా జీవింపకుండా, వీరిపైన తలపన్ను నిధించియు, వీరుచేసికొను వ్యాపారములను లైసెన్సు లేకుండా చేయరాదని నిషేధించియు, బాధించి మఱల ఒడింబడిక వ్రాయు నట్లు ఒత్తిడిచేయుచుండిరి. అట్లొడంబడికలను వ్రాయనివారి నా దేశము నుండి వెడలగొట్టుటకు, మునిసిపలుహక్కులొసగకయు నీచముగజూచియు అవమానపరచియు హింసింపసాగిరి. కూలివారికిసంబంధించిన శాసనములు చాలా అన్యాయముగా నుండెను. వా రేపనిచేసినను నేరమే: వారు రాత్రిళ్ళు బయట నడవరాదు. అందఱికిని గురుతుపత్రములుండవలెను. వారు తమ పేరులను రిజిస్టరుచేయించుకొనవలెను. ప్రాతనేరగాండ్రకువలె వలస కూలియొడంబడికలు తీరినవారికి అన్నియు అడ్డంకులే యుండెను.

కూలివారినిమాత్రమేగాక ఇతర భారతీయవర్తకులను వృత్తులవారిని ఉద్యోగులనుకూడా తెల్లవారు నీచముగాజూచుచు అవమానించి బాధించు చుండిరి. మర్యాదగాజీవించు ధనికులనుకూడా నిందార్థకముగా కూలివాడని వ్యవహరించుచుండిరి. ఏభారతీయుడైనను తెల్లవారితోసమానముగా రైళ్ళలో ట్రాముబండ్లలో గుఱ్ఱపుబండ్లలో ప్రయాణముచేయరాదు. కాలిదారులలో నడువరాదు. హోటళ్ళలో భారతీయులకు ప్రవేశమొసగరైరి. వీరికి విద్యా సౌకర్యములుగాని వైద్యసౌకర్యములుగాని లేవు. మునిసిపలుహక్కులు కూడా లేవు. భారతీయులెల్లరు రిజిస్టరుచేయించుకొనవలెననియు, గుఱుతు పత్రములుంచుకొనవలెననియు తలపన్నునిచ్చుకొనవలెననియు శాసించిరి. హిందువులు మహమ్మదీయులు చేసికొనువివాహములు చెల్లవుగనుక, అచ్చటి వారు తమభార్యలను బిడ్డలను భారతదేశమునుండి తెచ్చుకొనవీలులేదనిరి. న్యాయస్థానములందుకూడా భారతీయులకు న్యాయముజరుగదయ్యెను.

నేటాలు తెల్లవారివలనగాక భారతీయులవలననే బాగుపడినది. భార తీయు లీ వలసరాజ్యములోనికి రాకపూర్వ మా దేశము దారిద్ర్యమున మునిగి పోవుస్థితిలో నుండెను. ఆ ప్రభుత్వమువారు భారతీయులను తీసికొనివచ్చినందు వలననే అది బాగుపడినది. అక్కడి పాడిపంటలు వృద్ధియైనవి. భారతీయుల

వలననే పదివేలయకరములు సాగుచేయబడినవి. భారతీయులు భూమినిసాగు చేసి తోటలువేసి చాలాపనిచేసిరి. అక్కడ చెఱకే ముఖ్యపంటయయ్యెను. వీరు గొప్ప అరటితోటలను వేసిరి. హిందూదేశములోని ఫలవృక్షములనెల్ల అక్కడ నాటి పెంచిరి. ఇట్లు తమకాయకష్టమువలన బాగుచేసినభూమిలో తాము స్థిరపడి జీవింపదలచుటలో ఆశ్చర్యములేదు. అయితే తెల్లవారి కిది ఇష్టములేదయ్యెను. భారతీయులపైన లేనిపోని నిందలుమోపి వారిజీవిత మును దుర్భరముచేయదలచిరి

దక్షిణాఫ్రికాలో గడించినసొమ్ము నచ్చటనే వ్యయముచేయక తమ దేశమున కంపుదురనియు, వీరియనారోగ్యపుఆచారములు దేశమున కనిష్ట కరములనియు, వీరు చౌకగ జీవించి, చౌకబారుఇండ్లలో వసించి, వర్త కముచేయుచు తక్కువఅద్దెలనిచ్చి పలువు రొకయింటిలోనే జీవించుచు దివాలాలుతీసి బాకీదారులను నష్టపెట్టుచు తమయనుచరులకు తక్కువజీత ములనిచ్చి వర్తకముచేయుటకు నిర్ణయించినకాలములందేగాక యితరవేళ లందును వర్తకముచేసి సరుకులలో కల్తీచేసియు తక్కువతూచియు ఐరోపా వారికన్న తక్కువధరలకు విక్రయించియు తెల్లవారినోట మట్టికొట్టుచున్నా రనియు, ఆ దేశములోనివస్తువుల నుపయోగింపక తమదేశమునుండి సరుకు లను తెప్పించుకొందురనియు, వీ రచ్చట జీవించుచున్నందువలన వీరిని చూచి ఆ దేశీయులైన నల్లజాతులవారుకూడా పాడైనారనియు, వీరివేష భాషలు, ఆచారవ్యవహారములు, మతము పాశ్చాత్యులకు భిన్నమైనవనియు, వీరు నేటివులకు దొంగతనము నేర్పినారనియు, వీరు పాశ్చాత్యులతోను వారిస్త్రీలతోను చనువుగావ్యవహరించుటవలన అక్కడి నల్లజాతులవారికి వారిపట్లగల భయభక్తులు నశించుచున్నవనియు భారతీయులన్న గిట్టని తెల్ల వారు ప్రచారముచేయుచు భారతీయులకు వ్యతిరేకమైనశాసనవిధులను చేయుటను ప్రోత్సహింపసాగిరి.

నేటాలులో 1894 వరకును తెల్లవారితోపాటు భారతీయులకుకూడా ఎన్నికహక్కులుండెను. ఎన్నికలచట్టముప్రకారము 50 పౌనుల స్థిరాస్తి యున్నగాని, సాలుకు పదిపౌనులఅద్దెనుచెల్లించినవారికిగాని ఎన్నికహక్కు లుండెను. 1894లో ఆశియాదేశీయులహక్కులు తీసివేయుశాసనము చేయ

బడెను. అది చేయవలదని భారతీయులు ఎంతవేడుకొనినను లాభము లేకపోయెను. 1895లో చేయబడిన శాసనముప్రకారము వలసకూలి యొడం బడికగడువు ముగిసినపిమ్మట దేశములో జీవించువారు మరల యొడంబడి కముప్రాసి దాస్యములోనైన నుండవలెను లేదా ప్రతి స్త్రీపురుషుడు తల 15 3 పౌనులు (45 రూపాయలు) తలపన్నునైన చెల్లింపవలెను. ఇట్లు భార తీయులపైన క్రొత్తఅస్త్రములను ప్రయోగింపసాగిరి.

భారతీయుల కెక్కడికిపోయినను అవమానములే. వీరు రైళ్ళలో పైతరగతులందు పోరాదు. హోటళ్ళకు వీరిని రానీయరు. వీరిపిల్లలను చదువుకొనుటకు పాఠశాలలకు రానీయరు భారతీయులు భూములను ఇండ్లను కొనుటకు, అనుభవించుటకు ననేకములగు నభ్యంతరములను కలిగించు చుండిరి. ఇక ఒడంబడికలువ్రాసి కూలిపనిచేయుటకు వలసవచ్చినవారిదుఃస్థితి చెప్పతరముకాదు. అది యొకవిధమగు బానిసత్వముగనుండెను. వారియజ మానులు వారిని నరకబాధలుపెట్టుచుండిరనిన నతిశయోక్తిలేదు.

దక్షిణాఫ్రికాలో పనియుండి బారిస్టరుగా అచ్చటికిపోయిన గాంధి మహాత్ముడిది చూచి దుఃఖించినాడు. తమబాధల బాపుటకు మార్గములనరసి రక్షింపుమని అచ్చటి భారతీయులు వేడుకొనగా మహాత్ముడు ఆర్తజనరక్ష కుడుగాన 1893 సంవత్సరమునుండి డర్బనులో నివసించి ప్రజాసేవ చేయ సాగినాడు. ఆయననుతెల్లవారవమానించినను సహించుచు భారతీయులదురవస్థ లనుగూర్చి ప్రభుత్వమువారి కెన్నో విన్నపములంపినాడు. దొరలనెందరినో చూచినాడు. భారతీయుల మొఱలాలకించువారు లేకపోవుటచూచి కర్తవ్య మాలోచింపగ శాంతియుతముగ శాసనముల నుల్లంఘించు సత్యాగ్రహయోగ మాయనకు స్ఫురించెను. కాని అప్పు డచ్చటిభారతీయు లీయోగము నను ష్ఠించుటకు సిద్ధముగ లేరని యూరకొనెను. గాంధిమహాత్ముని ప్రజాసేవ వలనను సద్బోధలవలనను కొన్నాళ్ళకు భారతీయులందు సంచలనము కలి గెను. భారతీయులందు కలిగిన నూతనవికాసము జూచి తెల్లవారాశ్చర్యపడిరి. గాంధిమహాత్ముడు 1903 లో ట్రాన్సువాలులోని భారతీయులకుసహాయము చేయుటకు పోయెను. అచ్చటి భారతీయులకు పైనచెప్పిన బాధలుమాత్రమే గాక మఱికొన్ని యుండెను. స్త్రీపురుషులెల్లరు సాలుకు 3 పౌనులుచొప్పున

తలపన్ను నిచ్చుకోవలసియుండెను. వారు మాలగూడెములవంటి ప్రత్యేక స్థలములందే వసింపవలెను. స్వేచ్ఛగ వర్తకము చేయరాదు. ట్రాంబడ్ల నెక్కరాదు. ఈ యవమానములు చాలవని కాబోలు 1906 లో నొక క్రొత్త శాసనము చేయదలచిరి.

ఈశాసనమువలన క్రొత్తవారు దేశములోనికిరాకూడదు. ఉన్నవారు రిజిష్టరుచేయించుకొనవలెను. గుఱుతుపత్రములను పుచ్చుకొనవలెను. ట్రాన్సువాలులోని భారతీయుల కిక బ్రతుకుతెరవుకూడ పోవునట్లుండెను. అంతట 1906 సం॥ సెప్టెంబరు 11వ తేదీన భారతీయు లొక గొప్పసభ చేసిరి. 3000 మంది ఈ క్రొత్తశాసనమునకు తమ అసమ్మతిని దెలుపుచు దీనిని సామ్రాజ్యప్రభుత్వమువారు అంగీకరించి శాసనముగ చేసినచో తాము దానిని నిరోధింతుమనియు దానివిధులను తిరస్కరించి చెఱసాలల కేగెద మనియు నేకగ్రీవముగ తీర్మానించి గాంధిమహాత్ముని సత్యాగ్రహదీక్షను వారెల్లరుగైకొని ప్రమాణములను జేసిరి.

"ఈ చట్టమువలన భారతీయుల హృదయములు తల్లడిల్లినవి. దానిని నిరోధించుటకు కృతనిశ్చయులైరి. అందువలన సత్యాగ్రహమహాస్త్రప్రయోగ మునకు సమయ మేతెంచినదని నాకు తోచినది. భారతీయులెల్ల రేదోయొక మార్గమున వర్తింతురనియు వారు హింసాపద్ధతులతో దౌర్జన్యమార్గముల బోకుండగ అహింసామార్గముల సాత్వికనిరోధము నెరపిన బాగుండు ననియు స్పష్టమైనది. భారతీయులకు పార్లమెంటులో ఓటులేదు. అందు వలన వారిమొఱ వినువారులేరు. క్రైస్తవమతాధికారులును వారి దుఃఖముల జూచియు నూరకొనిరి. అందువలన నేను దుఃఖభాజనమగు నీ సాత్విక నిరోధమార్గమును చూపగ వారెల్లరు చక్కగ యోచించి అట్లు సత్యాగ్రహ దీక్ష గైకొనిరి." అని గాంధిమహాత్ముడే వ్రాసినాడు.

దక్షిణాఫ్రికా భారతీయులపట్ల ప్రభుత్వము గావించిన ఘోరాన్యాయ మునకు ప్రతిహతముగ తాను చేయబోవు సాత్వికనిరోధయుద్ధవిధానమును గాంధిమహాత్ముడు ముందుగ దక్షిణాఫ్రికా ప్రభుత్వమునకు దెలిపి మఱియు సమరమారంభించెను, 3 పౌనుల తలపన్ను నియ్యవలదని బోధించియు. ఇయ్యకయు అందువలనకలుగు శిక్షల ననుభవించుట, ఒడంబడిక పత్ర

ములు వ్రాసి కూలిపని జేయుచున్నవా రీపన్ను రద్దుచేయువరకును పనిమాను దని ప్రోత్సహించి పని మానినందులకు శిక్షల ననుభవించుటయు; క్రొత్త చట్టముల ప్రకారము రిజిస్టరుచేయించుకొనక నిరాకరించియు; అనుమతి పత్రములను పుచ్చుకొనకుండగ ట్రాన్సువాలు సరిహద్దుదాటి దేశములోనికి పోయి హద్దుమీరిన నేరమునకు శిక్షింపబడి చెఱసాలల కేగుటయు సత్యాగ్రహసాధనములుగ చేయబడెను.

గాంధిమహాత్ము డీసత్యాగ్రహ మహోద్యమమునకు నాయకుడయ్యెను. మహాత్ముని సత్యాగ్రహదీక్షను 8000 మంది గైకొనిరి. ఈ మహోద్యమమున జేరినవారు పన్నులిచ్చుటకు నిరాకరించిరి; పనులీచేయుట మానిరి. అందుకొరకు శిక్షింపబడి చెరసాలల కేగసాగిరి. గాంధిమహాత్ముడును ఇతర నాయకులును, సత్యాగ్రహులును పెక్కుమారులు శిక్షింపబడిరి. 3500 మంది శిక్షింపబడి చెరసాలకేగి వరకశిక్షల ననుభవింపసాగిరి. చెఱసాలలందు దక్షిణాఫ్రికాలోని ఆదిమవాసులతోపాటు వీరి కశుభ్రమగు నాహారమొసగియు, కఠినములగుపనులను వీరిచే జేయించియు బాధపెట్టుచుండిరి. గాంధిగారి నేకాంతవాసశిక్ష విధించినవానినివలె నేకాకిగ నుంచి కొంతకాలము బాధించిరి. చెఱసాలలందు గాంధీప్రభృతులు పడినబాధలు వర్ణనాతీతములు. అవమానపరచుటకు జైలునుండి బయటకు శృంఖలములతో నడిపించిరి. గాంధిగారి దారాపుత్రాదులుకూడ చెరసాలకేగిరి. చెఱసాలబాధలనుభవించిన భారతీయులుకొందరు ఆరోగ్యముచెడి త్వరితముగనే మరణించిరి. సత్యాగ్రహ మహోద్యమమున పురుషులేగాక స్త్రీలుకూడ పాల్గొనిరి. భారతీయుల వివాహములు చెల్లవను తెల్లవారితీర్పునుజూచి స్త్రీలు రోషముజెందిరి. బొగ్గుగనులలోనుండిన కూలీలనెల్లరను పనిమానుడని స్త్రీలే ప్రోత్సహించిరి. రోడ్డుమీద నిలువనీడలేక తనబిడ్డ చనిపోవగ నొక వీరమాత 'పోయినవారికయి వగచిన నేమికార్యము? బ్రదికియున్నవారికొరకు పాటుపడవలెను గాని' అనినది. ట్రాన్సువాలు సరిహద్దులను దాటి శిక్షింపబడుటకు కొన్నివేలమంది చేరిరి. ఈమహాసైన్యము కదలుటకు ముందుగనే కొందఱ నరెస్టుచేసిరి. మూడువేలమంది శాంతిసైన్యమును గాంధిగారు నడిపిరి. ఇందు 122 స్త్రీలు 50 మందిపిల్లలునుండిరి. సరిహద్దులు దాటగనే కొందరిన రెస్టుచేసిరి. గాంధి

గారినికూడ అరెస్టుచేసిరి. సత్యాగ్రహులెల్లరు జోహానసుబర్గుకు పోవదల చిరి వారుతలచుకొనినచో నెంతకల్లోలమైన చేసియుందురుకాని 'పోలకు, కాచేలియా'మున్నగు నాయకుల యాజ్ఞప్రకారము గాంధిమహాత్ముని అహింసా వ్రతమువీడక అత్యద్భుతశిక్షాక్రమము జూపిరి. వీరెల్లరు చెఱసాలకేగిరి. కొన్నివందలమందిని ప్రభుత్వమువారు దేశాంతరముల కంపసాగిరి.

ఈశాంతిసమరమున వేయిమంది తమసర్వస్వము గోల్పోయిరి.ఆరో గ్యమును ప్రాణములను గోల్పోయినవారును గలరు. వృద్ధులుగూడ ఎన్నో శ్రమలబడసాగిరి. భారతీయుల కొకకోటి రూప్యములు నష్టమయ్యెను. భారతీయు లి నెనిమిదివత్సరములు సత్యాగ్రహసమరము జేసిరి, కొన్ని కుటుంబములలో "నా" యనుపురుషుడు లేకుండగ చెరసాలలోపడిరి. స్త్రీలు జీవనముకొరకు కూరగాయ లమ్ముకొనవలసివచ్చెను. భారతీయులపట్ల సానుభూతినిచూపిన పాశ్చాత్యులందు పోలకుగారి కుటుంబమును తక్కిన పాశ్చాత్యులు వెలివేసి బాధించిరి.ఈబాధలను భరింపలేక లొంగినవారు స్వల్ప సంఖ్యాకులుండిరి. వీరైనను సిగ్గుజెంది తరువాత తమసర్వస్వము నీ మహో ద్యమముకొరకే ధారవోసిరి. ఈమహోద్యమమువలన దక్షిణాఫ్రికాలోని జనులం దత్యద్భుతమగు సంచలనముకలిగెను. సత్యాగ్రహుల పట్టుదలయు ప్రజలయుత్సాహమును గాంధిమహాత్ముని సత్యాగ్రహమహోద్యమమును జూచి ప్రపంచమెల్ల ఆశ్చర్యపడెను.

"అక్రమములు అన్యాయములని బయటనుండు మన వంటివారికి గూడ తోచుచున్న శాసనముల నుల్లఘించుచు సత్యాగ్రహమును వహించి వ్యవహారమును తామే పరిష్కరించుటకు దక్షిణాఫ్రికాలోని మీ దేశభక్తు లీ మధ్య నిశ్చయించినారు. అట్లుచేయుటవలన వచ్చుకష్టములను శిక్షల నెఱి గియే, ఇష్టపడి భరింప నడుకట్టియే ఉల్లంఘించుచున్నారు. ఇందు మన భరతఖండముయొక్క సానుభూతి వారియందు కలదు. భరతఖండమునకు మాత్రమే కాదు. భారతీయులు గాకపోయినను యీ దేశీయులయందు అభి మానముకల నావంటివారి కెల్లరకును సానుభూతికలదు." అని 1913 లో హిందూదేశమున వైస్రాయిగనుండిన హార్డింజిప్రభువు మద్రాసులో నుపన్యా సమునం బలికెను. తాతాగా రిరువదియైదువేలు విరాళముల నొసగిరి. గోఖలే

గారు ఒక లక్షరూపాయలు నిధిని చేకూర్చుటకు ప్రయత్నింపసాగిరి. ఈ మహోద్యమమును గూర్చి ఇంగ్లాండులో ఆంప్తిల్‌ప్రభువు ఆందోళనము సలిపెను. భరతఖండమున గోపాలకృష్ణగోఖలేగారు కలకత్తా సామ్రాజ్య శాసనసభలో ఈ ఘోరకష్టములను గూర్చి ఖండించి వలస నాపుదని తీర్మానము నుపపాదించిరి. భరతఖండమున నలుమూలలను దక్షిణాఫ్రికాసత్యాగ్రహమహోద్యమ సహాయార్థము విరాళములు ప్రోగుచేయబడెను. దేశములోని ప్రతిగ్రామమునను ప్రజలు ప్రభుత్వమువారి చర్యలనుగూర్చి తమ అసమ్మతిని వెల్లడించిరి.

ఎట్టకేలకు బ్రిటీషుసామ్రాజ్యమువారు కన్నుతెఱచిరి. దక్షిణాఫ్రికాలోని భారతీయుల స్థితిగతులను గూర్చి విచారించుటకు సోలమన్ విచారణ సంఘమును నియమించిరి. అందు భారతీయ ప్రతినిధులను నియమింపరైరి. చెఱసాల కంపబడిన నాయకులను మాత్రము విడిచిరి. తమ ప్రతినిధులు లేని విచారణసంఘమువలన లాభముండదనియు భారతీయు లడుగుచున్న స్వల్పపుహక్కులను ప్రభుత్వమువారు నిరాకరించినచో 1914 జనవరి 1 వ తేదీన మఱల సాత్వికనిరోధము ప్రారంభించి ఇదివరకుకన్న ఎక్కువ కష్టములుపడుటకు సిద్ధముగ నుందుమనియు గాంధిగారనిరి. భారతీయనాయకులా విచారణసంఘమునెదుట సాక్ష్యమిచ్చుటకు నిరాకరించిరి. 20,000 స్త్రీ పురుషులు చెఱసాలలకేగ సిద్ధముగా నుండిరి. ఇంతలో యూరపియను పరిశ్రామికుల సమ్మెవచ్చుటవలన అధర్మయుద్ధముచేయుట కిష్టములేక గాంధిమహాత్ము డుద్యమమును తాత్కాలికముగ నిలిపెను. అంతట నెట్టకేలకు దక్షిణాఫ్రికాప్రభుత్వప్రధానమంత్రి స్మట్సుసేనానికిని గాంధిమహాత్మునికిని సంధి కుదిరెను. భారతీయుల సత్యాగ్రహకారణములనుగూర్చియు ప్రభుత్వమువారంగీకరింపవలసిన ముఖ్యపద్ధతులను గూర్చియు వీరిరువురకు నుత్తర ప్రత్యుత్తరములు జరిగెను. ఇదియె గాంధి స్మట్సు ఒడంబడికయని ప్రసిద్ధి జెందినది. భారతీయులనెల్లరను విడిచిరి.

రాజీషరతులను పురస్కరించుకొని ప్రభుత్వమువారు 1914 ఇండియన్ రిలీఫుచట్టముచేసిరి. 3 పౌనుల తలపన్ను తీసివేయబడెను భారతీయులకు అప్పటికున్న హక్కులు పోకుండనుంచెదమని స్పష్టపఱచిరి. ఇంత

వరకు అంగీకరింపని భారతీయుల వివాహముల నంగీకరించిరి. వర్ణభేదము లనుబట్టి శాసనములను చేయమనిరి. భారతీయులను నిర్బంధించి దేశము నుండి సాగనంపుపద్ధతి మాని యిష్టమున్నవారు వెడలిపోవు పద్ధతి నంగీక రించిరి. ఉభయుల కోరికప్రకారము భారతీయులను వలసకూలి కంపు బాని సత్వపద్ధతి మాన్పిరి. విద్యావిషయికములు, నితరములునగు కొన్ని సంస్క రణములు చట్టమున నుదహరింపబడనప్పటికిని చేసెదమని మంత్రిగారు గాంధిగారికి చెప్పిరి. భారతీయులకు సంపూర్ణహక్కులు కలుగకపోయినను అవమానకరములగు బాధలు కొంతవరకు తీరెను. అంతట గాంధిమహాత్ముడు 1914 వ సంవత్సరమున జూలై నెలలో కుటుంబసమేతముగా దక్షిణాఫ్రికా వదలెను.

1914-1918 మధ్య జరిగిన ఐరోపామహాసంగ్రామసందర్భము నందు బ్రిటీషుసామ్రాజ్యప్రభుత్వమువారికి భారతదేశమువలన చాలా సహా యము కావలసివచ్చెను. ఆపదమ్రొక్కులవలె ఆ సందర్భమునజరిగిన సామ్రాజ్యరాజ్యనీతిజ్ఞులసభలయందును తరువాతజరిగిన ఇంపీరియల్ కాన్ఫ రెన్సు అనబడు మహాసభలందును ప్రభుత్వమువారికి విశ్వాసపాత్రుడగు భార తీయప్రతినిధిని ఆ సభల కాహ్వానించుటయు సామ్రాజ్యవ్యవహారములను గూర్చి మాటలాడనిచ్చుటయు జరిగెను. ఆసందర్భమున బ్రిటీషుసామ్రాజ్య మొక స్వతంత్రరాజ్యముల సమ్మేళనమనియు అందలిప్రజలు స్వేచ్ఛ స్వాతంత్ర్యములు కలవారనియు మహోపన్యాసములను గావించిరి. సామ్రా జ్యములోని వివిధరాజ్యములవారు తమప్రజల వలసవ్యవహారములనుగూర్చి యుక్తమైన ఏర్పాటులనుచేసికొనుటలో పరస్పరము మర్యాదనుపాటించు సూత్రము నొకదాని నామోదించిరి.

స్మట్సుసేనాని ఆ సభలందుచేసిన మహోపన్యాసములలోని ఉదార భావములకు వ్యతిరేకముగా దక్షిణాఫ్రికాలోనిభారతీయులు కొన్నిప్రాంత ములం దేవిధమైన స్థిరరూపకమైనఆస్తిని సంపాదింపరాదనియు ప్రభుత్వము వారునిర్ణయించిన స్థలములందుమాత్రమే నివసింపవలెననియు ఎక్కడ నైనను వర్తకముచేయవలెనన్నచో లైసెన్సులుపొందవలెననియు లైసెన్సు లిచ్చుట అధికారులచిత్తమునుబట్టి యుండుననియు స్మట్సుసేనాని 1919

సం॥ 37వ శాసనము నొకదానిని గావించెను. దక్షిణాఫ్రికానుండి భారతీయులను సాగనంపుటకై అనేకఉపాయములాలోచించి అమలుజరుపసాగిరి.

1921లో జరిగిన సామ్రాజ్యసభయందు భారతీయప్రతినిధి రైట్ఆనరబుల్ శ్రీనివాసశాస్త్రిగారు దక్షిణాఫ్రికాభారతీయులబాధలనుగూర్చి వగచిరి. 1923లో సర్ తేజ్‌బహదూర్ సప్రూగారును దీనినిగూర్చి చెప్పిరి. అయితే స్మట్సుసేనాని పెదవివిరచినాడు. నయముననో భయముననో బెదరించియో బుజ్జగించియో స్మట్సుసేనాని భారతీయులను దేశమునుండి సాగనంపుచునేయుండెను. 1921 నాటికి దక్షిణాఫ్రికాలో 161339 మంది భారతీయులుండిరి.

స్మట్సుసేనానిఅనంతరము హెర్టుజాగుగారు 1924లో ప్రధానమంత్రియైరి. స్వదేశవ్యవహారములకు మాలన్‌గారు మంత్రియైరి. వీరికాలమునందు "క్లాస్‌ఏరియాస్‌బిల్" అనబడు నివేశనముల చట్టము నొకదానిని శాసించి, భారతీయులను మారుమూలగూడెములకు త్రోయుటకు నిశ్చయించిరి. భారతదేశమునుండి దక్షిణాఫ్రికాకు పోవువారినిగూర్చి కఠిననిర్బంధములుచేయ తలపెట్టిరి. వర్ణభేదసిద్ధాంతమును అమలుచేయుచు,గాంధి స్మట్సుఒడంబడికకు విరుద్ధముగా దక్షిణాఫ్రికాప్రభుత్వమువారు ప్రవర్తింపసాగిరి.

దక్షిణాఫ్రికారాజ్యనీతిజ్ఞులు భారతీయులపట్లచేయు అన్యాయములనుగూర్చి గాంధిమహాత్ముడు పెక్కుమారులు విమర్శించియుండెను. భారతదేశము అస్వంత్రమైయున్నంతవరకు మనదేశములోనిప్రజలకును దేశాంతరములందున్నవారికిని న్యాయముజరుగదని మహాత్మునికి రూఢియయ్యెను. అంతట ఆయన భారతదేశమునకు స్వరాజ్యముసంపాదించుటకై తన సత్యాగ్రహమహోద్యమములను ప్రారంభించి నడుపసాగిరి.

"దక్షిణాఫ్రికా రాజనీతిజ్ఞులు భారతీయులకు న్యాయమొనరింపనిచో తమబైబిలునే తమదేవునే తిరస్కరించినవారగుదురని ఈ కాంగ్రెసువేదికనుండి ముమ్మాటికిని చెప్పుచున్నాము" అని గాంధిమహాత్ముడు 1925 డిశంబరులో జాతీయమహాసభయందు ఉద్ఘాటించెను.

భారతదేశప్రభుత్వమువారి రాయబారములఫలితముగా నొక ప్రతినిధుల సభ జరిగి, 19.6లో దక్షిణాఫ్రికాయొడంబడిక యొకటి చేయబడెను. దాని ప్రకారము రైట్ఆనరబుల్ శ్రీనివాసశాస్త్రిగారు దక్షిణాఫ్రికాలో భారతీయ ఏజెంట్జనరల్‌గా నియమింపబడిరి. అక్కడ ఆయనకు కొంత గౌరవము జరిగెను. గాని భారతీయుల కుపకారము జరుగలేదు. అటుపిమ్మట శ్రీ కూర్మా రెడ్డినాయుడుగారు ఆ పదవిని పొందిరి. దక్షిణాఫ్రికాప్రభుత్వము వారు మర్యాదగామాటలాడుచుండిరేగాని. వారిహృదయము మారలేదు. భారతీయులను మెల్లమెల్లగా దేశమునుండి సాగనంపవలెననియు, మిగిలిన వారికి సౌకర్యములుతీసివేసినచో వారే పోవుదురనియు తలచి ఆ విధానము నవలంబించిరి. ఇట్లు కొంతకాలము గడచెను.

1936లో దక్షిణాఫ్రికాసమితిప్రభుత్వములోని మంత్రులు హాఫ్‌మీర్ గారు మొదలైనవారు భారతదేశమునకు వచ్చి పర్యటనముగావించి. మర్యాదలనుపొంది వెళ్లిరి.

దక్షిణాఫ్రికాలో రమారమి 365000 మంది భారతీయులున్నారు. 1936లో నక్కడనున్న భారతీయులందు నూటికి 47మంది 15 సంవత్సరము లవయస్సువారు; నూటికి 13 మంది 45 సంవత్సరములకు పైబడినవారుగా నుండిరి. ఐరోపావారిలో 15 సంవత్సరములవారు నూటికి 27 మంది, 45 సంవత్సరములకుపైబడినవారు 26 మందియు నుండిరి. అందువలన భారతీయజనసంఖ్యలో అధికసంఖ్యాకులు యువకులే. అందువలన వీరిజనసంఖ్య అభివృద్ధిచెందుటకు హెచ్చుఅవకాశములున్నవని తెల్లవారు బాధపడిరి.

దక్షిణాఫ్రికాలోని భారతీయులలో చాలామంది అక్కడ జన్మించిన వారే. వారు భారతదేశమును తమ మాతృభూమిగా పరిగణించుచున్నను, నిజమునకు వారందరును వలసప్రజలే. వారు భారతదేశమునకు వచ్చినచో ఇక్కడిజీవనవిధానము వారికి కేవలము క్రొత్తగానుండును. వీరు క్రమక్రమముగా పాశ్చాత్యవేషభాషలను అవలంబించుచున్నారు. వీరిసమస్యలలో ముఖ్యమైనది వీరు మాతృభాషను మరవకుండనుండుసమస్యయే. దక్షిణాఫ్రికాలో గుజరాతిమాటలాడు మహమ్మదీయులకు బొంబాయి నుండి రేడియోలో ప్రసారమగు భాష అర్థముకాదు. భారతీయులపిల్లలందరును పాఠశాలలందు

తమతమ మాతృభాషలను నేర్చుకొందురు. ఇందులో అరవము, తెలుగు, గుజరాతీ మొదలైనభాషలవారున్నారు. ముఖ్యముగా మహమ్మదీయులు ఖురానులో కొంతభాగము కంఠస్థముచేసితీరవలెను. అందువలననే వారు పాశ్చాత్యుల పిల్లలకన్న రెండుమూడుసంవత్సరములు ఆలస్యముగా మెట్రిక్యులేషను పరీక్షలో నుత్తీర్ణులగుచుందురు. ఈ సమస్యలను పరిష్కరించుటకు దక్షిణాఫ్రికాలో కొన్నిప్రయత్నములు జరిగెను. అన్నిటికన్న నా దేశములో ముఖ్యమైనసమస్య ఈ భారతీయుల నేదోవిధముగా దేశమునుండి వెడలగొట్టవలెననునదియే.

భారతీయులు ఇష్టపడి తమంతటతాము దేశమునుండి వెడలిపోవగలందుల కొక ప్రణాళికను ఆ ప్రభుత్వమువారు తయారుచేసినారు. అట్లుపోవువారికి వలసరాజ్యప్రభుత్వమువారు కొంతసొమ్మును పరిహారముగా నొసగుదురు. అట్లు పోకుండా అక్కడనేయున్నవారు స్వేచ్ఛగాసంచరించుటకు వీలులేకుండా అనేకనిషేధములు చేయుదురు. ప్రభుత్వమువారు ప్రవేశపెట్టిన ప్రణాళికవలన కొన్నివేలమంది దేశమునువిడిచిపోవుట జరిగెను. మిగిలినవారిని కొన్ని ప్రత్యేకప్రదేశములందుండునట్లు నిర్బంధించిరి. అయితే భారతీయులవిషయములో అమలుజరిపిన యే ప్రణాళికయును జయప్రదము కాలేదు. వారిజనసంఖ్య అంతగా తగ్గలేదు. వారు ప్రభుత్వముపట్ల భయభక్తులుకలిగియుండునట్లు చేయనులేదు. ఈ భారతీయజనసంఖ్యను తగ్గించు సమస్య పరిష్కరింపలేకపోవుటవలన వలసప్రభుత్వమువారికి గంగవెఱ్ఱులెత్తినవి.

ఈసమస్యను పరిష్కరించుట సాధ్యపడదని వారికి గొప్ప భయము కలిగినది. అందువలన దర్బను మొదలైన జనసంకీర్ణములైనప్రదేశములందు తెల్లజాతివారికిని భారతీయులకును సామరస్యములేకుండాపోయినది. భారతీయుల సమస్య దక్షిణాఫ్రికాలోని వర్ణభేదసమస్యలో నొకభాగముగా నున్నది. అక్కడ తొంబదిలక్షలమంది నల్లజాతులవా రుండియుండగనిచో సీ 365000 మంది భారతీయులనుచూచి పాశ్చాత్యులు భయపడియుందురు. అదియునుగాక ఈ పాశ్చాత్యు లా దేశములో ప్రభువులేగాని అల్పసంఖ్యాకవర్గముగా నున్నారు. ఇందువలననే వారి కింత భయము. ఇదియుగాక

దగ్గరలోనే తూర్పు ఆఫ్రికాలో కెన్యారాజ్యమునందు చాలావేలమంది భారతీయులుండుట వారికి మఱింత భయకారణముగ నున్నది.

1948లో అధికారమువహించిన నేషనలిస్టుపార్టీవారి దక్షిణాఫ్రికా ప్రభుత్వమువారు వర్ణభేదసిద్ధాంతముపై జాతులనువిభజించి వేరుచేయు 'అపార్తీడు' విధానమును అమలుచేయుట ప్రారంభించిరి.

దక్షిణాఫ్రికాలోని భారతీయులవిషయములో నా ప్రభుత్వమువారవలంబించు రాజనీతినిగూర్చి ఆంతరంగికవ్యవహారములమంత్రి డాక్టర్ టి. ఈ. డోంగేస్‌గా రిట్లుచెప్పిరి. "ఈప్రభుత్వమువారి పరమలక్ష్యము భారతీయులజనసంఖ్యను వీలైనంత తక్కువగానుండునట్లు చేయుటయే." దక్షిణాఫ్రికాసమితిరాజ్యములో పాశ్చాత్యులకును భారతీయులకును మధ్య సంఘర్షణమునుగూర్చి చెప్పుచు ఈ భారతీయులు దక్షిణాఫ్రికాసమితిపైన యునైటెడ్‌నేషన్సువారిసమక్షమున మూడుసంవత్సరములనుండి నేరములు మోపుచుండుటయే దానికి కారణమనిరి. వీరు తమకష్టములనుగూర్చియు అక్కడిపరిస్థితులనుగూర్చియు అతిశయోక్తులతో చెప్పుచున్నారనియు దక్షిణాఫ్రికాలోనికి రహస్యముగా భారతదేశమునుండి క్రొత్తవారు వచ్చుచున్నారనియు, వారిట్లు చేయనిచో జాతులమధ్య విద్వేషము ప్రబలియుండదనియు చెప్పిరి.

ఇంకొకవిషయమేమనగా న్యాయశాస్త్రమునుబట్టి భారతీయులప్రతిపత్తి యెట్టిదైయున్నను వారు దక్షిణాఫ్రికాదేశప్రజలు కారనుభావము ఆ దేశములో వ్యాపించియున్నది. భారతీయసమస్య చాలావరకు ఆర్థికవిషయములపైన ఆధారపడియున్నది. దక్షిణాఫ్రికా భారతీయులనుగూర్చి చేయబడు విచారణములందు భూమిహక్కులు ప్రధానస్థానమువహించుచున్నవి. ఐరోపావారు నివసించుటకు ప్రత్యేకింపబడిన ప్రదేశములలో అందు ముఖ్యముగా నేటాలులోను ట్రాన్సువాలులోను భారతీయులు చొచ్చుకొనివచ్చుచున్నారనుభీతి తెల్లవారిలో నున్నదని వెబ్బుగారు వ్రాసియున్నారు.

దక్షిణాఫ్రికాలోని నల్లజాతివారివలన పనులుచేయించుకొనుటలోను, నల్లవారికి సరుకులమ్మి లాభముపొందుటలోను భారతీయులు పాశ్చాత్యులతో పోటీచేయుచున్నారనుకారణముననే భూస్వామ్యహక్కులవిషయములో భార

త్రియులకు వ్యతిరేకముగా తెల్లవారు శాసనములనుచేయుట ప్రారంభించినారని అప్పాస్వామిగారు వ్రాసిరి. అత్యధికసంఖ్యగల నల్లజాతులవారికి సరుకులు సరఫరాచేసి లాభముపొందుట కెవరికి హక్కుకలదు? అను విషయము లోనే ఈ తగవులు ప్రారంభమైనవని ఆయనయభిప్రాయము. మొదటి నుండియు భారతీయులపట్ల విచక్షణచూపుచు చేయబడిన నిరోధకశాసనము లను పరిశీలించినచో సమితిరాజ్యములోని తెల్లవా ో భారతీయులను ఆర్థిక ముగాను రాజకీయముగాను తమకన్న తక్కువస్థితిలోనుంచుటకే ఈశాసనము లనుచేసిరని తెలియగలదు. ఏకారణమువలన ప్రారంభమైనను భారతీయులు భూముల హక్కులకొరకు పోరులాడుచున్నకొలదియు వారికివ్యతిరేకముగా శాసనములుచేయబడుట హెచ్చుచున్నది. సమితిరాజ్యములోని భారతీయులకు 1946 సంవత్సరపు ఏషియాటికు లాండ్ టెన్యూర్ అండ్ రిప్రజెంటేషన్ ఆక్టు అనబడు చట్టములోని వర్ణవిబేధశాసనవిధులు వర్తించుచున్నవి. ఈ శాసనమును యునైటెడ్‌పార్టీ అను రాజకీయపక్షమువారు ప్రవేశపెట్టిరి. దీనివలన నేటాలులోను ట్రాన్సువాలులోను కొన్నిప్రదేశములను అన్ ఎగ్జెంప్టెడ్ ఏరియాస్(Un exempted areas)అని ప్రకటించి ఆ ప్రదేశ ములందు ఆశియావారగు భారతీయులు ఆంతరంగికవ్యవహారములమంత్రిగారి వలన అనుమతినిపొందకుండానే స్థిరాస్తిని విక్రయముపొందవచ్చునని నిర్ణ యించిరి. అనగా తక్కినచోటులలో అట్లు పొందరాదని శాసింపబడినది. పూర్వము ట్రాన్సువాలులో భారతీయులుచేయు ఆక్రమణలనుగూర్చిననిబంధ నలకు కొన్నిమార్పులుచేసి ఇనస్పెక్టరులను నియమించుట మొదలైన నిబంధనలుచేసినను భారతీయులకు స్వల్పమైన ఎన్నికహక్కునుమాత్ర మిచ్చినది.

లాండ్‌టెన్యూర్‌అడ్వైజరీబోర్డు అను నొక అధికారసంస్థను నియ మించి భారతీయులు అనుమతిపత్రములనిమిత్తము పెట్టుకొనిన దరఖాస్తుల విషయమున మంత్రిగారికి సలహానిచ్చుటకును, క్రొత్తప్రాంతములను ఎగ్జెం ప్టెడ్‌ప్రదేశములుగా నిర్ణయించువిషయమునను ఇతరవిషయములందును సలహానిచ్చుటకును ఆ చట్ట మధికారమిచ్చినది.

ఈ చట్టమునకు భారతీయులు తమఅసమ్మతిని ప్రకటించిరి. ఈ బోర్డులో అల్పసంఖ్యాకులప్రతినిధులను పేర్కొనుటకు వీ రంగీకరింపలేదు. భారతదేశప్రభుత్వమువారు ఈచట్టము శాసనముకాగానే దక్షిణాఫ్రికాలో తమప్రతినిధిని తీసివేసి ఆ దేశముతో దౌత్యసంబంధములను త్రెంపివేసి కొనిరి. భారతీయుల కా ప్రభుత్వమువా రన్యాయముచేసిరని యునైటెడ్ నేషన్సువారికి ఫిర్యాదుచేసిరి.

పూర్వము కేపురాష్ట్రములో వోటుహక్కులకర్హతగల భారతీయులను పాశ్చాత్యులతోపాటు సాధారణవోటరులజాబితాలోనే చేర్చియుండిరి. నేటాలులో ఎన్నికహక్కులను తీసివేసిన 1896వ సంవత్సరమునాటి శాసనమునకుపూర్వమే రిజిస్టరైనతప్ప సాధారణరిజిష్టరులో వారిపేర్లు చేర్చరైరి. 1946వ సంవత్సరపుచట్టముక్రింద భారతీయులు తమకు వోటరులుగానుండుటకు అర్హతకలదని రుజువుచేసినచో వారిని ప్రత్యేకనియోజకవర్గముగా వేరొక జాబితాలో చేర్చుటకు అవకాశమొసగబడినది. భారతీయులు ఒక సెనేటరును ఎన్నుకొనవచ్చును. ట్రాన్సువాలులోని భారతీయులకు నేటాలులో వలెనే వోటింగుహక్కు ఇవ్వబడినది. ఆరెంజిఫ్రీస్టేటులో పాశ్చాత్యులు కానివారెవ్వరికిని వోటుహక్కులు లేవు.

నేషనలిస్టుపక్షమువారు అవలంబించిన వర్ణభేద జాతివిభజనవిధానము నందు 1946వ సంవత్సరపు ఏషియాటిక్ లాండ్ టెన్యూర్ ఇండియన్ రిప్రజెంటేషనుచట్టమువల్ల భారతీయులకుగల వోటుహక్కులను రద్దుచేయుటకు నిశ్చయించిరి. ఆశియావారికి వ్యతిరేకముగా వీ పార్టీవారు చేయదలచిన కార్యములలో నిది మొదటిది. పార్లమెంటులో జరిగిన చర్చలందు నేషనలిస్టులు వివిధజాతులను ప్రత్యేకప్రదేశములందుంచి వారిని వేరుపరచుట కొరకు చేసిన "అపార్టీడ్" నిబంధనలను మరింత స్పష్టముగా చేయవలెననిరి. తెల్లవారు (పాశ్చాత్యులు) నివసించుప్రాంతములందు భారతీయులు భూములుకొనకుండా నిషేధించవలెనని వారుకోరిరి. వీరికి వోటుహక్కులే యుండరాదని వారు మొదట అనిరి కాని, తుదకు పార్లమెంటువారు చేయదలచినశాసనమునందు భూములవిషయమైన నిషేధములందు తాముకోరిన కఠిననిబంధనలు లేవనియు రాజకీయముగా తమకిష్టమైనదానికన్న హెచ్చు

సౌకర్యము లొసగబడినవనియు చెప్పి, ఆ చిత్తుచట్టమునకువ్యతిరేకముగా వోటుచేసిరి. భారతీయుల నా దేశమునుండి భారతదేశమునకు పంపివేయు దుమనియు లేదా భారతీయులయిష్టముతో ఇతరదేశీయులసహాకారముతోను ఇతరప్రాంతములకైనను పంపెదమనియు, నేషనలిస్టుపార్టీవారు నిశ్చయించు కొనిరి. భారతీయులను వారిదేశమునకు పంపివేయువిధానమువలననే వారి జనసంఖ్యను తగ్గింపదలచిరి. ఈలోపుగా భారతీయులను వర్ణభేద జాతివిభ జనవిధానమునందు ఇరికించి వారిపైన పూర్వప్రభుత్వమువారు చేసినదాని కన్న హెచ్చునిర్బంధములను ప్రయోగింపదలచిరి. భారతీయులను వారిదేశ మునకు పంపివేయవలెననువిధానము క్రొత్తదికాదు. 1920 ఆప్రాంతముననే స్మట్సుగా రిందులకు ప్రయత్నించిరి. నేషనలిస్టుప్రభుత్వమువా రిప్పుడు రెండువిధములైన పద్ధతులను ప్రయోగించుచున్నారు. వీలైనంతమంది భార తీయులను వారిదేశమునకు పంపివేయుటకు వారికి ధనపరిహారమునిచ్చి సహాయముచేయుట మొదటిపద్ధతి. రెండవపద్ధతి, ఈదేశములోనున్న భారతీ యులహక్కులను తీసివేసి వారిని తక్కువస్థితికి దింపుట. దీనివలన భారతీయులు తమదేశమునకైనను పోవలెను లేదా ఈ క్రొత్తపరిస్థితుల కంగీకరించి హీనస్థితిలోనైన ఉండవలెను. వీరిస్థితి మిశ్రమజాతిరంగువారికిని నల్లవారికినిమధ్య నొకస్థాయిలో నుండును. నేషనలిస్టుప్రభుత్వమువారి వర్ణ భేదవిధానమునందు భారతీయులకు ఎన్నికహక్కులేయుండదవని చెప్ప వచ్చును. ఈవిషయమున వారు నల్లవారికన్నను అధమస్థితిలోనుందురు. అయితే భారతీయులు తమకుప్రత్యేకింపబడిన ప్రదేశములందుమాత్రము భూములు విక్రయముపొంది, హక్కులుకలిగియుండవచ్చును. ఇది నల్లవారి కన్న ఆర్థికముగా కొంచెము అధికస్థాయిగా నుండును,

భారతీయులు దేశమువదలిపోవునట్లు పాశ్చాత్యులుచేయు ప్రోత్సాహ పద్ధతివలన ప్రయోజనము కలుగనిచో, నేషనలిస్టుపార్టీవారు వారిని రాజకీయ ముగను ఆర్థికముగను చాలా హీనస్థితికిదింపి వా రేవిధముగను పాశ్చాత్యు లతో పోటీచేయవీలులేనట్లుచేసి, వారివలన ఎట్టిభయము లేకుండాచేయు దురు. పార్లమెంటులో భారతీయులకు ప్రాతినిధ్యము లేకపోవుటకుతోడు

వారికిసంబంధించిన భూస్వామ్యశాసనములను మఱింతకఠినముగా చేయ దలచిరి.

పూర్వము యునైటెడ్‌పార్టీవారు భారతీయులస్థితిని కొంచెము చక్క చేసి సంఘసంక్షేమము కలిగించుటకు వారికుటుంబములకు అలవెన్సుల నిచ్చుచుండిరి. ఈ అలవెన్సుల నిప్పుడు నేషనలిస్టుపక్షమువారు తీసివేయు టకు నిశ్చయించిరి. వీరి కట్టి అలవెన్సులిచ్చుటవలన వీరిఆర్థికస్థితి చక్క బడకపోవుట యటులుండగా వీ రా సొమ్ముతో బహుభార్యలను వివాహ మాడి జనసంఖ్యను పెంచుచున్నారని, నేషనలిస్టుపక్షమువా రనిరి. కేపురాష్ట్రి ములో భారతీయులకన్న హెచ్చుజనసంఖ్యగల మిశ్రమజాతిరంగుప్రజల కివ్వబడుఅలవెన్సులు భారతీయులకిచ్చుసొమ్ములో మూడవవంతుమాత్రమే యున్నదని అంకెలను చూపిరి.

దక్షిణాఫ్రికాప్రభుత్వమువారు భారతీయులపట్ల గావించిన అక్రమపు శాసనములకు భారతీయులు లోబడక దానిని ప్రతిఘటించిరి. పాశ్చాత్యులతో పాటు తాముకూడా సాధారణ వోటరులజాబితాలో రిజస్టరుచేయబడుటకు హక్కుకలదని వాదించి భారతీయులు తమ కా దేశములో కలుగుచున్న అన్యాయములనుగూర్చి ఫిర్యాదుచేయగా అది 1946 నుండి యునైటెడ్ నేషన్సు అసెంబ్లీసభవారిసమావేశములలో చర్చనీయాంశముగా వచ్చుచునే యున్నది. ఇది దక్షిణాఫ్రికాప్రభుత్వమువారికి కోపకారణమైనది.

1949 జనవరినెలలో డర్బనులోని భారతీయులపైన నల్లవారు దౌర్జ న్యములుగావించిరి. నల్లవారు తండాలుగా బయలుదేరి భారతీయులఆస్తిని తగులబెట్టిరి. చాలామంది భారతీయులను హత్యచేసిరి. వారిఅంగళ్ళను నాశ నముచేసిరి. వందలకొలది భారతీయులను నగరమధ్యమున అటకాయించి హింసించిరి. ఈ అల్లరులఫలితముగా 142 మంది భారతీయులు చనిపోయి నట్లును 1087 మంది గాయపడినట్లును లెక్కతేలినది. ఈ దౌర్జన్యములను తెల్లవారే చేయించినారని రష్యాప్రతినిధి వాదించెను. ఇది నిజమైనను కాక పోయినను, ఈ దౌర్జన్యములు యునైటెడ్‌నేషన్సు అసెంబ్లీలోని వివిధ దేశముల ప్రతినిధులకు దక్షిణాఫ్రికావారిపైన అసహ్యమును కలిగించెను. అందువలన యునైటెడ్‌నేషన్సువారు ప్రపంచములోని ప్రజలస్వాతంత్ర్య

ములనుగూర్చి చేసిన ప్రకటననుగూర్చినఅన్వయమునందు దక్షిణాఫ్రికా వారికి వ్యతిరేకముగా వోటుచేసిరి.

ఏదియెట్లున్నను దక్షిణాఫ్రికాలోని నల్లవారికి భారతీయులపైన కొంత ద్వేషభావము ప్రబలియున్నట్లు నిదర్శనములున్నవి. డర్బనులోజరిగిన దౌర్జన్యము జూలూజాతివారు చేసిరని, భారతీయులు జూలూస్త్రీలపైన దౌర్జన్యము చేయుచున్నారని వారు నిందించిరని, భారతీయవర్తకులు నల్లవారిరిజర్వులను ప్రత్యేకనివేశనములందు చాలా హెచ్చుధరలకు నాణ్యముగానిసరుకులను విక్రయించి అమితలాభము లార్జించుచున్నారనికూడా వారు నిందించుచుండిరని, సమితిప్రభుత్వమువారు నల్లవారికన్న భారతీయులకు హెచ్చు గౌరవ ప్రతిపత్తులనొసగిరను కారణమువలనకూడా వారికి కోపముగానుండెనని ఈ దౌర్జన్యములకారణములను గూర్చి విచారించినసంఘమువారికి తెలియవచ్చెను.

భారతీయులపైన నల్లవారికిగల ముఖ్యమైన ద్వేషకారణము ఆర్థికముగా భారతీయులుచేయు పోటీవ్యాపార వ్యవహారములేయని చెప్పవచ్చును. రవాణాల మంత్రి పాల్ సవర్ (Sauer)గారు మాటలాడుచు "నల్లవారునివసించు ప్రాంతమునందు డర్బనులోని ఒక బస్సుసర్వీసును భారతీయులు నడుపుచున్నారనియు, ఆ సర్వీసు నల్లవారికే యిచ్చినచో వారికి భారతీయులపైనగల అసూయ తగ్గియుండెడిదని"యు ఆయన చెప్పిరి.డర్బనులో జరిగిన దౌర్జన్యములఫలితముగా ప్రభుత్వమువా రాప్రాంతమున బస్సులైసెన్సును నల్లవారికిచ్చిరి. అవసరమైనచో రోడ్డుట్రాన్సుపోర్టుచట్టమును సవరించుటకు నిశ్చయించిరి. ఇంకొకవిషయమేమనగా పూర్వమువలెగాక ఇటీవల నల్లవారిలో కొంత ఆత్మవిశ్వాసము కలిగినది. తాముకూడా తమస్థావరములందు ఖారీవ్యాపారములు వృత్తులు నిర్వహింపగలమనియు వానికి తమకు లైసెన్సులివ్వకుండా భారతీయులకు ఇచ్చుట అన్యాయమనియు వారిలో అసంతృప్తి కలిగినది. ఇట్టి వ్యాపారవృత్తులవలన లభించులాభము తమజాతివారికే చెందవలెనని వారియుద్దేశము. డర్బను దౌర్జన్యములవలన నింకొకసంగతి స్పష్టమగుచున్నది. నల్లవారు తమకు జరుగుచున్న అన్యాయములకు ప్రభుత్వము

వారిపైన తమ ఆగ్రహముచూపలేక, భారతీయులపనిపట్టించిరనికూడా విదితమగుచున్నది.

నల్లవారికేగాక మిశ్రమజాతి రంగుజాతి ప్రజలకుకూడా భారతీయులపైన అసూయత వర్ధిల్లినది. వర్తకవ్యాపారములం దీ రంగుప్రజలు భారతీయులతో సమానమైన శక్తిసామర్థ్యము కలవారు. అందువలన వారీ భారతీయులను తమపోటీదారులని ద్వేషించిరి.

1948లో నొక రంగుజాతివారి ప్రతినిధివర్గము ఒక మెమోరాండమును తయారుచేసి భారతీయులు మిశ్రమజాతిరంగువారుండు ప్రదేశములలోనికి చొచ్చుకొనివచ్చి వర్తకవ్యాపారములందు తమకు అన్యాయముచేయుచున్నారని వారు చెప్పిరి. భారతీయులు తమకడ్డురానిచో తాము వర్తకవ్యాపారములందు అభివృద్ధిచెందగలమనియు, ఈ భారతీయులను తమమధ్యనుండి తొలగించుట ప్రభుత్వమువారి పరమధర్మమనియు వారనిరి.

ఏమైననేమి, ఈపరిస్థితులలో నల్లజాతివారును మిశ్రమజాతి రంగు ప్రజలునుకూడా భారతీయులకు సంబంధించినంతవరకు ప్రభుత్వమువా రవలంబించిన వర్ణభేదజాతివిభజన 'అపార్తీడ్' విధానమును సమర్థించుచున్నారు॥

# ఆఫ్రికా జాతియోద్యమము

## ఏడవ ప్రకరణము

### ఆఫ్రికా జాతీయ కాంగ్రెసు

దక్షిణాఫ్రికాలోని కేపుకాలనీ ట్రాన్సువాలు ఆరెంజిఫ్రీస్టేటురాజ్యము అను వలసరాజ్యములను కలిపి 1910లో దక్షిణాఫ్రికాసమితి అను బ్రిటీషు అధినివేశరాజ్యము స్థాపింపబడినది. ఆ రాజ్యాంగచట్టమునుబట్టి ఆ రాజ్యమునకు బ్రిటీషుసామ్రాజ్యాంతర్భాగముగ సంపూర్ణస్వాతంత్ర్యము లుండెను. అందువలన ఆ సమితిప్రభుత్వమువారు దేశీయులైన నల్లవారిపట్ల ఎంత అన్యాయముగా ప్రవర్తించినను, వారి ఆంతరంగికవ్యవహారములందు తాము జోక్యముకలిగించుకొనకూడదనుసూత్రముపైన ఇంగ్లాండులోని బ్రిటీషు సామ్రాజ్యప్రభుత్వమువారు చూచుచు ఊరకొనుచుండిరి.

సమితిప్రభుత్వమువారు దక్షిణఆఫ్రికాలోని నల్లవారికి ఆ దేశపు పార్లమెంటులో ప్రాతినిధ్యమును తీసివేయగా నల్లవారు లండనునగరమునకొక రాయబారవర్గమును పంపి, దీనినిగూర్చి మొరపెట్టుకొనినను లాభము లేకపోయెను. కేపురాజ్యములో కొన్నివేలమంది ఆఫ్రికావారికి పూర్వముండిన వోటుహక్కుమాత్రము మిగిలెను. బ్రిటీషువారిన్యాయమునందు ఆఫ్రికావారికుండిన నమ్మకము అంతరించెను. అంతకుపూర్వము తమహక్కులను బ్రిటీషుసామ్రాజ్యమువారు కాపాడుదురను నమ్మకముపోయి ఇక తమదారిని తాము చూచుకొనవలసినదేయని నల్లవారు గ్రహించిరి. లండన్‌నగరమున ఉన్నతన్యాయశాస్త్రవిద్య నభ్యసించిన ఆఫ్రికాదేశములోని జూలూయువకుడైన పిక్సులే కా ఇజకా సేమ్ అను నతడు 1910లో తనదేశమునకు తిరిగి వచ్చెను. ఇంగ్లాండులో తనకుండిన గౌరవప్రతిపత్తి యిక్కడ లేకపోవగా

అన్నిచోటులలోని తెల్లవారును తనను నీచముగా చూచుట నితడు గమనించెను. అంతట నితడు దక్షిణాఫ్రికాలోని మూడునల్లజాతులకుచెందిన ముగ్గురు న్యాయవాదిస్నేహితులతో కలిసి ఆలోచించి, మనలో నైకమత్యములేనందు వలననే మనము వెనుకబడియున్నామనియు మనమందరము నొకేజాతి ప్రజలమనుభావముతో మెలగవలెననియు నుద్బోధించుచు ఆఫ్రికా జాతీయ వార్తాపత్రికలో నొక ప్రకటనము గావించెను. అంతకుముందు దేశములో చిన్నచిన్న ప్రజాసంఘములుండెను. ఆఫ్రికాజాతుల నాయకులసభయొకటి 1912లో బ్లూంఫాంటీన్‌లో సమావేశమయ్యెను. నల్లజాతులనాయకులు, న్యాయవాదులు, ఉపాధ్యాయులు, క్రైస్తవమతాధికారులు, గుమాస్తాలు మొదలైన వారు సమితిలోని నాలుగురాష్ట్రములనుండి వచ్చిరి. జాతియైక్యతనుస్థాపించి తమహక్కులను సంరక్షించుకొనుటకు ఒకజాతీయసమితిని స్థాపించుటకే ఇక్కడ సమావేశమైతిమని సేమ్ ఉపన్యసించెను. చిన్నచిన్న ప్రజాసంఘములను చేర్చి "సౌత్‌ఆఫ్రికన్ నేటివ్ నేషనల్‌కాంగ్రెస్" అను జాతీయ సంస్థ స్థాపింపబడెను. ఇది కొంతవరకు అమెరికారాష్ట్ర కాంగ్రెసుపద్ధతి పైనను కొంత ఇంగ్లీషుకామన్సుసభపద్ధతిపైనను నిర్మింపబడెను. గొప్పగొప్ప ఆఫ్రికాజాతీయప్రముఖులు వెనుకనుండి సలహాలనొసగిరి.

కాంగ్రెసుసంఘము నభివృద్ధిచేసి ఒకరాజ్యాంగమును నిర్మించుట కై దేండ్లుపట్టినది. దక్షిణాఫ్రికాలోని వివిధజాతుల నల్లవారి నేకముచేయుటయు, ఆఫ్రికాదేశీయుల ఆశయములసుగూర్చి ప్రజలలో ప్రచారముచేయుటయు ప్రభుత్వకార్యాలయములందుగాని పార్లమెంటుకుగానినల్లవారిపక్షమున ప్రాతినిధ్యమువహించి కార్యములుజరుపుటయు, ఆఫ్రికాదేశీయులక్షేమము కొరకు అభివృద్ధికొరకు పాటుపడుటయు కాంగ్రెస్‌యొక్క ఉద్దేశములని నిర్ణయించిరి. దాని కొక కార్యనిర్వాహకవర్గము నేర్పరచిరి. కాంగ్రెస్‌నాయకులు చాలామంది ఆఫ్రికాదేశములోని వివిధజాతుల పూర్వనాయకులవంశీయులుగ నుండిరి. అందువలన ప్రజలకు వీరియందు గౌరవముండెను. ఇందలిసభ్యులు వివిధపట్టణములందు కూలి వగైరా పనులుచేయు నల్లవారు. ఈసంఘము క్రమక్రమముగా నభివృద్ధిచెందెను. దీనికి దేశములోనిపరిస్థితులే తోడ్పడెను.

దక్షిణాఫ్రికాసమితిప్రభుత్వమువారు నల్లవారిహక్కులకు భంగకర ములగు శాసనములనుచేయుటకు పూనుకొనిరి. అట్టిశాసనములలో నేటివ్స్ లాండ్ ఆక్టు అను భూమిహక్కులచట్టము 1913లోనే శాసనముగాచేయ బడెను. దీనిప్రకారము నల్లవారికొరకు ప్రత్యేకింపబడిన "రిజర్వు"లను ప్రత్యేకప్రదేశములందుతప్ప వీరు మరెక్కడను భూములను కొనరాదని నిషేధించిరి. దేశములో నాలుగింట మూడువంతుజనసంఖ్యగల నల్లవారికి దేశముమొత్తమువిస్తీర్ణములో పదమూడువంతులుమాత్రమే ప్రత్యేకింప బడెను. దీనినిబట్టి పెక్కువేలమంది నల్లవారు వెళ్ళగొట్టబడిరి. అంతట నల్లవారు మేల్కొనిరి. కాంగ్రెసునాయకులు కింబర్లేనగరమున సమావేశమై ఈ అన్యాయములనుగూర్చి కేపుటవుననగరముననున్న ప్రధానమాత్యునికొక విన్నపమును పంపిరి. లండనులోని బ్రిటీషుసామ్రాజ్యప్రభుత్వమువారి కొక ప్రాతినిధ్యము నంపిరి. కాని ఎట్టిప్రయోజనమును కలుగలేదు. ఇంతలో 1914లో మొదటిప్రపంచయుద్ధము ఐరోపాలో ప్రారంభమయ్యెను. దేశాధి మానముగ ఆఫ్రికాదేశీయులు బ్రిటీషువారిపక్షమున యుద్ధమునందు పాల్గొందు మని ముందుకువచ్చిరి. కాని, తెల్లవారీ నల్లవారిని సైన్యమున జేరనివ్వ రైరి. అయితే ఐరోపాయుద్ధభూములందు జర్మనీవారి ఫిరంగివర్షమునుండి తప్పించుకొనుటకు బ్రిటీషుసైనికులు దాగియుండుటకై త్రవ్వవలసిన కంద కములుత్రవ్వుటకును ఇతరపనులుచేయుటకును ప్రాణములకుతెగించి చేయ వలసిన కష్టపుబనులు చేయుటకుమాత్రము ఆఫ్రికావారిని నియమించిరి. ఆసందర్భములో దక్షిణాఫ్రికానుండి నల్లవారెక్కిపోవునౌకలలో నొకటి మెండియన్ అనుపేరుగలది సముద్రమున మునిగిపోయెను. అందులో నైదువందలమంది నల్లవారు ప్రాణములను గోల్పోయిరి. ఇది ఆఫ్రికాదేశీ యులలో గొప్పసంచలనము కలిగించెను. పాశ్చాత్యజాతులవారికొరకై నల్ల వారిట్లు స్వార్థత్యాగముచేయుచున్నను తెల్లవారు వీరిపట్ల అన్యాయము చేయుట మానలేదు.

దక్షిణాఫ్రికాసమితి ప్రధానమంత్రియైన జనరల్ స్మట్సుగారికి ఇం గ్లాండుదేశమున బ్రిటీషుసామ్రాజ్య సభలందు గొప్ప పలుకుబడియుం డెను. ఆయన 1917లో లండనునగరమున ప్రసంగించుచు "దక్షిణాఫ్రి

కాను తెల్లవారిరాజ్యముగాచేయుటయే తమలక్ష్యమనియు, అయితే అది యింకను నల్లవారిదేశముగనే యున్నదనియు చెప్పి వగచెను.

ఆఫ్రికాదేశీయులు బ్రిటీషుసామ్రాజ్యాధీశుడగు ఐదవ జార్జిచక్రవర్తి పరిపాలితప్రజలుగా బ్రిటీషుసామ్రాజ్యపౌరులై యున్నారనియు ఆఫ్రికాజాతి వారికిగల హక్కుల నపహరించుటకు స్మట్సుగారికిగాని దక్షిణాఫ్రికాసమితి ప్రభుత్వమువారికిగాని అధికారములేదనియు ఆఫ్రికాకాంగ్రెసువా రొకతీర్మాన మును చేసిరి.

ఐరోపాసంగ్రామానంతరము జరిగిన సంధిసమావేశములందు తెల్ల వారిప్రతినిధులే పాల్గొనిరి గాని, నల్లవారిప్రతినిధులకు స్థానమేలేకపోవుట చూచి, ఆఫ్రికాదేశీయు లెంతో బాధపడిరి.

కాంగ్రెసు ప్రతిసంవత్సరమును సమావేశమగుచు నేవో కొన్ని తీర్మానములను గావించుచుండెను. "ప్యాసులు" అనుమతిపత్రములులేకుండా నల్లవారు ప్రయాణముచేయరాదను నిషేధము అన్యాయమని తలచి, దీనిని గూర్చి కాంగ్రెసువారు 1919లో నొక అసమ్మతిసూచకప్రదర్శనము నేర్పాటుచేసిరి వేలకొలది ఆఫ్రికాజాతివారు జోహానసుబర్గులోని కాంగ్రెసు కార్యాలయముదగ్గర చేరి తమ అనుమతిపత్రములను కాంగ్రెసు"పికెట్లు" కిచ్చివేసిరి. బ్రిటీష్‌రాజభక్తినినాదములు గావించిరి. ఇంతలో పోలీసువారు వచ్చి తమ బేటన్‌లాటీలతో వీరినికొట్టి అనుమతిపత్రములేనివారిని అరెస్టు చేసిరి. దీనిఫలితముగా దౌర్జన్యముతో దొమ్మిజరిగెను. అంతట 700 మందిని అరెస్టుచేసి ఖైదులోనుంచిరి.

స్మట్సుగారు దేశములో తిరుగుబాటులనుసహింపక అతితీవ్రముగా అణచివేయుచుండిరి. ఆయనకాలమున చాలా తీవ్రమైనచర్యలను తీసికొని యుండిరి. బుల్‌హోకులో 1921లో నల్లవారు ప్రార్థనలనుచేయుటకు సమా వేశమైనప్పుడు దొమ్మిజరిగినదనునెపమున 163 మందిని వధించిరి. 1922లో గనులలోజరిగిన పెద్దసమ్మె నణచుటకు నాయకులుగానుండిన తెల్లవారినికొం దరిని ఉరిదీసి, కొందరిని ద్వీపాంతరవాసమునకంపిరి. కుక్కలపన్నులివ్వక నిరాకరించిరనునెపమున నూరుమంది హాటెంటాటులను 1924లో చంపిరి.

ఈ అత్యాచారములవలన నల్లవారు భయపడిపోయి పైకి నెమ్మదిగానున్నను లోలోపల కుములుచుండిరి.

1924లో స్మట్సుగారు పదచ్యుతులైరి గాని నల్లవారిబాధలు తప్ప లేదు. ఆయనతరువాత ఆఫ్రికేనరు నేషనలిస్టుపక్షమువారును తెల్లలేబరు పక్షమువారును ఏకమై నల్లవారిని అదుపులోనుంచుటకు పూనుకొనిరి. నల్ల వారుతెల్లవారిని నమ్మిరి గాని, వారుమాత్రము వీరిని దగ్గరకురానివ్వలేదు.

'ఇండస్ట్రియల్ కమ్మర్షియల్ వర్కర్సుయూనియన్' అను నొక పారిశ్రామికసంఘము తలయెత్తి కాంగ్రెసును వెనుకకుత్రోసెను. ఇంతలో కమ్యూనిస్టుపక్షముకూడా పలుకుబడిని సంపాదించెను. ప్రపంచములోని పని వారందరు నేకముకావలెనను నినాదము బయలుదేరెను. అయితే తెల్లవారైన శ్రామికులు స్వార్థపరులైరి. కమ్యూనిస్టులు నల్లపనివారికి రాత్రిపాఠశా లలుపెట్టి వారిలో కొంత రాజకీయపరిజ్ఞానము కలిగించిరి.

తెల్లజాతులసమ్మేళనపక్షమున దక్షిణాఫ్రికాసమితిరాజ్యమునకు ప్రధానమంత్రియైన హెర్టుజాగ్‌గారు వర్ణభేదవిధానమును స్థిరముగాను గట్టి గాను అమలుజరిపి నల్లవారిని బాధించు చట్టములనుచేయుట ప్రారంభించిరి.

నేటివ్ టాక్సేషన్‌చట్టమువలన నల్లవారిచదువుకగువ్యయమును నల్లవారే భరింపవలెనని శాసించిరి. అనగా నల్లవారివిద్యకొరకు ఏర్పాటులు చేయుటకొరకై నల్లవారు హెచ్చుపన్నులు ఇచ్చుకొనవలెను.

వర్ణభేదశాసనము (Colour Bar Bill) వలన ఆఫ్రికావారు ప్రవీణపరిశ్రమలలోగాని కొంతప్రావీణ్యముకావలసిన వ్యాపారములలోగాని పనిచేయుటకు వీలులేకుండా నిషేధములుచేసిరి. 1927 సం॥ నేటివు అడ్మి నిస్ట్రేషన్‌చట్టము ఆఫ్రికాజాతుల నాయకులను గవర్నరుజనరలుయొక్క నౌకరులుగా చేసివైచెను. ఎవ్వరైనను నల్లవారికిని తెల్లవారికినిమధ్య వైష మ్యమును పురికొల్పుమాటలనాడినగాని చర్యలుజరిపినగాని వారి కొకసంవ త్సరము మించకుండా కారాగారశిక్షను నూరు నవరసులు జరిమా నాయును విధింపవచ్చునను నిబంధనచేసి నల్లవారికి వాగ్బంధనముగావించిరి. వారి పక్షమునవాదించు ధర్మాత్ములగు తెల్లవారికికూడా నిది వర్తించును.ఈక్రొత్త చట్టములు తెల్లవారికిని నల్లవారికినిమధ్యనేగాక నల్లవారికి నల్లవారికికూడా

విరోధభావము కలిగించెను. గ్రామములందలిప్రజలు తమజాతులనాయకుల పట్ల భయభక్తులు కలిగియుండిరి. పట్టణములందలినల్లవారు స్వతంత్రులై వారిని తృణీకరింపసాగిరి. ఆఫ్రికాలో నల్లజాతినాయకుడగు గుమెడ్‌గారు రష్యాదేశమునకు పోయి, అక్కడి సమానత్వమునుచూచి ముగ్ధుడయ్యెను. అయితే పూర్వాచారములకుకట్టువడిన ఆఫ్రికాదేశపు నల్లజాతులనాయకుల తోను కాంగ్రెసులోనున్న వారిఅనుచరులతోను అతనికి తగవులువచ్చెను. క్రొత్తచట్టములు వారికి బలమిచ్చెను.

1929లో ఆఫ్రికేనరుపక్షముతరపున హెర్టుజాగుగారు స్వతంత్రము గనే ప్రధానమంత్రిత్వమువహించుటతో ఆఫ్రికాలోని నల్లజాతివారిని అణచ వలెననుఉద్దేశమును పూర్తిగా నెరవేర్చుట కవకాశముకలిగెను. ఆ సంవత్స రాంతమున కమ్యూనిస్టులు ఆఫ్రికాబీర్‌హాల్సు బహిష్కరణోద్యమమును లేవదీసిరి. నల్లవారు సారాయితయారుచేసికొనకుండా ప్రభుత్వమువారు నిషే ధములనుచేసి, తమఅధ్వికారముక్రింద సారాకొట్లుపెట్టి లాభముతీయుచుండిరి. దీనిని నల్లవారు ప్రతిఘటించిరి. ఆఫ్రికావారిని తలపన్ను ఇవ్వవలదని కమ్యూ నిస్టులు ప్రోత్సహించిరి. పన్నులివ్వనివారియిండ్లను న్యాయశాఖామంత్రి సోదా చేయించెను. ఆఫ్రికాజాతివారు గుంపులుగా చేరగా వారినిచెదరగొట్టుటకు 'టియర్‌గ్యాస్'బాంబులు వేయించెను. ఈ అల్లరికి కమ్యూనిస్టులే కారకులని హెర్టుజాగుగారు ప్రకటించి, దానినిఅణచుటకు దొమ్మిసమావేశములచట్టము సవరణబిల్లు అనుదానిని 1930 ఫిబ్రవరినెలలో శాసించిరి. ఇది న్యాయ శాఖామంత్రి సామాన్యన్యాయస్థానముల అధికారమును తృణీకరించి, వైష మ్యభావములను ప్రోత్సాహింపగలరని తోచిన వ్యక్తులను ఏజిల్లానుండియై నను వెళ్ళగొట్టుట కతని కధికారమిచ్చెను.

కమ్యూనిస్టులు దీనికిభయపడక 1930 డిశంబరులో నల్లవారు ప్రయా ణముచేయుటకు పొందవలసిన అనుమతిపత్రములను తగులబెట్టుఉద్యమ మును ప్రారంభించిరి. చాలచోట్లలో నీ యుద్యమము విఫలమయ్యెను గాని, డర్బనునగరములోని ఆఫ్రికావారిలో చాలామంది తమ అనుమతి పత్రములను వాలంటీరులకు ఇచ్చివేసిరి. అంతట అనుమతిపత్రములు లేని

వారిని పోలీసువారు పట్టుకొని కొట్టసాగిరి. అప్పు డొక దొమ్మి జరిగెను. అందులో నలుగురను పోలీసువారు తుపాకులతో కాల్చిచంపిరి.

అనుమతిపత్రములను తగులబెట్టుట అక్కడక్కడ సాగుచునే యుండెను. న్యాయశాఖామంత్రి పిరోగారు వేలకొలది ఆఫ్రికావారిని అరెస్టు చేయించి, రెండువందలమంది కమ్యూనిస్టులను ప్రవాసమంపిరి. అంతట నీ యుద్యమ మంతరించెను. అయితే దీనివలన ఫలితములేకపోలేదు. ఈ యుద్యమము ఆఫ్రికాదేశీయులకు రాజకీయపోరాటములందు మంచి తర్ఫీయతునిచ్చినది. గొప్ప యుపన్యాసములిచ్చుట, ప్రజలనుకూడగట్టుట మొదలగు రాజకీయాందోళనవిధానములు ఆఫ్రికావారికి అలవడెను. అయితే సహజముగా పూర్వాచారములందు అభిమానముగల ఆఫ్రికాదేశీయులలో కమ్యూనిస్టుసిద్ధాంతములు అభివృద్ధిచెందలేదు. పూర్వవంశీయులైన జాతినాయకులందును క్రైస్తవమతమందును ఆఫ్రికావారికి భయభక్తులుండెను.

ఇట్లు దేశములో సంక్షోభము చెలరేగుచుండగా ఆఫ్రికావారిలో ప్రతిఘటనశక్తి అభివృద్ధిచెందుటకు అవకాశములు కలుగుచుండెను. విద్యయు నభివృద్ధిచెందుచుండెను. తెల్లవారినగరములవిభవమునుచూచి మొదట ఆశ్చర్యముచెందిన ఆఫ్రికావారు అందులో తమకు ప్రవేశములేకుండుటచూచి విషాదమును పొందిరి.

చదువుకొనిన ఆఫ్రికావారు తెల్లవారినాశ్రయించి లాభముపొందచూచుటవలన చదువురానివారికిని చదువుకొనినవారికిని అభిప్రాయభేదములు, సంఘర్షణములు కలుగుచుండెను.

ఈ పరిస్థితులలో హెర్టుజాగుగారు తెల్లవారినందరిని ఏకముచేయగా చదువుకొనిననల్లవారి ఆశ లడుగంటెను. కొంచెముచదువుకొనిన నల్లవారు సాధారణముగా పాశ్చాత్యనాగరికతకు అలవాటుపడి తెల్లవారితో మంచిగానుండి ఏదోవిధముగా వారివలన కొన్నిసౌకర్యములుపొందుటకు ప్రయత్నించుచు తీవ్రమైన రాజకీయఆందోళనమునుజరుపుట కిష్టపడకుండిరి. సాధారణముగా పట్టణములలోని నల్లవారిబ్రదుకంతయు తెల్లవారిపైననే ఆధారపడియుండెను. నల్లవారికోర్కెలను తెల్లవారు పూర్తిగా తిరస్కరింపరని

వారినమ్మకము. అయితే ప్రతివిషయమునను వ్యాకి ఆశాభంగమే కలుగు చుండెను.

కేపురాష్ట్రములో నిదివరకు నల్లవ్యాకి వోటుహక్కులుండెను. నల్ల వోటరులు పదునొకండువేలమందియే యుండిరి కాని, అందులో సమితిలో కెల్ల విద్యావంతులనియు మర్యాదస్థులనియు పేరుపొందిననల్లవా రుండిరి. వ్యాకిగల వోటుహక్కులవలన నల్లవ్యాకి హెచ్చులాభము లేకపోయినను తెల్లవారి ప్రజాప్రభుత్వవిధానమునందు నల్లవ్యాకికూడా కాలుపెట్టుటకైనను కొంత అవకాశమున్నదని సంతోషించుచుండ్రి.

ఈపరిస్థితులలో "ఉమ్మడివోటర్ల జాబితాలలోనున్న నల్లవోటరుల పేర్లు తొలగించుటకును, నల్లవ్యాకి ప్రత్యేకింపబడిన (రిజర్వులు) నూటికి ఏబదివంతులు పెంచుటకును"అని హెర్టుజాగుగారు పార్లమెంటులో రెండు బిల్లులను ప్రవేశపెట్టుటకు 1935లో నిశ్చయించిరి. ఇంతవరకును నిద్రపోవు చున్న ఆఫ్రికావారిప్రజాసంఘములు ఈ క్రొత్తచట్టములవలన కలుగబోవు అపాయమును గ్రహించి మేల్కాంచి, కాంగ్రెసునాయకత్వమున 1935 డిశంబరులో బ్లూంఫాంటీనునగరమున అఖిల ఆఫ్రికాప్రజలసమ్మేళన మహా సభ నొకదానిని ఏర్పాటుచేసిరి. ఇంతవర కెన్నడు నింత గొప్పసభ సమా వేశముకాలేదు. సమితిలోని అన్నిప్రాంతములనుండియు 500 మంది ప్రతి నిధులు వచ్చిరి. దేశములోనినల్లవారిలో ముఖ్యులందరును సభకు హాజరైరి అట్టివారిలో ప్రొఫెసర్ జబావుగారొకరు. తేమా, మ్సిమంగు, బొక్వే, మొరొకా మొలెమ, క్యూమా, మాత్యూస్ కుటుంబముల వారు సభకు వచ్చిరి.

ఈ సమితిసభలో నల్లవారు తమవిషాదమును ప్రకటించుచు ఉపన్యా సములొసగ్రి. కేపుటవునులోనున్న ప్రధానమంత్రి జనరల్ హెర్టుజాగుగారి దగ్గర కొక ప్రతినిధివర్గమును రాయబారమంపుటకు నిశ్చయించిరి.

హెర్టుజాగుగారు గొప్ప రాజ్యతంత్రజ్ఞుడు. తెలివైనవాడు. తన దగ్గరకు రాయబారముగావచ్చిన నల్లవారితో నతడు చాలా మర్యాదగా మాటలాడినాడు. అంతట వా రుబ్బిపోయిరి. అతడు కొందఱు తెల్లపార్ల మెంటుసభ్యులను పంపి, ఈ నల్లవారిలో అమాయకులైన కొందఱుపెద్ద మనుష్యులతో రాజీమాటలు సాగించెను. ఈ క్రొత్తశాసనములవలన నల్ల

వారి కెట్టినష్టమును కలుగదనియు, ఉమ్మడివోటరులజాబితాలోనుండి నల్ల వారిపేర్లు తొలగించి, వారిపేర్లు ప్రత్యేకవోటరులజాబితాలో చేర్పుదురనియు వారు కొందఱుతెల్లవారిని పార్లమెంటుకు తమప్రతినిధులుగా నెన్నుకొన వచ్చుననియు, ఇదిగాక ఆఫ్రికావారికిసంబంధించిన విషయములనుగూర్చి ప్రభుత్వమువారికి సలహానొసగుటకై నేటివుప్రతినిధులసంఘము నొకదానిని నిర్మింతుమనియు ఆ సభకు నల్లవారు తమప్రతినిధులుగా నల్లవారినే ఎన్ను కొనవచ్చుననియు అందువలన ప్రధానమంత్రిగారు ప్రతిపాదింపబోవు క్రొత్తబిల్లులు శాసనమగుట కభ్యంతరములుచెప్పక అంగీకరింపవలసిన దనియు నల్లవారిరాయబారవర్గములోని సభ్యులగు జబావు, మహాబసెన్ గార్లను మొగమాటపెట్టిరి. వారు మాటలాడలేకపోయిరి.

తరువాత రాయబారవర్గములోని తక్కిన ప్రతినిధులను ప్రధానమంత్రి మఱల పిలిపించి ఆ రాయబారవర్గమువా రా వ్యవహారము నింత సౌమ్య ముగ రాజీగా పరిష్కరించినందులకు తసకృతజ్ఞతను దెలిపెను. ఆ ప్రతి నిధుల కిది అర్థముకాలేదు. బయటకువెళ్ళినపిమ్మట ఏమిరాజీ? ఎవరు పరి ష్కారముచేసికొనిరి? అని తర్జనభర్జనలుచేసికొనగా తుదకు జరిగినమోసము బయల్పడెను.

1936లో (ఆల్ఆఫ్రికన్‌కన్వెన్షన్) అఖిలఆఫ్రికా ప్రజాసంఘసమితి సమావేశము జరుగునప్పటికి క్రొత్తబిల్లులు శాసనములైపోయెను. అయి నను కన్వెన్షన్‌సమావేశమువలన దేశీయులమనోభావములు ఐకమత్యము వెల్లడియయ్యెను. ఆ సమావేశమునకు దేశములోని 112 ప్రజాసంఘములు తమప్రతినిధుల నంపెను. కాంగ్రెస్‌వారి స్థానికశాఖలుకూడా ప్రతినిధుల నంపెను.ఆ కన్వెన్షనుకు ప్రతినిధులుగవచ్చిన దేశీయడాక్టరులు న్యాయవాదులు ఉపాధ్యాయులు దానికి గౌరవప్రతిపత్తిని కలిగించిరి. అయితే త్వరలోనే దేశీ యులలో అభిప్రాయభేదములుకలిగి ఐకమత్యము నశించెను.కొందఱు శాసన ములనుబట్టి పార్లమెంటుకు తెల్లవారినెన్నుకొనుటకునుదేశీయప్రతినిధిసంఘ ములకు నల్లవారినెన్నుకొనుటకునుజరుగుఎన్నికలను బహిష్కరింపవలెననిరి. ఏదోవిధముగా తెల్లవారితో మంచిగానుండి కార్యములుచక్కబెట్టుకొనజూచు మితవాదులు ఎన్నికలందు పాల్గొనుట యుక్తమనిరి. మితవాదులే బలవంతు

లగుటతో క్రొత్తఎన్నికలందు పాల్గొనుటయు అందువలన క్రొత్తతగవులు కలుగుటయు తటస్థించెను.

ఆఫ్రికావారు చాలామారులు క్రిందపడిమీదపడి తుదకు క్రొత్తకవున్సిలుకు పంద్రెండుమందినల్లవారిని ప్రతినిధులుగా నెన్నుకొనిరి. నలుగురు నల్లవారిని, సమితిప్రభుత్వ గవర్నరుజనరలు సభ్యులుగా నియమించెను. ఈ సభ తెల్లయుద్యోగులగు జిల్లాకమిషనరులఅధ్యక్షతక్రింద సమావేశముకావలెను. దీనివలన లాభములేదనియు నిది బొమ్మలకొలువువంటిదనియు త్వరలోనే విదితమయ్యెను. ఈ కవున్సిలుసమావేశమగుటకుకూడా సరియైన భవనము లభింపక ఒకమారొకచోటను ఇంకొకమా రింకొకచోటను సమావేశముకావలసివచ్చుచుండెను.

ఇదివరకు కొంత తీవ్రముగాపనిచేసిన కాంగ్రెసు 1937లో జూబిలీ యుత్సవములుచేసికొని విశ్రాంతిచెందెను. దానికి మహాబనెగారు అధ్యక్షులైరి. కన్వెన్షనుకు ఆయన ఉపాధ్యక్షుడయ్యెను. ఇంతలో ఆఫ్రికావారు పట్టణములలోనికి హెచ్చుగా వచ్చుచున్నారనియు వారిని రాకుండానిషేధించుట అవసరమనియు చెప్పి, అట్లు వచ్చు నల్లవారిని నిషేధించుటకును వచ్చినవారిని వెడలగొట్టుటకును అధికారమిచ్చు శాసనమొకటి 1937లో చేయబడెను. దీని నప్పు డెవ్వరును గట్టిగా ప్రతిఘటింపలేకపోయిరి.

కన్వెన్షనుసమితిసంఘము క్రమక్రమముగా బలవంతమైకాంగ్రెసును త్రోసిరాజనెను. కాంగ్రెసుకు 1940లో మహాబనెగారికిబదులుగా డాక్టరు గ్జూమా గా రధ్యక్షులైరి. ఆయన అమెరికాలోచదివి అక్కడ నొక సీగ్రోస్త్రీని పెండ్లాడి సుఖజీవనముచేయుచు తెల్లవారితో మంచిగానుండుటకు ప్రయత్నించుచుండిరి. అందువలన కాంగ్రెసు బలహీనమయ్యెను. కన్వెన్షనులో తీవ్రవాదులు ప్రవేశించిరి. వారిలో చాలామంది తెల్లవారిని ద్వేషించుచు రష్యాదేశములో ట్రాట్‌స్కీగారికమ్యూనిస్టుసిద్ధాంతములు హర్షించువారుగా నుండిరి.

ఈ పరిస్థితులలో తెల్లవారికి వ్యతిరేకముగానుండువారందరిని ఏకము చేయుపథమొకటి బయలుదేరెను.

ఇంతలో 1939లో ప్రారంభమైన రెండవప్రపంచయుద్ధమునందు కూడా పూర్వమువలెనే నల్లవారిని సైనికులుగాచేర్చుకొనక యుద్ధభూమిలో కూలిపనులు కాయకష్టముచేయువారిగామాత్రము చేర్చుకొనుచుండిరి. దీనిని గూర్చి కొంత ఆందోళనముజరిగెను. అప్పుడు కమ్యూనిస్టులు యుద్ధమునకు విముఖులుగానుండిరి. ఏమైనను కొన్నివేలమంది నల్లవారు యుద్ధకార్యములయందు నియుక్తులైరి.

కాంగ్రెస్ప్రెసిడెంటు గ్జూమాగారు కాంగ్రెసులోనికి మధ్యతరగతుల నల్లవారి నాకర్షింపగలిగిరి. గుమాస్తాలు, ద్విభాషులు, షాపుకీపర్లు, అమ్మకముగుమాస్తాలు మొదలైనవారు కాంగ్రెసులో చేరిరి. కాంగ్రెసుసంస్థయొక్క నిబంధనలను 1943లో సవరణచేసి, దానిసభ్యత్వమును ప్రాతినిధ్యమును కట్టుబాటులోనికి తెచ్చిరి. కాంగ్రెసుమితవాదపద్ధతులతో పనిచేయసాగెను.

ఈపరిస్థితులలో ఆఫ్రికాదేశీయులకొరకు ప్రత్యేకింపబడిన స్థావరములందు చోటుచాలక జీవనాధారములులేక బాధపడు నల్లవారు రోషావేశముతో అసమ్మతిప్రదర్శనములుచేయసాగిరి. కాంగ్రెసుతోగాని కమ్యూనిస్టులతోగాని కన్వెన్షనుతోగాని సంబంధములేని సత్యాగ్రహవిధానమొకటి నల్లవారిలో బయలుదేరెను.

1943, 1944 సం॥లలో జోహానసుబర్గుకు పదిమైళ్ళదూరమునగల అలెగ్జాండ్రియా అను చిన్నపట్టణములోని నల్లవారు, బస్సుచార్జీలపైన నొక పెన్నీ అనగా రమారమి యొకఅణా పెంచుటను సహింపక ఆగ్రహించి బస్సులనెక్కుట మానివేసి కొన్నివారములపాటు రానుపోను ఇరువదిమైళ్ళు నడుచుచు సత్యాగ్రహముచేసిరి. ఇట్టిసత్యాగ్రహమే మరల 13 సంవత్సరముల తరువాత అతితీవ్రముగా జరిగెను. ఈ బహిష్కారము విజయవంతమయ్యెను. దీనిఫలితముగా ఆఫ్రికన్ డెమాక్రటికుపార్టీ అను నొక క్రొత్త రాజకీయ పక్షము బయలుదేరెను. దానికి నాయకుడు పాల్ మొసక అనునతడు. అయితే అది త్వరలోనే అంతరించెను.

1944 ఏప్రిల్ నెలలో నింకొక క్రొత్తసత్యాగ్రహము జరిగెను. జోహానసుబర్గుపట్టణమునకు వెలుపల నల్లవారికొరకు ప్రత్యేకింపబడిన "ఆర్లాండో స్థావరము"నందు గుడారములందును గోనెసంచులఆచ్ఛాదనముక్రిందను

జీవించుచుండిన కొన్నివేలమంది నల్లవారు తమబాధలను సహింపలేక కొంత దూరములోనున్న మునిసిపలుభూమిలో ప్రవేశించి, అక్కడ గడ్డికూడాపెరు గని ఉషరక్షేత్రముపైన గూళ్ళములవంటి చిన్నచిన్నగుడిసెలను వేసికొని "అందఱము కట్టకట్టుకొని ఇక్కడనే చచ్చిపోవుదము" అని అర్థమువచ్చు "సోఫా సొంకే"అను నినాదములు చేయుచుండిరి. ఈ శాసనధిక్కారము చూచి మునిసిపాలిటీవారు మొదట ఆగ్రహించిరి. కాని చేయునదిలేక నల్లవా రాక్రమించినప్రదేశమునకు చుట్టును ఒక ఆవరణదడిని నిర్మించి దాని నొక పేటగా అంగీకరించిరి. ఇట్లు జయప్రదమైన సత్యాగ్రహము నల్లవారిలోనే గాక దేశములోని తెల్లవారిలోకూడా సంచలనము కలిగించెను. ఆఫ్రికాదేశీ యులలోగల శక్తిసామర్థ్యములు దీనివలన లోకమునకు వెల్లడియయ్యెను.

ఈపరిస్థితులలో కాంగ్రెసువారు కొంత కార్యశూరత్వమును ప్రదర్శిం పదలచి, అనుమతిపత్రములులేకుండా నల్లవారు ప్రయాణముచేయరాదను నిబంధనకు అసమ్మతినితెలుపుటకు ఆంటీప్యాస్ క్యాంపెయిన్ కాన్ఫరెన్సు అను నొకసభను జూమాగారిఅధ్యక్షతక్రింద జరిపిరి.అప్పు డొక ఉపసంఘ మును నియమించి దీనినిగూర్చి పదిలక్షలసంతకములుచేయించుటకు నిశ్చ యించిరి. కొన్నివేలసంతకములను మంత్రిగారికి పంపించిరి. తరువాత నీ అనుమతిపత్రములను తగులబెట్టవలెనను ఉద్యమమునుకూడా ప్రారంభింప దలచిరి కాని, దానిని విరమించిరి. 1945లో ప్రపంచయుద్ధము విరమింప బడి శాంతి స్థాపింపబడెను. దేశములోని ప్రజలందరు ఉత్సాహముగా నుండిరి. యుద్ధసందర్భమున గావింపబడిన ప్రపంచ ప్రజాస్వాతంత్ర్యప్రకట నలు, అట్లాంటికుచార్టరు, యునైటెడ్‌నేషన్సు అను స్వతంత్రరాజ్యముల సమితి స్థాపనము. దేశములోని నల్లవారిమనస్సులందు క్రొత్తభావములను ఆశయములను రేకెత్తించినవి. అట్లాంటికుచార్టరుయొక్క 3వ నిబంధన పైన ఆధారపరచి కాంగ్రెసువారు "ఆఫ్రికావారికోర్కెలు" అనుపేరుతో పౌరస్వాతంత్ర్యములనుగూర్చిన ముసాయిదా నొకదానిని తయారుచేసిరి.

ఈపరిస్థితులలో దక్షిణాఫ్రికాలోని తెల్లవారిప్రభుత్వమొక చిత్రమును గావించిరి. యుద్ధానంతరము వారుచేయుటకుతలపెట్టిన వర్ణభేదవిధానచర్యను ఆఫ్రికావారిపైనగాక నేటాలులోనున్న 3 లక్షలభారతీయులపైన ప్రయో

గించిరి. ఈ భారతీయులు తెల్లవారితో వ్యాపారములందు పోటీచేయుచుండు టయేగాక నల్లవారితోకూడా పోటీచేయుచుండినందున తెల్లవా రట్లు వర్ణభేద మును పురస్కరించుకొని భారతీయులకు నష్టముకలిగించుచర్యలు జరిపి నచో నల్లవారు సంతోషింతురని తెల్లవా రెఱుగుదురు. అయితే దీనివలన నొక విపరీతఫలితము కలిగెను. అదివరకు నల్లవారితో నంతగా సహకరింపని భారతీయు లిప్పుడు నల్లవారితోసమానులుగా పరిగణింపబడుటచే నల్లవారి పక్షమువహించి పోరాడుట కిది కారణమయ్యెను.

ది ఏషియాటిక ల్యాండ్ టెన్యూర్ అండ్ ఇండియన్ రిప్రజెంటేషన్ బిల్ అను చిత్తుశాసనమును స్మట్సుగారు 1946లో ప్రతిపాదించిరి. దీని వలన నేటాలులోని భారతీయు లికముందు భూములను విక్రయింపరాదు. వారిపక్షమున ఇద్దరు తెల్లవారిని పార్లమెంటుకును, ఇద్దరుతెల్లవారిని సెనేటు నకును ప్రతినిధులుగా నెన్నుకొనవచ్చును. దీనిని భారతీయులు ప్రతిఘటిం చిరి. తెల్లవారినెన్నుకొనుఅధికారమును తృణీకరించి, పార్లమెంటుఎన్నికను బహిష్కరించిరి. ఈ నిబంధనను తరువాత నేషనలిస్టుపార్టీప్రభుత్వమువారు రద్దుచేసి మఱియొక అస్త్రమును ప్రయోగించిరి.

ఈ అన్యాయపుచట్టమును ఉల్లంఘించి వందలకొలది భారతీయ కాంగ్రెసుసభ్యులు నేటాలులోని డర్బనుపట్టణము మునిసిపలుభూములపైన మకాముచేసి అరెస్టుచేయబడి కారాగారముల కేగిరి. వీరితోపాటు మైకేల్ స్కాటు అను నొక ఇంగ్లీషుక్రైస్తవమతబోధకుడు కూడా సత్యాగ్రహము సాగించి చెఱసాలకేగెను.

ఈ శాసనముయొక్కఫలితముగా ఆఫ్రికాకాంగ్రెసువారును భారతీయ కాంగ్రెసువారును తమకు పరస్పరసంబంధముగల విషయములందు సహక రించుటకు 1946లో "డాక్టర్సుప్యాక్టు" అనబడు నొక సమాఖ్యచేసికొనిరి. ఆఫ్రికాదేశీయడాక్టరు గ్జూమాగారును భారతీయడాక్టరులగు నాయుడు, దాదూ గార్లును ఈసమాఖ్యలో సంతకముచేసినందువలననే దాని కా పేరువచ్చెను. ఈ అన్యాయపుశాసనమునుగూర్చి యునైటెడ్ నేషన్సువారి ప్రథమసమావేశ ములో నివేదించుటకై డాక్టరు గ్జూమాగారును హెచ్. ఏ. నాయడుగారును అనధికారప్రతినిధులుగా వెళ్ళిరి. అక్కడ యునైటెట్ నేషన్సువా రుపకారము

చేయలేకపోయినను, దక్షిణాఫ్రికాప్రభుత్వమువారి వర్ణభేదవిధానమును ప్రపంచములోని నాగరికులెవ్వరును హర్షించుటలేదనుసంగతి మాత్రము అక్కడి చర్చలవలన వెల్లడియయ్యెను.

ఈపరిస్థితులలో ఆఫ్రికాకాంగ్రెసులో యువజనసమితి అను నొక పక్షమునకు ఆంటన్ లెంబ్డే (Anton Lembde) అను ముప్పదేండ్ల జూలూప్రముఖుడు నాయికుడయ్యెను. అతడును,మ్డటాంబొ, సిసులు,మండెల అను మిత్రులును కలిసి కృషిచేసి, ఆఫ్రికాదేశపు పూర్వపుగొప్పదనము పోయెనని పరితపించుచు ప్రపంచములోని గొప్పజాతులలో ఆఫ్రికాదేశీయులుకూడా పగ్గణింపబడునట్లుచేయదలచు ఆఫ్రికాజాతీయోద్యమమునకు మూలపురుషులైరి. ఆఫ్రికాదేశవేషభాషలపైన అభిమానముతో తెల్లవారి నాగరికతను సంస్థలను బహిష్కరించవలెనను తీవ్రకార్యక్రమమును ప్రారంభింపగోరిరి. లెంబ్డేగారు గొప్పవక్త. హాటెంటాటులను నిర్మూలము చేసినట్లే ఆఫ్రికాదేశీయులనందఱను తెల్లవారు నిర్మూలింపదలచినారని అతదుద్బోధించుచుండెను. ఆఫ్రికావారితరులపైన ఆధారపడి లాభములేదనియు, స్వయంకృషివలననే స్వాతంత్ర్యము సంపాదింపవలెననియు అత డుద్ఘాటించుచుండెను. లెంబ్డేగారికి డాక్టరు సెమ్ (Dr. Seme) గారు భాగస్వామిగ నుండెను.

రెండవ ప్రపంచసంగ్రామానంతరము ఆఫ్రికాఖండములోని అన్ని ప్రాంతములందలి నల్లవారిలోను జాతీయాభిమానమును స్వాతంత్ర్యవాంఛయు ద్విగుణీకృతములైనవి. లెంబ్డేగారీ జాతీయస్వాతంత్ర్యోద్యమమునకు నాయకుడుగనుండెను. భారతదేశమునకు నెహ్రూగారివలెను, ఘనరాజ్యమున న్క్రూమాగారివలెను, రొడీశియాలో న్కుంబులావలెను దక్షిణాఫ్రికాకు లెంబ్డెగారు జాతీయనాయకుడుగ నుండెను. పూర్వపునాయకులు కేవలము మితవాదులు. వీరు తీవ్రజాతీయవాదులు.

ఆసమయమున ఆఫ్రికాలోని అన్నిప్రాంతములందును జాతీయోద్యమ కార్యక్రమములను తయారుచేయుచుండిరి. లెంబ్డేగారును ఆయనస్నేహితులును జోహానసుబర్గులోని కాంగ్రెసుకార్యాలయమున కూర్చుండి 'యూత్ లీగ్' వారి కొక జాతీయకార్యక్రమప్రణాళికను తయారుచేసిరి.

కొన్నినెలలనుండి కమ్యూనిస్టులు బంగారుగనులపనివార్కి జరుగు చున్న అన్యాయములను మాన్పుటకై ఒకసమ్మెను సాగింపవలెనని ప్రచారముచేయుచుండిరి. వారికి దినమునకు రెండుషిల్లింగుల మూడుపెన్నీల నిచ్చుట ఘోరమనియు దినమునకు 10 షిల్లింగులిచ్చునట్లు చేయవలెనని వారు ప్రచారముచేసిరి. అంతట 1946 ఆగష్టులో గొప్ప సమ్మె ప్రారంభమయ్యెను. 70 వేలమంది నల్లవారు పనిమానిరి. ప్రభుత్వమువారును కంపెనీలవారును ఏకమై నల్లవారినిభయపెట్టి, బలవంతముగా పనిచేయింపదలచిరి. లాటీలతోను (బెయోనెట్టు) సన్నీలతోను పోలీసులువచ్చి నల్లవారిని గనుల ఆవరణలోనికి బలవంతముగా త్రోయుటకు ప్రయత్నించిరి. అప్పుడు పోరాటములు జరిగెను. ఐదుదినములలో తొమ్మిదిమందినల్లవారు హతులైరి. వందలకొలది గాయపడిరి. అధికారులు బలప్రయోగముతో సమ్మె నణచివేసిరి.

ఈ సమ్మెయు దీనిఫలితములును ఆఫ్రికాదేశీయులలో గొప్ప సంచలనము కలిగించెను. ఒకమూల నల్లవారి నిట్లు బలవంతముగా గనులలోనికి త్రోయుసమయమునందే నల్లవారి రిప్రజెంటేటివు కవున్సిలునభవారు ఈ గనులకునలుబదిమైళ్ళదూరములోనున్న ప్రిటోరియాలో సమావేశమై నల్లవారికష్టములనుగూర్చి చర్చించుచుండిరి. ఈ సభ యెంతపనికిమాలినసంస్థయైనది అందరికిని తెలిసినది. దేశములోనిప్రజలందరు సంసిద్ధులుకాకుండగనే కమ్యూనిస్టు లీ సమ్మెను ప్రోత్సహించిరని చాలామంది వారిని నిందించిరి. అయితే 1946లో సమ్మెజరిగినప్పుడు నల్లవారిపట్ల సానుభూతిచూపుటకు తక్కినవ్యాపారములలోను వృత్తులలోను పనిచేయు నల్లవారందరును కలిసి "జనరల్‌స్ట్రయికు"లేక సమష్టిసమ్మె చేయుదని కాంగ్రెసువా రుద్బోధింపకపోవుట బాగులేదని యూత్‌లీగ్‌లోని యువజనసంఘములవారు తీవ్రవిమర్శగావించిరి. ఇంతలో మాలన్‌గారు ప్రధానమంత్రియైరి. ప్రభుత్వవిధానమునం దెట్టిమార్పును జరుగలేదు. తెల్లవారు నిర్దయులనియు నల్లవారికావంతయైన సహాయముచేయరనియు నల్లవారు స్వయంకృషివలననే తమ హక్కులను నిలుపబెట్టుకొనవలెననియు లెంబ్డేగారు చెప్పినజోస్యము నిజమని అందరును గ్రహించిరి.

# ఆఫ్రికా జాతీయోద్యమము

సమ్మెవిఫలమైనరెండుదినములకు ఆఫ్రికన్ గనులపనివారిసంఘము నను కమ్యూనిస్టుపార్టీలోను సభ్యులుగానున్నవారిలో ఏబదిమందిని ప్రభుత్వ మువారు అరెస్టుచేసి "వార్ మెషర్ 145" అను యుద్ధకాలశాసనవిధిక్రింద అక్రమపుసమ్మెను ప్రోత్సహించిరను నేరమునుమోపి విచారించి, వారికి కారాగారశిక్షలును జరిమానాలను విధించిరి. ఇంతవరకును ఆఫ్రికాలోజరిగిన రాజకీయకేసులలోకెల్ల నిది పెద్దది. దేశములో కమ్యూనిస్టులయుపద్రవము ప్రారంభమైనదని తెల్లవారనిరి. మూడునెలలలో కమ్యూనిస్టుపార్టీ కార్యనిర్వా హకసభ్యులనందరిని రాజద్రోహనేరమునకు పట్టుకొనిరి. కాని ఆ కేసు కేవ లము ఒక న్యాయశాస్త్రవిధిలోని చిక్కువలన విఫలమయ్యెను.

దక్షిణాఫ్రికాలోని తెల్లవారిలో హృదయపరివర్తనముకలుగునని యాశించుచుండిన వేలకొలదినల్లవారికి 1946లో గొప్ప ఆశాభంగముకలిగెను. నల్లవారిపట్ల చాలా ఉదారభావమువహించినట్లు తెల్లవారనుకొను స్మట్సు ప్రభుత్వమువారే నల్లవారిసమ్మెను కఠినముగాను క్రూరముగాను అణచి వేసిరి. దీనికి కేవలము కళ్ళెముబిగించినట్లు తెల్లవా రనుకొనిరి గాని ఇది ఖడ్గపురుశిపింపు అనియె నల్లవా రెంచిరి.

రెండుసంవత్సరములలో డాక్టరు మాలన్‌గారును ఆయనఅనుచరు లైన ఆఫ్రికేనర్ నేషనలిస్టుపార్టీవారును స్మట్సుగారిని త్రోసిరాజని ప్రభు త్వమువహించిరి. వారు నల్లవారిపట్ల తీవ్రమైన జాతివిద్వేషకవిధానములను ప్రయోగించుటవలన యూత్‌లీగ్‌వారియూహలన్నియు నిజములని నల్లవారం దరకును అవగతమయ్యెను.

1949లో కాంగ్రెస్‌అధ్యక్షపదవికి గ్జుమాగారు మరల నిలువబడి నప్పుడు నల్లవా రీ సంగతుల నాలోచించియే ఆయననువదలి డాక్టర్ మొరొకాగారిని అధ్యక్షునిగా నెన్నుకొనిరి. కాంగ్రెసుప్రతినిధులు 1949 డిశంబరునెలలో బ్లూంఫాంటీను పట్టణమున సమావేశమై తీవ్రబహిష్కారో ద్యమము సాగింపవలెనని తీర్మానముగావించిరి. వీరిలో అనేకవర్గములవా రుండిరి. నల్లవారికి గొప్పవిపత్తు కలుగుననుభయమే ఈ నల్లవారినందరిని ఏకముచేసినది. ఇంతవరకు కాంగ్రెసు కేవలము ఏటేట జరుపుకొను తిరు నాళ్ళవలె నుండెను. ఈసంవత్సరముకూడా అట్లే ఈ నల్లవా రీ యుత్స

వము జరుపుకొనిపోవుదురని తెల్లవారనుకొనిరి. అయితే నల్లవారిలో గొప్ప మార్పులు కలిగినవి. కాలము మారిపోయినది.

దక్షిణాఫ్రికాలోని 90 లక్షల నల్లవారిలో ముప్పదిలక్షలమంది పూర్వాచారములకు కట్టువడి చాలా వెనుకబడియుండిరి. వీరు వివిధతెగల వంశపారంపర్యపునాయకుల అధికారముక్రింద నుండిరి. ఇంకొక ముప్పది లక్షలమంది తెల్లవారికృషిక్షేత్రములందు పనిచేయుచు దారిద్ర్యము ననుభ వించుచుండిరి. మిగిలిన ముప్పదిలక్షలమంది పట్టణములలో నివసించుచు వివిధస్థాయిలలో సుఖమును ధనమును నాగరికతను కలిగియుండిరి.

కేవలము పట్టణములలోనున్న నల్లవారిజనసంఖ్యయే తెల్లవారిని మించియుండెను. ఇప్పు డీ కాంగ్రెసులో,పట్టణములలోనివారే బలవంతులై యుండిరి. దేశమునుపరిపాలించుచుండిన వివిధపక్షముల తెల్లవారిప్రభు త్వము లెవ్వియుకూడా నల్లవారిని పట్టణములలోనికి రాకుండా అరికట్టలేక పోయెను. పట్టణములలోనినల్లవారిలో కొంత రాజకీయపరిజ్ఞాన మభివృద్ధి చెందెను.

ఆఫ్రికావారి రాజకీయప్రజాసంఘములలోకెల్ల కాంగ్రెసే బలవంత మైనదిగా నుండెను. అఖిల ఆఫ్రికాకన్వెన్షను ఇప్పుడు దేశములో ఐక్య యుద్యమమునందు లీనమైనది అది కేపురాష్ట్రములోని మిశ్రమజాతి రంగు ప్రజలతో స్నేహభావము కలిగియుండెను. కమ్యూనిస్టులు నమర్థులైనప్పటి కిని కాంగ్రెసుతో కలిసి పనిచేసినగాని, తమకు జయముచేకూరదని గ్రహిం చిరి. మాలన్‌గారి వర్ణభేద జాతివిభజన అపార్తీడ్‌విధానము నామోదించు చుండిన బాంటూ నేషనల్‌సంఘమువారికి ప్రభుత్వమువారు ధనమిచ్చి నల్ల వారిక్షేమలాభములకు వ్యతిరేకముగా పనిచేయించుచున్నట్లు అందరికిని అనుమానముకలిగెను.

నేషనలిస్టుపార్టీవారు ప్రభుత్వమువహించగానే నల్లవారిపట్ల వర్ణభేద జాతివిచక్షణవిధానమును ప్రయోగించుట ప్రారంభించిరి. 1950లో కమ్యూ నిజమునణచుటకై "సప్రెషన్ ఆఫ్ కమ్యూనిజము" అను చట్టమును చేసి కమ్యూనిస్టులు కుట్రలుచేయుచున్నట్లు ప్రచారముగావించుచు వారినిఅణచుట కని తీవ్రచర్యలు తీసికొనసాగిరి. కేవలము కమ్యూనిస్టులనేగాక ఆ చట్టము

క్రింద తమకిష్టములేనివారందరిపైనను చర్యతీసికొనుటకువీలుగా "కమ్యూనిజం" అనుపదమునకు చాలా విశాలమైన నిర్వచనమునుచేసి, దేశములో సాంఘిక, ఆర్థిక, రాజకీయమైనమార్పులను చేయదలచినవారెవ్వరినైనను కమ్యూనిస్టులుగా పరిగణింపవచ్చుననిరి. దీనివలన కాంగ్రెసుసభ్యులనెవ్వరి మీదనైనను చర్యతీసికొనవచ్చును. ఇదిగాక న్యాయశాఖామంత్రి ఎవ్వరినైనను పేర్కొని కమ్యూనిస్టుగా ప్రకటింపవచ్చును. ఈ అధికారమునుపురస్కరించుకుని తరువాత కొలదిసంవత్సరములలోనే ఆరువందలమందిపైన చర్య తీసికొనిరి. ఇది తరువాత జరిగిన చరిత్ర. అయితే ఇందులో చాలామంది ఇరువదేండ్లక్రిందటనే కాంగ్రెసునుండి తొలగిపోయినవారుకూడా ఉండిరి.

ప్రపంచములో కమ్యూనిస్టులు విజృంభించుచుండినందున ప్రభుత్వము వారుచేసిన చట్టమును వారు జరిగించినచర్యలను ప్రతిపక్షమువారు ప్రతిఘటించినచో వారు కమ్యూనిజమును ప్రోత్సహించుచున్నారని నిందింపసాగిరి. అందువలననే ఆ చట్టము అంతత్వరగా శాసింపబడినది.

ఈ అన్యాయపుశాసనమునకు తమఅసమ్మతిని తెలుపుటకే దేశములోని ప్రజాసంఘములవారెల్లరు 1950 జూన్ 26వ తేదీని జాతీయదినముగా పరిగణించి సభలు జరుపవలెనని ప్రబోధముచేసి జోహానసుబర్గులోని కాంగ్రెసువారు దేశములోని అన్నిజాతుల ప్రజాసంఘములతోను కమ్యూనిస్టులతోను సౌత్‌ఆఫ్రికన్ ఇండియన్ కాంగ్రెస్ అను భారతీయప్రజాసంఘముతోను కలిసి దేశములో అసమ్మతిసభలను చేసిరి. ఈ చట్టము శాసింపబడుటకు కొలదిదినములకుముందుగానే కమ్యూనిస్టుపార్టీవారు తమసంఘమును రద్దుచేసికొనిరి. అందువలన ఆ పార్టీ విచ్ఛిన్నమై అందలిసభ్యులు వేరువేరు పేరులుపెట్టుకొని, వేరువేరుపద్ధతులతో కార్యక్రమములు జరుపసాగిరి. అప్పటినుండి దేశములో ఎవరు కమ్యూనిస్టులైనది ఎవరు కానిది చెప్పుటకు వీలులేకుండెను.

ఈ క్రొత్తచట్టమునుగూర్చి సమష్టిగాచేయబడిన అసమ్మతిప్రకటనల ఫలితముగా ఆఫ్రికాకాంగ్రెసువారికిని భారతీయ "ఇండియన్‌కాంగ్రెసు"వారికిని స్నేహసంబంధములుకుదురుటకు మార్గమేర్పడెను. 1950లో చేయబడిన గ్రూప్‌ఏరియాస్ ఆక్టువలనభారతీయు లదివర కెంతకాలమునుండి కాపుర

మున్నను పట్టణములలో ఐరోపావారునివసించు ప్రదేశములనుండి వెడలి పోవలెనని ఇతర ప్రదేశములందు నివసింపవలెనని ప్రభుత్వమువారు నిర్ణయించి, వారిని వెళ్ళగొట్టుటకు ప్రభుత్వమువారు చర్యలు తీసికొనుటకు ప్రయత్నించుచున్నందున భారతీయులు ఆఫ్రికావారిఆందోళనమున కలియుటకు అవకాశముకలిగెను. అయితే ఈ రెండుజాతులవారిలోను పూర్తియైన స్నేహభావము లేదనుసంగతి తెల్లవారెరుగుదురు. ఈ విషయము జూలూ జాతినల్లవారు డర్బనులోనిభారతీయులపైన 1949లో చేసిన దౌర్జన్యములవలన అందరికిని తెలిసినది.

ఆఫ్రికా రాజకీయపక్షములలో యూత్‌లీగ్‌వారికి ఆఫ్రికాదేశీయులతో తప్ప ఇతరజాతులవారితోకలిసి పనిచేయుట కిష్టములేదు. భారతీయులసదుద్దేమునుగూర్చియు వారికి నమ్మకములేదు. అయితే ఆఫ్రికావారు బలవంతులగుచున్నకొలది వారి అనుమానములు తగ్గిపోయెను. ఆఫ్రికావారును భారతీయులును ఒకరికొకరు సహాకరించుట అత్యవసరమయ్యెను. ఆఫ్రికావారి అంగబలము (జనాభా) భారతీయుల అర్థబలము (ధనము) కలిసినచో గట్టి పని జరుగునని తోచినది దీనిఫలితముగా వర్ణభేద జాతివిచక్షణశాసనములను ప్రతిఘటించుటకై ఒకపెద్ద యుద్యమమును నడుపుటకై 1951జూలైలో పథకమువేసిరి. దీనికై ముగ్గురు ఆఫ్రికావారును ఇద్దరు భారతీయులును కలిసిన ఒక సమష్టి ప్లానింగుకవున్సిలు నేర్పరచి కార్యక్రమముయొక్క తబ్సీలను నిర్ణయింపుమనిరి. దీనికి మొరొకాగారును దాదూగారును నాయకత్వమువహించిరి.

ఆఫ్రికాకాంగ్రెసుయొక్క మరుసటి వార్షికసమావేశమునందీ ప్రణాళికను సభవారియెదుట పెట్టిరి. ఆఫ్రికాకాంగ్రెసువారును భారతీయకాంగ్రెసువారునుకూడా ప్రభుత్వముచేసిన ఆరు అన్యాయశాసనములను, "ప్యాస్‌లాప్" అనబడు అనుమతిపత్రములశాసనమును. నిర్బంధముగా పశువులను పరిమితముచేయునట్టిచట్టమును, సప్రెషన్ ఆఫ్ కమ్యూనిజం ఆక్టును, రెండు నెలలో రద్దుచేయనిచో మొదట వానినుల్లంఘించుటకు సత్యాగ్రహమును ప్రారంభించి తరువాత పార్లమెంటు సమ్మెలను జరుపుటకు నిశ్చయించిరి.

ఈ అన్యాయపుచట్టములను ప్రభుత్వము రద్దుపరతురనుఆశ లేదు. వారుతలపెట్టిన శాసనోల్లంఘనము గాంధిమహాత్ముని సత్యాగ్రహము వలె సత్యము అహింసలపైన ఆధారపరుపబడినట్టిదియు కాదు. అయితే, భారతీయకాంగ్రెసులో గాంధిమహాత్మునిశిష్యులు కొందరుండిరి. వీరు తలపెట్టిన స్వాతికనిరోధమువలన ప్రజాసేవకులకు ఒకవిధమైన శిక్షణమునిచ్చి, ఆఫ్రికావారిని బాధించుచున్న అన్యాయపుశాసనములయొక్క స్వభావమును దేశీయులు గ్రహించునట్లుచేసి మునుముందు గొప్పచర్యకు సంసిద్ధముచేయవలెననియే వీరియుద్దేశము. ఈప్రణాళికను కాంగ్రెసులోని అధికసంఖ్యాకు లామోదించిరి. సాత్వికవిరోధమునకు సన్నాహములు జరిగెను. అయితే ఈ ప్రణాళిక జయప్రదమగునని ఆఫ్రికానాయకులలో కొందరికి నమ్మకములేదు. భారతీయులతోకలిసి పనిచేయుటయు వారికిష్టములేదు. కాంగ్రెసులోనే కొంద రీ అభిప్రాయముతో నొక ప్రత్యేకవర్గము నేర్పరచిరి. అయినను కాంగ్రెసు తలపెట్టిన కార్యమునకై సన్నాహములుజరుపుచునేయుండెను.

1952 జనవరిలో కాంగ్రెసు న్యాయశాస్త్రానుసారమైనభాషలో సీ ఆరుశాసనములను రద్దుచేయవలసినదని ప్రధానమంత్రిగారి కొకలేఖను వ్రాసి, ఆఫ్రికావారిహక్కులను పునరుద్ఘాటించెను.

డాక్టరుమాలన్‌గారు కాంగ్రెసువారికి జవాబువ్రాయుచు "నల్లవారివ్యవహారములమంత్రిగారికి వ్రాయక తనకే తిన్నగా లేఖనువ్రాయుటనుగూర్చి నిరసించుచు వారికోర్కెలను నిరాకరించి, వారు రద్దుచేయమనికోరుశాసనములు వారిక్షేమముకొరకే చేయబడినవని చెప్పుచు, వారుతలపెట్టినచర్యలవలన అల్లరులేమైన జరిగినచో వానినణచుటకు ప్రభుత్వమువారు తమవశమునగల సమస్తసాధనములను పూర్తిగా ప్రయోగింపగలరని బెదరించిరి. (భారతదేశములో స్వాతంత్ర్యోద్యమసందర్భమునకూడా వైస్రాయిగా రిట్లే బెదరించుచు జవాబులు పంపియుండిరి.)

అంతట కాంగ్రెసువారు దేశమునందంతటను మహాసభలనుజ్యపి, వాలంటీరులనుచేర్చి ఆరునెలలలో సాత్వికనిరోధమునుప్రారంభించిరి. ట్రాన్సువాలులో జోహానసుబర్గుదగ్గరనున్న గనుల పట్టణమైన బోక్సుబర్గులో కొంత

మంది ఆఫ్రికావారును భారతీయులును కలిసి అనుమతిపత్రములులేకుండా స్థావరములలోనికి ప్రవేశించుచున్నామని ముందుగా పోలీసువారికి తెలియ పరచుటతో నా యుద్యమము ఆరంభమయ్యెను. అక్కడ పోలీసువారు వీరి కొరకు సిద్ధముగానుండి, వీరిని అరెస్టుచేసి లారీలలోనికెక్కించి తీసికొని పోయి, వారిపైన కేసులుపెట్టి కొద్దికాలము కారాగారశిక్షలను లేక జరిమానా లను విధింపజేసిరి. ముద్దాయిలు జుర్మానాలనుచెల్లింపక చెరసాలలకేగిరి.

బోక్సుబర్గులో జరిగినట్లే దక్షిణాఫ్రికాసమితిలోని చాలాప్రదేశము లందు అటుపిమ్మట నారునెలలవరకును శాసనోల్లంఘనము జరిగెను. 8000 మంది ఆఫ్రికావారును, చాలామంది భారతీయులును ఈ శాసనోల్లంఘనమున కారాగారములకేగిరి.

కొన్నివేళలలో ప్రజలు వీధులలోతిరుగరాదని "కర్ఫ్యూ" అను నిషేధాజ్ఞను ప్రభుత్వమువారు జారీచేయగా ఆఫ్రికావారును భారతీయులును చిన్నచిన్నగుంపులుగా అనుమతిపత్రములులేకుండానే ఆ నిషిద్ధసమయము లందు తిరుగుచు, ఆ శాసనవిధినుల్లంఘింపసాగిరి. "పాశ్చాత్యులకు మాత్రమే" అని ప్రకటనలుకట్టిన రైలుబండ్లలోనికి జొరబడసాగిరి. పాశ్చా త్యులకు ప్రత్యేకింపబడిన తపాలాఆఫీసుగూళ్ళదగ్గరకు వీరు పోయిరి.

దేశములోనిప్రజలందరును ఇట్లు చేయకపోయినను అనేకస్థలము లలో నిట్లు చేయుచున్నందున తెల్లవారిలో అన్నివర్గములవారియందును భయాశ్చర్యములు కలిగెను. ఆఫ్రికావారును భారతీయులును ఇట్లు కలిసిపని చేయుదురనిగాని, కాంగ్రెసువారిబెదరింపులు కార్యరూపముదాల్చునవిగాని వారెన్నడు ననుకొనలేదు. ఒక కేంద్రసంఘమువారియుత్తరువులవలన వేయి మైళ్ళదూరమున వాలంటీరులను ప్రోగుచేయుటయనునదికూడా వారను కొననివిషయమే. ఈ శాసనోల్లంఘనమునందలి ప్రధానవిశేషములు క్రమ శిక్షణము, కట్టుబాటులు నుండుట.

సత్యాగ్రహముచేయుడని గాంధిమహాత్ముడు దక్షిణాఫ్రికాలోనిభారతీ యులను ప్రోత్సహించియుండలేదు. పైగా డర్బనులోనున్న గాంధిమహా త్మునికుమారుడైన మణిలాల్‌గాంధిగారు సాత్వికనిరోధముచేయువారిలో నైతికధర్మములేకపోవుటనుగూర్చియు, వారు న్యాయపరిపాలనావిధానము

నకు లోబడకపోవుటనుగూర్చియు ఖండించెను. అయితే ఈ వాలంటీరులు అహింసాపద్ధతిని ఒకధర్మముగా పరిగణింపకపోయినను దానిఆవశ్యకతను గ్రహించి దానికికట్టుబడియుండుటమాత్రము జరిగెను.

ఆఫ్రికావారిలో చెరసాలకేగిన 8500 మందిలోమాత్రమేగాక ఇతర ప్రజలలోకూడా ఈ సాత్వికనిరోధ శాసనోల్లంఘనముయొక్క ప్రభావము కనబడెను. ఆఫ్రికావారు ప్రభుత్వమువారిశాసనములను ఉల్లంఘించి, ధిక్కరించుటవలన అదివరకు నిర్జీవముగాపడియున్న కాంగ్రెసుకు గొప్ప ఖ్యాతిని గౌరవమును కలిగించెను. కాంగ్రెసుసభ్యులసంఖ్య పెరిగెను. అదివరకు ఊరుపేరులేని ప్రజానాయకులపేర్లు ప్రపంచములో ప్రచారముగల పాశ్చాత్యపత్రికలందు ఈ యుద్యమమునుగూర్చి గోరంతలు కొండంతలుచేసి ప్రకటింపబడుటవలనను, ప్రతిసందర్భమునను పోలీసువారు ప్రత్యక్షమగుచుండుటవలనను, ఆఫ్రికాలోనినల్లవారి శాసనోల్లంఘనప్రదర్శనము చాలా విజయవంతమయ్యెను.

ఈ యుద్యమము ప్రారంభమైన నాలుగవనెలలో ఆఫ్రికాలోని నల్లవారు నివసించుపేటల (Locations) లోని దేశీయులందు రోషావేశము వృద్ధియై, దానిఫలితముగా పోర్టుఎలిజబెత్తు, కింబర్లే, తూర్పులండన్‌పట్టణములందు వరుసగా అల్లరులు దొమ్మినేరములు జరిగెను. పోలీసువారు జోక్యముకలిగించుకొనుటవలన నల్లవారి గుంపులకు ఆగ్రహముకలిగి 'లొకేషన్‌బిల్డింగులు' అనగా నల్లవారిస్థావరములందలి ప్రభుత్వకార్యాలయ కట్టడములను తగులబెట్టుట జరిగెను. కొందరుతెల్లవారు హత్యచేయబడిరి. అయితే ఈ దౌర్జన్యములకును, శాసనోల్లంఘనమునకును ఎట్టిసంబంధమును లేదు. దీనినిగూర్చి విచారణజరిపినవారీ దౌర్జన్యములు ప్రభుత్వమువారును తెల్లవారును ప్రయోగించిన ఆతతాయిలవలననే జరిగినవని నిర్ణయించిరి. దీని ఫలితముగా తెల్లవారు కాంగ్రెసుపైన ద్వేషమువహించుటయు, ప్రభుత్వమువారు మఱింత కఠినచర్యలనుజరిపి, శాసనోల్లంఘనోద్యమమును అణచుటయు జరిగెను. ఈ యుద్యమమువలన చిక్కులుకలుగగలవని ప్రభుత్వమువారు త్వరలోనే గ్రహించిరి. అది ప్రారంభమైనఎనిమిదివారములలో

జోహానసుబర్గులోని ఆఫ్రికానాయకులను భారతీయనాయకులను కలిపి ఇరువదిమందిని అరెస్టుచేసిరి. వారిపైన "స్ప్రెషన్ ఆఫ్ కమ్యూనిజం" చట్టము క్రింద నేరములుమోపిరి. ఆ చట్టములో 'కమ్యూనిజం' అనుపదమునకు చేయబడిననిర్వచనము సామాన్యమైన కమ్యూనిజమునకుఅన్వయించునట్టిదే గాక అందులకు భిన్నమైనదని ఆ కేసులు విచారించిన న్యాయాధిపతి జస్టిస్ రంఫ్ (Justice Rumph)గారు తీర్మానించి, వారికివిధించిన తొమ్మిది నెలలకఠినశిక్షలఅమలును రెండేండ్లవరకు నిలుపుచేసియుంచెను. దీనివలన వారా రెండేండ్లును కాంగ్రెసుకార్యక్రమములను నిర్వహింపకుండా నిషేధింపబడిరి.

ఆఫ్రికా శాసనోల్లంఘనోద్యమమునందు అరెస్టుచేయబడిన డాక్టరు మొరొకాగారు ఆ కేసులో తనకు వేరుగా నొకన్యాయవాదిని నియమించుకొని 'ఆఫ్రికేనరు' పాశ్చాత్యజాతివారికి మొదటినుండియు తాను మిత్రుడననియు, ప్రభుత్వసంస్థలతో సహకరించితిననియు, ఏసందర్భములోను అన్ని జాతులవారును సమానులని తాను తలంపలేదనియు వాదించిరి. దీనివలన దేశీయనాయకులందు ధైర్యసహనములు కొరవడియున్నవనియు, అఖండ త్యాగముచేయుటకు ఆఫ్రికాకాంగ్రెసు ఇంకను సంసిద్ధముగా లేదనియు స్పష్టమయ్యెను.

ముఖ్యమైన ఆఫ్రికానాయకుల నిట్లు పట్టుకొని నిర్బంధించినను ఆ యుద్యమము సాగుచునేయుండెను. ప్రజలస్వేచ్ఛను స్వాతంత్ర్యములను హరించు శాసనములనేకములున్నను, ఈవిధమైన శాసనోల్లంఘనమును అణచుటకు తగినశాసనము మాత్రము లేదని ప్రభుత్వమువారు గ్రహించిరి. అందువలన పూర్వము 1930లో చేయబడిన నేటివ్ అడ్మినిస్ట్రేషన్ ఆక్టు క్రింద ఏ శాసనవిధినిగాని ఉల్లంఘించుటకు లేక నిరోధించుటకు నల్లవారిని పురికొల్పునట్లు ఎవ్వరైనను ప్రయత్నించినచో మూడువందలనవరసులు జరిమానా విధింపబడునని గవర్నరుజనరలుగారు 1952లో నొకప్రకటనము చేసిరి.

గవర్నరుజనరలు చేసిన ప్రకటనవలన, దేశములో అల్లరులు దొమ్మీలు జరుగుటవలన, శాసనోల్లంఘనముచేయువారిలో ఉత్సాహము

క్షీణించుటవలన ఈ యుద్యమము అడుగంటెను. అయితే, ఇది అంత మందులోపుగా దేశములోని అన్నిజాతులవారునుకలిసిన చిన్నగుంపులును పూర్వపు గవర్నరుజనరలుగారికుమారుడైన పాట్రికు డంకన్‌గారును మణీలాల్‌గాంధిగారును అనుమతిపత్రములులేకుండా "జర్మిస్టౌన్‌లొకేషన్" అను నల్లవారిస్థావరములోనికి ప్రవేశించి శాసనోల్లంఘనమునుగావించిరి. పోలీసువారికి వారినిపట్టుకొనుట ఇష్టములేకపోయినను, విధిలేక వారిని అరెస్టు చేసిరి. ఈ యుద్యమమునం దిది తుదిఘట్టమని చెప్పవచ్చును.

1953 ప్రారంభములో గవర్నరుజనరలుగారిప్రకటనమును స్థిరపరచుచు "పబ్లికుసేఫ్టీ ఆక్టు" అనబడు ప్రజారక్షణశాసనమును, క్రిమినల్‌లా అమెండ్‌మెంటుఆక్టు అనబడు క్రిమినలు న్యాయశాస్త్ర సవరణచట్టమును ప్రభుత్వమువారు శాసించిరి. ఇందులో మొదటిదానివలన న్యాయపరిపాలన మంత్రిదేశక్షేమముకొరకేశాసనముయొక్క అమలునైననునిలుపుచేసిఅందలి విధులకు వ్యతిరేకమైన కఠినచర్యలనుతీసికొనవచ్చును. రెండవదానివలన నల్లవారు శాసనోల్లంఘనముచేయునట్లు ప్రోత్సహింపగల ఏవార్తనైనను ప్రకటించినవార్తాపత్రికాధిపతికి ఐదుసంవత్సరములకఠినశిక్షను ఐదు కొరడా దెబ్బలును నూరునవరసులజరిమానాయును విధింపవచ్చును.

ఈసమయమున నొక నర్సు హత్యగావింపబడెను. ఉత్తరమున కెన్యాలో తెల్లవారియిండ్లను తగులబెట్టుట, ఆస్తినిదోచుట, మనుష్యులను హత్యచేయుట మొదలైన రాక్షసకృత్యములు కొన్ని జరుగుచుండెను. వీనిని చేసినవారు "మావ్‌మావ్"అను నొక రహస్యసంఘమునకు చెందినవారనియు అది యొక ఘోరమైన అరాజకోద్యమమనియు, దానికిసంబంధమున్నదని అనుమానముగలనల్లవారిని పట్టుకొని కాల్చుట, చిత్రవధలుచేయుట ప్రారంభించిరి. దేశములోనినల్లవారందరును తెల్లవారిని రూపుమాపుటకై కుట్రలు చేయుచున్నారని తెల్లవారు ప్రచారముగావించి నిరపరాధులనుపట్టుకొని బాధింపసాగిరి. వారుపెట్టుబాధలుపడలేక ఏపాపమెరుగనివారు తమ కా యుద్యమముతో సంబంధమున్నదని ఒప్పుకొనుచుండిరి.

ఈపరిస్థితులలో దక్షిణాఫ్రికాసమితిప్రభుత్వమువారి కఠినశాసనములను పార్లమెంటులో ప్రవేశపెట్టి చట్టములుగావించిరి. కనివినియెరుగని

క్రూరనిర్బంధవిధులుగల ఈ శాసనములు ప్రజాప్రభుత్వసిద్ధాంతములకు విరుద్ధములై ప్రజలప్రాతిపదికస్వాతంత్ర్యములకు భంగకరములుగనున్నను, పార్లమెంటులోని ప్రతిపక్షమువారు కిక్కురుమనక ఊరకొని, వీనిని శాసనము గానిచ్చిరి. దీనికికారణము కొలదినెలలలోనే జనరల్ఎలెక్షను లేక పార్లమెంటుకు ఎన్నికలు జరుగనైయుండుటయే. వీనిని ప్రతిఘటించినచో తమకు దేశములోని తెల్లవారివోట్లు రాకుండా ప్రచారముగావింపబడునని వీరు భయపడిరి.

ఈలోపుగా 1952 డిశంబరులో జోహానసుబర్గులో కాంగ్రెసువార్షిక సమావేశము జరిగెను. మొరొకాగారు మరల అధ్యక్షులుగ నిలిచిరి గాని, యూత్లీగ్పక్షమువారును ఇతరవర్గములవారును ఆయనకు వ్యతిరేకులుగ నున్నందున ఆయనస్థానమున ఆల్బర్టు జాన్ లుతూలి అను నొక జూలూనాయకుడు అధ్యక్షుడుగ నెన్నుకొనబడెను.

కాంగ్రెసులోని ప్రముఖనాయకులపైన ప్రభుత్వమువారు కఠినచర్యలను ప్రయోగించుచుండిరి. కఠిన నిర్బంధశాసనవిధులను విచ్చలవిడిగా నుపయోగింపసాగిరి పోలీసుఉద్యోగులు దేశములో స్వచ్ఛందవిహారము చేయుచు, కాంగ్రెసువారియిండ్లను కార్యాలయములను సోదాచూచుటు, మంత్రిగారు స్వయముగా సంతకముచేసిన పెద్దపెద్ద నోటీసులను జారీ చేయుచుండిరి. ఆ నోటీసులలో నిట్లుండెను.

"న్యాయపరిపాలనశాఖామంత్రినైన చార్లెస్ రాబర్ట్సు స్వార్టు అను నేను మీకు తెలియపరచున దేమనగా: మీరు ఐరోపాజాతి తెల్లవారిమధ్యను పాశ్చాత్యేతరులైన నల్లవారిమధ్యను వైషమ్యమును పురికొల్పుచున్నారని నాకు తెలిసినందున రైటస్ అసెంబ్లీస్ అక్టు అనగా దొమ్మిలుచేయుప్రజల సమావేశములచట్టము 12వ సెక్షనుననుసరించియు, 1914 సం॥ క్రిమినలు అమెండ్మెంటు అక్టుప్రకారమును, ట్రాన్సువాలు ఆరెంజిఫ్రీస్టేటులోని యేప్రదేశమునందును 12 నెలలవరకును మీరుఉండకూడదని ఇందుమూలముగా ఆజ్ఞాపించడమైనది."

ఇట్లు నిషేధింపబడినవారు ఒకచోటనుండి యింకొకప్రదేశమునకుపోవరాదు. పదిమందికన్న హెచ్చుమంది ప్రజలు సమావేశమైనచోట హాజరుగ

నుండకూడదు. ఎట్టి రాజకీయసంఘమునందును కార్యనిర్వాహకఉద్యోగ మును వహింపరాదు. నల్లవారు తెలివితక్కువగాచేసిన శాసనోల్లంఘనఉద్యమమువలననే ఈ కఠిననిర్బంధములు చేయుటకు తెల్లవారికి అవకాశము కలిగినదని కాంగ్రెసుయొక్కవిరోధులు ప్రచారముచేయసాగిరి.

నల్లవారిని కమ్యూనిస్టులు చెరసాలల కెరగాచేసినారనియు, దేశీయులు విదేశీయులవలనపీడింపబడుచున్నారనియు సెలోప్‌తెమా(Selope Thema) గ్వామా మొదలైనవారును ఆఫ్రికానిస్టుపక్షమువారును కూడా చెప్పసాగిరి.

1953 ఏప్రిలునెలలో జరిగిన ఎన్నికలయందు నేషనలిస్టుపార్టీవారే మఱల విజయముపొంది, దక్షిణాఫ్రికాసమితిరాజ్యమున రెండవసారి ప్రభుత్వమువహించిరి. వీరందఱును తీవ్రమైన వర్ణభేదమును జాతివిచక్షణను సమర్థించు తెల్లవారు. అదివరకు అమలులోనున్న జాతివిభేదకశాసనములను వీరు మరింతకఠినముగా అమలుజరిపి. వివిధజాతులను విభజించి వేరుపరచు విధానమును మఱింతతీవ్రముగా అమలుజరుపదలచిరి. అదివరకీ జాతులను వేరుపరచువిధానము తెల్లవారిక్షేమముకొరకేగాక నల్లవారిక్షేమముకొరకుకూడా చేయుచున్నామని చెప్పుచుండిరి. ఇప్పుడు తెల్లవారిలాభమునకు అడ్డుకలిగించు సందర్భములందు నల్లవారిక్షేమమును ఆలోచింపవలసినపనిలేదని బహిరంగముగనే ఉద్ఘాటించిరి.

ఆఫ్రికావారికి అధికారములు, హక్కులు లేకుండాచేసినను వారికి మంచి విద్యనొసగి పాశ్చాత్యులపట్టణముతోను నాగరికతతోను సన్నిహిత సంబంధము కలిగించుటద్వారా వారిని అభివృద్ధిలోనికి తీసికొనిరాదలచినామని చెప్పుట మానిరి. ఆఫ్రికాలోని నల్లవారిని కేవలము మారుమూలప్రాంతములందు నిర్బంధించి వారిని బానిసచాకిరిచేయుటకుమాత్రము వినియోగించుటయేతమలక్ష్యమని తెల్లవారు బహిరంగముగా ప్రకటించిరి. నల్లవారు అభివృద్ధిచెందకుండా అరికట్టుటయేకాదు, వారిని అధోగతిలోనికి దింపుటకు కూడా నేషనలిస్టుపార్టీవారు నిశ్చయించి తమశాసనములద్వారా నల్లవారిజీవితమునే దుర్భరముచేయదలచిరి.

1951 సం॥బాంటూ అథారిటీస్‌ఆక్టు అను చట్టము ఆఫ్రికాజాతులవారి వంశపారంపర్యపునాయకులను తెల్లప్రభుత్వముక్రింద జీతగాండ్రుగచేసెను.

పూర్వము బాంటూప్రజలవ్యవహారములను పరిష్కరించుచుండిన వివిధసాయకుల ఆలోచనసంఘములకుబదులుగా ప్రభుత్వమువారు "స్థానికకవున్సిళ్ళు" అను సంఘముల నేర్పరచి, అందులో గొప్పవంశీయులైన పెత్తనదారులనుగాక తమఆశ్రితులను సభ్యులుగా నియమించిరి. వారిని వివిధజిల్లాలలో నల్లవారివ్యవహారములను చక్కబెట్టు కమీషనర్ల అధికారమునకును గవర్నరు జనరలు అధికారమునకును లోబరచిరి.

1953 తరువాత చేయబడిన శాసనములు నల్లవారి నింకను అధోగతిలోనికి దింపునట్టివిగా నుండెను. 1954 సం॥ నేటివు రీసెటిల్మెంటు అక్టు జోహానసుబర్గుకు పడమరప్రక్కనున్న 60వేలమంది నల్లజాతులవారిని ఆ నగరమునకు పదిమైళ్ళదూరమునగల నల్లవారికి ప్రత్యేకింపబడిన చిన్న పట్టణము ( township ) లోనికి బలవంతముగా పంపి నిర్బంధించియుంచెను. బాంటూ ఎడ్యుకేషన్ అక్టువలన ఆఫ్రికావారికి విద్యనుబోధించు మిషనరీపాఠశాలలన్నిటిని ప్రభుత్వమువారు స్వాధీనపరచుకొని వారికి పాశ్చాత్య పద్ధతులప్రకారము విద్యబోధింపక కేవలము నల్లజాతులవారి పూర్వసంప్రదాయములకనుగుణమగు శిక్షణమునిచ్చునట్లును నీచపుచాకిరీలను చేయుటకు తర్ఫీయతునిచ్చునట్లును కట్టుబాటులుచేసిరి. ఇటువంటి క్రొత్త నిర్బంధకపు శాసనములనుచేసి, ప్రాతవానిని కఠినతరముగా అమలుజరుపుటవలన నీ నల్లవారుతమయిండ్లలో క్రుంగి కృశింపవలసియుండిరి.

అనుమతిపత్రములు లేకుండా నల్లవారొకప్రదేశమునుండి ఇంకొక ప్రదేశమునకు ప్రయాణముచేయరాదను నియమము నల్లస్త్రీలకుకూడా వర్తింపజేసిరి. అనుమతిపత్రములనుగూర్చియు, సారాయితయారును గూర్చియు సోదాలుజరుపుటకు పోలీసువారు దౌర్జన్యములుచేయసాగిరి. నల్లవారునివసించు స్థావరముల ( Locations) చుట్టును పోలీసులు కాపలా కాయుచుండిరి. ఒక క్రొత్తనిబంధనవలన నల్లవారు పూర్వమువలె కేవలము అనుమతిపత్రములుమాత్రమేగాక, ఆ వ్యక్తి చరిత్రను అతడు పూర్వమేదైననేరముచేసినచో ఆ వివరములనుకూడా వివరించు ఒక రిజిస్టరునుకూడా వెంటదీసికొని రాకపోకలు చేయవలెనని శాసింపబడెను. సామాన్యాజనులకు వర్ణభేద జాతివిభజనవిధానమనగా వేదో యొక సిద్ధాం

తము గాక ప్రత్యక్షముగాకనబడు పోలీసుదాడులు, నల్లవారినివెడలగొట్టుటకు చేయు చర్యలు, ఆడువాండ్రకు అనుమతిపత్రములు పోలీసువారిజులుము అని మాత్రమే అవగతమగుచుండెను.

ఈ తీవ్రచర్యలు కాంగ్రెసుకు గొప్ప క్రొత్తసమస్యలను కలిగించెను. వారిదివరకు శాసనోల్లంఘనమున ఆఫ్రికావారందరు తమపక్షమవలంబింపవలెనని కోరుచుండిరి. ఇప్పు డీ ప్రభుత్వమువారు తమచర్యల వలన సామాన్యజనులందరిని బాధించుచున్నందున వారందరిలో ఒకవిధమగు ఏకీభావము కలుగుచుండెను. సామాన్యసంసారులనుకూడా ప్రభుత్వమువారి చర్యలు రాజకీయములలోనికి దింపుచుండెను. అందువలన కాంగ్రెసువారి కోర్కె సఫలమగుచుండెను. అనగా నల్లవారిలో అధికసంఖ్యాకులు ప్రభుత్వమువారిని ద్వేషించి తీవ్రజాతీయవాదులగుచుండిరి. క్రమశిక్షణము, సంయమము చాలా అవసరమయ్యెను. ఏ కొంచెము దౌర్జన్యము జరిగినను ప్రభుత్వమువారు అది సాకుగా నల్లవారిపైన పోలీసులచేత తుపాకులుకాల్పించుచుండిరి.అందువలన దేశీయులు దుర్మరణమునొందుచుండిరి. దీనివలన నల్లవారిగుంపులు ఆగ్రహపరవశులై సంఘీభావములేక క్రమశిక్షణములేక చెలరేగును. అంతట ప్రభుత్వమువారి అత్యాచారములకు అవకాశముకలుగుచుండును. ఈ పరిస్థితులను చూచి ప్రభుత్వమువారికన్న కాంగ్రెసువారే ఎక్కువగా భయపడసాగిరి. అందువలన ప్రతిసందర్భములోను ప్రజలను తొందరపడవలదనియు, జాగ్రత్తగా ప్రవర్తింపుడనియు కాంగ్రెసువారునువారినాయకులును తరచుగా హెచ్చరించుచుండిరి. కాంగ్రెసు నాయకులలో తీవ్రముగా నుపన్యసించువారుకూడా అహింసపాటింపుడని ప్రజలను హెచ్చరించుచుండిరి.

నలుబదేండ్లనుండి కాంగ్రెసువారు వాంఛించుచున్న ఆఫ్రికాదేశీయుల సంఘీభావము కనుచూపుమేరలో కనబడుచుండెను. తెల్లవారు నల్లవారి నెంతఅణగద్రొక్కినను వారు ఆత్మవిశ్వాసము కలిగియుండిరి. అందువలన మీరు దౌర్జన్యపూరితమైన ధిక్కారము చేయవలదని వారికి బోధించి ఒప్పించుట సులభమైకార్యము కాకుండెను. హక్కులకొరకు గట్టిగా పాటుపడుడని హెచ్చరించినప్పుడు డర్బనునగరముపైకి దండయాత్ర

చేయుటయే దానిఅర్థమని వారనుకొందురు. మీ రట్లు భావింపరాదని జూలూ జాతివీరులకు చెప్పినను లాభములేదు. నల్లవారిహక్కులను నాశనము చేయుచున్న క్రొత్తశాసనములను ప్రతిఘటించుటకై కాంగ్రెసువారు గట్టి చర్యతీసికొనుటలేదని నల్లవారిపట్టణములందలి ఆఫ్రికావారు గొణగికొన సాగిరి. కాంగ్రెసువారిలోనే అహింసనుగూర్చిన బోధలన్నియు మాటవరు సకే చేయబడుచున్నవనియు బలప్రయోగము; దౌర్జన్యములు చేయక తప్ప దనియు తలచువారుండిరి. పూర్వము తీవ్రవాదులుగానున్న యువజనసంఘ సభ్యు లిప్పుడు మితవాదులుగానున్నారని కొందరు నల్లవారు గొణగికొను చుండిరి।

1954 సం॥ నేటివు సెటిల్మెంటుచట్టముక్రింద ప్రభుత్వము చర్యతీసి కొని, సోఫియాటవునులోని నల్లవారికుటుంబములను మెడోలాండ్సులో క్రొత్తగా స్థాపింపబడిన నల్లవారిప్రత్యేకస్థావరములలోనికి పంపుటకు ప్రయత్నించిరి. అంతట నీచట్టమును మొదటినుండియు ఖండించుచు కాంగ్రెసువారు సోఫియాటవునులో ననేకసభలుచేయుచుండిరి. ఈ పట్టణము లోని ఆఫ్రికాయువకులలో చాలామంది పొగరుబోతులు దౌర్జన్యపరులుగా నుండిరి. నల్లవారిని బలవంతముగా వెడలగొట్టవలెనని రెండువేలమంది పోలీసువారిని అరువదిసైనికలారీలను తీసికొని తెల్లయుద్యోగులు కొంద రక్కడికి వచ్చిరి. అప్పుడు రక్తపాతముజరుగకుండాచేయుటకు కాంగ్రెసు వారు కొన్నికుటుంబములను సోఫియాటౌనులోని ఇతరభాగములకు పంపిం చిరి. ఇట్టి పిరికిపనిచేసినందులకు నల్లవారు కొందరు కాంగ్రెసును నిందించిరి.

కాంగ్రెసును తీవ్రముగా విమర్శించువారిలో జోహానసుబర్గుదగ్గర నల్లవారిపట్టణమైన ఆర్లాందో (Orlando) వారు ముఖ్యులుగా నుండిరి. ఇక్కడివారు ఆఫ్రికాదేశముఆఫ్రికాదేశీయులకే హక్కుకలదేశమనియు నల్ల వారినిబాధించుచున్న విజాతీయులగు నీ తెల్లవారికి బుద్ధిచెప్పవలెననియు కోరుచుండిరి. ఇక్కడినల్లవారిలో చాలా తెలివితేటలుగలవారు పాశ్చాత్య నాగరికతను అవలంబించిన డాక్టర్లు, ప్రొఫెసర్లు, వర్తకులు నుండిరి. పాశ్చాత్యులతో వ్యవహరించునప్పుడు వీరందరును చాలా మర్యాదగా

ప్రవర్తించుచుండిరి. అయితే తెల్లవారి జాతివిచక్షణచర్యలు వీరి మన స్సులలో తీవ్రమైనబాధను కలిగించి, తెల్లవారిపట్ల ద్వేషమును కలిగించెను.

తెల్లమొగములనుద్వేషించు "ఆఫ్రికానిస్టు"లను వర్గమువారు బయలు దేరిరి. వీరికి కాంగ్రెసుపైన విశ్వాసముపోయినది. నల్లవారందరును తెల్లవారికివ్యతిరేకముగా ప్రవర్తింపవలెనని వీరియుద్దేశము. దీని ఫలిత ముగా నల్లవారు తమంతటతాము కొన్నిబహిష్కరణోద్యమములను జరిపిరి. ఉదాహరణమునకు 1956 లో ట్రాన్సువాలులోని ఇవటన్‌బస్సులను నల్ల వారు బహిష్కరించిరి. 1957 జనవరిలో అలెగ్జాండ్రాబస్సులను బహిష్క రించిరి. వీనికి ఆఫ్రికానిస్టులు మద్దతుచేసిరి.

వివిధపట్టణములందలి నల్లవారిని కట్టుబాటులోనుంచినది కాంగ్రెసే. దేశములోని వివిధజాతులవారు ఏకమై ప్రభుత్వమును ప్రతిఘటింపవలెనని కృషిచేసినసంస్థయు కాంగ్రెసే. అయితే కాంగ్రెసుయొక్క ఉద్దేశములను గూర్చి తెల్లవారికి అనుమానములుండెను. తెల్లవారు పాశ్చాత్యఆధిపత్యము గల ప్రభుత్వమును స్థాపించదలచినందువలన నల్లవారుకూడా నల్లవారి ఆధిపత్యముగల రాజ్యస్థాపనమును వాంఛించుచున్నారని తెల్లవారు తలచిరి. వారిపట్ల తాము ప్రవర్తించినట్లే నల్లవారు తమపట్ల వర్ణభేద జాతివిచక్షణ విధానమును ప్రయోగింతురనియు వారిభయము.

గత నూరేండ్లలో కేవలము అనాగరికమై ఆర్థికముగా వెనుకబడి యున్న ఆఫ్రికాదేశము ఆర్థికాభివృద్ధినిచెంది ధనవంతమైనదనియు నల్ల వారికాయకష్టమువలననే ఈ మార్పు కలిగినదనియు, అయితే, దాని లాభమునుమాత్రము నల్లవారికిగాక, తెల్లవారికే కలుగుచున్నదనియు నల్ల వారికి అవగతమయ్యెను. వారిని పట్టణములలోనినాగరికత ఆకర్షించెను. అయితే ఆ పట్టణములందు వారికి స్థానమేలేకుండెను. దక్షిణాఫ్రికాలోని నల్లవారికి హిందూదేశములోను పశ్చిమఆఫ్రికాలోను ఉన్న దేశీయులకు వలె పూర్వనాగరికత లేదు. వారినిత్యజీవనము వారిపరికరములు, గృహోప కరణములు, పుస్తకములు, చదువులు, దుస్తులు, ఆటలు, భాష మొదలైన వన్నియు పాశ్చాత్యులనుండి గైకొనినవే. దక్షిణాఫ్రికాలోనినల్లవారు ప్రతి విషయమునను తెల్లవారిపైననే ఆధారపడుచుండిరి.

తెల్లవారిదుశ్చర్యలవలన కెన్యాలోని మావ్‌మావ్‌సంఘీయులవలెనే ఇక్కడి నల్లవారుకూడా రాక్షసత్వవిధానమునకు చెందిన జాతీయతను అవలంబింపవచ్చునని కొందరుతెల్లవారికి తోచినది. అయితే కెన్యాలోని తెల్లవారిసంఖ్య అల్పము. దక్షిణాఫ్రికాలో లక్షలకొలది తెల్లవారున్నారు. వారు నల్లవారిని అణచివేసిరి. కాంగ్రెసునాయకులు కొందరు శాసనోల్లంఘనఉద్యమముమధ్యలో తెల్లవారిసహాయము నపేక్షించిరి. దక్షిణాఫ్రికాలోనితెల్లవారు కొందరు ధర్మబుద్ధితో ఆఫ్రికావారికి న్యాయమైనహక్కులనొసగవలెనని తలచుచుండిరి. ఇట్టివారు ఉదారవాదులని (లిబరల్సు)ఆఫ్రికావారిచే ప్రశంసింపబడిరి. వీరు "కాంగ్రెస్ ఆఫ్ డెమోక్రాట్సు" అను సంఘముగా ప్రసిద్ధిచెందిరి. వీరు ఆఫ్రికావారితో కలిసిమెలసి చరించుచుండిరి. ఈ సంఘమేర్పడినసమయముననే, విశ్వవిద్యాలయములోని విద్యాధికులును, డాక్టర్లును, లాయర్లు మొదలైన ఉదారబుద్ధిగల తెల్లవారు కొందరు జాతిభేదసిద్ధాంతమువలన దేశము అల్లకల్లోలములో మునుగుట చూచి, ఆఫ్రికావారికి కొంత పరిమితమైన ఎన్నికహక్కులనిచ్చి, జాతివిచక్షణనుచూపు శాసనములను రద్దుచేసి, పూర్వము కేపురాష్ట్రములో అమలు జరుపబడిన ఉదారపద్ధతులను అవలంబింపవలెనని కోరుచు పార్లమెంటులో పనిచేయుటకు "లిబరల్‌పార్టీ" అను నొక రాజకీయపక్షమును స్థాపించిరి. వీరు కాంగ్రెసుయొక్కఆశయములను హర్షించినను, శాసనములనుల్లంఘించుపద్ధతిని హర్షింపకుండిరి. కాంగ్రెసులోని తీవ్రజాతీయవాదమునుగాని కమ్యూనిజమునుగాని వీరు సహింపజాలనందువలన వీరు కాంగ్రెసుతో సహకరింపజాలరైరి.

లిబరల్‌పక్షమువారు దక్షిణాఫ్రికాలోని వివిధరాష్ట్రములందుండిరి. అయితే వారిభావములు, ఆశయములు వేరువేరుగానుండెను. వీరి నాయకులు కొందరు ఆఫ్రికావారితో కలిసిపనిచేయు సహచరులుగాగాక వారికి నాయకులుగా వ్యవహరింపజూచిరి., అందువలన వీరు కాంగ్రెసుకు సలహానిచ్చుచు దానికన్న తా మధికులమనుభావముతో ప్రత్యేకకార్యక్రమములప్రకారము రాజకీయములందు ప్రవర్తించుచుండిరి.

ఆఫ్రికాలోనినల్లవారు తమపక్షమున పార్లమెంటుకును సెనేటునకును

తెల్లవారినెన్నుకొనుటలో సాధారణముగా లిబరలుపక్షీయులనే ఎన్నుకొను చుందురు. అట్లెన్నుకొనబడిన లిబరలుపక్షీయులైన తెల్లవారుకూడా నల్ల వారిప్రతినిధులుగాగాక వారికి సలహానిచ్చునాయకులుగనే ప్రవర్తించుచుండిరి.

శాసనోల్లంఘనఉద్యమానంతరము కాంగ్రెసువారు తెల్లవారిలో తమకు మిత్రులుగానుండువా రెవ్వరని వెదుకగా కమ్యూనిస్టులుతప్ప ఇతర తెల్లవారు కనబడలేదు. అనేకశాసనములచే బంధింపబడిన కాంగ్రెసు నాయకు లేదైన చర్యతీసికొనినచో నైదేండ్లుశిక్ష ననుభవింపవలసివచ్చు ననుభయముతో నేమియు చేయలేకుండిరి. ఏమియు చేయకుండాఉన్నందు వలననే కాంగ్రెసు విచ్ఛిన్నముకాకుండా నిలిచియుండెను. గాంధిమహాత్ముని వలె సత్యాగ్రహముచేసి పూర్ణాహుతి సమర్పింపగల త్యాగమునుచేయుటకు ఆఫ్రికాలోనినల్లవారు సంసిద్ధముగ లేకుండిరి.

పోలీసువారు కాంగ్రెసునాయకులను వెంటాడుచు, వారు తమపై గల నిషేధాజ్ఞల నావంతయైన తప్పిచరించినను వారిని అరెస్టుచేయుచుండిరి. సభలు సమావేశములు జరుపుట కన్నియు ఆటంకములుగనేయుండెను. కాంగ్రెసువా రేసభచేసినను రహస్యపోలీసువారువచ్చి రాజద్రోహనేరమును గూర్చి తాము దర్యాప్తుచేయుచున్నామని చెప్పుచు అక్కడచేరినవారిపేర్లు వ్రాసికొనుచు ప్రేక్షకులఫొటోలు తీయుచుండిరి.

శాసనోల్లంఘనము విఫలమైనపిమ్మట దేశములోని నల్లజాతుల ప్రజల కుత్తేజముకలిగించి కార్యశూరులుగాచేయుట కెట్టి యుద్యమము నడపవలెననుచర్చలు కాంగ్రెసులో చాలామారులు జరిగెను. రాజకీయనాయ కులలో పూర్వసంప్రదాయమునకుచెందిన ప్రొఫెసర్ జడ్. కె. మాత్యూస్ గారు ప్రభుత్వమువారవలంబించిన వర్ణభేద జాతివిభజనవిధానమునకు వ్యతి రేకముగా దేశములోని వివిధజాతులప్రతినిధులు కలిగిన గొప్పమహాసభను సమావేశపరుపవలెనను అభిప్రాయమును ప్రకటించెను. ఇది క్రొత్తయభి ప్రాయము కాదు. లేబరుపార్టీవారు "ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ రేస్ రిలేషన్సు" ఆఫికేసరుల డచ్చి రిఫారండ్ చర్చివారు మొదలగు అనేకసంఘములవా రిదివరకు వివిధజాతులసభలను సమావేశపరుపవలెనను సూచననుచేసిరి. అట్టిసమావేశములను కొన్నిటిని చేసిరి. ఈ ప్రొఫెసరుగారుచేసిన సూచన

లోని విశేషమేమనగా పీడితులైన నల్లజాతిప్రజలే యిట్టి వివిధజాతుల సమావేశమును జరుపవలెననుట. ఇదివరకువలె ఇటువంటికార్యక్రమమునకు పాశ్చాత్యులుగాక నల్లవారే ప్రారంభకులగుట.

1953 డిశంబరులో కేపురాష్ట్రమునందు క్వీన్సుటవునులో జరిగిన కాంగ్రెసుసభయం దీ ప్రొఫెసరుగారు తమఅభిప్రాయములను వెల్లడించిరి. ఇది యొకవిధమైన ప్రజలపార్లమెంటుగా నుండవలెననిరి. వివిధజాతుల సమష్టిసంఘమున కిదీ దారిచూపవలెననిరి. వివిధజాతులు సమష్టిగా సమావేశముకావలెననుభావమునకు కొందరు వ్యతిరేకించిరి గాని, కాంగ్రెసు కార్యవర్గమువారి కిది బాగున్నటుల తోచెను. దీనివలన కాంగ్రెసుగౌరవ మును ప్రతిష్ఠయు హెచ్చునని వారికి తోచెను. అంతట వారు తమతోసహ కరించు ఇతరజాతులసంఘములకొరకు అన్వేషించిరి. పూర్వము శాసనోల్లంఘనకాలమున నల్లవారికితోడ్పడిన "సౌత్ ఆఫ్రికన్ ఇండియన్ కాంగ్రెస్" అను భారతీయప్రజాసంఘమువా రొకరు ముందుగా కనబడిరి, "యూరపియన్‌కాంగ్రెసు ఆఫ్ డెమోక్రాట్సు" సంఘమువారును తమకు సహకరింతురు. ఇవిగాక దక్షిణాఫ్రికాలో తెల్లవారికిని నల్లవారికిని పుట్టిన మిశ్రమజాతిరంగుప్రజలు - పదిలక్షలమందికి ప్రాతినిధ్యమువహించు కలర్డు పీపుల్సు ఆర్గనైజేషన్ అనునది యొకటికూడా వీరితో సహకరించుట కంగీకరించెను. అయితే కేపురాష్ట్రములో మిశ్రమజాతిరంగువారికి కొన్ని ప్రత్యేకసౌకర్యములున్నందువలన వారు నల్లవారితో నీవిషయమున సహకరించుటలేదు.

కాంగ్రెసువారు లిబరల్‌పార్టీవైపున తమదృష్టిని మరలించిరి. అయితే వారు మొదట నీయుద్యమము బాగున్నదని పలికినను చివరకు నల్లవారితో కలియుటకు అంగీకరింపలేదు. దీనికికారణము కమ్యూనిస్టులకు దీనిలో పలుకుబడియున్నట్లు వారికనుమానముకలుగుటయే.

ఇట్లు సహకరించుటకంగీకరించిన నాలుగుజాతులప్రజాసంఘములలో ఆఫ్రికన్‌కాంగ్రెసులోనే అధికసంఖ్యాకసభ్యులుండిరి. తక్కినసంఘముల వారు అల్పసంఖ్యాకులు. అయినను వివిధజాతులుకలిసిచేయు సమావేశము నకు ఒకవిధమైన గౌరవప్రతిపత్తులు కలుగుట సహజము.

ఐదుసంవత్సరములనుండి ప్రతియేటను వార్షిక అసమ్మతిసూచనదిన ముగ గమనింపబడుచున్న జూన్ 26 వ తేదీననే ఈ 1955 వ సంవత్సర మున నీ వివిధపక్షమహాసభజరుప నిశ్చయించిరి. కాంగ్రెసులో ప్రకటించు టకై స్వాతంత్ర్యములప్రకటనము "ఫ్రీడం చార్టర్" అనుపేరుతో ఒక ముసాయిదాను సిద్ధముచేసిరి. కాంగ్రెసు అఫ్ డెమోక్రాట్సువారు ఈ సన్నా హాములకు బాగుగా సహకరించిరి.

"కాంగ్రెసు ఆఫ్ ది పీపుల్" అనుపేరుతో నీ వివిధజాతులప్రజా సంఘమహాసభ - జోహానసుబర్గునకు పదునైదుమైళ్ళదూరమునగల "క్లిప్ టవున్"లోని ఫుట్‌బాల్‌మైదానములో 26-6-1955 వ తేదీన సమావేశ మయ్యెను. ఈ మహాసభను ప్రభుత్వమువారు నిషేధింపలేదు. దీనికికార ణము అప్పుడు ఎవ్వరికిని బోధపడలేదు. అయితే అప్పుడు పోలీసువారు మాత్రము వచ్చి అక్కడచేరినవారిపేర్లు వ్రాసికొని, ప్రేక్షకులదృశ్యములను ఫొటోలుతీసికొనుటయేగాక అక్కడినుండి కొన్నికాగితములను పట్టుకొని పోయిరి. అటుతరువాత వీనికి అపార్థములనుకల్పించి 1956 లో 156 మందిపైన రాజ్యద్రోహనేరమును ఆరోపించిపెట్టినకేసులో నుపయోగించిరి. అప్పుడు అందరికిని బోధపడెను.

ఈ మహాసభకువచ్చిన ప్రతినిధులలో స్త్రీలు, పురుషులు, వృద్ధులు, యువకులు, వివిధవృత్తులవారు వివిధ వేషభాషలవారు వివిధజాతులవారు మొత్తము రెండువేలయెనిమిదివందలమంది ప్రతినిధులుండిరి. "పోరాటము వర్ధిల్లునుగాక ! మనజీవితములోనే స్వాతంత్ర్యము !" అనువాక్యములుగల కేతనములు (banners) తో, పాటలతో, వచ్చిచేరిరి. ఆమైదానమంతయు నలుపు ,ఆకుపచ్చన, పసుపుపచ్చరంగుల కాంగ్రెసుత్రివర్ణపతాకములతో నిండిపోయెను. ఇందులో ప్రజలనుసూచించురంగు నలుపు; భూమిని సూచించునది ఆకుపచ్చ; బంగారమునుసూచించునది పసుపు. ఈ మూడు రంగులతో వారిపతాకము నిర్మింపబడెను. ఆసభకు అధ్యక్షుడుకాంగ్రెసు అఫ్ డెమోక్రాట్సుసంఘసభ్యుడైనపియటీబెయిల్‌వెల్డ్‌గారు( Piet Beyl Veld). చీనాదేశనాయకుడైన చౌఎన్‌లెయ్‌గారు ఈ మహాసభ కొక సందేశము నంపిరి. అక్కడ పుస్తకములదుకాణములందు స్వాతంత్ర్యమునకునంబం

ధించిన కరపత్రములు విక్రయింపబడుచుండెను. కాంగ్రెసు డెమాక్రాట్సు గాక ఆ సభకు కొలదిమంది పాశ్చాత్యులుమాత్రమే హాజరైరి. ఫాదర్ ట్రెవర్ హడల్‌స్టన్ అను నొక ఆంగ్లేయ క్రైస్తవమతబోధకుడు అదివరకు ఆఫ్రికాకాంగ్రెస్‌పట్ల సానుభూతిని కనబరచినవాడు ఆ సభకు రాగా, అక్కడి నల్లవారాయననుగౌరవించి వేదికపైన కూర్చుండబెట్టిరి. పాశ్చాత్యప్రపంచము ఆఫ్రికావారిఆశయములకు హర్షించుచున్నదని చూపుటకీ వృద్ధుడగు ఆంగ్లేయమతబోధకు డొక్కడే చాలునని నల్లవారు అభిప్రాయపడిరి.

ఈ మహాసభ రెండుదినములు జరిగెను. అప్పుడు గొప్పగొప్ప ఉపన్యాసములొసగబడెను. అందులో తర్జుమాలు, సందేశములు, పరిచయములు, ప్రకటనలు ఎన్నో జరిగెను. ఆఫ్రికావారు పాటలుపాడిరి. గీతములు పద్యములు చదివిరి. రెండవదినము అంతమగుచుండగా శాంతియు స్నేహము నుండవలెనను 'ఫ్రీడంచార్టరు' లేక స్వాతంత్ర్యప్రకటనము నందలి నిబంధనను చదివి సభవారికి వినిపించుచుండగా అందరు అనుకొనినట్లే పోలీసువారు తుపాకులతో వచ్చి సోదాచేయుదుమని అధ్యక్షునికి వారంటును జూపించిరి. రాజద్రోహనేరమునుగూర్చి తాము దర్యాప్తుచేయుటకు వచ్చినామనియు, రాజద్రోహకరములగు ప్రచురణములను సోదాచూచి పట్టుకొనిపోవుదుమనియు వారు చెప్పి ఆవరణమును చుట్టవేసిరి. అనుమతి పత్రములులేని నల్లవారిని అరెస్టుచేసిరి. వేదికపైనున్న కాగితములను లాగికొనిరి. సభలో నలుప్రక్కలనుండి చూపరులను ఫొటోతీసిరి. కరపత్రములవలనవచ్చిన అమ్మకపుసొమ్మును వశపరచుకొనిరి. పాశ్చాత్యేతర జాతులవారిని భయపెట్టుటకు ప్రయత్నము జరుగుచున్నదని ఫాదర్ హడ్‌ల్‌స్టన్‌గా రనిరి.

"ఎట్టివిచక్షణయు లేకుండా ప్రతిసందర్భమునందును 'కమ్యూనిజం' బూచిని చూపి నిరంకుశచర్యలు జరుపుచున్నారు. ఈ నిధముగాచేయువారు తుదకు చిక్కులలోపడితీరుదురు" అని ఆయన ఉద్ఘాటించిరి.

పోలీసువారు కాంగ్రెసుసభలో సోదాలుచేయుచు కాంగ్రెసుయొక్క నరంజామును తీసికొని, వేదికదిగువ కావలికాయుచుండగా అక్కడి-

కులు స్వాతంత్ర్యములపత్రములలోని ప్రతిసూత్రమును చదువుచుండుటయు అవి సభవారిచే ఆమోదింపబడుటయు యథావిధిగా జరుగుచునేయుండెను. మధ్యమధ్య ఆఫ్రికావారు జాతీయగీతమును పాడుచుండిరి. ఈ స్వాతంత్ర్యములప్రకటనపత్రము కాంగ్రెసులోని వివిధశాఖలవారిసూచనలను కలిపి సమకూర్చిన సంకీర్ణవిషయములపత్రముగా నుండెను. ఇంతకన్న తీవ్రమైన రాజకీయస్వాతంత్ర్యసూత్రములను తీర్మానించుటకు కాంగ్రెసులోని వివిధవర్గములవారి కిష్టములేకుండెను.

"దక్షిణాఫ్రికాప్రజలమైన మేము మాదేశమునకును ప్రపంచమునకును ఇందుమూలముగా ప్రకటించునదేమగా: ఈ దక్షిణాఫ్రికాదేశము ఇందులోనివసించుచున్నవారందరకును అనగా తెల్లవారు నల్లవారు అను భేదములేకుండా ప్రజలందరికిని హక్కుగలదేశము. అందువలన ప్రజల అందరియిష్టప్రకారము పరిపాలించిననే ప్రభుత్వము అధికారమువహించుట కర్హతకలిగియుండును. అన్యాయముపైనను అసమానత్వసిద్ధాంతముల పైనను ఆధారపరుపబడిన ప్రభుత్వము దేశములోనిప్రజలకు పుట్టుకవలన కలిగియున్న భూస్వామిత్వహక్కులను స్వతస్సిద్ధములైన స్వాతంత్ర్యములను శాంతిని హరించినది. మనప్రజలందరును సమానములైనహక్కులను, అవకాశములును కలిగియుండి సౌభ్రాతృత్వముతో జీవించువరకును మనదేశము అభివృద్ధిచెంది స్వతంత్రదేశముయొక్కసౌఖ్య మనుభవింపజాలదని, ప్రజలయిష్టముపైన ఆధారపడిన ప్రజాప్రభుత్వరాజ్యమున తప్ప జాతి మత వర్ణ స్త్రీ పురుషభేదము లేకుండా ప్రజలందరును తమ జన్మస్వాతంత్ర్యములను పొందజాలరు. అందువలన దక్షిణాఫ్రికాప్రజలమైన మేము తెల్లవారును, నల్లవారును కలిసి సమానులముగను ఒకేదేశీయులముగను సోదరులుగను భావించుకొనుచు, ఈ ఫ్రీడంచార్టరు అను ప్రజాస్వాతంత్ర్యములపత్రమును త్రికరణశుద్ధిగా ప్రకటించుచున్నాము. ఈ పత్రమునందు వివరింపబడిన ప్రజాప్రభుత్వసూత్రములప్రకారము మార్పులను కలిగించువరకు మేము మా సర్వశక్తులను ధైర్యముతో వినియోగింతుము" అని ప్రకటించిరి.

ఈ పత్రమునందు క్రిందిసూత్రముల క్రింద వివరములు వ్రాయబడినవి:

1. దేశమును ప్రజలే పరిపాలింపవలెను.

2. ప్రజలలోని అన్నివర్గములవారికిని సమానహక్కు లుండవలెను.

3. ప్రజలందరు దేశసంపద ననుభవింపవలెను.

4. భూమినికృషిచేయువారు దానిని సమానముగా అనుభవింపవలెను.

5. ప్రజలందరును న్యాయశాస్త్రముఖమున సమానులుగ నుండవలెను.

6. అందరును మానవస్వాతంత్ర్యములను కలిగియుండవలెను.

7. ప్రతివారికి జీవనమునకవసరమగుపనియు, భద్రతయు నుండవలెను.

8. విజ్ఞానము, సంస్కృతియొక్క కవాటములను పూర్తిగా తెరువవలెను.

9. ప్రజలువసించుటకు ఇండ్లు, సౌకర్యములు భద్రత యుండవలెను.

10. దేశములో శాంతియు స్నేహమును నెలకొల్పవలెను.

కొంత తీవ్రరాజకీయవాదస్వరూపము కనబడుచున్నను మొత్తముమీద నీ కోర్కెలన్నియు సర్వసామాన్యజనసంఘమువారి ఆశయములకు సంబంధించినవే. అద్దె, కౌలు మొత్తములు తగ్గించవలెననియు, ఆహారము పుష్కలముగా లభింపవలెననియు, ఎవ్వరును ఆకలిచే బాధపడరాదనియు, వారమునకు 41 గంటలు పనిచేయుపద్ధతి ప్రకారము శ్రామికవారపరిమితిని నిర్ణయించుట, మొదలైనకోర్కెలవలననే ఈ స్వాతంత్ర్యములనభిలషించు బీదజనుల ఆశయములు వెల్లడించుచుండెను. బ్యాంకులును, సర్వముక్తా భారీ పరిశ్రమలును ప్రజలవశముచేయబడవలెను; ఏ ప్రాంతముననైనను భూముల నాక్రమించుటకు అందరికిని హక్కులుండవలెనని వ్రాయబడిన సూత్రమునుగూర్చి కాంగ్రెసులో చాలా చర్చలుజరిగెను. దీనిని ఇంకను వివరముగా వ్రాయకుండా వదలిపెట్టిరి.

ఒక్కసంగతిమాత్రము స్పష్టముగా కనబడుచుండెను. అది వివిధ జాతులకు ప్రాతినిధ్యముగల రాజ్యము కావలెననువాంఛ. నిజమునకు

తాము స్థాపింపదలచిన రాజ్యాంగస్వరూపమునుగూర్చి కాంగ్రెసులో చాలా అభిప్రాయభేదములుండెను. దానికికారణము అందులో 'క్యాపిటలిస్టు' పెట్టుబడిదారులగు ధనికులు, సామ్యవాదులగు కమ్యూనిస్టులు, ఆస్తికులగు క్రైస్తవులు మొదలైన వివిధాభిప్రాయములుకలవా రుండిరి. ఏమైననేమి, కాంగ్రెస్ ఆఫ్ ది పీపుల్‌సభవారు ప్రజాస్వాతంత్ర్యములపత్రము నేకగ్రీవముగా ఆమోదించిరి. పోలీసువా రొకమూల సోదాలుచేయుచు సభ్యుల పేర్లు వ్రాసికొనుచుండగా ఆఫ్రికాదేశీయులయొక్క ప్రత్యేక బ్యాండు వాద్యమునందలి బూరాలు దోలువాద్యములతో ఆఫ్రికావారు పాటలుపాడుచుండగా నీ మహాసభ ముగిసి, సభ్యులందరును వెళ్ళిపోయిరి.

ఈ మహాసభావృత్తాంతములకును స్వాతంత్ర్యప్రకటనపత్రమునకును పాశ్చాత్యపత్రికలు ప్రాముఖ్యమునొసగలేదు. ఆఫ్రికాన్సు అను తెల్లవారి దైనికపత్రికయగు డయి ట్రాన్సువాలర్ (Die Transvaler) ఆ పత్రములోనున్న సామాజికవాదసిద్ధాంతమునకు సంబంధించిన కొన్నిపదములను మాత్రము ఉదాహరించెను.

ఈ సభావృత్తాంతములకు తెల్లవారు అపార్థములనుకల్పించసాగిరి. దానికి కమ్యూనిస్టుపూతవేయసాగిరి. తెల్లవారిలోనే ఈ సభాకార్యక్రమము కొంత పరివర్తనము కలిగించునని ఆశపడిన ప్రొఫెసర్ మాత్యూస్‌గారును, ఆఫ్రికాకాంగ్రెస్‌నాయకుడైన లుతూలీగారును ఆశాభంగముచెందిరి.

పూర్వము చాలామారులు ఇతరసందర్భములందు చేసినట్లే కాంగ్రెసు ఈ ప్రజాస్వాతంత్ర్యములపత్రమునకు బలముచేకూర్చుటకొరకు పదిలక్షల సంతకములను ప్రోగుచేయుఉద్యమమును ప్రారంభించెను.

1955 సెప్టెంబరులో దీనినిగూర్చి కాంగ్రెసువారు ప్రజలకు హెచ్చరికచేయుచు సైక్లోస్టయిలుపత్రములను తయారుచేయుచుండగా పోలీసువారు కాంగ్రెసుకార్యాలయముపైనను ఇతరప్రదేశములపైనను ఇదివర కెన్నడును కనివినియెరుగనివిధమైన దాడిని జరిపిరి. దేశములో మొత్తము 48 సంస్థల కార్యాలయములను వ్యక్తులయిండ్లను ఒకేసారి సోదాచేయుటకు దేశములో నలుప్రక్కలనున్న పోలీసువారు వారంట్లు పొంది దాడిచేసిరి. వీరు ఆఫ్రికా కాంగ్రెసుకార్యాలయములను ఇండియన్ కాంగ్రెసు కార్యా

లయములను సోదాచేసి, అక్కడి పుస్తకములను, టైపుయంత్రములను, పదిలక్షలసంతకములకొరకై హెచ్చరికను తయారుచేయుటకు తెచ్చియుంచిన డూప్లికేటింగుపేపరును తీసికొనిపోయిరి. పోలీసువారు సెంట్రల్ ఇండియన్ హైస్కూలును, న్యూయేజ్, (New Age) పత్రికకార్యాలయమును, ఫాదర్ హడల్‌స్టన్‌గారియింటిని సోదాచేసిరి. వారు లారీనిండుగా వేసి తీసికొనిపోయిన కాగితములందు పుస్తకములందు సోమర్‌సెట్‌మాఘం అను నవలారచయితయొక్క రేజర్సుఎడ్జి అనునవల, బెర్నార్డుషాగారి అన్‌సోషల్‌సోషలిస్టుఅనుగ్రంధము."The statetly houses of England" అను నొక చిత్రపటము, ఓలివర్‌స్క్రీనరుగారి జీవితచరిత్ర, చీనాదేశపు డ్రాగన్‌బొమ్మతోకుట్టిన డ్రెసింగుగౌను కూడా ఉండెను. 1931 లో భారతదేశమందు జరిగిన శాసనోల్లంఘనోద్యమమునందుకూడా ఇట్టి గ్రంథములను పోలీసువారు తీసికొనిపోయిరి. ఉదాహరణమునకు బెజవాడ సర్కిలు ఇన్‌స్పెక్టరుగారు మాత్యూ ఆర్నాల్డుగారి 'కల్చర్ అండ్ అనార్కీ', టాల్సుటాయి 'రిసరెక్షన్' రైల్వేగైడు మొదలైనవి పట్టుకొనిపోయిరి.

స్పెషల్‌బ్రాంచిపోలీసుఅధికారి లెఫ్టినెంట్ ప్రిన్‌స్లూగారు ఈ సోదాలు రాజద్రోహమునుగూర్చియు. సప్రెషన్ ఆఫ్ కమ్యూనిజంచట్టము, రయటస్ అసెంబ్లీస్‌చట్టములకు సంబంధించిన నేరములనుగూర్చియు దర్యాప్తుచేయు సందర్భమున జరిగినవని ప్రకటించిరి.

ప్రజాస్వాతంత్ర్యములపత్రము రాజద్రోహకరపత్రమని ప్రభుత్వము వా రభిప్రాయపడుచుండగా, కాంగ్రెసులోని నల్లవారిలో ఆఫ్రికావిస్టుపక్షము వా రీ పత్రములోనివిషయములు నల్లవారిక్షేమలాభములను కలిగించుటకు కావలసినంత తీవ్రముగాలేవని గొణిగికొనుచుండిరి. ఈ పత్రమువలన దేశములో నల్లవారికి ఆధిపత్యము లభింపదని అసంతృప్తిచెందిరి.

1955 సంవత్సరాంతమున బ్లూంఫాంటీనులో జరిగిన కాంగ్రెసు వార్షికసమావేశమునందు ఆఫ్రికానిస్టుపక్షమువారు ఫ్రీడంచార్టరును అతి తీవ్రముగా విమర్శించిరి. పూర్వము నల్లవారి జాతీయనాయకులు చేసిన కృషిని వారిఆశయములను వర్ణించుచు, ఈ ప్రజాస్వాతంత్ర్యములపత్రము

లోని అంశము లెంత నిర్వీర్యముగానున్నవో పేర్కొనుచు డాక్టరు గ్జూమా గారు ఆఫ్రికానిస్టుపక్షమువారికి వ్రాసినలేఖను వా రుల్లేఖించిరి.

పూర్వము 1949 లో లెంబ్దెగారినాయకత్వముక్రింద నిర్వహింపబడిన కార్యశూరత్వముగల ప్రణాళికను గైకొని ప్రభుత్వసంస్థలను బహిష్కరింప వలెనని గ్జూమాగారును, ఆఫ్రికానిస్టులును కోరిరి. క్లిప్టవునులో కాంగ్రెసు చేసినపని యేమియులేదనియు నిష్కారణముగా కాలమును వృథపుచ్చిన దనియు వారనిరి. దక్షిణాఫ్రికా నల్లవారిదేశమైయుండగా ప్రజాస్వాతంత్ర్య ముల పత్రమునందు భూమిలో ఇతరజాతులవారందరికిని హక్కులిచ్చుట కేవలము అన్యాయమనిరి. నల్లవారు దయతోనిచ్చినహక్కులను పొందు టకే ఇతరజాతులవారు అర్హులనిరి. ఇది ధనికులును ధనహీనులు ననువర్గ ములవారి పోరాటము కాదనియు, తెల్లవారికిని నల్లవారికినిమధ్య జరుగు చున్నపోరాటమనియు వా రుద్ఘాటించిరి.

ఈ వాగ్వాదములు కాంగ్రెసులోనేగాక తరువాతకూడా జరుగుచునే యుండెను. మరుసటిసంవత్సరము అనగా 1956 ఈస్టరుసెలవులలో ఆర్లాం డోలో జరిగిన ప్రత్యేకసమావేశమునందుకూడా 'నేషనల్' జాతీయభావము లకును 'లిబరల్' ఉదారభావములకును మధ్య సంఘర్షము జరిగెను. ఇతర జాతులతో సమైక్యతనుకలిగించు రాజ్యాంగవిధానమునకు ఆఫ్రికానిస్టులు ఇష్టపడలేదు. అయితే, కాంగ్రెసులోని "చార్టరిస్టు"లని పిలువబడు ప్రజా స్వాతంత్ర్యపత్ర ప్రతిపాదకులు అధికసంఖ్యాబలముతో నెగ్గిరి.

1956 ఏప్రిలులో ఈ ప్రత్యేకసమావేశముజరిగిన కొలదికాలము లోనే న్యాయపరిపాలనశాఖామంత్రియైన స్వార్టుగారు పార్లమెంటులో ప్రసంగించుచు దేశములో జరిగిన సోదాలఫలితముగా రెండువందలమంది పైన రాజ్యద్రోహనేరము (Treason) కేసు పెట్టదలచినామని చెప్పిరి. ఈ లోపుగా కాంగ్రెసువారు అన్నిపక్షములవారితో సామరస్యము కుదుర్చు కొనవలెనని ప్రయత్నించుచుండిరి. అక్టోబరునెలలో బ్లూంపాంటీన్‌లో ఆర్చిడీకన్‌గారు సమావేశపరచిన "Inter denominational African Ministers' Federation" అను నొక మిశ్రమజాతి క్రైస్తవమతాధి కారులసభలో కాంగ్రెసునాయకులు హాజరైరి. దానికి పండుముదుసలియైన

జాకరయ్యా మహాలనెగారు అధ్యక్షులు. ప్రభుత్వమువారి వర్ణభేద జాతివిభజన 'ఆపార్తీడ్'విధానమును చర్చించి, అందులో జాతులవారీగా వేరువేరుప్రదేశ ములలో ప్రజలను వేరుపరచి నిర్బంధించియుంచుటను నిరసించిరి. పదునలుగురు ప్రముఖులు ఆ తీర్మానమును తయారుచేయుచు దక్షిణాఫ్రికాలోని ప్రతి అంగుళముభూమియందును నల్లవారుకూడా హక్కుకలిగియున్నారని చెప్పి, వారికి ప్రత్యేకగూడెములను నిర్ణయించుట తప్పనిరి. ఈ క్రైస్తవమహాసభ చేసిన తీర్మానములు చాలా మర్యాదగాను గంభీరముగను ఉన్నవని ఇంగ్లీషు పత్రికలుకూడా అంగీకరించెను.

ఈ పరిస్థితులలో దక్షిణాఫ్రికాసమితిప్రభుత్వమువారు కాంగ్రెసు నాయకులను జాతీయోద్యమాభిమానులను కలిసి 156 మంది పైన రాజ్యద్రోహ నేరముమోపి పట్టుకొని కేసులుపెట్టిరి.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## ఎనిమిదవ ప్రకరణము

### రాజద్రోహ కేసు

1956 డిశంబరు 5 వ తేది తెల్లవారకుండగనే దక్షిణాఫ్రికాసమితి రాజ్యప్రభుత్వమువారి పాశ్చాత్య పోలీసుఉద్యోగులు అధికారదుస్తులుగాక, సాదాదుస్తులనేవేసికొని పెద్ద బూట్సు, దొరటోపీలు ధరించి, ఆ దేశములో నలుప్రక్కలను రమారమి వేయిమైళ్ళదూరమున జీవించుచున్న ఆఫ్రికా, పాశ్చాత్య, భారతీయ మిశ్రమజాతిపురుషులను, కొందరుస్త్రీలను కలిపి మొత్తము 140 మందిని రాజద్రోహనేరమునకు పట్టుకొని దగ్గరలోనున్న మేజస్ట్రేటులవలన జైలునిర్బంధపుఉత్తర్వులు పొంది సమీపమునగల విమానాశ్రయములదగ్గర సిద్ధముగా నుంచిన మిలిటరీవిమానములలోని కెక్కించి జోహానసుబర్గులో 'కోట' యని ప్రసిద్ధిచెందిన కొండమీది సెంట్రల్ జైలులోని ఒక పెద్ద ఖైదుకొట్టులో వీరిని పెట్టిరి.

త్వరలోనే ఇంకను పదునారుగురుముద్దాయిలను ఆ నేరమునకే పట్టి తెచ్చి అక్కడ నిర్బంధించిరి.

ఈ రాజకీయనేరవిచారణ పదునైదుదినములలో ప్రారంభమగునని అప్పు డక్కడియుద్యోగు లనిరి.

అరెస్టుచేయబడి ఖైదులోనుంచబడినవారిలో దక్షిణాఫ్రికాలోని ప్రజలలో వివిధజాతులవారు వివిధసంఘములవారు, తరగతులవారు, వృత్తుల వారును ఉండిరి.

ఈ ముద్దాయిలలో లుతూలీగారును, మాత్యూస్ అను నల్లప్రొఫెసరు గారును, న్యాయవాదిగాపనిచేయు ఆయనకుమారుడు నుండిరి. గుణ్ణపువందె

ములవ్యాపారముచేయు ఒక పాశ్చాత్యు డుండెను. ఒక పార్ల మెంటుసభ్యు డుండెను. ముగ్గురు క్రైస్తవమతాధికారు లుండిరి. ఇరువురు లారీడ్రైవర్లు, ఎనిమిదిమంది లాయర్లు, ఏడుగురు డాక్టర్లు, కొద్దిమంది స్త్రీలు నుండిరి. వీరిలో ఒకరితో నొకరికి సంబంధముగలవా రొకరిద్దరుతప్ప మిగిలినవారి కొకరితో నొకరికి ఎట్టిసంబంధమును లేదు.

రాజద్రోహమునకు పట్టుకొనిన 156 మందిలో 23 మంది ఐరోపా జాతి తెల్లవారు. ఆఫ్రికాదేశములోని నల్లవారికి న్యాయమైనహక్కులుండ వలెనని కోరుచుండుటయే వీరు చేసిన మహాపరాధము. ఇందులో కొందరు ధనికవర్గమునకు చెందినవారే. కొందరు వ్యాపారవృత్తికట్టడి సంఘములతో సంబంధముగలవారు. కొందరు ఆఫ్రికాదేశములో చిరకాలము నివాసముగా నుండి ఆఫ్రికేనరుపేర్లు కలిగియుండిరి. అందులో కొందరు పూర్వసంప్ర దాయములకుచెందిన తెల్ల వారు. కొందరు తీవ్రవాదులు, కొందరు మార్క్స సిద్ధాంతములకు చెందినవారు. కొందరు కేవలము కాకతాళన్యాయముగా అనుకొనకుండా నల్లవారివ్యవహారములందు చొరబడి చిక్కులోనికివచ్చిన వారు. డి. సి. తాంప్సన్‌గారను ముద్దాయి మెతడిస్టు క్రైస్తవమతబోధ కుడు. హెలెన్ జోసెఫ్ అను ఇంగ్లీషుస్త్రీ ఇంగ్లాండులోని కన్సర్వేటివ్ లేక పూర్వసంప్రదాయములకుచెందిన టోరీజిల్లాలో కాపురముండి దక్షిణా ఫ్రికాలో జరుగుచున్న అన్యాయములనుచూచి బాధపడినది.

'ప్రొగ్రెసివ్సు' అను ఉదారవాదులలో చాలామంది యూదులు (Jews). వీరికి నల్లవారిపైన సానుభూతియుండెను. ముద్దాయిలలో ఇరు వదియారుగురు భారతీయులు. వీరికి పూర్వము మహాత్మ గాంధిగారు ప్రయో గించిన సత్యాహింసలు సత్యాగ్రహపద్ధతులు తెలియవు. వీరిలో కొందరు గాంధిగారి అనుచరులబిడ్డలు. దక్షిణాఫ్రికాలో పుట్టి పెరిగినవారు. తెల్లవారి ప్రభుత్వమునందు భారతీయులకు చాలా అన్యాయములు జరుగుచుండెను. వీరిలోకొందరు నల్లవారితోకలిసి రాజకీయాందోళనమున పాల్గొనిరి. ఆఫ్రికా వారు భారతీయులను గాంధిగారిబిడ్డలని వ్యవహరించుచుండిరి. (అబాఫనా బాకాగాంధీ) ముద్దాయిలలో అధికసంఖ్యాకులు నల్లవారే. సమితిరాజ్యములోని తెల్లవారిరాజ్యాధిపత్యమును ప్రతిఘటించు ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెసు అను

జాతీయసంఘమునందుగాని, దానికి సన్నిహితసంబంధముగల ఇతర రాజకీయప్రజాసంఘములందుగాని సభ్యులై యుండుటయే వీరికిగల సంబంధము. ఎత్తైనగోడలమధ్య ఆ కారాగారమునందు నిర్బంధింపబడిన ఈ వివిధ రాజకీయ సాంఘిక ఆర్థికసంఘములకు జాతులకు చెందిన వ్యక్తుల కదివరకు ఒకరితోనొకరికి సన్నిహితసంబంధముగాని స్నేహముగాని పరిచయముగాని లేకపోయినను జాతి మత కులవివక్షతలేని రాజ్యము స్థాపింపవలెనని కోరుటయే నేరముగా పరిగణించి వీరి నీవిధముగా నొకచోట నిర్బంధించుట వలన ఆ నేరమునుగూర్చి న్యాయస్థానమునందు విచారణజరుగులోపుగా వీరిలో నొకరిపై నొకరికి భ్రాతృభావ మేర్పడెను. అదివరకు కేవలము మనస్సులందుగల కోరికలుగమాత్రమేయుండిన ఈ రాజకీయభావములు బలపడి అదివరకు కార్యాచరణరూపమున ప్రదర్శించుటకు ధైర్యముచాలని భీరువుల కిప్పుడు ధైర్యముకలిగి, చల్లనినీటిలో మొదట మునకవేసినవారికి చలితీరినట్లు వీరికి ఈ రాజకీయస్వాతంత్ర్యసముద్రస్నానమున చలితీరి తిరుగులేని జాతీయవాదులుగా పరిణమించిరి.

ఆ కారాగారముయొక్క విశాలమందిరము ప్రతిదినము సాయంకాలమగునప్పటికి ఆఫ్రికా రాజకీయపాఠశాలగా మారిపోయి, ఆఫ్రికా జాతీయ కాంగ్రెసుచరిత్రనుగూర్చియు, గాంధిమహాత్ముని సాత్వికనిరోధసిద్ధాంతములనుగూర్చియుఆఫ్రికాదేశసంస్కృతికిసంబంధించినవిషయములనుగూర్చియు చర్చలతో ఉపన్యాసములతో ప్రతిధ్వనించుచుండెను. అక్కడ ప్రతిదినము గొప్పగొప్ప రాజకీయఉపన్యాసము లొసగబడుచుండెను. అదివరకు దేశములోని మారుమూలగ్రామములందుండి కేవలము దూరమునుండి కాంగ్రెసుపైన సానుభూతిని కనబరచు రాజకీయపరిజ్ఞానములేనివారికి ఆఫ్రికాదేశభక్తి, జాతీయత, స్వాతంత్ర్యోద్యమవిధానములు అవగతములయ్యెను. ఆ కారాగారములో జయజయధ్వానములు మిన్నుముట్టెను. ఆఫ్రికా పునరుజ్జీవమగుగాక! ఆఫ్రికాను భగవంతు డనుగ్రహించుగాక! అను జయధ్వానములు చెలరేగెను.

ఈ రాజకీయనేరమునకు 156 మందిని పట్టుకొనకపూర్వము మూడు సంవత్సరములనుండి దక్షిణాఫ్రికాలో ప్రభుత్వమును ప్రతిఘటించు జాతీయ

వాదులపైన రాజ్యద్రోహనేరము మోపబడునని, ఆ నేరమునకు మరణ దండనమే శిక్షయని ప్రభుత్వాధిమానులు అప్పుడప్పుడు అక్కడక్కడ వెల్లడించుచునేయుండిరి.

తుదకు 1956 జూలై నెలలో న్యాయపరిపాలనమంత్రి స్వార్టుగారు పార్లమెంటులో మాటలాడుచు రాజ్యద్రోహమునకుసంబంధించిననేరములకు షుమారు రెండుసందలమందిని అరెస్టుచేయదలచినానని ప్రకటించెను. ఆఫ్రికాజాతీయనాయకు లీ మంత్రి యిట్లు చేయునని ఎఱిగియున్నందువలన డిశంబరు 5 వ తేదీన జరిగిన అరెస్టులకు ఆశ్చర్యపడలేదు.

ఈ అరెస్టులనుగూర్చి దక్షిణాఫ్రికాలో వివిధవర్గములకుచెందిన ప్రజలమనోభావము లెట్లుండెను? దక్షిణాఫ్రికాలో తెల్లవారిరాజ్యాధిపత్యమును నిలువబెట్టుకొనవలెనను "నేషనలిస్టు" జాతీయపక్షమను రాజకీయ పక్షమునకు చెందినవారు, తెల్లవారిజనసంఖ్యలో సగభాగ ముండిరి. వీరందరు నీ అరెస్టులు రాజ్యక్షేమమున కవసరమనియే ఎంచుచుండిరి. తెల్లవారి రాజ్యాధిపత్యమును ప్రతిఘటించువారిని అణచుట అవసరమని వీరు తలచుటలో ఆశ్చర్యములేదు. అదివరకు ఆఫ్రికారాజకీయములందు వీరికన్న కొంచెము ఉదారభావమువహించి రాజ్యమేలిన యునైటెడ్‌పార్టీ అను రాజకీయపక్షమువారి నీ నేషనలిస్టులు ఇప్పటికైనను బుద్ధితెచ్చుకొనవలసినదని హెచ్చరింపసాగిరి. ఇందులో విశేషమేమనగా పూర్వము డచ్చిజాతివారును వివిధపాశ్చాత్యజాతులవారును దక్షిణాఫ్రికాలోనికి వలసవచ్చిస్థిరపడినపిమ్మట, ఇంగ్లీషుభాషకు భిన్నమైన ఆఫ్రికాన్సు అను నొక క్రొత్తభాషను మాటలాడుచు, తమవలెనే ఇక్కడ వలసవచ్చి నెలకొనిన ఇంగ్లీషుజాతివారికి భిన్నమగు 'ఆఫ్రికేనరు' జాతీయత నొకదానిని అభివృద్ధిచేసికొనిరి. అట్టివారి నేషనలిస్టుపార్టీలో చాలామంది యుండిరి. యునైటెడ్‌పార్టీలో ఆంగ్లేయ నాగరికతకుచెంది ఇంగ్లీషుభాషనుమాటలాడువా రధికులుగా నుండిరి. అయితే ఈ యునైటెడ్‌పార్టీవారుకూడా నల్లవారిపైన నిజమైన సానుభూతికలిగినవారు కారు. వారుకూడా దక్షిణాఫ్రికాలోని భాగ్యభోగ్యములన్నియు తెల్లవారికే హక్కుకలిగియుండవలెనను భావము కలవారే. ఆ యభిప్రాయముతోనే వారు నల్లవారికి హక్కులులేకుండాచేసి, వారిని అణచియుంచు శాసన

విధులనుచేసి వారిని నీచముగానే చూచుచుండిరి. నేషనలిస్టులు వీరుచేసిన దానికన్న నల్లవారిపైన తీవ్రచర్యలు జరుపవలెనని కోరుచుండిరి. అయితే దక్షిణాఫ్రికాలో పుట్టిపెరిగిన దేశీయులైన నల్లవారిపట్ల న్యాయముగా ప్రవర్తింపవలెననియు వారికి కొన్ని రాజకీయహక్కు లొసగవలెననియు తలచు ఉదారభావముగల పాశ్చాత్యులు కొందరు లేకపోలేదు. వీరిని "లిబరల్సు" అని ఆ దేశములోనితెల్లవారు వ్యవహరించుచుండిరి. ఆ దేశమున అన్ని జాతులకుచెందిన ఐరోపావారును కలిసి ముప్పదిలక్షలమందియున్నారు. అట్టివారిలో నిట్టి యుదారభావముగల ధర్మాతు లొక లక్షమందిమాత్ర మున్నారు. రాజద్రోహనేరమున కిట్లు 156 మందిని అక్రమముగా పట్టు కొని నిర్బంధములోనుంచుటవలన నీ 'లిబరల్సు'లో సంచలనము కలిగినది. ఆఫ్రికాజాతీయనాయకులపక్షమువహించి పనిచేయవలెనను దృఢనిశ్చయ మిప్పుడు వారికి కలిగెను.

"ఉత్కృష్టరాజకీయసిద్ధాంతమగు "డెమోక్రటికు" ప్రజాప్రభుత్వవిధానమునకు భంగముకలుగకుండా సంరక్షించుటకు మనము పాటుపడనిచో ప్రజాప్రభుత్వవిధానమే అంతరించు పరిస్థితులు సంభవింపగలవు" అని లిబరల్‌పార్టీఅధ్యక్షుడగు అలన్ పేటన్‌గారు గట్టిగా వక్కాణించిరి. ఈ నిర్బంధములు అక్రమములనియు, ఇవి పౌరస్వాతంత్ర్యములకు భంగము కలిగించుచున్నవనియు లిబరలుపక్షమువారికి తోచినను, ఆఫ్రికాదేశీయులైన నల్లవారవలంబించు ప్రతిఘటనవిధానమును వీరు హర్షింపజాలరు. అందువలన నీ పరిస్థితిలో వీరి కేమిచేయుటకును తోచలేదు, అందువలన చాలా మంది తటస్థభావము వహించిరి. కొందరుమాత్రము ఆఫ్రికాదేశీయుల పక్షమున పనిచేయుటకు ముందుకువచ్చిరి.

ఇట్లు తెల్లవారిలో అభిప్రాయభేదములు తలయెత్తగా అదివరకు దేశములో రాజకీయఉద్యమము చురుకుగా సాగనందులకు అసంతృప్తివహించి విసుగులైయున్న నల్లవారిలో నీ రాజద్రోహనేరమునకు తమ నాయకు లిట్లు నిర్బంధింపబడుటవలన సంచలనముకలిగి తమ హక్కులకొరకు పోరాడవలెనను ఉత్సాహము కలిగెను. వారిస్వాతంత్ర్యకాంక్ష ద్విగుణీకృతమై కార్యశూరత్వమునకు పురికొల్పెను.

అంతట దక్షిణాఫ్రికాప్రజల జాతీయకాంగ్రెసుసంఘమువారు "మీ నాయకులకు అండయై నిలువబడుడు" అను నినాదముతో నొక యుద్యమ మును లేవదీసిరి.

దేశములో నలుప్రక్కలనున్న నల్లవారిప్రత్యేకస్థావరములందు "నిర్బంధితులగు మా జాతినాయకులకు తోడ్పడుదుము, మేము మా నాయ కులను శాయశక్తుల సమర్థింతుము. వారికి అండయై నిలుతుము" అని యుద్ఘాటించుచు పెద్దపెద్దఅక్షరములతో వ్రాసిన అట్టలను ప్రదర్శింపసాగిరి.

ఈ కేసువలన దేశములోనితెల్లవారిలోను, నల్లవారిలోను కూడా గొప్ప సంచలనము కలిగెను. "ఆఫ్రికాకాంగ్రెసు" అనుమాట దేశములోని నల్లవారి బలమంతయు కేంద్రీకృతమైనశక్తికి పర్యాయపదమయ్యెను. అది వరకు అక్కడక్కడ చెదరియున్న శక్తులు ఏకమై సమ్మెలుగా 'బాయి కాటు'లుగా బహిష్కారములుగా రాజద్రోహచర్యలుగా విజృంభించెను. రాజ్యద్రోహనేరమునకు విచారింపబడుచున్న ముద్దాయిలరక్షణముకొరకు 100000 నవరసులుఖర్చుఅగునని అంచనావేయబడెను.ఆమొత్తమును సమ కూర్చుట కొక నిధిసంఘ మేర్పడెను. ఇంగ్లాండులోని న్యాయవాదులయొక్క మూడురాజకీయసంఘములతరపునను బార్‌కవున్సిలుపక్షమునను ఈ రాజ కీయనేరములవిచారణను కనిపెట్టిచూచుటకు, జెరాల్డు గార్డినర్ Q. C. అను నొక సుప్రసిద్ధ బ్యారిష్టరు జోహానసుబర్గుకు వచ్చెను. మా రాజ్యము లోని ఆంతరంగిక న్యాయపరిపాలనవ్యవహారములలో జోక్యముకలిగించు కొనుట బాగుగాలేదని దక్షిణాఫ్రికాప్రభుత్వ విదేశవ్యవహారములమంత్రి ఆక్షేపించగా, 'మీదేశప్రభుత్వమువారు 1950 సంవత్సరములో చేసిన సప్రెషన్ ఆఫ్ కమ్యూనిజం ఆక్టులో 'కమ్యూనిస్టు' అనుపదమునకు చేసిన నిర్వచనమును చూచినవారెవ్వరును మా అనుమానమున కాశ్చర్యము చెందరు' అని అంతర్జాతీయ న్యాయశాస్త్రజ్ఞులసంఘమువారి సెక్రటరీజనరల్ గారు జవాబుచెప్పిరి. (**Secretary General of International Commission of Jurists**).

బ్లూంఫాంటీన్‌లోని ప్రధానమేజస్ట్రేటుగారగు ఎఫ్. సి. ఏ. వెస్సెల్ (**F. C. A. Wessel**) గారు ఈ కేసువిచారించుటకు ప్రత్యేకముగా నియ

మింపబడిరి. ఈ కేసువిచారణనుచూచుటకు దేశములో నలుప్రక్కలనుండి తండోపతండములుగా ప్రజలు వచ్చి, ఆ విచారణజరుగుచుండిన మిలిటరీ డ్రిల్లుమైదానములోని డ్రిల్ హాల్ అను ఆ భవనముచుట్టును చేరి, జాతీయ నాయకులను పేర్కొనుచు జయజయధ్వానములుచేయసాగిరి. ఇట్లు అక్కడ చేరిన అసంఖ్యాకులగుప్రజలను పోలీసువారు తమ బ్యాటన్ లను లాటీలతో చెదరగొట్టుటకు ప్రయత్నించిరి. అంతట ప్రజలు ఆగ్రహముతో వారిపైన నారింజకాయలను రాళ్ళను రువ్వసాగిరి. దీనికి ప్రతిక్రియగా పోలీసుఉద్యోగులు ఒడలుతెలియనిఆవేశముతో తుపాకులుకాల్చిరి. ఇంతేగాక మెషిన్ గన్‌లను ప్రయోగించిరి, ఈ గుండుదెబ్బలవలన గాయపడిన ఇరువదియిద్దరిని ఆసుపత్రికి తీసికొనివెళ్ళిరి. ఇట్లు బయట గడబిడ జరుగుచుండగా లోపల కోర్టువిచారణ జరుగుచుండెను, దేశీయులపట్ల సానుభూతిగల జోహానసుబర్గు బిషప్పుగారు వచ్చి, పోలీసుఉద్యోగులను మందలించి ఈ కాల్పులు ఆపించిరి. రాజబాటమూలలందు చేరిన ప్రజలగుంపులను సమాధానపరచి పంపివేయుటకు ప్రయత్నించిరి. మా సోదరులు లోపలనుండగా మేమెందులకు పోవలెనని ప్రజలనిరి. ఎట్టకేల కా బిషప్పుగారియందుగల గౌరవమువలన వారు మనస్సుమార్చుకొని జేయ్ ఆఫ్రికా! అని అరచుచు వెళ్ళిపోవుట ప్రారంభించిరి. క్రమక్రమముగా గుంపులు సన్నగిల్లెను, ఆ మరునాటినుండి డ్రిల్ హాల్ చుట్టును ఐదువందలమంది పోలీసులు కావలా కాయుచు మనుష్యులను దగ్గరకు రానివ్వకుండిరి. అయితే ఆ యావరణ వెలుపల ప్రజలు ప్రదర్శనములుచేయుచునే యుండిరి. క్రమక్రమముగా నాలుగైదుదినములైనపిమ్మట శాంతిభద్రతలు నెలకొనెను. సాధారణముగా న్యాయస్థానములందు న్యాయాధిపతి లేక మేజస్ట్రేటు కూర్చుండువేదికకు దగ్గరగా ఫిర్యాదీ ముద్దాయిపక్షముల న్యాయవాదులు కూర్చుండు బారుఅను కుర్చీలవరుస యుండును. దానివెనుక అడ్డుగా కొయ్యకమ్ముల అడ్డుదడి యుండి, దానికివెనుకభాగమున ముద్దాయి నిలిచియుండుట, లేక కూర్చుండుట ఆచారము. దీనిని "బోను" అని వ్యవహరింతురు. ఈఅపూర్వరాజ్యద్రోహ నేరమును విచారించుటకు తెచ్చిన ముద్దాయిలనుంచుటకు యినుపచట్రములు వలలు గల నిజముగా పెద్దపులిబోనువంటిదానిని అధికారులు తయారు

చేసిరి। ముద్దాయిలపక్షపున్యాయవాదు లిట్టి కనివినియెరుగని పద్ధతికి తమ అసమ్మతిని తెలిపిరి. తరువాత నీ బోనుకుగల ఇనుపవలలను తీసివేసిరి.

మొదటి విచారణవాయిదా డిశంబరు 19 వ తేదీన జరిగినది. పైనచెప్పిన గడబిడలు, అల్లరులు కాల్పులు చల్లారి శాంతినెలకొనిన పిమ్మట నీ కేసు విచారణ కొంతవరకు శాంతముగానే జరిగినది.

ప్రభుత్వమువారితరపుప్రాసిక్యూటరైన వాన్ నీ కర్కు (Van Neikerk) గారు 18 ముద్దాయిలపైన మోపబడిన నేరమునుగూర్చియు ప్రభుత్వము తెచ్చునట్టి సాక్ష్యమునుగూర్చియు దీర్ఘమైన ప్రారంభవాదమును గావించిరి. జాతీయవిమోచనోద్యమము (National Liberation Movement) అని వ్యవహరింపబడు కార్యకలాపములను ప్రారంభించిన కొన్ని ప్రజాసంఘముల చర్యలఫలితముగా నీ కేసు దాఖలా నేరము జరిగెనని ప్రారంభించి, ప్రభుత్వమువారు దీనిని రుజువుచేయుదురనెను. ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్, సౌత్‌ఆఫ్రికన్ ఇండియన్ కాంగ్రెసు, సౌత్ ఆఫ్రికన్ కాంగ్రెసు ఆఫ్ ట్రేడ్‌యూనియన్సు, సౌత్ ఆఫ్రికన్ కలర్డు పీపుల్సు ఆర్గనైజేషన్, (మిశ్రమజాతిరంగుప్రజలసంఘము), సౌత్‌ఆఫ్రికన్ కాంగ్రెసు ఆఫ్ డెమాక్రాట్స్ అను ప్రజాసంఘములే ఈ యుద్యమమును నడుపుసంస్థలనిరి. "ఈ కేసులో ముద్దాయిలందరు నీ వివిధసంఘములలో కార్యనిర్వాహకసభ్యులుగాగాని. జాతీయవిమోచనోద్యమమునందును కాంగ్రెసు ఆఫ్ ది పీపుల్ అనబడు అందోళన (Campaign)లోను ప్రధానపాత్రవహించినవారుగాగాని ఉన్నారు, పాశ్చాత్యేతర లేదా వివిధ జాతులవ్యవస్థలయొక్క కార్యకలాపములనన్నిటిని సమన్వయముచేయుటకు పథకములువేయబడినవి. 1954 లో నొక జాతీయకాంగ్రెసుసమావేశమున నీ వివిధసంఘముల సమష్టిసమావేశము జరుపుటకు సంకల్పించబడెను, "ఫ్రీడంచార్టర్" అనబడు ప్రజాస్వాతంత్ర్యములపట్టా నొకదానిని తయారు చేయుటకు ఒక ప్లానింగుకమిటీని నియమించుటకు నిశ్చయింపబడెను.

"యథార్థమైన దక్షిణాఫ్రికాప్రభుత్వము కావలెనని తీర్మానింపబడెను, ఒక నిశ్చితమైనకార్యక్రమము జరుపుటకు (decisive action) ప్రజలను

సిద్ధముచేయవలెనని తీర్మానించిరి. జాతీయవిమోచనఉద్యమము నడుపవలె ననిరి. పార్లమెంటుకువెలుపల కార్యక్రమమును జరిపిననే ప్రస్తుతము ప్రభుత్వము నేషనలిస్టుప్రభుత్వమును ఓడింప వీలగుననిరి.

"దక్షిణాఫ్రికాసమితిలో వివిధప్రాంతములందు జరిగిన సభలలో రష్యాదేశములోని మార్క్సు, లెనిన్‌గార్లు ప్రతిపాదించిన ప్రజానంఘమును ప్రభుత్వమునుగూర్చి ప్రచారముచేయుచు ఉపన్యాసములొసగబడెను. సోవియటురష్యాలోని పద్ధతులపైన "పీపుల్సు డెమాక్రటిక్‌స్టేటు" ప్రభుత్వస్థాపనమును సమర్థించిరి. కమ్యూనిస్టులు తమఉద్దేశములను సాధించుట కవలంబించిన సాధనవిధానములను ప్రశంసించిరి.

"1955 జూన్ 25, 26 వ తేదీలలో జోహానసుబర్గుదగ్గర క్లిప్‌టౌనులో కాంగ్రెసు ఆఫ్ ది పీపుల్ అనబడు ప్రజాకాంగ్రెసుసమావేశము జరిగెను." అప్పుడు "ఫ్రీడంచార్టర్" స్వాతంత్ర్యములప్రకటనపత్రముయొక్క చిత్తుముసాయిదా ఆమోదింపబడినది.

"ఈ ఫ్రీడంచార్టర్‌లో నుదాహరింపబడిన ప్రణాళికలు కమ్యూనిస్టు ప్రభుత్వస్థాపనకు దారితీయునట్టివే. అంతే కాక, అవసరమునుబట్టి విప్లవమునకు మార్గదర్శకములు. అందులో నుద్దేశించిన గమ్యస్థానము ప్రస్తుతసంఘవ్యవస్థలో మార్పుకలిగించుట. ప్రస్తుతము అమలుజరుగుచున్న ప్రభుత్వస్వరూపమును రద్దుచేయుట. అన్నివిధములైన విచక్షణలను. పీడనమును (oppression] అంతమొందించుట. ఈఉద్దేశములు సఫలములగుటకు విదేశములనుండి సలహా సహాయములను పొందుట.

"మఱియొకవిధమైన ప్రభుత్వమును స్థాపించుటకు ముద్దాయిలందరు ఏకసలహాకారులై ఉద్దేశించి పాశ్చాత్యపాశ్చాత్యేతరజాతులమధ్య వైషమ్యమును పురికొల్పి,ప్రస్తుతముఅమలుజరుగుచున్న అధికారముపట్ల దౌర్జన్యము బలప్రయోగముద్వారా ధిక్కారముచేయుటకు తమసభ్యులను ప్రోత్సహించినారు." అని ప్రాసిక్యూటరుగారుచెప్పిరి. ముద్దాయిలలోప్రముఖుడగు ప్రొఫెసర్ జడ్ కె. మాత్యూస్‌గారు 1953 సంౡన కేపు టవునులో మాట్లాడుచు దేశమును పరిపాలించుటకు ప్రజాప్రభుత్వవిధానము నొకదానిని సిద్ధముచేయు తరుణ

మింకను ఆసన్నము కాలేదాయని నాకు ఆశ్చర్యముకలుగుచున్నది.' అని చెప్పిన ఉపన్యాసభాగమును ప్రాసిక్యూటరుగారు ఉల్లేఖించిరి.

"ప్రస్తుతపు రాజ్యాంగవిధానమును విప్లవపద్ధతులద్వారా తిరుగదోడుటకు చేయబడిన ప్రేరేపణములు సన్నాహములు నీ రాజ్యద్రోహనేరమున రుజువుచేయబడును" అని ప్రాసిక్యూటరుగారు కోర్టువారికి చెప్పిరి.

ముద్దాయిలతరఫున న్యాయవాదులలో నొకరైన వెర్నన్ బెరాంజ్ (Vernon Berrange) గారు ప్రాసిక్యూటరుగారివాదనకు ప్రతివాదనమును చేసిరి. సామాన్యమైనకేసులలోవలె కేవలము న్యాయశాస్త్రసంబంధమైన కారణములనేగాక రాజకీయకారణములుకూడా ముద్దాయిలపక్షమున వాదించుట అవసరమని న్యాయవాదులందరికిని తోచెను.

"ఫ్రీడంచార్టర్ లోనిసంగతులు రాజ్యద్రోహముక్రిందికిగాని క్రిమినలు లేక శిక్షార్హమైన ఏ నేరముక్రిందికిగాని రావని ముద్దాయిలు ఘంటాపథముగా వాదింపగలరు. ఇంతేకాదు; ఆ పత్రమునం దుదహరింపబడిన అభిప్రాయములు, విశ్వాసములు ప్రస్తుతము దక్షిణాఫ్రికాసమితిని పరిపాలించుచున్న నేషనలిస్టుపక్షప్రభుత్వమువారికి గిట్టకపోవచ్చునుగాని, అవి ప్రపంచములోని జనసంఖ్యలో అన్నిజాతులజనులందు అన్నిరంగులప్రజలందు అధికసంఖ్యాకులు హర్షించు సద్భావములై యున్నవి. మఱియు నవి దేశపౌరులలో నధికసంఖ్యాకులును హర్షించునట్టివే. ఫ్రీడంచార్టర్ అను నీ ప్రజాస్వాతంత్ర్యములపత్రములోని ఆశయములను సాధించుటయే కాంగ్రెస్ సంస్థయొక్క పరమలక్ష్యమని అంగీకరింతుము. తా మీ లక్ష్యములను కలిగియున్నామని ముద్దాయిలు నిర్భయముగనే చెప్పదలచినారు."

"స్వాతంత్ర్యములపత్రములో సూచింపబడినమార్పులను దౌర్జన్యముల ద్వారాగాని బలప్రయోగముద్వారా కాని రాజ్యాంగమును తిరుగదోడుటద్వారా గాని కాంగ్రెసువా రెన్నడు సాధింపదలపలేదు. తెల్లవారికిని నల్లవారికిని మధ్య వైషమ్యములను పురికొల్పుట కాంగ్రెసుఉద్దేశ్యముకాదు; జాతుల మధ్య సామరస్యమునుపెంపొందించుటయే కాంగ్రెసులక్ష్యము. 'కాంగ్రెస్ ఆఫ్ ది పీపుల్' ఉద్యమముగాని ఫ్రీడంచార్టర్ గాని కమ్యూనిస్టురాజ్యస్థాప

నకు సోపానములని ప్రభుత్వమువారుచేయు ఆరోపణము అసత్యమని ముద్దాయిలు వాదించుచున్నారు."

"పూర్వము పోర్చుగీసుమతాధికారులు తమకుగిట్టనివారిపైన ఇంక్విజషన్‌లో లేనిపోనినేరములను ఆరోపించి విచారించినట్లును, జర్మనీదేశపు నిరంకుశనియంత తన ప్రత్యర్థులను రూపుమాపుటకు రీచ్‌స్టాగ్ తగులబెట్టుటకు ప్రయత్నించిరని నేరమునుమోపినట్లును ఈ దక్షిణాఫ్రికాసమితిప్రభుత్వపక్షీయులైన తెల్లవారు తమవిధానములను ప్రతిఘటించుచున్నవారిని నాశనముచేయుటకై చేసిన రాజకీయకుట్రయొక్క ఫలితమే యీ రాజద్రోహకేసు అని ముద్దాయిలు వాదించుచున్నారు. ఈ ముద్దాయిలు తమపైన గావింపబడిన ఆరోపణములనుగూర్చి ఆత్మరక్షణముకొరకుమాత్రమే యీ వాదనను చేయదలపలేదు. ఈ కేసును దాఖలుచేయుటకు కారకులైనవారు రాజకీయముగా ప్రయోగించిన కుటిలరాజ్యతంత్రమునకు సంబంధించిన ఎత్తులకు ఈ ముద్దాయిలు గురియైనారని గట్టిగా వాదించుచున్నారు. దీని యథార్థమును తేల్చవలసినదని కోర్టువారిని ప్రార్థించుచున్నారు."

"ఈ కేసుగ్రంథమునకు అంకురారోపణముగను, నేరారోపణమునకు తగినవాతావరణమును కల్పించుటకును రహస్యపోలీసువారు ఈ ముద్దాయిల నిత్యకృత్యములందు జరిపిన ప్రతి సామాన్యకార్యమునకును రాజ్యద్రోహ సంబంధము నంటగట్టుటకు కృషిచేసియున్నారు. ముఖ్యముగా సామాన్య విషయములనుగూర్చి జరుగు బహిరంగసభలకుకూడా పోలీసువారు వచ్చి నిష్కారణముగాను అనవసరముగాను దేశములో ననేకప్రదేశములందు సోదాలుచేసియు మరతుపాకీలను ఝుళిపించియు "బాయొనెట్" సన్నీలతోడి తుపాకులను ప్రదర్శించియు పోలీసుట్రంచను లను నల్లలాఠీకర్రలను ఝుళిపించియు ప్రజలలో నొకవిధమైన బెదురును భీతిని కలిగించుచువచ్చిరి."

"ప్రజలలో భీతినికలిగించి, పోలీసువారినిరంకుశచర్యలకు దారిదీయుటకై మంచినీటివనరులందు విషముకలుపుటకు దుష్ప్రయత్నములు జరిగినట్లును, విద్యుచ్ఛక్తియుత్పాదకకర్మాగారములను కూల్చివేయుటకు దుష్ప్రయత్నములు జరిగినట్లును లేనిపోని అసత్యవార్తలను ప్రభుత్వమంత్రులు తమయుపన్యాసములందు ప్రచారముచేసిరి."

"ఈ కేసులో నిప్పు దిక్కుడ నీ విచారణాగ్రస్తమైన విషయము ఈ 156 మందిముద్దాయిలు చేసినట్లు ఆరోపింపబడిననేరమే కాదు, ఈ ముద్దాయిలును, ఈ దేశములోని వేలకొలదిజనులును ఏ స్వతంత్రభావముల నదివరకు బహిరంగముగా వెల్లడించి వేనికొరకు పాటుపడుచున్నారో ఆ భావములే ఈ విచారణాగ్రస్తవిషయములుగ నున్నవి. ఇది సామాన్యమైన నేర విచారణకాదనుసంగతి ఈ ముద్దాయిల గౌరవప్రతిపత్తులు, చరిత్రయు పరిశీలించిననే తెలియును. ఈ కేసులోనిముద్దాయిలు ఈ దక్షిణాఫ్రికాదేశములోని జనసంఖ్యలోని అన్నివర్గములకు ప్రతినిధులుగా నున్నారు వీరు వివిధ జాతులకుచెందినవారు, వివిధ రాజకీయపక్షములకుచెందినవారు. అయితే సర్వమానవసౌభ్రాతృత్వసిద్ధాంతమునందు దృఢమైనవిశ్వాసముకలిగి మానవునిఉద్ధరణముకొరకు స్వాతంత్ర్యముకొరకు పాటుపడుటలోమాత్రము వీరందరును ఏకీభావమువహించియున్నారు."

"మనదేశములోని రెండువిరుద్ధమైనభావములమధ్య యుద్ధము ప్రారంభమైనది: ఒకవంక జాతి మత వర్ణవివక్షతలేకుండా మనుష్యులందరకును భావప్రకటనస్వాతంత్ర్యములు, సమానఅవకాశములు నుండవలెనను భావములకును ఇంకొకవంక ఐహికఆముష్మికసౌఖ్యములు సంపద ననుభవించుటకు ముద్దాయిలు చెప్పినట్లు అందరకును అర్హతలేదనియు కొంతమంది తెల్లవారికిమాత్రమే హక్కులనియు ప్రచారముచేయబడుచున్న విపరీత భావములకును యుద్ధము ప్రారంభమైనది" అని ముద్దాయిలతరఫున్యాయవాది చెప్పెను.

రాజ్యద్రోహనేరమును దాఖలుచేయుటకై రెండున్నరసంవత్సరముల పాటు అనేకసంఘముల కార్యాలయములను వ్యక్తులయిండ్లను సోదాచూచి పోలీసువారుతెచ్చిన అసంఖ్యాకములగుకాగితములు వగైరా లిఖితార్థముల నుండి 12 వేల ఆధారపత్రముల నేరి, కేసులో దాఖలుచేసిరి. ఇందులో కరపత్రములు, చిన్నపుస్తకములు, గ్రంథములు, జెండాలు, ధ్వజములు మొదలైనవి యుండెను. గతమూడేండ్లలో దక్షిణాఫ్రికాచరిత్రలో సంభవించిన అనేకవిషయములకు సంబంధించినకాగితము లుండెను. కొన్ని ఎందులకు తెచ్చిరో కూడా చెప్పుటకువీలులేనంత అర్థరహితములైన హాస్యాస్పదములైన

ఆధారపత్రములుగ నుండెను. అందులో యునైటెడ్ నేషన్సువారి మానవస్వత్వముల ప్రకటనము, సోవియటుకాన్సలుగారికార్యాలయమును మూసివేయుటనుగూర్చిన ఖండనము. ఒలింపిక్ ప్రపంచ వ్యాయామక్రీడలపోటీలో ఆఫ్రికావారు లేకపోవుటనుగూర్చినవిచారము. "రష్యనురెసిప్" అను మందులసంపుటీకరణప్రక్రియలు, కర్నల్ నాజరుగారు ఇండియన్‌కాంగ్రెసువారికి పంపిన అభినందనపత్రము, మిశ్రమజాతిరంగుప్రజల పునర్వర్గీకరణమునుగూర్చిన అసమ్మతిసూచన, విందుఆహ్వానపత్రిక; నాణెములను చందాలుగా ప్రోగుచేయుటకు తయురుచేసినడబ్బీ; "నేను కమ్యూనిస్టును" అను పాట; చీనాఅధ్యక్షుడగు మావోట్సీటంగుగారి సందేశము; 18 నెలల క్రిందట కాంగ్రెసు అఫ్ ది పీపుల్‌సభాభవనమున పట్టుకొనివచ్చిన ధ్వజములు (banners), అందులో ఒకటి "మాంసముతోపులుసు" అనియు రెండవది మాంసములేని పులుసు" అనియు ప్రకటనలుగల కాగితము. దీని నెందులకు తెచ్చిరో దేవునకెఱుక. బహుశః కాంగ్రెసుభోజనశాలలలో నీ రెండురకములపులుసులు వడ్డించుచుండిరికాబోలునని పోలీసుఉద్యోగి సాక్ష్యముచెప్పెను. కాంగ్రెసులో పాడు పాటలలోని కొన్నివాక్యములను కూడా సాక్ష్యములో చదివిచెప్పిరి.

ఇక నీ 156 ముద్దాయిలు సభలలో నప్పుడప్పుడు చేసిన ఉపన్యాసములలోని వాక్యములను సందర్భశుద్ధిలేకుండా విడదీసియు కొన్నిమారులు కేవలము తప్పుగాను సాక్ష్యముచెప్పిరి.

"1954 లో కాంగ్రెసుఉపన్యాసములందు మాలన్‌గారిని కాల్చివేయు తరుణమువచ్చినదని ఒకరు ప్రసంగించిన ట్లొకయుద్యోగి సాక్ష్యమిచ్చెను. ముద్దాయిలన్యాయవాదికి అనుమానముకలిగి అసలునోట్సుకాగితమును చూడగా "మాలన్‌గారిని ప్రతిఘటించవలసినతరుణము వచ్చినది" అని యుండెను. ఆ యుద్యోగిని క్రాసుచేయగా పొరబాటున తాను అట్లు సాక్ష్యముచెప్పితిననెను ఇట్టిసందర్భము లెన్నో యుండెను.

కొంతమందిసాక్షులు కాంగ్రెసుపక్షమువారు దౌర్జన్యముపురికొల్పిరని తమసాక్ష్యములో మొదట చెప్పిరి. క్రాసుపరీక్షలో కాంగ్రెసువారు బలప్రయోగమునుగాని, దౌర్జన్యములను గాని హర్షింపలేదని యొప్పుకొనిరి.

కాంగ్రెసువారు కమ్యూనిజంసిద్ధాంతములను ప్రచారముచేసిరనిచెప్పుటకు వచ్చినసాక్షులు వారు ప్రజాప్రభుత్వముకొరకై కృషిచేసిరని యంగీకరించిరి. కాంగ్రెసుసభ్యులు దేశములో క్రమశిక్షణముతో మెలగిరని అహింసను జాతీయైక్యతను సమభావములను బోధించిరని ప్రభుత్వమువారు తెచ్చిన సాక్ష్యములవలననే రుజువైనది.

దక్షిణాఫ్రికాలోని నల్లవారి జాతీయోద్యమునకు కమ్యూనిస్టులతో సంబంధములేదనియు అది స్వాతంత్ర్యోద్యమమనియు తెల్లవారు ఎఱుగుదురు. అయితే వలసరాజ్యములందు ప్రజలవిమోచనముకొరకు నడుపబడు ఉద్యమములు కమ్యూనిస్టుసిద్ధాంతముక్రిందికివచ్చునని చెప్పి, ఈ రాజద్రోహ కేసులను సమర్థించుటకై తెల్లవారు విద్యాధికులచేత కమ్యూనిజముసిద్ధాంతములనుగూర్చిన సాక్ష్యము చెప్పించిరి.

ఈ కేసువిచారణలో నాలుగవమాసమునందు కేపుటవును విశ్వవిద్యాలయములోని ప్రొఫెసర్‌గారైన డాక్టర్ ఏ. హెచ్. మర్రేగారిని సాక్షిగా విచారించిరి. ఆయన కమ్యూనిస్టుసిద్ధాంతములకు చిత్రమైనవ్యాఖ్యానము చేసిరి. ప్రజాప్రభుత్వము పోలీసురాజ్యము మొదలైనమాటల కాయన చెప్పిన లక్షణములనుబట్టి కాంగ్రెసురాజ్యాంగమునందు కమ్యూనిస్టులక్షణములున్నవనిరి. వలసరాజ్యములందు ప్రజలవిమోచనమునకు నడుపబడు ఉద్యమములు కమ్యూనిస్టుసిద్ధాంతములక్రిందికివచ్చునవిరి. జాతీయోద్యమమున కేదోవిధముగా కమ్యూనిజంలక్షణముల నంటగట్టి అది అశాస్త్రీయమని చెప్పుటకు తెల్లవారు ప్రయత్నించుచున్నట్లు దీనివలన స్పష్టపడినది.

ఈ కేసు ఆరునెలలు జరుగునప్పటికి ముద్దాయిలు మర్యాదగల పెద్దమనుష్యులనియు అల్లరిచేయువారుగాని తప్పించుకొనిపోవువారుగాని కారనియు ఆ న్యాయసభకుసంబంధించిన యుద్యోగులకు తెలిసివచ్చినది. కోర్టుహాలులోని బోనుయొక్క యినుపకమ్మిలను చాలావరకు తీసివేసి మామూలు కొయ్యఅడ్డకమ్మిలుమాత్రమే యుంచిరి. అదివరకు ప్రతిదినము చిత్రము చూచుటకు వచ్చు జనులలో తెల్లవారిసంఖ్య సన్నగిలినది. నల్లవారు మాత్రము మిగిలిరి.

క్రమక్రమముగా ప్రభుత్వపక్షమున తెచ్చిన సాక్షులలోకొందరు అవి

నీతిపరులనియు ప్రాతనేరగాండ్రనియు వారిసాక్ష్యము విశ్వసనీయముకాద నియు బయల్పడుచుండెను. ప్రాసిక్యూషన్‌వారు సొలొమన్‌మ్గుబాసియను ఆఫ్రికాదేశీయునొకనిని తెచ్చి సాక్ష్యమిప్పించిరి. అతడు మోసగింపునేర మునకు మూడుసంవత్సరములశిక్ష ననుభవించుచుండెను. కెన్యాలో మావ్ మావ్‌ఉద్యమమారంభమగుటకు పూర్వమే 1951 లో దక్షిణాఫ్రికాకాంగ్రెసు వారే ఆ యుద్యమమునకు పునాదివేసిరనియు ముద్దాయిలలో నొకడగు డాక్టర్ లెబెల్‌గారు రష్యాదేశమునుండియు చీనానుండియు బంగారుకోస్టునుండియు ధనమును ప్రోగుచేసితెచ్చుటకు కోశాధిపతిగా నియమింపబడెననియు మ్గుబాసి చెప్పెను. ఇంతేకాదు, 1952 లో కాంగ్రెసువారియాదేశానుసారముగా మ్గుబాసియు మరిముగ్గురును కలిసి 'ఫ్రీడంచార్టర్' అనబడు స్వాతంత్ర్య ప్రకటనపత్రముయొక్క ముసాయిదాను తయారుచేసితిమనియు ఇండ్లపైన రాళ్ళురువ్వితిమనియు వస్తువులను దొంగిలించితిమనియు, పోర్టుఎలిజబెత్తు అల్లరులలో ఒకసినీమాను తగులబెట్టుటకు సహాయముచేసితిమనియు అతడు సాక్ష్యమిచ్చెను. పైగా ట్రాన్సువెయి, కేపుజిల్లాలలోని పాశ్చాత్యుల నందరిని హత్యచేయుటకు కాంగ్రెసువారు కుట్రచేసినారనియు అతడు సాక్ష్యమిచ్చెను. రష్యాదేశమునుండి బెచూనాలాండు, బసూటోలాండులద్వారా ఆయుధములను తెప్పించుటకు ఇరువురుమనుష్యులనుపంపుటకు ఏర్పాటు జరిగెననియు ఆ మనుష్యులు శిశులు, టొపాపెగార్లే యనియు చెప్పెను. కొన్నిఆయుధములను గ్యాస్‌పొడరును తెచ్చి పాశ్చాత్యులుండుప్రదేశములో ప్రేల్చుటకు పథవేసి తాము పారిపోవుటకు సంకల్పించితిమని చెప్పెను.

మ్గుబాసిని క్రాసుపరీక్షచేయగా అత డదివరకు మూడుసారులు మోస గింపునేరమునకు శిక్షింపబడెనని, పట్టాలేకుండా ప్లీడరుగా ప్రాక్టీసుచేసెనని, ఇంకొకకేసు విచారింపవలసియున్నదనియు బయల్పడెను. ఇంతేకాదు, ఈ శిక్షలకాలములోనే మధ్యలో నాతడు పోలీసుఇంటర్‌ప్రిటరు అనగా తర్జుమా దారుగా పనిచేసెను. ఈ రాజద్రోహనేరములో తాను సాక్ష్యమిచ్చెదనని తనంతటతాను 15 దినములక్రిందట కింబర్లేమేజస్ట్రేటుగారికి జాబువ్రాసి నట్లును అత డంగీకరించెను.

పూర్వము నాలుగైదుసంవత్సరములక్రిందట నెక్కడనో జరిగిన దొమ్మినేరములను గూర్చియు ఇండ్లుతగులబెట్టిననేరమునుగూర్చి చెప్పుచు వానికీ రాజద్రోహనేరమునకు ముడిపెట్టుటకు కొంతమంది సాక్షులను తెచ్చిరి.

తొమ్మిదినెలలవరకు నీ కేసువిచారణలోనున్నతరువాత ప్రభుత్వము వారుతెచ్చిన యీ క్రొత్తసాక్ష్యములు కేవలము పనికిమాలినట్టివిగా నుండెను. వారు దాఖలుచేసిన క్రొత్తదస్తావేజులు కొన్ని ప్రభుత్వమువారిఆఫీసులలో వారికాగితములపైన వారిపైపురైటరుమిషనులపైన తయారుచేయబడినవని బయల్పడెను. 8 వేలపైపుకాగితముల మూజువానీసాక్ష్యమును పదివేలదస్తావేజులు నీ కేసులో ప్రభుత్వపక్షమున రికార్డుచేయబడినది.

1957 సెప్టెంబరు 11 వ తేదీన ఫిర్యాదిసాక్ష్యము ముగిసెను. ఈ సాక్ష్యమును జాగ్రత్తగా పరిశీలించి ముద్దాయిల తరఫున సాక్ష్యమును దాఖలుచేయుటకు 5 నెలలు వాయిదాకావలెనని న్యాయవాదులు కోరిరి. ఫిర్యాదీన్యాయవాది ప్రతిఘటించెను కాని కోర్టువారు నాలుగునెలలు వాయిదావేసిరి.

ఈ వాయిదాలోపుగా ప్రభుత్వమువారి అటార్నీజనరల్‌గారీ కేసులోని 156 మందిముద్దాయిలలోనుండి 61 మందిని వదలుకొనుచున్నామని కోర్టువారికి మనవిచేసెను. ఇట్లు వదలివేయబడినవారిలో చాలామంది ఆఫ్రికన్‌కాంగ్రెసులోని అప్రధానవ్యక్తులు. ఐతే కాంగ్రెసుప్రెసిడెంటు జనరలు అగు, అల్బర్టు లుతులీ అను జూలూజాతినాయకుడు, ఓలివర్ టాంబో అనువారుకూడా ఉండిరి. వీరు కాంగ్రెసులో ప్రముఖులుగానున్న వారే. ప్రభుత్వమువారు వీరి నిప్పెందులకు వదలిరో అర్థముకాలేదు.

మిగిలిన 95 మంది ముద్దాయిలను విచారణనిమిత్తము సెషన్సు కంప వలసినదని ప్రభుత్వముతరఫున ఆస్వాల్డు ఫిరో Q. C. అనుఆఫ్రికేనరునాయకుడు కోరెను. స్వాతంత్ర్యములపత్రమొక్కటే ఈ కేసులోనిముద్దాయిలు ప్రభుత్వమునుతిరుగదోడి సోవియటురాజ్యాంగవిధానమును స్థాపింపదలచినట్లు రుజువుచేయగలదని అతడు వాదించెను. ప్రభుత్వము తనకర్తవ్యమును

నిర్వహించలేకుండా ఆటంకములుకలిగించుటయే రాజ్యద్రోహమగుననెను. పార్లమెంటుకువెలుపల ఉద్యమమునడపవలెనని కాంగ్రెసుచెప్పినదానిలోనే దౌర్జన్యము బలప్రయోగము కలవనెను. గంగవెఱ్ఱులెత్తియున్న ఆఫ్రికా వారికి అహింసయనుమాటలను చెప్పుటలో కాంగ్రెసుకు ఆత్మశుద్ధిలేదనెను.

"చాలా భయంకరమైన కమ్యూనిస్టుకుట్ర యున్నట్లు రుజువు చేయుటకు మేము చాలా సాక్ష్యము తెచ్చినాము ఇది రాజ్యద్రోహ నేరము క్రిందికివచ్చు"నని ఆయనచెప్పెను. ఈ ముద్దాయిలు రాజ్యద్రోహనేరమునకు లేదా సప్రెషన్ ఆఫ్ కమ్యూనిస్టుఆక్టుకు వ్యతిరేకముగా చరించినందులకు ప్రభుత్వమువారిక్షేమమునకు భంగముకలిగించు వ్యతిరేకకృత్యములు జరిపినందులకు వ్యతిరేకచర్యలను జరుపుటకు ప్రోత్సహించినందులకు ప్రస్తుతమున్నప్రభుత్వములను పార్లమెంటువిధానమునకు బాహ్యమైన, అశాస్త్రీయమైన, దౌర్జన్యవిధానములతో తిరుగదోడుటకు కుట్రచేసినందులకు ప్రత్యేక న్యాయాధిపతివలన విచారణచేయబడుటకు కమిటుచేయబడిరి

# ఆఫ్రికా జాతియోద్యమము

## తొమ్మిదవ ప్రకరణము

### అపార్థీడ్ విధాన ఫలితములు

రాజ్యద్రోహనేరమునకు 156 మంది వివిధజాతులవారిని విచారించుట వలన దేశములో కొన్నిఫలితములు కలిగెను. అదివరకు ఒకజాతివారు ఇంకొకజాతివారిని ఒకవర్గమువారింకొకవర్గమువారిని చూచి అనుమానముపడుట తగ్గిపోయెను. ఏలననగా ఈ డ్రిల్లుహాలులో వివిధజాతులవారు నానావర్గములవారును ఒకేవిధమైన రాజకీయనేరములు గావించినందులకు అరెస్టుకాబడి ఒకే ఆశయము కొరకు బాధలనుభవింపవలసినవారైనందున వీరిలో పరస్పరవిశ్వాసము గౌరవము లేర్పడెను

దేశములోని జనసంఖ్యయందువలెనే ఈ 156మంది ముద్దాయిలలో నల్లవారిజనసంఖ్యకుతగినట్లుగా హెచ్చుమంది నల్లవారును తెల్లవారిజనసంఖ్యకు మిశ్రమజాతి జనసంఖ్యకు భారతీయుల సంఖ్యకు తగినట్లు ఆయా జాతుల ముద్దాయిలసంఖ్యయు ఆ నిష్పత్తులందేయుండెను.

ఈ డ్రిల్లుహాలులో నీ కేసువిచారించు మేజిస్ట్రేటు మధ్యాహ్నము ఫలహారమునకులేచిన విరామసమయమునందీ భవనము న్యాయస్థానభవనముగాగాక కాంగ్రెస్‌కార్యాలయముగా మార్పుచెందుచుండెను. అక్కడ కాంగ్రెసువారి వివిధసంఘములవారు కాంగ్రెసు రాజకీయములనుగురించి సమాలోచనములు జరుపుచుందురు. నేషనల్ ఎగ్జిక్యూటివు లేక జాతీయకార్యనిర్వాహకవర్గము. బహిష్కారకమిటీ, కార్యాచరణకమిటీ, పడమర ప్రాంతముల కార్యనిర్వాహకసంఘము ఆయా శాఖల వ్యవహారములకు ఆ రోజులో వివిధవర్గములవారు వేరువేరుగా కూర్చుండి ఆలోచించుచుందురు. ఇట్లొక

వంక తెల్లప్రభుత్వమువారు రాజ్యద్రోహనేరమునకు కాంగ్రెసుపైన చర్య జరిపి కాంగ్రెసుసంఘమువారు బహిరంగముగా సమావేశముకాకుండా నిషేధించి కాంగ్రెసునాయకు లా యాజ్ఞనుల్లంఘించిన నేరమునకు విచారించుచుండగా, వారందరు కాంగ్రెసు వ్యవహారముల నెప్పటివలెనే యథావిధిగా ఆ కోర్టుభవనమునందే జరుపుకొనగలుగుచుండిరి. వీరి నిర్ణయములు కాంగ్రెసు సభ్యులందరికిని దేశములో ఉప్పుఅందించినట్లు చేరుచుండెను.

పూర్వము కాంగ్రెసు కార్యకర్తలలో త్యాగముచేయువారు చాలా తక్కువగానుండిరని దేశభక్తులు వాపోవుచుండిరి. ప్రభుత్వమువారిచర్యవలన నొక్కసారిగా 156 మంది త్యాగమూర్తులు కాంగ్రెసువారికి లభించిరి. నేషనలిస్టుపార్టీప్రభుత్వమువా రిట్లు 156 మందిపైన నేరములుమోపి విచారించుచున్నారన్నచో కాంగ్రెసువారు నల్లవారికొరకు పాటుపడినందువల్లనే చేయుచున్నారని ఆఫ్రికావారు నిశ్చయించుటలో నాశ్చర్యములేదు.

నల్లవారిస్థావరములందు ఈ కేసును దేశభక్తులకేసుగ పరిగణించి ముద్దాయిలను తమసంభాషణలందు గౌరవించుట ప్రారంభించిరి. వోట్లు అధికారము లేని రాజకీయనాయకులకు పలుకుబడియుండుట కష్టము. ఈ కేసు విచారణవలన నీ నాయకులకు బ్రహ్మాండమైన పలుకుబడి కలిగెను. కేవలము దక్షిణాఫ్రికాలోనేకాదు, ఆఫ్రికాఖండములోని వివిధజాతులవారు వీరిని గౌరవించుటవలన దేశమందంతట వీరికి పలుకుబడి యేర్పడెను అన్నిప్రాంతములనుండి వీరినిదర్శించుటకై ప్రజలు వచ్చుచుండిరి. తుదకు దేశాంతరములనుండి ముఖ్యముగా అమెరికా జర్మనీ బ్రిటీషు దేశములనుండి వార్తాపత్రికలవారు ఇతర ప్రముఖులుకూడా వచ్చి ఈ దేశభక్తులను సందర్శించిరి. దక్షిణాఫ్రికాలోని తెల్లవా రిదివరకు నల్లవారినాయకులను తృణీకరించుచుండిరి, ఇంతమందినల్లవారు రాజ్యద్రోహమునకు కుట్రచేసిరనుసంగతి తెల్లవారిలో సంచలనము కలిగించెను. ఆ తెల్లవారిలో లిబరల్‌పక్షమువారొకరిద్దరు కాంగ్రెసువారిని తమతో తేనీరు త్రాగుటకాహ్వానించి,సంభాషింపసాగిరి. లిబరలు పక్షమునకుచెందని పూర్వాచారపరాయణులైన తెల్లవారిలో కూడా ఒకవిధమైన మార్పుకలిగెను. అదివరకు నల్లవారన్నలక్ష్యపెట్టనివారు రహస్యముగాను పరోక్షముగాను వారితో కొంత సంసర్గము నేర్పరచుకొన

సాగిరి. ప్రొఫెసర్ మాత్యూస్‌గారు, లుతూలీగారు—మొదలైన నల్లజాతి పెద్దమనుష్యులను రాత్రిపూట పిలిచి, నల్లవారివ్యవహారముల నడిగి తెలిసికొనసాగిరి.

దక్షిణాఫ్రికారాజ్యద్రోహనేరవిచారణ జరుగుచుండగా పార్లమెంటులోని ప్రతిపక్షసభ్యులు ప్రభుత్వమువారిని గట్టిగా ప్రతిఘటించుటకు జంకిరి. దీనికికారణము తాము నల్లవారిపట్ల సానుభూతినిచూపినచో ప్రతివిషయము నను మీరు కమ్యూనిజమును సమర్థింపదలచినారని ప్రభుత్వపక్షమువారు వీరిని నిందించుచుందురు. పైగా మరుసటిసంవత్సరము ఎన్నికలుజరుగనై యున్నందున ఆ ఎన్నికలందు తమపైన దుష్ప్రచారముచేయుదురు.

ప్రతిపక్షమువారిప్రతిఘటనము లేనందువలన నేషనలిస్టుపార్టీప్రభుత్వమువారు తాము తలపెట్టినవర్ణభేదజాతివిభజనవిధానమును పూర్తిగా అమలు జరుపుట కవసరమైనచర్యలను స్వేచ్ఛగా తీసికొనసాగిరి. నల్లవారిని పూర్తిగా వేరుపరచుటకు నిశ్చయించిరి. విశ్వవిద్యాలయములపైన గట్టి కట్టుబాటును చేసి, వారివిద్యసరికట్టదలచిరి. ఆసుపత్రులలో నల్లవారికితెల్లవారితోపాటు ప్రవేశములేకుండునట్లుచేసిరి. తుదకు రోగులకుపచారముచేయు నర్సులు కూడా నల్లవారికి వేరుగను తెల్లవారికి వేరుగను ఉండవలెననిరి! ప్రాణభయముకలుగునప్పుడు రక్తమునెక్కించవలసివచ్చినప్పుడుకూడా నల్లవారి రక్తము వేరుగను తెల్లవారిరక్తము వేరుగను ప్రత్యేకించి, ఆయాజాతుల వారికే వినియోగింపవలెననిరి. రాకపోకలుచేయుటకు నల్లవారిలో పురుషులవలెనే స్త్రీలుకూడా 'ప్యాసు'లు లేక అనుమతిపత్రము లేకుండా ప్రయాణముచేయరాదని కఠిననిర్బంధములు చేయదలచిరి. దక్షిణాఫ్రికాలో నల్లవారిపైన విధింపబడు తలపన్నును హెచ్చించి, అట్లుచేయగా వచ్చిన సొమ్ముతో నల్లవారికి కాలేజీల నేర్పాటుచేయుడుమనిరి. అనగా నల్లవారి విద్యకగుఖర్చు విదేశప్రభుత్వమువారు గాక, నల్లవారే భరింపవలెనను సిద్ధాంతమును స్థాపింపదలచిరి. పట్టణములందలి నల్లవారికి తెల్లవారికి పరస్పరసంబంధములేకుండా వేరుచేయదలచిరి. అన్నిటికన్న ముఖ్యముగా నల్లవారికిని తెల్లవారికిని సాంఘికముగా పరస్పరసంబంధము ఉండరాదనిరి.

1957 ప్రారంభములో రాజ్యద్రోహనేరవిచారణ యింకను ప్రారం

భముగాకముందే జోహానసుబర్గులో నొక క్రొత్తయుద్యమము బయలు దేరెను. ఆ నగరమునకు తొమ్మిదిమైళ్ళదూరములోనున్న అలెగ్జాండ్రా అను చిన్నపట్టణమునుండి ప్రభుత్వమువారిసహాయముతో కొన్నిబస్సులు జోహానసుబర్గుకు నడుపబడుచుండెను. ఆ పట్టణములోని గనులలో పని చేయు నల్లవారందరు నీ బస్సులెక్కిపోవుచుందురు. ఆ బస్సులనునడుపు కంపెనీవారు అదివరకు నాలుగుపెన్నీలుగానుండిన బస్సుచార్జీని ఐదుపెన్నీ లకు హెచ్చించుటకు నిశ్చయించిరి. అదివరకే బస్సులలోనెక్కు నల్లవారికి బస్సుస్టాండుదగ్గర నిలువనీడయైనలేదు ఎట్టి షెడ్లుగాని సౌకర్యములుగాని లేవు. తగినన్ని బస్సులును లేవు ఒక్కొక్కప్పు డీ నల్ల కార్మికులు తెల్లవారుజామున లేచి. ఒకటిన్నరగంటలుకూడా బస్సులకొరకు వేచి యుండవలసివచ్చుచుండెను. కొన్నివేలమంది నల్లవా రిట్లు ప్రతిదినము బస్సులెక్కి జోహానసుబర్గుకు పోవుచున్నందున కంపెనీవారికి లాభముగ నుండెను. ఎట్టి సౌకర్యము నేర్పాటుచేయకుండా బస్సుచార్జీలో ఇప్పు డిట్లొకపెన్నీ హెచ్చుచేయుట అన్యాయమని నల్లవారికి తోచినది. అంతట వారు మేము మీ బస్సులనెక్కమని వానిని బహిష్కరించి ప్రతిదినము పోను పదిమైళ్ళు రాను పదిమైళ్ళు నడచుట ప్రారంభించిరి. నల్లవారిసంఘములును అలెగ్జాండ్రాలోని కాంగ్రెసుశాఖసంఘమువారి కార్యా లయమువారును దీనిని ప్రోత్సహించిరి. నాలుగువందలమంది నల్లవారు మొదట నీబహిష్కారము నారంభించిరి. క్రమక్రమముగా నది వ్యాపించెను. సోఫియాటవునులోను ప్రిటోరియాలోనుకూడా బస్సుచార్జీలను హెచ్చింప దలచిరి. అక్కడకూడా సభలు జరిగెను. బహిష్కరణముచేయుదని కర పత్రములు సైక్లోస్టయిలుతీసి పంచిపెట్టిరి.

అలెగ్జాండ్రాలో నల్లవారిజనసంఖ్య హెచ్చుగానుండెను. నడవవల సినదూరముకూడా అధికమే. అయినప్పటికి నీ బహిష్కారోద్యమము వృద్ధియై ఒకవారమగునప్పటికి నలుబదియైదువేలమంది నల్లవారు తమపను లకు నడచిపోవుచుండిరి. ఖాళీబస్సులు వీరిప్రక్కనే మెల్లిగా పోవుచుం డెను. ఈ బహిష్కారోద్యమము చాలా ఆశ్చర్యకరముగా నుండెను. నల్ల వారిని తెల్లవారుకొంతమంది చిన్నకారులలోనెక్కించి తీసికొనిపోవసాగిరి.

పోలీసువారు కారులనాపి అందులోనిగల్ల వారికి అనుమతిపత్రములున్నవా లేవా యని తనిఖీచేయుచుండిరి. నల్లవారికి తక్కువకూలినిచ్చి పనిచేయించుకొను తెల్లయజమానులు కొంతమంది వారిపైన సానుభూతివహించిరి.

మొదట జోహానసుబర్గు ఛేంబర్ ఆఫ్ కామర్సు అను తెల్లవారి వర్తకసంఘమువారి బహిష్కారము నాపవలెనని తీర్మానించిరి గాని, పనులు అసలే ఆగిపోవుననితలచి బస్సుచార్జీలో తాము కొంత భరింతుమనియు ఆ చార్జీని తగ్గించి యథాప్రకారము బస్సులు నడుపవలసినదనియు వారు కోరిరి.

ఆఫ్రికాదేశీయులైన నల్లవారిలో నెంత సంఘశక్తియున్నదో నేషనలిస్టుప్రభుత్వమువారియొక్కయు, ఆఫ్రికేనరుపక్షమువారియొక్క పత్రికలవారికి విశదమయ్యెను. కమ్యూనిస్టులు వెనుకనుండి భాగవతమునాడుచున్నారని ప్రభుత్వమువారి సమాచారపత్రము నిందింపసాగెను. దీనివెనుక ఇతరసంస్థలుకొన్ని యున్నవనియు "దయివెడర్‌లాండ్" అను పత్రిక వ్రాసెను.

ఈ బహిష్కరణోద్యమమును డ్రిల్లుహాలులోని ప్రజానాయకులు జాగ్రత్తగా గమనించుచుండిరి. ఇది నిజముగా నొక రాజకీయసమస్యగనే పరిణమించెను. జోహానసుబర్గుకు ఎనిమిదివందలమైళ్ళదూరమునగల పోర్టు ఎలిజబెత్తులోని నల్లవారుకూడా అక్కడిబస్సులను బహిష్కరించి, వీరిపట్ల సానుభూతినిప్రకటించిరి. అదివరకు కాంగ్రెసుపైన గౌరవములేనియువజనులు (tsotsis) సోఫియాటవునులో కూడా బస్సులబహిష్కారమును ప్రోత్సహించిరి.

అలెగ్జాండ్రాలోని నల్లవారు ఎప్పటివలెనే జోహానసుబర్గుకు నడచిపోవుచుండిరి. తెల్లవారు వీరికి కొన్నిఆటంకములు కలిగించినను, వారు తమపట్టుదల మానలేదు. వారు విశ్రాంతికొరకై మార్గమధ్యమున హాస్టల్సులోనున్నప్పుడు పోలీసువారు వారిపైన దాడిసల్పుచుండిరి. అనుమతిపత్రములులేవని ఎనిమిదివేలమందిని అరెస్టుచేసిరి. ప్రజలగుంపులను పోలీసువారు పొట్టిలాటీలతో కొట్టిరి. బైసికిళ్ళపైన నెవ్వరిని కూర్చుండబెట్టి త్రొక్కరాదనిరి. నడచిపోవుచున్నవారు కక్కరితిపడి ఎక్కుదురేమో యని బస్సులు మెల్లిగా వారిదగ్గరనుండి పోవుచుండును. తుదకు అది

లాభములేదని గ్రహించి, సిటీకవున్సిల్ అను పురపాలకసంఘసభ్యు లేదో విధముగా నొక రాజీకుదుర్చుటకు ప్రయత్నించిరి.

బహిష్కార మారువారములు సాగినపిమ్మట చేంబరు ఆఫ్ కామర్సు వారు 25 వేల నవరసులు ప్రోగుచేసి, బస్సులలో ప్రయాణముచేసిన నల్ల వారికి ఒక్కొకపెన్నీ తిరిగి వాపసునిచ్చెదమనిరి. బహిష్కరణము అంత మగునని పత్రికలవారు వ్రాసిరి. దీనినిగూర్చి తెల్ల వారెంతప్రయత్నించినను నల్లవారు లొంగలేదు. "ఈ తికమకలను మే మంగీకరింపము; బస్సుచార్జీలను తగ్గించవలెనేగాని, మేము చెల్లించినదానిలో మాకు మొబరాలిచ్చుట పనికిరాదు" అని నల్లవారనిరి.

బహిష్కరణము మూడునెలలు సాగెను. అంతట నల్లవారిలో విషాదము, ఆగ్రహము రగులసాగెను. ఈ బహిష్కరణముతో సర్వపరిశ్రమలసమ్మె "జనరల్ స్ట్రయిక్"కూడా ప్రారంభింపవలెనని కొందరు ప్రచారముగావింపసాగిరి.

నడచిపోవుచున్నవారికి కోపము వృద్ధియగుటతో దౌర్జన్యములు చెల రేగునసుభయము వ్యాపించెను. చేంబరు ఆఫ్ కామర్సువారును ఉదారవాదులగు తెల్లవారును ఈ బహిష్కరణము నేదోవిధముగా ఆపవలెనని నల్ల వారికి విశ్వాసపాత్రులైన జోహానసుబర్గుబిషప్పుగారిని మధ్యవర్తిగా నియమించి వ్యవహారము పరిష్కరింపదలచిరి. ఆయన ఢిల్లుహాలులో నున్న కాంగ్రెసునాయకులదగ్గరకు వెళ్ళి ఈ విషయమునుగూర్చి సంప్రదించిరి.

తుదకు అక్కడిముద్దాయిలుకొందరు చేసినసూచనప్రకారము ఐదు పెన్నీలు అని ముద్రించియున్న బస్సుటిక్కెట్లను నాలుగుపెన్నీలకే అమ్మునట్లు రాజీచేసిరి. అలెగ్జాండ్రాకమిటీవారు మొదట కొన్ని పేచీమాటలాడిరి గాని, తుదకు దీనికంగీకరించిరి. అయితే ఈ బహిష్కరణోద్యమ మంతతీవ్రముగా జరుగుచుండగా నల్ల వారికి నచ్చచెప్పి దీనిని విరమింపజేయుట యంత సులభమైన కార్యముకాదు. కొంద రీ రాజీ పనికిరాదనిరి. విషమషరతులుపెట్టిరి. ఎట్టకేలకు కొందరిని ఒప్పించిరి, అంతట నల్లవారిలో అభిప్రాయభేదములు కలిగెను. అందువలన కల్లోలముకలిగెను. కొందరు బస్సులెక్కగా చాలామంది నడచిపోవసాగిరి. వీరిని అదుపులోనుంచుట

దుస్తరకార్యమయ్యెను. తుదకు నల్లవా రేదోవిధముగా సరిపెట్టుకొని మరల బస్సులెక్కపోవసాగిరి.

మూడునెలలో చేంబరు ఆఫ్ కామర్సువారు ప్రోగుచేసినసొమ్ము అయిపోయినది మరల క్లిష్టపరిస్థితులువచ్చినట్లు కనబడెను. అప్పుడు స్కోమన్ (Schoman) గారు జోహానసుబర్గులబస్సులకు సబ్సిడీనిచ్చుటకు "నేటివ్.సర్వీసెస్ లెవీ" అను పన్నును హెచ్చించుటకు పార్లమెంటులో నొకచట్టమును ప్రవేశపెట్టి దాని నొకదినములోనే శాసనముగాచేయించిరి. దీనిఫలితముగా నల్లవారిపట్టుదల నెగ్గి బస్సులచార్జీ నాలుగుపెన్నీలుగా నిలిచెను ఈలోపుగా ప్రభుత్వమువారుతలపెట్టిన వర్ణభేదవిధానమునకు అనుకొనని ప్రతిఘటనలుకలిగెను. 'సెపరేట్ యూనివర్సిటీ ఎడ్యుకేషనల్ బిల్' అను ప్రత్యేక విశ్వవిద్యాలయవిద్యాబోధనచట్టము నొకదానిని చేసి దక్షిణాఫ్రికాలోని విశ్వవిద్యాలయములపైన ప్రభుత్వమువా రధికారమువహించి నల్లవారిని వేరుపరచి వారికి ప్రత్యేక పాఠ్యప్రణాళికలతో "ట్రైబల్ కాలేజీ" లను నల్లజాతివారి కళాశాలలను స్థాపింపదలచిరి. దీనివలన అదివరకు నల్లవారిలో పాశ్చాత్యవిద్యాభివృద్ధి జరుగుటకుగల అవకాశములను తీసివేయదలచిరి. దీనిఫలితముగా నీ నల్లవారిని చేర్చుకొనుటకు ఐరోపాలోని విశ్వవిద్యాలయములవారు నిరాకరింతురు. అంతట వారికి ఉన్నత విద్య లేకుండపోవును. ఇది అన్యాయమని విద్యావంతులైననల్లవారు అసమ్మతిని ప్రకటించిరి. ఆఫ్రికేనరుప్రొఫెసర్లును వార్తాపత్రికాధిపతులును కొంత అలజడినిచెందిరి. ఈ బిల్లును వెంటనే శాసనముగాచేయుటకు ధైర్యముచాలక దానిలో కొంతమార్పుచేసి, దాని నొకసంవత్సరముపాటు పరిశీలించవలసినదని ప్రభుత్వమువా రొక సెలెకుకమిటీని నియమించిరి. నేటివు లాస్ అమెండ్మెంట్ఆక్టు అను నల్లవారికిసంబంధించిన శాసనవిధుల సవరణచట్టములోని ఒకనిబంధనను బట్టి నల్లవారిని పాశ్చాత్యపాఠశాలలకును ఆసుపత్రులకును, క్లబ్బులకు వినోదప్రదేశములకు చర్చిలకు పోకుండా నిషేధించుటకు మంత్రి కధికారమొసగబడెను.

చర్చిలకు నల్లవారురాకుండా నిషేధింపవచ్చుననునిబంధన చాలా

ఘోరమైనదని ఒకరిద్దరుతప్ప తక్కిన క్రైస్తవమతాధికారులందరును నిర్భయముగా విమర్శించి దానిని ప్రతిఘటించిరి.

"ఇటువంటివిషయములందు మేము ఈశ్వరాజ్ఞనుతప్ప ప్రభుత్వాజ్ఞలను పాటింపజాల"మని కేపుటవును ఆర్చిబిషప్పు డాక్టరు జాఫ్రే క్లేటన్ గారు మంత్రిగారికి కొక లేఖవ్రాసిరి. ఆ లేఖవ్రాసిన కొలదిదినములకే ఆయన దివంగతులైరి. అంతట నది ఆయనమరణశాసనమే యయ్యెను.

దక్షిణాఫ్రికాలోని అన్నిమతశాఖల క్రైస్తవమతాచార్యులును దీనిని విమర్శించిరి. మతముపేరున రాజ్యద్రోహముజరుగకుండచేయుటకు ఇది ఆవసరమని ప్రభుత్వమువారనిరి. ఈ నిబంధనలను ఉల్లంఘించునల్లవారినే శిక్షింతుముగాని, మతాధికారులను శిక్షింపమని ఒకసవరణను ప్రతిపాదింతుమని చెప్పుచు, తీవ్రమైన ప్రతిఘటనమధ్యలో మేనెలలో దానిని శాసనముగచేసిరి.

జూలై నెలలో ఆంగ్లికన్‌చర్చిలలో నీ నిబంధన తృణీకరింపుడని సందేశములను చదివిరి. ఈ విషయమున మానవుని ఆజ్ఞనుగాక భగవంతుని ఆజ్ఞనే శిరసావహింపవలెనని జోహానసుబర్గు బిషప్పుగారు లేఖవ్రాసిరి

ఈ చట్టమును ఉల్లంఘించు నల్లవారిరక్షణ నిమిత్తము ఒక క్షేమనిధి ప్రోగుచేయుదుమనిరి. క్రొత్తశాసనమును తృణీకరించుటయేగాక సాధారణ శాసనముల నుల్లంఘింపుమని నల్లవారిని ప్రోత్సహించిన క్రైస్తవ మతాధికారులకుకూడా కారాగారశిక్షను. దెబ్బలశిక్షను విధించు 1953 సంవత్సపు. క్రిమినల్‌లా అమెండ్‌మెంటుఆక్టునుకూడా ఈ సందేశము తృణీకరించెను.

ఇంగ్లాండులో కాంటర్బరీ కాన్వొకేషను అనుక్రైస్తవ మతాధికారుల పరిషత్తు దక్షిణాఫ్రికా ప్రభుత్వమువారి వర్ణభేద జాతివిభజన విధానమును ఖండించి పైవిధముగా అక్కడి యధికారులను తిరస్కరించిన బిషప్పులను సమర్థించెను.

ప్రభుత్వమువారవలంబించిన ఇతరవిధములగు వర్ణభేద జాతి విభజన విధానముకూడా పృథయగు సూచనలు కనబడెను. తలపన్నును హెచ్చించు బిల్లును ప్రభుత్వమువారు చల్లగా వదలుకొనిరి.

నల్ల వారి స్త్రీలుకూడా రాకపోకలకు ప్యాసులు లేకఅనుమతిపత్రిము లను పొందవలెనవిరి. ప్రభుత్వమువారు చేసిన ప్రియత్నమునకు గట్టిప్రతి రోధము కలిగెను. పటణములలోని నల్లవారు తెలివిగలవారైనందువల్ల దీనికి గట్టిప్రితిఘటన కలుగునని తలచి దేశములోని దూరప్రాంతము లకుపోయి, అక్కడి చిన్నపట్టణములపేటలలో నీ విధిని అమలుచేయుటకు ప్రిభుత్వమువారు తమయుద్యోగులను పంపిరి. అక్కడి స్త్రీలు వీరిని ధైర్య ముగా ఎదిర్చించి వారు తెచ్చిన అనుమతిపత్రిములను తగులబెట్టిరి. స్టాండ ర్టన్, యూటెన్ హేజ్ లిచెన్‌బర్గు మొదలైన చిన్నపట్టణములలో నిట్లు జరిగెను.

పూర్వాచారములకు కట్టుబడిన నల్లజాతులవారున్న జిల్లాలలోకూడా ఒకవిధమైన అధికార ధిక్కారము ప్రబలెను. జీరస్టు రిజర్వులోని నల్ల వారి నాయకుడు తనజాతి స్త్రీలను అనుమతిపత్రిములను పుచ్చుకొనవలసిన దని అజ్ఞాపించనందుల కతనిని ప్రవాసమంపిరి. అంతట దీనినిగూర్చి అస మ్మతిని తెలుపుటకు ఒకమహాసభను చేసిరి. అప్పుడక్కడ సమావేశమైన వారందరును "ఆఫ్రికా!" అను నినాదముతో కాంగ్రెసు వందనమునుచేసి తమఅసమ్మతిని ప్రదర్శించిరని తెల్లఅధికారియైన నేటివు కమీషనరు పై యధికారులకు వ్రాసెను.

దక్షిణాఫ్రికాలోని నల్లవా రిట్లు తెల్లవారి ప్రభుత్వమును ధిక్కరించు చుండగా అదివరకు ఆ ప్రభుత్వవిధానమును చూచియు చూడన ట్లూరకొనిన ప్రపంచములోని నాగరిక పాశ్చాత్యజాతులవా రిప్పుడు దక్షిణాఫ్రికా సమితి ప్రభుత్వమువా రవలంబించిన వర్ణభేద జాతివిభజన "అపార్థీడ్" విధాన మును తీవ్రముగా విమర్శింపసాగిరి.

అదివరకు అమెరికానుండియు ఇంగ్లాండునుండియు దక్షిణాఫ్రికా లోనికి ప్రవాహముగావచ్చుచుండిన పెట్టుబడిధనము క్షీణించెను. ప్రపంచము లోని నాగరికరాజ్యములవారియభిప్రాయము అట్లుండగా వివిధదేశములలోని ఆటలపోటీలజట్టులవారిలోను లలితకళాసంఘములవారిలోను వినోదక్రీడా సంఘములవారిలోను దక్షిణాఫ్రికావారిగౌరవముతగ్గిపోయెను. ఈపరిస్థితులలో పశ్చిమ ఆఫ్రికాలోని నల్లవారిరాజ్యమయిన బంగారుకోస్తాలోని ఘనదేశము

బ్రిటిష్ కామన్వెల్తు అను స్వతంత్రరాజ్యసమ్మేళనమునందు తెల్లవారిరాజ్య ములతో సరిసమానప్రతిపత్తిగల స్వతంత్ర రాజ్యమగుట తటస్థించెను. స్వతంత్ర ఘనరాజ్యముతో దక్షిణాఫికారాజ్యము స్నేహముగనుండ దలచినచో ఘనరాజ్యముయొక్క నల్లరాయబారిని తెల్లప్రభుత్వమువారు గౌరవింపవలసినగతిపట్టునట్లు కనబడెను.

ప్రముఖులైన ఆఫ్రికేనరు ప్రొఫెసర్లు, క్రైస్తవధర్మతత్వజ్ఞులు (Theologians) వార్తాపత్రికలవారును దక్షిణాఫ్రికాప్రభుత్వమువారవలంబిం చిన జాతి విద్వేషకవిధానములవలని అనర్థములనుగూర్చి అంగీకరించుచు, దక్షిణాఫ్రికాలోని నల్లజాతివారితోను ఇతరనల్లవారితోను రాజీగా పరిష్కా రముచేసికొనుట యుక్తముకాదాయని బహిరంగముగా వితర్కింపసాగిరి.

చుట్టును ఎత్తైన పెద్దగోడలనుకట్టి బాహ్యలోకమును మనకన్నులకు కనపడకుండా చేయుటకు ప్రయత్నించుచుండగా, ఆగోడలలో చిన్న కంతలు పడి బయటిలోకము కనబడినట్లు ఢిల్లీహాలులోని కాంగ్రెసుప్రజానాయకు లకు దేశములోని పరిస్థితులు కనబడుచుండెను.

దేశములో "బాయ్‌కాట్, బహిష్కారము" అను నినాదములు అన్ని దిశల ప్రతిధ్వనించుచుండెను బస్సులబహిష్కరణము తరువాత నల్లవారిలో సంచలనముకలిగెను. ఆఫ్రికేనరుపక్షీయులైన తెల్లవారు తయారుచేయు సిగ రెట్లను బహిష్కరించుఉద్యమము ప్రారంభమయ్యెను.
"Azi"—"Do Not" "వలదు" అను నొక్కమాటతో బహిష్కరణో ద్యమము పట్టణములందు వ్యాపింపసాగెను. ఎట్టిదౌర్జన్యములులేకనే నల్లవారి అంగీకారములేనిది తామేపనియు చేయుటకు సమర్థులముకామని తెల్లవారు గ్రహింపగలిగిరి.

నల్లవారిని బస్సులెక్కమని సిగరెట్లుకాల్చుడని ఏశాసనము బలవం తముచేయగలదు ? ఇదివరకు నల్లవారు ఇష్టపడి విధేయులైయుండిరి. లేదా చిరునవ్వుతో నూరకుండిరి. అందువల్లనే తెల్లవారిఆధిపత్యము సాగినది. ఈ అంగీకారమును వారు ఉపసంహరించుకొని ఎంత సాత్వికముగనైనను నెమ్మదిగనైనను తమసహకారమును విరమించినచో తెల్లవారిరాజ్యమంత రింపవలసినదే యనుసంగతి విదితమగుచుండెను. అనుమతిపత్రమును

మంటలో వేసినచో నీ అనుమతిపత్రముల పద్ధతి యంతరించునని నల్లవారు గ్రహించి, తమలో తాము అనుకొనిరి. సంఘీభావము వహించినజాతి నెవ్వరును బెదిరించిగాని ప్రతీకారచర్యలు జరిపికాని లొంగదీయజాలరు. దీనికి భారతదేశరాజకీయచరిత్రయే సాక్షి, గాంధిమహాత్ముడే సాక్షి.

డ్రిల్లుహాలులో విచారణజరుగుట ప్రారంభమైన ఆరునెలలకు దక్షిణాఫ్రికా లోని పారిశ్రామికులును పనివారును ప్రభుత్వమువారి వర్ణభేద జాతి విభజన విధానమునకును, అనుమతిపత్రములపద్ధతికిని, తక్కువకూలినిర్ణయమునకును తమఅసమ్మతిని ప్రకటించుటకై ఒకరోజు పనిమాని సమ్మెచేయవలసినదని కాంగ్రెసువారు ఉత్తరువుచేసిరి. అంతట జోహానసుబర్గులోని పారిశ్రామికులలో సగముమంది పనులుమాని సమ్మెకట్టిరి. కార్యాలయములు ఖాళీగానుండెను. తెల్లబైపిస్టులకు తేనీటిని తయారుచేయుటకు నల్ల సేవకులు లేరైరి. ఈ బహిష్కరణ విధానమును అసమ్మతియు నల్లవారి సంఘబలమును సూచించెను. రాజద్రోహనేరవిచారణవలన బహిష్కరణోద్యమము వలన క్రైస్తవచర్చిలకు నల్లవారు పోకూడదను నిబంధనవలన, లిబరల్ సంస్థలును, చర్చిమతాధికారులును కాంగ్రెస్‌పైన సానుభూతిని చూపుట కవకాశము కలిగెను. రాజ్యద్రోహవిచారణ సంవత్సరములో జరిగిన వివిధజాతుల కాన్ఫరెన్సు మహాసభకు ముగ్గురుబిషప్పు లనుపెద్దక్రైస్తవమతాధికారులును ఐరోపావారి "బ్లాక్‌శాష్" ఉద్యమము ( Black Sash movement ) ప్రముఖులును లిబరల్‌పార్టీ అధ్యక్షులును, పార్లమెంటులోని ఇరువురు లేబరు మెంబర్లు, పండ్రెండుగురు ప్రొఫెసర్లునువచ్చి కాంగ్రెసుపక్షమున పనిచేయుట తటస్థించెను. వీరిలో చాలామంది రెండుసరివత్సరముల క్రిందట నట్లుచేయువారుకారు. కాంగ్రెసు తన 47వ సంవత్సరమున నూతనశక్తితో ప్రకాశించెను. దానిలో లోపములులేకపోలేదు. నల్లవారిపైన కాంగ్రెసుకుగలపలుకుబడి తిరుగులేనిదని చెప్పుటకును వీలులేదు. ప్రభుత్వమువారి జీతబత్తెములుపుచ్చుకొను నల్లజాతులనాయకులు తెల్లప్రభుత్వమువారికి దాసులైయుండిరి. పట్టణములలోని నల్లవారిసంఘములు సులభముగా విచ్ఛిన్నము కావచ్చును. క్రమశిక్షణముతప్పి చరింపవచ్చును. పట్టణములలోనినల్లవారిని చీలదీయుటకు ప్రభుత్వమువారు ప్రయోగించుచున్న కుటిలరాజ్యతంత్రము కొంత

ఫలించుచుండెను. నల్లవారిలో వర్గవైరమును వృద్ధియగుచుండెను. అయితే రెండేండ్లలో దేశములోని నల్లవారును తెల్లవారునుకూడా కలలోనైనతలం పనిమార్పులు దేశములో కలిగెను. ఈ అన్యాయరాజ్యద్రోహవిచారణము ఆ ప్రజానాయకులలో తీవ్రమైన విషాదమును, ద్వేషభావమును పురికొల్పెను. అయితే వారిలో ఆత్మగౌరవము ఆత్మవిశ్వాసము కలిగెను. తమకు కొంత పలుకుబడియు గౌరవము నున్నవని వారు గ్రహించిరి. చాలాకాలము తాము తెల్లవారిచేతులలో కీలుబొమ్మలమై యుంటిమని వారుచెప్పినట్లెల్ల చేసితిమని ఇప్పుడు స్వతంత్రులమని వారు గ్రహించిరి. తెల్లవారే తమ నిప్పుడు తమప్రక్కకు త్రిప్పుకొనజూచుచున్నారనుసంగతికూడా వారికి తెలిసెను.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## పదవ ప్రకరణము

### "నల్ల" విశ్వవిద్యాలయములు

దక్షిణాఫ్రికాసమితి ప్రభుత్వమువారు వర్ణభేద జాతివిభజన అపార్తీడ్ విధానమును పురస్కరించుకుని ఆ రాజ్యములో తెల్లవారికి వేరుగాను నల్లవారికి మిశ్రమజాతులవారికి వేరువేరుగాను విశ్వవిద్యాలయముల నేర్పాటు చేయదలచి, అందుకొరకు కొక చిత్తుచట్టమును పార్లమెంటులో ప్రవేశపెట్టిరి. అది పార్లమెంటు సభలో 1959 ఏప్రిలు 11 వ తేదీన రెండవసారి చర్చకు వచ్చినది దానిని సభ్యులు 26½ గంటలు చర్చించినపిమ్మట నూరుమంది దానికి అనుకూలముగను 56 మంది వ్యతిరేకముగను వోటుచేసిరి.

పార్లమెంటులో ప్రతిపక్షముగానున్న యునైటెడ్‌పార్టీ వారీ చట్టమునకు వ్యతిరేకముగానున్నారు. దీనివలన విశ్వవిద్యాలయములయొక్క ఆంతరంగికస్వాతంత్ర్యమునకు భంగముకలుగునని వారనిరి. ఆ దేశములో ఇంగ్లీషుభాషలో విద్యనుబోధించు విశ్వవిద్యాలయములలోని విద్యార్థులును ఉదారబుద్ధికలిగి ఈచట్టమునకు తమఅసమ్మతిని ప్రకటించిరి. విశ్వవిద్యాలయములకు ప్రభుత్వమువారు ధనసహాయముచేయుచున్నందువలన ఆ విశ్వవిద్యాలయ వ్యవహారనిర్వహణమునందు జోక్యము కలిగించుకొనుటకు ప్రభుత్వమువారికి హక్కుకలదని ప్రభుత్వపక్షమున న్యాయపరిపాలనశాఖామంత్రియగు మిష్టర్ చార్లెస్ స్వార్టుగారు పార్లమెంటులో వాదించిరి. తాను మంత్రిగానేగాక ఆరెంజి ఫ్రీస్టేటు విశ్వవిద్యాలయ అధ్యక్షుడుగాకూడా మాటలాడుచున్నానని ఆయన చెప్పిరి.

సమితి రాజ్యములో వివిధజాతులను సమ్మిశ్రణముచేయుట ప్రభుత్వమువారి కిష్టములేదని ఆయన అనిరి. విశ్వవిద్యాలయములందు విద్యార్థులను

చేర్చుకొనుట జాతినిబట్టిగాక విద్యనుపొందుటకుగల అర్హతనుబట్టిమాత్రమే నిర్ణయింపవలెనని కేప్‌టవును విశ్వవిద్యాలయములో స్వాతంత్ర్యప్రచార కమిటీవారు మంత్రిగారి కొకలేఖను వ్రాసిరని, అందులో తెల్లవారు కానట్టిజాతులవారితో కలిసిమెలసియుండుట తెల్లవారి కిష్టములేదనుసంగతిని ఒప్పుకొని, అందుకు వలసిన ఏర్పాటులనుచేయుదుమని వ్రాసినారనియు. అందువలన విశ్వవిద్యాలయముయొక్క సాంఘికజీవనమునందు శ్వేతేతరజాతులవారు పాల్గొనుట కవకాశములుండవనియు అందువలననే వారికి ప్రత్యేక విశ్వవిద్యాలయములు ఏర్పాటుచేయుట అవసరమనియు మంత్రిగారు వాదించిరి. ఈ చట్టమును ప్రతిఘటించుచున్న విశ్వవిద్యాలయములోని అధ్యాపకులలో కొందరు కమ్యూనిష్టులనియు, విట్‌వాటర్సురాండ్ విశ్వవిద్యాలయములోని ఒక ఉపన్యాసకుడు ఇటీవల ఆఫ్రికానిస్టు ఉద్యమమునకు అధ్యక్షుడుగా ఎన్నుకొనబడెనియు, ఆ యుద్యమము యొక్క ఉద్దేశము దక్షిణాఫ్రికాసమితిరాజ్యాంగచట్టమును రద్దుచేయించి, తెల్లవారిఆధిపత్యమును తొలగించుటయేయని ఆ యుద్యమమువారు బహిరంగముగనే ప్రకటించినారనియు, సమితిలో నిటువంటి సంగతులు జరుగుచుండగా జూచుచు ఊరకుండుటెట్లనియు ఆయన హెచ్చరించిరి.

విశ్వవిద్యాలయములందు వర్ణభేద జాతివిభజన (అపార్టీడ్) విధానమును ప్రవేశపెట్టుటకు సమితి ప్రభుత్వమువారు చేసిననిర్ణయమునకు అసమ్మతి సూచకముగా విట్‌వాటర్సురాండ్ విశ్వవిద్యాలయమువారు కళాశాలలోనితరగతులను అన్నిటిని ఆపివేయుటకు నిశ్చయించిరి. ఆవిశ్వవిద్యాలయ కవున్సిలు సంఘమువారును విద్యార్థులును కలిసి తమ అసమ్మతి నేకగ్రీవముగా ప్రకటించిరి.

ఈ విధానమునకు తమ తీవ్రమైన అసమ్మతిని ప్రకటించుటకై నేటాలు విశ్వవిద్యాలయమువారు ఈ విధానమునుగూర్చి తమ అభిప్రాయములను నిర్భయముగా చెప్పవలసినదని హెచ్చరించినారు. ఆఫ్రికా విశ్వవిద్యాలయములోని ఉపన్యాసకుడుగా ఎంటిమ్కుల (M'Timkula) గారిని నేటాలు విశ్వవిద్యాలయమునకు వచ్చి యుపన్యసింపుమని కోరిరి. దక్షిణాఫ్రికా సమితిరాజ్యముతో నింతవరకును తెల్లవారుకాని శ్వేతేతరజాతులవిద్యార్థులను

కూడా చేర్చుకొనుచున్న విశ్వవిద్యాలయకళాశాలలనుండి నల్ల వారిని,మిశ్రిమ జాతిరంగువారిని భారతీయులను తొలగించుటకు ఆ దేశప్రభుత్వమువారు ప్రవేశపెట్టిన శాసనము హవుస్ ఆఫ్ అసెంబ్లీవారిచే ఆమోదింపబడినది. దీనిని అమలుజరుపుట కా ప్రభుత్వమువారు గట్టిచర్యలుతీసికొనుటకు సమకట్టినారు

ఆఫ్రికా దేశీయులగు నల్లజాతులవారికొరకు మూడు ప్రిత్యేక "ట్రైబల్" ఆదివాసికళాశాలలను, అక్కడి మిశ్రమజాతిరంగుజాతివారికిని భారతీయులకును ప్రత్యేకకళాశాలలను, ఆ ప్రభుత్వమువారు స్థాపించి వర్ణభేద జాతివిభజనవిధానమును సార్థకముచేయదలచినారు. దక్షిణాఫ్రికాలో నిప్పటివరకును నల్ల వారికి ఫోర్టు హేర్ (Fort Hare)కళాశాల యొకటిమాత్రమే ప్రత్యేక కళాశాలగా నున్నది. అయితే ఇందులో మిశ్రమజాతివారిని భారతీయులను కూడా చేర్చుకొనుచుండిరి. ఇప్పు డీ కళాశాలలోనుండి వీరిని తొలగించి ఆఫ్రికాదేశీయులైన నల్లవారికిమాత్రమే దీనివి ప్రత్యేకించుటకు ఫోర్టు హేర్ కళాశాలట్రాన్సుఫరుశాసనమను నొకచట్టమును చేయుచున్నారు. ఇదివర కీ కళాశాల తెల్లవారి విద్యాశాఖమంత్రి అజ్మాయిషీక్రింద నుండెడిది. ఇప్పుడు దీనిని బాంటూజాతుల నల్లవారివిద్యాశాఖయను నొక క్రొత్తశాఖపరిపాలన క్రిందికి మార్చుచున్నారు.

ఫోర్టుహేర్ కళాశాలనుమార్చు బిల్లును ప్రవేశపెట్టునప్పుడు బాంటూ విద్యాశాఖామంత్రి విల్లీ మరీ (M. Willie Maree) "ఈ హేర్ కళాశాల పూర్వము 48 సంవత్సరములక్రిందట ఆఫ్రికా దేశీయులకొరకు స్థాపింపబడెననియు, అయితే, ఇందులోనికి మిశ్రమజాతులరంగు వారిని భారతీయులను రానిచ్చినందువలన దీని ఆఫ్రికాజాతీయలక్షణములు క్రమక్రమంగా నశించినవనియు. ఇంతేగాక, 1955 నుండి ఈ కళాశాలలో భారతీయవిద్యార్థులసంఖ్య చాలా పెరిగినందువలన నది భారతీయకళాశాలగా మారుతున్నదనియు చెప్పిరి.

నేటాలునుండి పార్లమెంటుకెన్నుకొనబడిన ప్రితిపక్షసభ్యుడగు రోనాల్డు బుచ్చర్(Mr. Ronlad Butcher) గారు భారతీయులు మంచి నాగరికత గల ప్రజలనియు వారిని వేరుపరచి వారికొరక ప్రిత్యేక విశ్వవిద్యా

లయము స్థాపించుట భావ్యము కాదనిరి. శ్వేతేతరజాతి విద్యార్థులను వేరుపరచి వారికి పాశ్చాత్యసంప్రదాయానుసారమైన విద్యగాక ఆయాజాతుల పూర్వ సంప్రదాయములననుసరించిన విద్యను బోధించుటయే దక్షిణాఫ్రికాప్రభుత్వమువారియుద్దేశము. విద్య సర్వమానవులకు సమానమైన జ్ఞానసము పార్జనమార్గముగ నుండవలెనుగాని, క్రమక్రముగా వెనుకబడుచున్న పూర్వ నాగరిక సంప్రదాయములను పునరుద్ధరించుటకు ప్రయత్నించుటలో ప్రభుత్వమువారు శ్వేతేతరజాతులను అణగద్రొక్కి అధోగతిలోనుంచి, తెల్లవారి ఆధిక్యతను స్థాపించు రాజకీయమైన ఉద్దేశమును కలిగియున్నారనియు, శ్వేతేతరజాతులవారు తెల్లవారికి దాసానుదాసులుగ నుండునట్లు బానిసబుద్ధిని అలవరచుటయే ప్రభుత్వముయొక్క నిజోద్దేశమనియు బుచ్చర్‌గారు కఠినముగా విమర్శించిరి. ఫోర్టు హేర్ ట్రాన్సుఫర్‌బిల్లు అనునది నిజముగా విద్యకుసంబంధించినశాసనము కాదనియు, అదికేవలము తెల్లవారికి రాజకీయ అధికారము చేజిక్కించుటకేర్పడినదనియు తెల్లవారి అడుగులకు మడుగులెత్తగల బానిస ఉపాధ్యాయులను తయారుచేసి ప్రభుత్వమువారి వర్ణభేద జాతివిభజనసిద్ధాంతములను వ్యాప్తిచేయుటకే ఏర్పడినదనియు విమర్శించిరి.

ప్రభుత్వమువారు క్రొత్తగా స్థాపింపదలచిన "నల్ల" కళాశాలలనుగూర్చిన వివరములు కొన్ని దక్షిణాఫ్రికాలోని పత్రికలందు ప్రకటించబడినవి. ఈ కళాశాలలందు నల్లజాతులవారి పూర్వసంప్రదాయసూచకములగు చిత్రములతో అలంకరింతురు. తక్కిన విశ్వవిద్యాలయములందువలె విద్యార్థులు డ్రాయింగురూముహాల్సు అనబడు సభాభవనమందిరములందు సమావేశమై ఇష్టాగోష్ఠిసలుపుపద్ధతిగాక నల్లజాతులలోని అనాగరిక ఆదివాసులు తమ గుడిసెలమధ్య ఖాళీస్థలములందు నిప్పుమంటచుట్టు చేరి ఇష్టాగోష్ఠిసలుపుకొనునట్లే ఈ నల్లవారికళాశాలవిద్యార్థులు పైన కప్పులేని పొట్టిగోడల ఆవరణలందు నిప్పుమంటలు వేసికొని ఇష్టాగోష్ఠులు సలుపుకొనవలెను.

అభినవవిద్యావిధానమునందు జాతిమతభేదము లేకుండా విద్యార్థులెల్లరు నాగరికదుస్తులు ధరించి, డ్రాయింగురూముహాల్సు అను సభామందిరములందే సమావేశమై చర్చలుజరుపుకొనుట యుక్తముకాని, ఆచ్ఛాదనములేని ఆవరణగోడల మధ్య నిప్పుమంటలచుట్టు కూర్చుండి కాల

క్షేపముచేయుట కేవలము అనాగరిక సంప్రదాయమని పాశ్చాత్యులే స్పష్టముగా విమర్శించుచున్నారు. దక్షిణాఫ్రికాప్రభుత్వమువారు ప్రపంచములోని నాగరికతతో సంబంధములేకుండా ఆఫ్రికాదేశీయవిద్యార్థుల కొరకు మారుమూలప్రాంతములం దిట్టి ఆదివాసి జాతీయ కళాశాలలను నిర్మించుచున్నారు. ఉత్తరట్రాన్సువాలులో నిటువంటి "నల్ల" కళాశాల నిర్మించుపని చాలావరకు పూర్తియైనది. ఆ దేశములోని ఏ పట్టణమునకును కూడా దగ్గరలోలేకుండా వెల్డు అనబడు ప్రాంతమున పదునెనిమిదిమైళ్ళ దూరమున నీ కళాశాల నిర్మించబడినది. దానికివెలుపల అంగళ్ళుగాని సినిమాలుగాని నాగరికజీవనమునకు అవసరములగు సౌకర్యములుగాని లేవు ।

# ఆఫ్రికా జాతీయోద్యమము

## పదునొకండవ ప్రకరణము

### బాంటూజనుల "స్వపరిపాలన" చట్టము

దక్షిణాఫ్రికాలోని బాంటూజాతులవారికి స్వపరిపాలనములనొసగు చట్టము (The Promotion of Bantu (African) Self Government Bill) "అను నొక చిత్తుచట్టమును దక్షిణాఫ్రికా నేషనల్ పక్షప్రభుత్వమువారు సమితి రాజ్యపార్లమెంటుసభలో ప్రవేశపెట్టిరి. దక్షిణాఫ్రికా ప్రధానామాత్యుడైన డాక్టరు హెండ్రికు వెర్వర్డు (Dr Hendrik Verwoerd) గారు ఆ చట్టమునుగూర్చి మాటలాడుచు, "ఆఫ్రికాజాతిప్రజలకు తామువసించుప్రాంతములందు స్వపరిపాలనహక్కులు ఒసగబడిననే తెల్లవారికి తమప్రాంతములందుగలహక్కులు సురక్షితములుగ నుండగలవు" అనిరి.

ఈ క్రొత్తచట్టమునుబట్టి దక్షిణాఫ్రికాలో ఆఫ్రికాజాతులవారి రాజ్యము లెనిమిది క్రొత్తగా స్థాపింపబడును.

ప్రభుత్వమువారు తలపెట్టిన కార్యక్రమమువలన భారతదేశమువలెనే దక్షిణాఫ్రికాదేశముకూడా విభజింపబడగలదని పార్లమెంటులోని ప్రతిపక్షనాయకులు విమర్శించిరి.

పార్లమెంటులోని యునైటెడ్ పార్టీకిచెందిన ప్రముఖసభ్యుడగు మెరెయిస్ స్టెయిన్ (Marais Steyn) గారు "ఆఫ్రికాజాతులవారి ప్రతినిధులు పార్లమెంటులో లేకుండాచేయుపద్ధతివలన కుతకుత ఉడుకుచున్న బాయిలరుకుగల కొలదిపాటి రక్షకద్వారములు (Safety valves) తీసివేయుటయగుననియు, ఇప్పుడు ఊహించుదానికన్న అత్యధిక భయంకరమైనదిగా నది బ్రద్దలుకాగల పరిస్థితులు కలుగవచ్చుననియు చెప్పిరి.

ప్రస్తుతము దక్షణాఫ్రికాలో 90 లక్షలమంది నల్లజాతులవారును 30లక్షలమంది తెల్లవారును ఉన్నారనియు, నలుబది యేబది యేండ్లలో తెల్ల

వారిసంఖ్య 60లక్షలు లేక 70లక్షలకు పెరుగవచ్చుననియు. నల్లవారిసంఖ్య ఒకకోటి 90లక్షలుగాని 2కోట్ల పదిలక్షలుగాని కావచ్చుననియు. అందువలన ఆసంగతి నాలోచించి తగుచర్యగై కొనవలెననియు ప్రధానమంత్రిగారనిరి.

ఈ బిల్లువలన దక్షిణాఫ్రికాలోని శాసనసభలందు నల్లవారిపక్షమున ఇప్పుడు ప్రతినిధులుగానున్నతెల్ల వారి సభ్యత్వపుగడువుకాలము పూర్తికాగానే ఇకముందు నల్లవారికి ఈవిధమైన పరోక్షపు ప్రాతినిధ్యముకూడా ఉండదు. దక్షిణాఫ్రికాలో వివిధప్రాంతములందు ఎనిమిది నల్ల జాతివారి రాజ్యములు స్థాపింపబడును. ఆరాజ్యములలోని నల్లవారికి ప్రత్యేకశాసనసభలుండును. అవి నల్లవారికి కావలసిన శాసనములుచేయును. పన్నులువిధించును, నిర్మాణములను చేయును. తమ అధికారముక్రిందనుండు నల్ల యుద్యోగివర్గముపైన అధికారముకలిగి ఉత్తరువులు జారీచేయును.

పూర్వము నల్లవారిపక్షమునపనిచేయు ప్రతినిధులకుబదులుగా ఐదుగురు తెల్లకమీషనర్సు జనరల్ అను అధికారులు నియమింపబడి ఈ నల్ల వారిరాజ్యములకును కేంద్రప్రభుత్వమునకును మధ్య అనుసంధాయకాధికారులుగా పనిచేయుదురు.

తెల్ల వారునివసించు ప్రాంతములందున్ననల్ల వారికి హెచ్చుహక్కులు అధికారములు నుండవలెనని ప్రతిపక్షమునకు చెందిన యునైటెడ్‌పార్టీవారు అభిప్రాయపడిరి. ప్రభుత్వమువారవలంబించిన రాజ్యనీతివలన దక్షిణాఫ్రికా యంతయు నల్ల వారివశమగుననిరి.

ప్రభుత్వమువా రవలంబించిన విధానము దక్షిణాఫ్రికా రాజ్యములోని ప్రజలకు క్షేమకరమైనది కాదనియు, ఈ దేశమును నాశనము చేయగలదనియు, అందువలన నీ చిత్తుచట్టమును ప్రవేశపెట్టుటకు పార్లమెంటువా రనుమతినివ్వరాదనియు ప్రతిపక్షనాయకుడైన సర్ డి విల్లియర్సు గ్రాఫ్ (Sir De VilliersGraaf) గారు ఉద్ఘోషించి. ఈ విధానము దేశవిభజనకు దారితీయునన్నియు. కేంద్రప్రభుత్వమున పలుకుబడిలేకుండా ప్రజలకు కొన్ని హక్కులిచ్చుటవలన సంఘర్షము కలిగి తీరుననియు, రాజ్యాంగముయొక్క అభివృద్ధి, స్వాతంత్ర్యముపైపునకే దారితీయునను సంగతి చరిత్రవలన తెలియగలదన్నియు చెప్పిరి.

ఈ శాసనము ఆర్థికసమైక్యతను ప్రోత్సహించుచున్నదని ఆర్థికసమై క్యత రాజకీయసమైక్యతకు కారణమైతీరుననియు, అయితే ప్రభుత్వమువారు రాజకీయవిభజనమును వాంఛించుచున్నారనియు విమర్శించిరి.

దక్షిణాఫ్రికాలోని తెల్లవారి అభిప్రాయములు రెండుమార్గములను బట్టి నడచుచున్నవి. ఈ పద్ధతివలన ఆర్థికాభివృద్ధికి భంగముకలిగి, దక్షిణా ఫ్రికా బలహీనమైతీరునని కొందరు అభిప్రాయపడుచున్నారు.

తూర్పు కేపురాష్ట్రమున ఆఫ్రికాజాతివారి ప్రతినిధియగు మార్గరెట్ బల్లింజర్‌గారు (Mrs. Margaret Ballinger) "ఈ చట్టము దక్షిణా ఫ్రికాలోని నల్లవారిని తెల్లవారిని విడదీయుచున్నదని, ఆఫ్రికా దేశమున పుట్టిపెరిగిన ఆఫ్రికాజాతివారి కా దేశప్రభుత్వమున పలుకుబడిలేకుండా చేయుచున్నదని, ఆఫ్రికావారితో ఆలోచింపకనే ఈచట్టము శాసింపబడుచున్న దనిరి. దీనివలన ఆఫ్రికాలోని నల్లవారిని హైన్యస్థితికిదింపి నాగరికప్రపంచ ములో నితరప్రాంతములందలి సదభిప్రాయములకు భిన్నమైన నిరంకుశ సామ్రాజ్యనీతి నవలంబించునట్టిదిగా నున్నదనిరి. ఈదేశములోను దేశాంతర ములందును మానవసంబంధములకు భంగముకలిగించునట్టిదిగా నున్నదనిరి. అందువలన నీచట్టమును ప్రవేశపెట్టుటకు పార్లమెంటువా రనుమతింపరాదని ఒక సవరణను ప్రతిపాదించిరి. అయితే పార్లమెంటులో ప్రభుత్వపక్షము వారికిగల అధికసంఖ్యాబలమువలన నీసవరణ వీగిపోయెను. పార్లమెంటువా రీ శాసనమును మొదటిసారి చదివిరి.

ఈ చిత్తుచట్టమును త్వరలోనే శాసనముగా చేయుటకు ప్రభుత్వము వారు నిర్ణయించి దానిని అమలుపరచుటకు తగు ఏర్పాటులనన్నిటిని చేయుట ప్రారంభించినారు.

బాంటూ స్వపరిపాలనచట్టమునుగూర్చిన రెండవసారిచర్చ దక్షిణా ఫ్రికా పార్లమెంటులో మూడుదినములు జరిగి, 26-5-59 తేదీన వోట్లు తీసికొనగా ఆ బిల్లునకు 102 మంది అనుకూలముగను 58 మాత్రము వ్యతి రేకముగను వోటుచేసిరి.

"ఈవిధానమువలన దక్షిణాఫ్రికాలో వివిధప్రాంతములందు వివిధ జాతులవారుందురు. నల్లవారిప్రాంతములను పరిపాలించుటకు నల్లవారికి

కొన్నిహక్కు లివ్వబడును. ఈ నల్లవారి ప్రాంతములు మునుముందు స్వతంత్రరాజ్యములగునని నేషనల్‌పార్టీవారికిని ప్రభుత్వమునకును తెలియును. వేరువేరుజాతులప్రాంతములుగల దక్షిణఆఫ్రికారాజ్యముండుటవలన నష్టములేదు..దేశజనసంఖ్యలోని మెత్తముమీద ఒకతెల్లవారికి నలుగురు నల్లవారున్నందున తెల్ల వారు నల్ల వారు తిలతండులన్యాయముగా కలిసియున్నచో తెల్ల వారు బలహీనులుగనుందురు. దేశము తెల్లవారిఅధీనముతప్పి శ్వేతేతరరాజ్యమగును. అట్టిరాజ్యముండుటకన్నతమవ్యవహారములనుతాముచక్కబెట్టుకొని, తమలక్ష్యములను సాధించుకొనుటకు వీలైన ఒక చిన్నరాజ్యమైనను తెల్లవారికి శ్రేయస్కరముగనుండును"అని ప్రధానమంత్రియనెను.

ఈ బిల్లు ఆఫ్రికావారి కిప్పుడు పార్లమెంటులోనున్న ప్రాతినిధ్య హక్కును రద్దుచేసి, స్వపరిపాలనహక్కుగల బాంటూయూనిట్లను స్థాపింప నుద్దేశించుచున్నది. నల్ల జాతుల'యునిట్ల'కు సంబంధించినవ్యవహారములో ప్రభుత్వమువారు నల్ల జాతులరాయబారులతో సమాలోచనముసలుపుదురు.

పార్లమెంటులోని ప్రతిపక్షనాయకుడైన సర్ డి విల్లియర్సు గ్రాఫ్ (Sir De Villiers Graaf) గారి అభిప్రాయములును ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్‌నాయకుడైన అల్బర్టు లుతూలీగారి యభిప్రాయములును ఎంత సన్నిహిత సంబంధము కలిగియున్నవో గమనింపుడని ప్రధానమంత్రిగారు పార్లమెంటును హెచ్చరించిరి. దక్షిణాఫ్రికాకు ఉత్తరసరిహద్దులోనున్న ఆఫ్రికా కాంగ్రెసువారిచర్యలను గమనింపుడనికూడా ఆయన పార్లమెంటు వారిని హెచ్చరించిరి. నల్లవారి సమస్యలోనున్న చిక్కులను వానివలన తెల్లవారికి తటస్థింపగల బాధలను ప్రతిపక్షమువారు వర్ణించుచు వారు ప్రభుత్వవిధానమును విమర్శించుచున్నారేగాని, ఆ సమస్యలను పరిష్కరించు విషయములో వారు ప్రత్యేకకార్యక్రమమును దేనిని సూచించుటలేదని ప్రధానమంత్రిగా రాక్షేపించిరి.

బాంటూ"స్వపరిపాలన"చట్టముయొక్క సూత్రములను పురస్కరించుకుని, దక్షిణాఫ్రికా ప్రభుత్వమువారు అప్పుడే కొన్నిచర్యలు తీసికొనుచున్నారు. బాంటూలకొరకు ప్రత్యేకించుప్రాంతముల నిదివరకే నిర్ణయించియున్నారు. అట్టివానిలో కేపురాష్ట్రములోని ట్రాన్‌స్కెయిలో స్థాపింపబడు

"బాంటూ యునిటు" యొక్క పరిపాలన వ్యవహారములను నిర్వహించుటకు నల్లవారి"ప్రాంతీయఅధికారసంస్థ(All Black Territorial Authority) నొకదానిని దక్షిణాఫ్రికాసమితి ప్రభుత్వములోని బాంటూల పరిపాలన అభివృద్ధిశాఖామంత్రియైన ఎం.డి సి.డివెట్ వెల్ గారు ట్రాన్సుకెయిదగ్గర ఉమటాట పట్టణమున 26-5-1959 తేదీన ప్రారంభించిరి.

అక్కడ సమావేశమైన బాంటూజనుల నుద్దేశించి మాటలాడుచు "ఉమటాటలో నివసించు కమీషనరు జనరల్ మీకును ప్రభుత్వమునకును మధ్య అనుసంధాయక అధికారిగా నుండును. ఇంతేగాక మీరు నాతో స్వయముగా మీవ్యవహారములనుగూర్చి మాటలాడవచ్చును" అని మంత్రిగా రనిరి. "ఇదివరకు బాంటూల ప్రత్యేకస్థావరముల పరిపాలనము తెల్ల యధికారిచేతులలో నుంచుచుంటిమి. ఇప్పు డా యధికారము నీ ప్రాంత వాసులలో నొకరి అధీనముచేయుటవలననే పరిపాలనబాధ్యతలను, ముఖ్యమైన ప్రభుత్వపదవులను నల్లవారికిచ్చుటకు ప్రభుత్వమువారు సుముఖులుగా నున్నారను సంగతి స్పష్టమగుచున్నది. భవిష్యత్తులో మీకు సంబంధించిన రాజకీయ ఆర్థిక సాంఘిక వ్యవస్థయంతయుకూడా మీచేతులలో నుండగలదు. బాంటూ బాలబాలికలు పెద్దపెద్ద పదవులను పొందు అవకాశము కలుగును. త్వరలోనే ఆఫ్రికావారి కింకను హెచ్చు అధికారము లొసగ బడును. తమ స్వంత పరిపాలనావిధానము నభివృద్ధిచేసికొనుటకు వారికి వీలుకలుగును" అని చెప్పి ఆఫ్రికా జాతీయ అధికారసంస్థయొక్క ప్రధాన బాధ్యతలను మంత్రిగారు వివరించిరి.

"భూసారము పాడుచేయకుండా నుండు పద్ధతులనుగూర్చి దేశీయులలో విజ్ఞానబోధనముచేయుట, తమ ఆర్థిక వ్యవహారముల అభివృద్ధి విషయములు, ముందుముందు వివిధస్థాయిల విద్యాశిక్షణము దాని బాధ్యతలుగా నుండును. న్యాయపరిపాలనావిధానము వారివశమొనర్చుటకు ముందు అభివృద్ధిపరచి తగు పైతనిఖీ నేర్పాటుచేయుట, ముందుముందు పరిపాలనా విధానమునెల్ల సమర్థులగు ఆఫ్రికాదేశీయులవశమొనర్చుటకై పరిపాలనా కార్యములందు కొందరికి తగిన శిక్షణయు నొసగుటయు దాని బాధ్యతలుగ నుండును" అని మంత్రిగారు సూచించిరి.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## పండ్రెండవ ప్రకరణము

### " తెల రిపబ్లికు "

దక్షిణాఫ్రికా సమితివారి శాసననిధులవలన కేపుటవునులోని నల్ల జాతులవారు తెల్లవారితోపాటు సినీమాలను చూచుటకు పోవుట కిదివరకే వీలులేదు. ఆ దేశమును పరిపాలించుచున్న నేషనలిస్టు ప్రభుత్వమువారు 1959 జనవరినెలలో నొక క్రొత్తయుత్తరువును జారీచేసినారు. దీనినిబట్టి తెల్లవారు పోవు సినిమాలకే గాక మిశ్రమజాతి రంగువారును భారతీయులును పోవు సినీమాలలోనికికూడా నల్లవారు పోరాదని నిషేధించిరి. అందువలన ఆ నగరమునందు ఆఫ్రికావారి టవునుషిప్పు లేక నల్లవారి గూడెము అగు "లంగా" (Langa) లోనున్న ఒక సినీమాకుమాత్రమే నల్లవారు పోవచ్చును. నగరములోని రెండు మిశ్రమ సినీమాలలో తెల్లవా రొకప్రక్కను తెల్ల జాతికిచెందనివారింకొకప్రక్కనుపరస్పరసంపర్కములేకుండా కూర్చుండున ట్లిదివరకే నిబంధనలున్నవి. ఇరువది శ్వేతేతర సినీమాలు, మిశ్రమజాతి రంగువారు, ఆశియావారు, నల్లవారు, చూచుటకై ప్రత్యేకింపబడియుండెను. సమితి ప్రభుత్వమువా రిప్పుడుచేసిన నిబంధనవలన నల్లవా రీ యిరువది రెండుసినిమాలలో దేనిలోనికిని పోవుటకు వీలుండదు. మిశ్రమ సినీమాల యజమానులు తమ సినీమాలలో తెల్లవారితోపాటు మిశ్రమజాతిరంగువారికిని ఆశియావారికిని ప్రవేశమొసగవచ్చును. అయితే వారి నొకేద్వారమునుండి లోపలికి పంపకూడదు. వారికి వేరువేరు చోటులలో సీట్లు అమర్చి వేరు వేరు ద్వారములలోనుండి లోపలికి పంపవలెను. తెల్లవారికి వేరుగా పాయి ఖానాల నేర్పాటుచేయవలెను.

దక్షిణాఫ్రికాలో దేశీయులైన ఆఫ్రికావారిలో చాలామంది రంగులోను రూపములలోను మిశ్రమజాతిరంగువారిని పరిపోలియుందురు. అందువలన వీరిని గుఱుతించుట సినీమాయజమానులకు చాలా కష్టమైనసమస్య. ఈవిషయములో ఒకనిర్ణయముచేయుట కష్టమని ఒకసినీమాయజమానుడు అనెను.

కేపుటవున్‌లో 110000 మంది ఆఫ్రికాదేశీయ స్త్రీపురుషులు పిల్లలు నున్నారు. ఇందులో 55000 మంది, ఆఫ్రికా వారికి ప్రత్యేకింపబడిన గూడెములకు పేటలకు వెలుపలనే జీవించుచున్నారు. వీరందరు నిదివరకు మిశ్రమ సినీమాలకు శ్వేతేతరసినిమాలకు పోవుచున్నారు. ఇప్పుడు వారు సినీమా చూడదలచినచో లంగాటవునుషిప్పుకు బస్సుమీద వెళ్ళవలసి యుండును. అక్కడ వారమునకు మూడుమారులు మునిసిపాలిటీవారు ఉచితముగా సినిమాప్రదర్శములను ఏర్పాటుచేయుచుందురు.

ఈ నిషేధపుటుత్తరువు సమితిలోని పట్టణములలోనున్న ఆశియావారి ఇండ్లు, వాకిండ్లు, షాపులు, వదలిపోవునట్లుచేయుటకై ప్రభుత్వమువారు ప్రయోగింపదలచిన "గ్రూప్ ఏరియాస్ బిల్లు" క్రిందనే చేయబడినది.

దక్షిణాఫ్రికా ప్రభుత్వమువారు వర్ణభేద జాతివిభజన "అపార్తీడ్" విధానము నమలుజరుపుటకు దేశములో నల్లవారునివసించు ప్రాంతములందలి శ్వేతేతరజాతి ఆసుపత్రులనన్నిటిని ప్రభుత్వాధికారముక్రిందికి తీసుకొనుటకు విశ్చయించినారు. క్రైస్తవ మిషనరీ సంఘములవారు ధనసహాయముచేయు అటువంటి ఆసుపత్రులనుకూడా తాము వశపరచుకొనుటకు నిశ్చయించినారు. ఈ నిర్ణయమునుబట్టి ట్రాన్సువాలురాష్ట్రములో 22 ఆసుపత్రులు ప్రభుత్వము వారి వశమగునని 1959 ఏప్రిలు 13వ తేదీన ట్రాన్సువాల్ ప్రావిన్షియల్ కవున్సిలు ఎగ్జిక్యూటివ్‌కమిటీ సభ్యుడగు ఆర్. ఎస్. ఫెరీరాగారు చెప్పిరి.

దక్షిణాఫ్రికా సమితిప్రభుత్వమువా రవలంబించిన వర్ణభేద జాతి విభజన "అపార్తీడ్" విధానమును, ఆ సందర్భమున వారుశాసించిన గ్రూప్‌ఏరియాస్‌చట్టమును దానిని అమలు జరుపుటలో వా రవలంబించుచున్న అక్రమపుపద్ధతులును ఆ దేశములోని తెల్లవారిలోకూడా కొందరికి అన్యాయమనితోచి అసమ్మతినిచూపుట ప్రారంభమైనది.

డర్బన్ సిటీకవున్సిల్ అను నగరపాలకసంఘమువారు గ్రూప్ ఏరియాస్ చట్టనిబంధనములను పురస్కరించుకొని డెబ్బదివేలమందినుండి డర్బనులో కాపురమున్న భారతీయులనులేవగొట్టుటకై తీసికొనుచున్నచర్యలు న్యాయముగలేవని దానిపట్ల తమఅసమ్మతిని సూచించుటకు డర్బన్ పుర మందిరమునందు ఇటీవల ఐరోపాఖండీయుల మహాసభ యొకటి జరిగినది. అందులో 2300 మంది పాశ్చాత్యులు సమావేశమై తమ అసమ్మతి తీర్మానమును గావించిరి.

తెల్లవారికి వేరుగాను నల్లవారికి వేరుగాను ఉన్నతవిద్యగరపుటకై ప్రత్యేక విశ్వవిద్యాలయములను నెలకొల్పుటకు ప్రభుత్వమువారు పార్లమెంటులో ప్రవేశపెట్టిన బిల్లు లేక చిత్తుచట్టమునకు విశ్వవిద్యాలయములందలి ప్రొఫెసర్లు లేక ఆచార్యులు తమఅసమ్మతిని ప్రకటించిరి.

దక్షిణాఫ్రికా సమితిప్రభుత్వమును నిర్వహించుచున్న నేషనల్‌పార్టీవా రేర్పాటుచేసిన ఒకసభలో 23-5-1959 తేదీన ప్రసంగించుచు దక్షిణాఫ్రికా ప్రధానమంత్రి డాక్టర్ హెండ్రిక్ వెర్‌వుడ్‌గా రిట్లనిరి: "నేషనల్‌పార్టీవారికి దేశములోని తెల్లప్రజలలో సామాన్య మెజారిటీయును, పార్లమెంటులో అధికసంఖ్య సీట్లును లభించగనే "దక్షిణాఫ్రికా రిపబ్లికు" లేక ప్రజా స్వామిక స్థాపనమునకు పూనుకొనెదను. అయితే అది తెల్లవారిసైన్యమును తెల్లవారి నౌకాబలమునుగల తెల్లవారిరిపబ్లికుగానే యుండును. ఈ ప్రజా స్వామికమునందు ఇంగ్లీషు, ఆఫ్రికాన్సు బాషలను మాటలాడు తెల్లవారు సుఖముగా జీవింపగలరు. తరతరముల తెల్లవారి సంతతియొక్క క్షేమ లాభములను సంరక్షించుటయే నేషనల్‌పార్టీవారి యుద్దేశము. ఆఫ్రికా దేశీయులైన నల్లజాతులవారు స్వాతంత్ర్యముపొందు మార్గమున పురోగమించు చున్నారనియు, దక్షిణాఫ్రికాలోని నల్లవారుకూడా ఆ మార్గముననే పురోగ మించుచున్నారనియు నేషనల్‌పార్టీవా రెరుగుదురు. అయితే దక్షిణాఫ్రికా దేశములోనికి నల్లజాతులవారును తెల్లవారును ఇంచుమించుగా నొకే సమయమున వచ్చిరి. తెల్లవారీ నల్లవారినుండి తీసికొనినదేదియు లేదు. తెల్లవారి సాహచర్యము వలన నీ నల్లవారికే చాలా లాభములు కలిగినవి."

"దక్షిణాఫ్రికాలోని తెల్లవారు తమభూములను నల్లవారి కిచ్చినచో

వారు పశ్చిమ ఐరోపారాజ్యములవారితో స్నేహముగనుందురను నమ్మకము లేదు. శ్వేతదక్షిణాఫ్రికారాజ్యమే పశ్చిమరాజ్యములవారికి అండగా నుండ గలదు. దక్షిణాఫ్రికాసమితిని మఱియొక స్వతంత్రఘనరాజ్యముగా చేయుటకు వీలులేదు. తెల్లవారివలెనె నల్లవారును తమజాతిని తాము పరిపాలించు కొనవలెనని అభిలషించుచున్నారు. అందువలననే నేషనల్‌పార్టీవారు ఈ నల్లవారికి దేశములోని కొంతభాగమును ప్రత్యేకించి వారికి కొంత స్వపరి పాలనహక్కునొసగ నిశ్చయించినారు. అయితే తెల్లవారి దేశభాగములం దీ నల్లవారు తెల్లవారిపరిపాలనక్రిందనే యుండవలెనని వారు గ్రహింపవలెను" అని వెర్‌వుడ్‌గా రనిరి.

దక్షిణాఫ్రికా సమితి ప్రభుత్వమువారు తలపెట్టిన వర్ణభేద జాతివిభజన విధానమును తెల్లవారిని నల్లవారిని వేరుపరచుటకు వా రవలంబించిన "అపార్తీడ్" విధానమును కొనసాగవని అనుభవజ్ఞులైన రాజకీయవేత్తలు చెప్పుచున్నారు. దక్షిణాఫ్రికాలోని వివిధజాతుల పరస్పర సంబంధములను గూర్చి రెండుమూడు ఉద్గ్రంథములను రచించిన అలెన్ పేటన్(**Mr Alan Paton**) గారు ఈ విధానము విఫలమగుననుటకు నాలుగుకారణములను చూపుచున్నారు. ముందుగా వర్ణభేదమునుబట్టి జాతులను విభజించి వేరుపరచి వారికి ప్రత్యేకస్థావరములను భూములను పంచియిచ్చుటకు దేశములో చాలి నంతభూమి లేదు. ఈ యేర్పాటుచేయుటకు తగినధనమును లేదు. ఇట్లు చేయుటకు కాలమును చాలదు. ఇది జరిగించుటకు అవసరమగు కార్యశూర త్వమును లేదు, అని ఆయన చెప్పిరి.

అపార్తీడ్ విధానమును సమర్థించు తెల్లవారిలో చాలామందికి నల్ల వారులేని తెల్లప్రదేశములు స్థాపించుటకు నిజముగా నిష్టములేదు. ఏలననగా వారికి చౌకగా పనిచేయుటకు నల్లవారు కావలసియున్నారు. కావలసినప్పుడు దగ్గరలో కావసినంత చౌకబారుకూలి చేకూరు గొప్ప అవకాశముండినందు వలననే దక్షిణాఫ్రికాలో తెల్లవారియాధిపత్యము సుస్థిరముగా మున్నది.

ఇటీవల దక్షిణాఫ్రికాలో చేయబడిన జనాభావివరముల విచారణవలన నీ క్రిందిసంగతులు తేలినవి. నల్లవారికొరకు ప్రత్యేకింపబడిన రిజర్వు లను ప్రదేశములందు 36 లక్షల మంది, తెల్లవారి వ్యవసాయక్షేత్రములందు 26

లక్షలమంది, పట్టణములందు 23 లక్షలమందినల్లవారున్నారు. అందువలన ఎనిమిదేండ్ల క్రిందట జనాభాలెక్కలను తయారుచేసినప్పుడు తెల్లవారిప్రదేశములని నిర్ణయింపబడిన ప్రాంతములందున్న ఒక్కొకతెల్లవానికి ఇద్దరు నల్లవారిచొప్పున ఉన్నట్లు తేలినది. మఱి పట్టణములందును నగరములందునునల్లవారినిష్పత్తి యింకను చాలా హెచ్చుగానున్నది. ఇప్పుడు దక్షిణాఫ్రికా ప్రధానమంత్రిగారు 90 లక్షలమంది నల్లవారును, 30 లక్షల మంది తెల్లవారు నున్నట్లు చెప్పియున్నారు. నలుబది ఏబదిసంవత్సరములలో నల్లవారిసంఖ్య రెండుకోట్లు కాగలదు. అందువలన వారికి కావలసిన భూమి నిచ్చుటకు ఎక్కడనుండిలభించును? నిజముగా వారి కవసరమైనంత భూమి నిచ్చు ఉద్దేశ్యము తెల్లవారికి లేదు. దేశములోని మంచిభూమి యంతయు తెల్లవారిస్వాధీనములో నున్నది. దానిని వారు వదలరు.

నల్లవారికి ప్రత్యేకింపబడిన రిజర్వులనుగూర్చి విచారించుటకు నియమింపబడిన టోంలిన్సన్‌కమిటీవారు 1950 లోనే ఈ రిజర్వులను చక్కపరచుటకు కనీసము 10 కోట్ల 40లక్షలపౌనులైనను పదేండ్లలోపుగా వ్యయముచేయవలెనని సిఫారసుచేసియుండిరి. అట్లుచేసిననే ఈ రిజర్వులలో క్రీ. శ. 2000నాటికి ఒకకోటి ఏబదిలక్షలమంది నల్లవారు జీవింప వీలు కలుగుననిరి. దక్షిణాఫ్రికాసమితిప్రభుత్వమువారీ కమిటీనివేదికను బుట్టదాఖలుచేసిరి. మొదటిసంవత్సరము 3500000 పౌనులు శాంక్షనుచేసినట్లు చేసిరేగాని, అందులో నొక చిల్లిగవ్వయైనను వ్యయముచేయరైరి. ఇట్టి స్థితిలో నీ రిజర్వులెట్లు బాగుపడును? 'అపార్తీడ్‌విధాన' మెట్లు కొనసాగును? ఇప్పుడు నిర్మింప తలపెట్టిన ఎనిమిది నల్లవారిరాజ్యములుకూడా పూర్వమువలెనే దుఃస్థితిలోనున్న రిజర్వులుగానే యుండునుగాని, నిజమైన రాజ్యములుగాగాని, రాష్ట్రములుగాగాని పరిణతిచెందజాలవు.

# ఆఫ్రికా జాతీయోద్యమము

## పదమూడవ ప్రకరణము

### జూలూగాంధి

అల్బర్టు జాన్ లుతూలీగారు దక్షిణాఫ్రికాలోని జూలూజాతి నాయక వంశమునకుచెందినవాడు. వీరికాపురము నేటాలురాష్ట్రములోని గ్రౌట్విల్లి గ్రామము. దక్షిణాఫ్రికాలోని వివిధజాతులవారు పూర్వాచారములకు కట్టుబాట్లకు లోబడిన ప్రజలైనందువలనను వారిని పాలించు నాయకులు అమితములైన అధికారములు కలిగియుండినందునను ఈ నాయకులను లోబరచుకొని, వారిఅధికారమును పలుకుబడిని తగ్గించినగాని నల్లవారిని లొంగదీయలేమని పాశ్చాత్యప్రభుత్వమువారు గ్రహించిరి, వివిధజాతులనాయకులతో మంచి మాటలాడి, వారివంశపారంపర్యపుహక్కులకును గౌరవమునకును ఎట్టిభంగమునులేకుండా ప్రభుత్వమువారికొలువులో చేరి, వారు చేయు శాసనవిధులను ఉత్తరువులను అమలుజరిపినచో జీతబత్తెము లిచ్చెదమని తెల్లప్రభుత్వమువారాశపెట్టగా ఈ నాయకులు చాలామంది సర్కారుఉద్యోగమునుచేయుటకంగీకరించిరి. అంతట వీరు సర్కారు నౌకరులైరి. సర్వాధికారులుగ నుండిన స్వతంత్రనాయకులు క్రమక్రమముగా తెల్లదొరతనమువారికట్టుబాటులకు లోనై వారికిదాసులగుస్థితిలోనికి దిగి తమపూర్వాధికారములను పలుకుబడిని గౌరవమును గోల్పోయిరి.

ఇట్లు తెల్లసర్కారువారి కొలువులో చేరిన జూలూజాతినాయకులలో లుతూలీగారి పితామహుఁ డొకడు. ఆయనతరువాత నాయనపెద్దకుమారుడు నాయుద్యోగమును చేసెను. బ్రిటీషువారు రొడీషియాలో మటాబెల్జాతితో యుద్ధముచేసినసందర్భమునందు బ్రిటిష్ ఆఫ్రికాదళమునకుచేరిన కాంగ్రిగేషనల్ ఇంటర్ప్రిటర్ అనబడు క్రైస్తవమతబోధలను తర్జుమాచేయు



ఆల్బర్టు జాన్ లుతూలీ

(జూలూ గాంధి)

*మరణము 21.7 1967

ఉద్యోగమును లుతూలీగారితండ్రి కొంతకాలము చేసిరి. అందువలన లుతూలీ గారి కుటుంబమువారు ప్రభుత్వముపట్ల వినయవిధేయతలుగల సంప్రదాయ మునకు చెందియుండిరి. లుతూలీగారును చిన్ననాటనుండియు నట్టిఅభిప్రాయ ములతోనే పెరిగెను.

లుతూలీగారి కుటుంబమువారు చాలాకాలముక్రిందటనే క్రైస్తవమత మును స్వీకరించియుండిరి. ఆయన క్రైస్తవధర్మములయందు గాఢమైన విశ్వాసము కలిగియుండెను. పైగా ఈ మతము తనజాతికి విద్యను విజ్ఞాన మును కలిగించినదనుభావము కలిగియుండెను.

లుతూలీగారియూరు కుగ్రామము. అక్కడ క్రైస్తవమతబోధకుడైన తెల్లమిషనరీ తప్ప తెల్లవారెవ్వరును లేరు. అందువలన పట్టణములందు నల్లవారికి తెల్లవారివలన కలుగు అవమానములను బాధలను లుతూలీగారు చూచి యెరుగడు.

లుతూలీగారు మొదట క్రైస్తవమిషన్‌పాఠశాలలో చేరి తరువాత 'ఆడమ్సుకాలేజియను అమెరికన్ మిషన్ హైస్కూలులో విద్యాభ్యాసము చేసెను. అటుపిమ్మట నాయన ఆడమ్సుకాలేజిలోనే యుపాధ్యాయుడుగాచేరి, అక్కడ జూలూజాతిచరిత్రను సాహిత్యమును బోధించుచుండెను.

ఆయన ఆడమ్సుకాలేజిలో నుండగనే జూలూసంస్కృతిసంఘమును స్థాపించి జూలూజాతి పూర్వసంస్కృతి సంప్రదాయములం దక్కడి యుపా ధ్యాయుల కభిరుచిని కలిగించెను.

ఇత డిట్లు విజ్ఞానసముపార్జనమునందును విద్యావ్యాసంగమునందును నిమగ్నుడై యుండినందువలన చాలాకాలమువరకును రాజకీయములవైపు నకు తన దృష్టిని మరల్పలేదు.

ఇతడు సర్వమానవసౌభ్రాతృత్వమును ఆశయముగా కలవాడైనందు వలన దక్షిణాఫ్రికాలోని తెల్లవారు నల్లవారిపట్ల అన్యాయములు జరిగించు చున్నారని ఎరిగియున్నను, వారిని ద్వేషింపలేదు. ఎన్నటికైన నల్లవారికి న్యాయముజరుగునను ఆశతో నుండెను.

లుతూలీగా రిట్లు పదునైదేండ్లు ఉపాధ్యాయపదవిని నిర్వహించిన పిమ్మట సెలవులలో నొకమారు స్వగ్రామమునకు వచ్చినప్పుడు అక్కడి

పెద్దలందరు ఇతనిని జాతినాయకత్వపదవిని వహింపుమని బలవంతముచేసిరి. రెండుసంవత్సరములైనపిమ్మట నితఁ డా పదవి కంగీకరించెను.

లుతూలీ తనజాతినాయకత్వమును, దానికిసంబంధించిన ఉద్యోగమును స్వీకరించిపిమ్మటఅతడుగ్రౌట్‌విల్లి గ్రామ ప్రజాజీవనమునందుమునిగితేలుచు తన జాతివారిలో క్రమశిక్షణమును బుజుపద్ధతిని శాంతినినెలకొల్పి, న్యాయముగావివాదములనుపరిష్కరించుచు,శాసనములనుఅమలుచేయుచు,పన్నులను వసూలుచేయుచు పదునేడుసంవత్సరములు తన యుద్యోగధర్మమును చక్కగా నిర్వహించెను. ప్రతి ఆదివారమును క్రైస్తవమతబోధచేయుచుండెను. దక్షిణాఫ్రికాలోని వివిధజాతులయొక్కయు తెగలయొక్కయు రాజకీయవ్యవహారములందు లుతూలీగారు శ్రద్ధవహించి పాటుపడిరి. పారమౌంట్ చీఫ్ లేక సర్వాధికారనాయకుడగు మ్షియేని (Mshiyeni) గారి కితడు కుడిభుజముగానుండి సలహానిచ్చి సహాయముచేయుచుండెను. లుతూలీగారు తనకు న్యాయము ధర్మము అని తోచినట్లు నిర్భయముగా ప్రవర్తింపుచు క్రైస్తవ ధర్మమార్గములద్వారా ప్రజాసేవచేయుచుండెను.

లుతూలీగారు సరసుడు. మితభాషి, మద్యపానమునుచేయడు. తుదకు పొగచుట్టనైనను కాల్చడు. లుతూలీగారిపట్ల నల్లవారందరును చాలా గౌరవము కలిగియుండిరి. పాశ్చాత్యులు నీయనను మర్యాదగనే చూచుచుండిరి.

లుతూలీగారు రాజకీయములందు ప్రవేశించి, జాతీయనాయకుడైన కథ చాలా చిత్రమైనది.

దక్షిణాఫ్రికాప్రధానమంత్రియైన హెర్టుజాగుగారు 1936లో చేసిన శాసనఫలితముగా నల్లవారికుండిన ఎన్నికహక్కులు పదేండ్లలో పూర్తిగా పోయెను. నల్లవారికి జరుగుచున్న అన్యాయములను చూచి లుతూలీగారు బాధపడిరి. తా నింతకాలము తెల్లదొరతనమువారిని భక్తివిశ్వాసములతో కొలిచినను వారు చిన్నవిషయములందైనను తనసలహాను పాటింపరని,, తనజాతివారికి తా నావంతయైనను సహాయముచేయలేకున్నానని లుతూలీగారికి తోచెను. ప్రభుత్వమువారు తన నొక కీలుబొమ్మగా ఉపయోగించుకొనుచున్నారని ఆయన గ్రహించి విషాదమునొందిరి.

నల్లవారిస్థితిగతులను చక్కచేయుటకని తెల్లప్రభుత్వమువారేర్పరచిన

కొన్నిసంస్థలు, సలహాసంఘములు మొదలైనవానిలో లుతూలీ సభ్యుడై, తన జాతివారి క్షేమలాభములను కలిగించుకార్యములనుచేయుటకు ప్రయత్నించి విఫలుడయ్యెను. ఈ సంస్థలును సలహాసంఘములు చేయు సూచనలను తీర్మానములను ప్రభుత్వమువారు తృణీకరించి తమ చిత్తమువచ్చినట్లు ప్రవర్తింపుచు నల్లవారి కన్యాయములుచేయుచుండిరి.

లుతూలీగారు 1946లో నేటివులరిప్రజెంటేటివుకవున్సిల్‌లో సభ్యుడుగానుండుట కంగీకరించునప్పటికే ఆ సంఘముకూడా ఇతరసంస్థలవలెనే నల్లవారికి లాభమునుకలిగింపజాలదని ఆయన ఎరుగును. ఆ కవున్సిలు యొక్క మొదటిసమావేశమువలననే ఇది ఋజువయ్యెను. వారొక అసమ్మతి తీర్మానమునుచేసి సభను వాయిదావేయవలసివచ్చెను. ఈ పరిస్థితులలో లుతూలీగారు తమకర్తవ్యము నాలోచించిరి.

రాజకీయములకు తాను దూరముగానుండుట పొరబాటుఅని తనజాతికి క్షేమలాభములనుకలిగించుటకు ఆఫ్రికా జాతీయకాంగ్రెస్‌లో చేరి ప్రజాసేవ చేయుటతప్ప గత్యంతరములేదని లుతూలీగారు నిశ్చయించిరి. అంతట లుతూలీగారు 1946లోనే కాంగ్రెసుసభ్యులైరి. రాజకీయములందు పాల్గొను సామాన్యవ్యక్తులు కాలమునుబట్టి మారుచు మెత్తబడుచుండగా లుతూలీగారి పట్టుదలయు కార్యదీక్షయు క్రమక్రమముగా హెచ్చెను. ఆయన గొప్ప జాతీయనాయకుడయ్యెను.

క్రైస్తవమతబోధకులు (మిషనరీలు)దక్షిణాఫ్రికాలోని నల్లవారికిజరుగుచున్న అన్యాయములకు అసమ్మతిచూపకపోవుట యట్లుండగా వారు ప్రభుత్వపక్షపాతులుగా నుండిరి. అయినను లుతూలీగారు మిషనరీసంస్థలను విడనాడక తన ప్రజాసేవాపద్ధతిని విడనాడక పనిచేయుచుండిరి.

"వరల్డు చర్చి కవున్సిల్" అనుపేరుతో భారతదేశములో జరిగిన ప్రపంచములోని వివిధదేశములక్రైస్తవ మిషనరీసంస్థలప్రతినిధులసమావేశమునకు లుతూలీగారొకప్రతినిధిగా వచ్చిరి. ఆఫ్రికాలోవలెగాక భారతదేశములోనిమిషనరీలు దేశీయులఆచారవ్యవహారములపట్లను సంస్కృతి సంప్రదాయములపట్లను సానుభూతికలిగి ప్రవర్తించుట చూచి సంతోషించిరి. భారతదేశములోని దేశీయక్రైస్తవసమస్యలనుగూర్చి తెలిసికొనిరి. అటు

పిమ్మట లుతూలీగారు అమెరికాదేశమున పర్యటనముగావించి, అక్కడి నీగ్రోల పరిస్థితులను రాజకీయములను గమనించిరి. ఆయన తనదేశమునకు తిరిగివెళ్ళునప్పటికి ఎన్నటికైన తనజాతి స్వాతంత్ర్యము పొందితీరునను ధైర్యమొకటి కలిగెను.

లుతూలీగారు ఆఫ్రికాజాతీయకాంగ్రెస్‌యొక్క నేటాలుశాఖకు అధ్యక్షులై, ఆఫ్రికాదేశీయులహక్కులను సంరక్షించుటకొరకు తనయావచ్ఛక్తిని వినియోగించి పాటుపడదలచిరి. బలవంతమైన తెల్లవారిప్రభుత్వమును ధిక్కరించినచో తనకు కష్టములుకలుగునని ఆయన ఎరుగును. ఆయన ఎట్టికష్టములువచ్చినను అనుభవించుటకు సంసిద్ధుడయ్యెను.

అసహాయులైన దేశీయులు బలవంతమైన జాతీయప్రభుత్వముతో పోరాడుటకు సాత్వికనిరోధముతప్ప వేరుమార్గము లేదని ఆయన గ్రహించెను. గాంధిమహాత్ముని సత్యాగ్రహసిద్ధాంతముల నాయన చక్కగా గ్రహించిరి. వాని నాయన ఆచరింపదలచిరి.

ఈశ్వరదత్తములగు మానవస్వత్వములకును నీతిధర్మములకును మానవునిశీలమునకును భంగముకలిగించు అన్యాయములగు ప్రభుత్వశాసనములకు ప్రజలు లోబడవలసినపనిలేదనియు, వానిని ఉల్లంఘించి ప్రతిఘటింపవలెననియు, నీవు మానవుని ఆజ్ఞకు లోబడుదువా? ఈశ్వరుని ఆజ్ఞకు లోబడుదువా? అనిన బైబిలువాక్యమే దీనికి ప్రమాణమనియు లుతూలీగారనిరి.

అన్యాయములైన శాసనముల నుల్లంఘించుటలో దౌర్జన్యవిధానములనుమాత్రము అవలంబింపరాదనియు అహింసాయుత సాత్వికనిరోధమార్గములనే అవలంబింపవలెననియు లుతూలీగారి దృఢసంకల్పము.

సాత్వికనిరోధము నిరాయుధులకుపయోగించు నొక దివ్యాస్త్రమేగాక మానవహృదయములను తప్తముచేసి, పరిశుద్ధమొనరించు ఒక దివ్యసాధనమని గాంధిమహాత్ముడు ప్రతిపాదించిన ఆధ్యాత్మికసిద్ధాంతమును త్రికరణశుద్ధిగా విశ్వసించి ఆచరించు కొలదిమంది ఆఫ్రికా జాతీయనాయకులలో లుతూలీగా రగ్రగణ్యులు ఆయన యుపన్యాసములం దీ సంగతులను గట్టిగా నొక్కిచెప్పుచుందురు. ప్రతియుద్యమమునందును దయాళుత్వము, గౌరవ

ప్రతిష్ఠలు ప్రధానముగానుండవలెనని ఆయన చెప్పుచుందురు. శౌర్యధైర్య ములుగల ఆఫ్రికాజాతివారిని శాంతిసైనికులుగా చేసి సత్యాగ్రహసమరము చేయుట కాయన యావచ్ఛక్తిని వినియోగించి పాటుపడిరి

లుత్తూలీగారి నిరంతరకృషివలన మహావీరులైన జూలూజాతివారిలో గొప్ప సంచలనముకలిగెను.

జూలూయుద్ధము జరిగినతరువాత నిద్రావస్థలోపడియున్న జూలూలు మేల్కొనిరి. తమదుఃస్థితినిగూర్చి తెలిసికొని తమహక్కులను సంరక్షించు కొనుటకు నడుముగట్టిరి.

ఆఫ్రికాజాతీయకాంగ్రెస్‌వారు శాసనోల్లంఘనమును సత్యాగ్రహ మును ప్రారంభించిననాలుగునెలలకు దేశీయవ్యవహారముల ప్రభుత్వకార్య దర్శిగారు 1952 అక్టోబరులో లుతూలీగారిని ప్రిటోరియాకు పిలిపించి ఆయన రాజకీయములందు తీవ్రముగా పాల్గొనుచున్నందువలన తననాయకత్వమునో కాంగ్రెసుసభ్యత్వమునో వదలుకొనవలసియుండునని చెప్పిరి.

దేశీయులు తమబాధలనుగూర్చి ఇచ్చుకొనినవిన్నపములు వృథయైన వనియు అసమ్మతి తీర్మానములు బుట్టదాఖలైనవనియు, ప్రజలు అభివృద్ధి చెందుమార్గము లరికట్టబడినవనియు. అందువలన ప్రజలు ప్రత్యక్షచర్యకు పూనుకొనిరనియు, తనకు ప్రభుత్వమువారిపట్లగల విశ్వాస మంతరించిన దనియు లుతూలీగారు కార్యదర్శిగారికి స్పష్టముగా చెప్పి, నాయకత్వము తన జాతికి సేవచేయుటకై తనవంశమువారికి పారంపర్యపుహక్కులుగల పదవి యనియు జాతీయకాంగ్రెస్‌సభ్యత్వము ప్రజాసేవచేయుటకు సాధనమనియు నీ రెంటిలో దేనిని తాను వదలుకొనజాలననియు లుతూలీగారు నిర్భయముగా చెప్పివైచిరి,

అంతట ప్రతిజిల్లాలోను దేశీయులవ్యవహారములను నిర్వహించుటకు నియమింపబడిన స్థానిక నేటివుకమిషనర్ అను తెల్లయధికారి లుతూలీగారిని నాయకత్వపదవినుండి తొలగించినట్లు 1952 నవంబరు 12వ తేదీన ప్రకటించెను.

ఈ సందర్భమున లుతూలీగారొక బహిరంగప్రకటన గావించిరి. "ఏసుక్రీస్తుశిలువద్వారా తప్ప స్వాతంత్ర్యమునకు మార్గములేదు. నే వింత

కాలమునుండి మితవాదిగ నున్నందువలన ప్రయోజనము కనబడలేదు. ఈ దేశములో నేషనలిస్టుపక్షమువారు ప్రభుత్వమువహించినను యునైటెడ్ పక్షమువారు ప్రభుత్వమువహించినను తెల్లవారియాధిపత్యమును సురక్షితము చేసికొనుటకై నల్లవారిదాస్యమును మఱింత కఠినతరముచేయుటయే ఇన్ని సంవత్సరములనుండి జరుగుచున్నది.''

"నన్ను నాయకత్వపదవినుండి తొలగించుటకు కారణమైన నా యభిప్రాయములు, నాయందు దయగల ఉదారవాదులైన పాశ్చాత్యులకు వింతగా కనబడవచ్చును. అయితే నేను ఇకముందుకూడా వారితోకలిసి పనిచేయు దలచినాను. దక్షిణాఫ్రికా దేశములో జీవించు అన్నిజాతులవారికిని ఎట్టితారతమ్యము లేకుండా, ప్రజాప్రభుత్వఅధికారములను బాధ్యతలను కలుగజేయుటకే నే నీ స్వాతంత్ర్యసమరమునందు పాల్గొనుటకు నిశ్చయించినాను."

"రాజ్యాంగధర్మబద్ధములైన మార్గములద్వారా అభివృద్ధిపొందుటకు అవకాశములేని మా ఆఫ్రికాజాతులవారివంటి ప్రజలు తమ ఆశయములను సాధించుటకు న్యాయమైనట్టియు దౌర్జన్యయుతవిప్లవమునకు చెందనట్టియు కరుణార్ద్రమైనట్టియు దౌర్జన్యరహిత సాత్వికనిరోధమార్గముద్వారా స్వాతంత్ర్యములకొరకు పోరాడుట పరమధర్మమని నేను త్రికరణశుద్ధిగా నమ్ముచున్నాను. దక్షిణాఫ్రికానమితిని నిజమైన ప్రజాప్రభుత్వరాజ్యముగా చేయుటకు నేను చేయదలచినకృషిలో అవమానము కారాగారనిర్బంధము కొరడా దెబ్బలు ప్రవాసము తుదకు మరణముకూడా నన్ను భయపెట్టకుండుటకు తగినమనోదార్ఢ్యము నీశ్వరుడు ప్రసాదించునుగాకయని ప్రార్థించుచున్నాను."

అటుతరువాత నొకనెలదినములలోనే డాక్టరు మొరొకాగారిస్థానమున లుతూలీగారు కాంగ్రెస్ ప్రెసిడెంట్ జనరల్ లేక అగ్రఅధ్యక్షులుగా నెన్నుకొనబడిరి. కాంగ్రెసుయొక్క వివిధశాఖలకుకూడా ప్రెసిడెంటులున్నందువలన ప్రధానసంస్థఅధ్యక్షుని ప్రెసిడెంట్ జనరల్ అనిరి. అప్పటి కాయనవయస్సు 53 సంవత్సరములు.

అంతట లుతూలీగారు జాతీయకాంగ్రెసులో మహానాయకుడై కాంగ్రెసు కార్యక్రమనిర్ణయములందు ప్రధానపాత్రవహించుచు దేశములో తెల్ల నల్ల తారతమ్యములులేకుండా అందరుప్రజలకు క్షేమలాభములను కలిగించు

టకు తోడ్పడు ప్రజాప్రభుత్వస్థాపనముకొరకు కృషిచేయుచు ఇతర రాజకీయ సంఘములతోను. వివిధప్రజానాయకులతోను: సమాలోచనములనుజరుపుచు దౌర్జన్యరహిత సాత్వికనిరోధమార్గమున జాతీయోద్యమమును నడుపసాగిరి.

ఇంగ్లాండుప్రధానమంత్రి అట్లీగారివలెనే లుతూలీగారుకూడా "క్రిస్టియన్ సోషలిస్టు" లనబడు క్రైస్తవసామాజికవాదియు అంతర్జాతీయకమ్యూనిస్టుభావములకు వ్యతిరేకియు అయియుండెను.

అయినను లుతూలీగారికి కమ్యూనిస్టుభావములుండెవని తెల్లవారాయనను నిందించిరి. దీనికికారణము ఆయన, కాంగ్రెసులోని భిన్నదృక్పథముల వారిని ఏకముచేయ ప్రయత్నించుచుండుట కాంగ్రెసువారైనను కమ్యూనిస్టులైనను, తెల్లవారైనను నల్లవారైనను దేశక్షేమమునుకోరు కార్యక్రమమునకు తోడ్పడువారందరు నీయనకు మిత్రులే. అయితే కాంగ్రెసుజాతీయ దృక్పథమును విడనాడి అంతర్జాతీయ కమ్యూనిస్టుసిద్ధాంతములను స్వీకరించి మాస్కోకొరకు పనిచేయుట ప్రారంభించినచో తానా మరుక్షణముననే కాంగ్రెసును విడనాడెదనని ఆయన స్పష్టముగాచెప్పెను.

"మా ఉద్యమము క్రైస్తవధర్మముపైననే ఆధారపడబడినది. అయితే క్రైస్తవచర్చిఅధికారులు మాకు వ్యతిరేకులుగా నున్నారు. హడ్ల్‌స్టన్, రీవ్సు, బ్లాక్సాల్‌గార్లవంటి ధర్మాత్ములు మాత్రము మాకు తోడ్పడుచున్నారు" అని లుతూలీగారు చెప్పిరి.

లుతూలీగారు కాంగ్రెసు అధ్యక్షులైన కొలదికాలమునకే ఆయన జిల్లాసరిహద్దులుదాటి ఎక్కడకును పోరాదని ప్రభుత్వమువారొక నిషేధాజ్ఞను జారీచేసిరి. ఆయన తనగ్రామములోనుండియే కాంగ్రెసుసభలకు తనసందేశముల నంపసాగిరి. ఆయనను చూచుటకు వచ్చిన పెద్దమనుష్యులతో కాంగ్రెసువ్యవహారములను చర్చింపసాగిరి. ప్రభుత్వోద్యోగులు తనిఖీచేసి తీసికొనకుండా విడిచిన సమాచారములుమాత్రమే ఆయనకు చేరుచుండెను. ఈ నిషేధాజ్ఞగడువు 1954లో అంతముకాగానే లుతూలీగారు జాతీయోద్యమమునందు పాల్గొనుటకై విమానములో జోహానసుబర్గునకు పోయిరి.

ఆసమయమున ప్రభుత్వమువారు తలపెట్టిన "వెస్టరన్ ఏరియాస్ మూవ్" అనబడు విధానమును ప్రతిఘటించి అవసరమైనచో శాసనోల్లంఘ

నముచేసి మూడేండ్ల శిక్షననుభవించుటకు లుతూలీగారు సిద్ధపడిరి. దానిని గూర్చి అసమ్మతి తెలుపుటకు సోఫియాటౌనులో జరుగు నొక పెద్దసభలో నుపన్యసించుటకు లుతూలీగారు పోయి విమానముదిగగానే ఆసభలో నుపన్య సింపరాదని నిషేధించుచు ఆయనపైన నిషేధాజ్ఞ జారీచేయబడెను.

ఇట్టి పరిస్థితులలో లుతూలీగారిని 1956 డిశంబరులో అరెస్టుచేసి రాజద్రోహనేరము చేసినట్లు ఆరోపించి. 156మందితోపాటు ముద్దాయిగా చేర్చిరి. అది 1957 సంవత్సరాంతమువరకును విచారణ జరిగిన పిమ్మట విడుదలచేయబడిన 61 మందిలోను లుతూలీగారుకూడా ఉండుట ఆయన కును దేశీయులకును ఆశ్చర్యముకలిగించెను.

ఆఫ్రికాజాతీయోద్యమమును అణచివేయుటకు ప్రభుత్వమువారు దేశ ములో కాంగ్రెసుపక్షావలంబులైన నల్లవారిపైనను తెల్లవారిపైనను భారతీయు పైనను రాజద్రోహనేరమునారోపించి గొప్పకేసునుపెట్టినడుపుచు ప్రజలలో భీతినిగొల్పుటకై అనేక అత్యాచారములు గావించుచుండుటయేగాక తెల్ల నేష నలిస్టుపక్షమువారు తలపెట్టిన వర్ణభేద జాతివిభజన "అపార్తీడ్"విధానమును తీవ్రముగా అమలుజరిపి, నల్లవారిని అధోగతిలోదింపుటకు తెల్లవారిఆధి పత్యము సుస్థిరముచేయుటకు వలసిన శాసనవిధులను చేయుచు నిరంకుశులై ప్రవర్తింపసాగిరి

దేశములో జాతీయోద్యమమును పునరుత్తేజముచేసి ప్రభుత్వమువా వలంబించిన అన్యాయవిధానములను ప్రతిఘటించుటకు జరుపవలసిన కార్య క్రమమును నిర్ణయించుటకు కాంగ్రెసువారు ఆఫ్రికన్ జాతీయకాంగ్రెసు కాన్ఫరెన్సు అనుపేరుతో దేశములోని కాంగ్రెసుశాఖల ప్రతినిధులమహా సభను జోహానసుబర్గులో 1959 ఏప్రిలులో జరుపవలెనని నిశ్చయించిరి. అందులో లుతూలీగారు పాల్గొందురు. సభానంతరము ఆ సభాసందర్భమున నక్కడకువచ్చు అసంఖ్యాకులగు ప్రజలను బారులుదీర్చి నిలువబెట్టి ఒక సామూహికప్రదర్శనమును జరిపినచో దేశప్రజలలో జాతీయోద్యమమున కెంత పలుకుబడియున్నదో తెలియగలదని తలచి అట్లుచేయ నిశ్చయించిరి.

కాన్ఫరెన్సుజరుగుదినము వారమురోజులున్నదనగా పోలీసువారు వచ్చి కాన్ఫరెన్సుతరువాత సామూహికప్రదర్శనము జరుపకూడదని నిషేధిం

చిరి. అంతట కాన్ఫరెన్సువ్యవహర్తలు, ఆ సామూహిక ప్రదర్శనమును కాన్ఫరెన్సుకుముందుదినముననే జరుప నిశ్చయించిరి. పోలీసువా రిదికూడా పనికిరాదని క్రొత్తనిషేధాజ్ఞనిచ్చిరి, అందువలన నీ సామూహికప్రదర్శనము జరుగలేదు. కాన్ఫరెన్సుమాత్రము ఏప్రిలు 27వ తేదీన జయప్రదముగా జరిగినది. ఆసమావేశమునకు దేశములో అన్నివైపులనుండి జాతీయోద్యమ సంస్థలప్రతినిధులు 1300మంది వచ్చి ఉత్సాహముతో పాల్గొనిరి. దక్షిణాఫ్రికా ప్రభుత్వమువారి వర్ణభేదజాతి విభజనవిధానమునకు అసమ్మతిని చూపుటకు ఆ ప్రభుత్వమును నడుపుచున్న తెల్లవారి నేషనలిస్టుపక్షమునకు చెందిన పారిశ్రామికులు తయారుచేయువస్తువులను బహిష్కరించు ఆర్థిక బహిష్కరణోద్యమమును ప్రారంభింప నిశ్చయించిరి.

1959 జూన్ 26వ తేదీన జాతీయకాంగ్రెసుప్రెసిడెంట్ జనరలైన లుతూలీగారు దీనినిగూర్చి ఒక ప్రకటనచేయుటతో నీ బహిష్కరణోద్యమము ప్రారంభమగునట్లు తీర్మానించిరి.

దక్షిణాఫ్రికాలోని తెల్లవారివ్యవసాయక్షేత్రములందు పనిచేయు నల్లవారిని తెల్లయజమానులు పెట్టుచున్న బాధలు మితిమీరి, కొన్నియుదాహరణములు దక్షిణాఫ్రికాపత్రికలో ప్రకటింపబడినందున దీనినిగూర్చి అసమ్మతిని తెలుపుటకై ఆ కృషిక్షేత్రములలో నుత్పత్తియగు బంగాళాదుంపల నెవ్వరును కొనరాదని కాన్ఫరెన్సువారు హెచ్చరించిరి. ఈ నిర్ణయమునకు కాన్ఫరెన్సులోని సభాసదులందరు హర్షించిరి.

కృషిక్షేత్రములలో పనిచేయు నల్లవారిస్థితిగతులనుగూర్చి విచారించుట కొక నిష్పక్షపాతమైన విచారణసంఘము నేర్పాటుచేయవలెనని కాన్ఫరెన్సువారు కోరిరి.

దక్షిణాఫ్రికా లోని నల్లవారిపైన చిన్నచిన్ననేరములనుమోపి పోలీసువారు పట్టుకొని వారిని "వాలంటరీలేబరు" లేక ఐచ్ఛికకార్మికులనుపేరుతో తెల్లకర్షకుల వ్యవసాయక్షేత్రములకు పంపుచున్నారనియు, తెల్లయజమానులు వారిచేత వెట్టిచాకిరిచేయించుచు వారిని క్రూరముగా హింసించుచున్నారనియు, వారిదెబ్బలవలన కొందరు చచ్చిపోయినారనియు, మఱికొందఱిని నెలలతరబడి నిర్బంధించియుంచి వారిచేత పగలు వెట్టిచాకిరిచేయించుచు

రాత్రిళ్ళు కొట్లలో పెట్టి వారు పారిపోకుండా కావలియుంచి నిర్బంధించుచున్నారనియు, అట్టివారిలో కొందరిని విడిపించి తమవశముచేయవలసినదని వారి బందుగులు కోర్టులలో పిటిషనులుపెట్టుకున్నారనియు పత్రికలందు ప్రకటింపబడుటవలన నీ యన్యాయములు వెల్లడియైనవి.

అందువలననే జోహానసుబర్గుకాన్ఫరెన్సువారు దీనినిగూర్చి పైన చెప్పినతీర్మానముగావించిరి.

దక్షిణాఫ్రికాలోని నల్లవారు అనుమతిపత్రములులేనిది ఎక్కడ సంచరింపరాదను విధినిషేధములనుగూర్చి ప్రతిఘటించుటకొరకు నియమింపబడిన "అంటీ ప్యాస్‌కమిటీవారు తయారుచేసిన నివేదికలో ఆఫ్రికాదేశీయులైన పురుషులేగాక స్త్రీలుకూడా ఇట్టిప్యాసులు లేనిది కదలుటకువీలులేకున్నదనియు, అధికారులు దీనినిపురస్కరించుకొని వారిస్వేచ్ఛకు భంగకరమైన చర్యలు జరిగించుచున్నారనియు ఈ ప్యాసులు ఆఫ్రికావారికి చాలా నిరోధకరమగు అస్త్రములుగ నున్నవనియు వివరించిరి. జోహానసుబర్గు కాన్ఫరెన్సువారీ నివేదికలోనిఅంశములను గమనించి దానిని రికార్డుచేసిరి.

పరిమిట్లు లేక అనుమతిపత్రములు లేవనియు పన్నుచెల్లింపలేదనియు చిన్నచిన్న నేరములనుమోపి ఆఫ్రికాదేశీయుల నిట్లు పిచ్చలవిడిగా అరెస్టుచేయుచు నిర్బంధించియుంచుపద్ధతిని వెంటనే విరమింపవలెనని కాన్ఫరెన్సువారు గట్టిగా కోరిరి.

ఆఫ్రికన్ జాతీయకాంగ్రెసుకు తోడ్పడువారందరు 1959 జూన్ 26వ తేదీని "నిస్వార్థపర్వదినము"గా పరిగణింపవలెననియు, ఆ దినమున నెట్టి వస్తువులను కొనకుండగను ఏ వినోదమునకును పోవకుండగను త్యాగము చూపవలెననియు కాన్ఫరెన్సువారు దేశీయులను కోరిరి

ఇటీవల దక్షిణాఫ్రికాప్రభుత్వమువారు వర్ణభేద జాతివిభజనవిధానమును అమలుజరుపుటకు నల్లవారిపట్ల జరుపుచున్న అక్రమచర్యలను ప్రతిఘటించుటకు ఆఫ్రికన్ జాతీయకాంగ్రెసువారు తీవ్రమైన బహిష్కరణోద్యమమును ప్రారంభింపదలచిరి.

ఆఫ్రికన్ జాతీయకాంగ్రెసువారి శాసనోల్లంఘనోద్యమకార్యక్రమములు తీవ్రముగా సాగుచున్నందునను, తెల్లవారు తమ ఆధిపత్యమును

స్థాపింపదలచినట్లే తెల్లవారిని త్రోసిరాజనదలచిన నల్లవారిలోకూడా కొంద రున్నందునను ఉదారవాదులై ప్రజాప్రభుత్వము స్థాపించుటకు సుముఖులగు తెల్లవారిలో కొందరికి కాంగ్రెసుఉద్యమమునుగూర్చి కొంత అనుమానము కలిగియున్నందువలననే వా రా యుద్యమముపట్ల సానుభూతి చూపుటకు సంశ యించుచుండిరి. వర్ణభేదములేని ప్రజాప్రభుత్వము స్థాపింపబడవలెనన్నచో వర్ణ భేదవిధానము నమలుజరుపు నేషనలిస్టుపక్షమునకు వ్యతిరేకులగు తెల్ల వారు ఆఫ్రికను జాతీయోద్యమముపట్ల సానుభూతికలిగి సహకరించుట అవ వసరమని లుతూలీగా రెఱుగుదురు. ఆయన సద్గుణుడగు క్రైస్తవుడనియు నీతిపరుడనియు తెల్లవారిలో కొందరాయనను గౌరవించుచుండిరి. అందువ లన ఆయన దేశములోని తెల్లవారిలో ప్రముఖులను దర్శించి, ఆఫ్రికా జాతీయకాంగ్రెసు తలపెట్టిన బహిష్కారణోద్యమము శాసనోల్లంఘనము తెల్లవారిపైన ద్వేషబుద్ధితో చేయబూనినదికాదనియు, తెల్ల నేషనలిస్టు పక్షమువా రవలంబించిన వర్ణభేద జాతివిభజనవిధానమును ప్రతిఘటించు టకే ప్రారంభింపబడుచున్నదనియు, కాంగ్రెసులక్ష్యము జాతిభేదములేకుండా సర్వజనులకు క్షేమలాభములుకలిగించు ప్రజాప్రభుత్వవిధానస్థాపనమే యనియు నచ్చజెప్పుటకు తన యావచ్ఛక్తిని వినియోగించి పాటుపడుట ప్రారంభించిరి.

ఈపరిస్థితులలో లుతూలీగారినాయకత్వముక్రింద ఆఫ్రికన్ జాతీయ కాంగ్రెసు చాలా బలవంతమగుచున్నందున లుతూలీగారిని ఆయన అనుచ రులను రాజకీయములందు పాల్గొనకుండా నిషేధించినచో కాంగ్రెసుకార్య క్రమములనరికట్టవచ్చుననితలచి,ప్రభుత్వమువారు,లుతూలీగారు ఇప్పటినుండి 5 సంవత్సరములవరకును ఎట్టిసమావేశములకును హాజరు కాకూడదనియు, దక్షిణనేటాలులోని ఆయననివాసగృహమున్నప్రాంతమునందలి. మేజస్ట్రేటు యొక్క అధికారమండలసరిహద్దులను దాటి ఆయన ఎక్కడకును వెళ్ళ కూడదనియు ఒక నిషేధాజ్ఞను 27-5-1959 తేదీన ఆయనపైన జారీచేసిరి.

కాంగ్రెసుకార్యదర్శియైన డ్యూమా నొక్వేగారుకూడా 5 సంవత్సర ములవరకు నెట్టిసభలకును పోవకూడదని 19-6-59 తేదీన ఒక నిషేధా జను జారీచేసిరి.

లుతూలీగారిపైన చేయబడిననిషేధము దేశములో సంచలనము కలిగించెను. దక్షిణాఫ్రికాలోని వివిధజాతుల పరస్పరసంబంధముల సంస్థ అధ్యక్షుడగు డొనాల్డు మొల్టెనో గారును దక్షిణాఫ్రికా లిబరల్‌పార్టీ యొక్క నేషనల్ అధ్యక్షుడగు ఆలెన్ పేటన్‌గారును ప్రభుత్వమువారిచర్యను ఖండించిరి. ఈ నిషేధాజ్ఞయొక్క అంతరార్థము ఎట్టిన్యాయవిచారణలేకుండగనే లుతూలీగారి నైదేండ్లు నిర్బంధమున నుంచినట్లగుననిరి.

"లుతూలీగారు మంచి క్రైస్తవుడు. దేశములో వర్ణభేదము జాతిభేదము ఉండకూడదనువాడు. తెల్లవారి యాధిపత్యము కూడదనుటయేగాక నల్లవారియాధిపత్యముకూడా ఉండకూడదని గట్టిగా కోరుచున్నవాడు" అని లుతూలీగారు అన్నిజాతులక్షేమలాభములు కలిగింపగల విధానముకొరకు పాటుపడుచున్నాడనుసంగతిని ఉద్ఘాటించిరి

దక్షిణాఫ్రికాలోని ప్రముఖు లిట్లు చెప్పుటవలన రెండుసంగతులు తెలియుచున్నవి. ఆఫ్రికా జాతీయకాంగ్రెసు పలుకుబడిగల ప్రజాసంస్థ యనియు, దానిని అలక్ష్యముచేయుటకు వీలులేదని తెల్లవారు గ్రహించినా రనియు. లుతూలీగారినాయకత్వమున కాంగ్రెసు తెల్లవారివలెనే వర్ణభేద జాతివిద్వేషకరములైన సంకుచితభావమువహింపక దేశములోని అన్నిజాతులకు క్షేమలాభములు కలిగింపగల విధానమును స్థాపించుటకు కృషిచేయుచున్నదనియు, దేశములో తెల్లవారిలోని బుద్ధిమంతులు గ్రహించినారనియు అందువలన దేశములోని రాజకీయవాతావరణమునందు కొంత మార్పుకలుగుటకు వారు తోడ్పడుదురనియు దీనివలన విదితమగుచున్నది.

1960 Nobel Peace Prize
21.7.1967

# ఆఫ్రికా జాతీయోద్యమము

## పదునాలుగవ ప్రకరణము

### విప్లవాగ్ని

ఆఫ్రికాఖండములోని వివిధ పాశ్చాత్యవలసరాజ్యములందు 1959 సంవత్సరారంభమునుండి ఎక్కడనోయొకచోట నల్లవారు అసమ్మతిప్రదర్శనములు గావించుచుండుటయు, దానిని అణచుటకు తెల్లప్రభుత్వములవారు లాటీప్రయోగములు, తుపాకికాల్పులు, కారాగారశిక్షలు మొదలైన కఠిన చర్యలు తీసుకొనుచుండుటయు జరుగుచున్నది. అట్టిఅల్లరులలో గత ఆరు నెలలలో రెండువందలమంది నల్లజాతివారు ప్రాణములనుగోల్పోయిరని, చాలామంది గాయపడిరని, కారాగారమున నిర్బంధింపబడిరని, ఆయారాజ్యముల ప్రభుత్వమువారు చేసిన ప్రకటనలవలననే తెలియుచున్నది. ఈ అల్లరులకు కల్లోలమునకు నేదోయొక తాత్కాలిక నైమిత్తికకారణమును చెప్పుదురేగాని, దీనికంతకుగల మూలకారణము మాత్రము ఆ ప్రభుత్వములవారు వెల్లడింపరు.

ఆఫ్రికాలోని వివిధప్రాంతములందుగల అసంఖ్యాకులగు నల్లజాతి ప్రజలను విజాతీయులు అల్పసంఖ్యాకులునగు తెల్లవారు అణచియుంచి లాభముపొందుటకు ప్రయత్నించుచున్నందువలన నల్లవారిలో అసంతృప్తి వ్యాపించి, విప్లవాగ్నిరగుల్కొని అప్పుడప్పుడు ప్రజ్వలించుచున్నందువలననే ఆఫ్రికాలో నీ కల్లోలములు జరుగుచున్నవి. అసంతృప్తికిగల కారణములను తొలగించినగాని ఈ విప్లవాగ్ని చల్లారదు.

1959 జూన్ 18వ తేదీన దక్షిణాఫ్రికాలో నేటాలురాష్ట్రముఖ్యపట్టణమైన దర్బన్‌నగరమున కేటోమేనర్ అను నల్లవారిపేటలో కల్లోలముజరిగినదని మునిసిపాలిటీవారుచేయు బీర్‌సారాయి విక్రయమునకు పోటీగా

దొంగసారావ్యాపారముచేయు స్త్రీలు కొందరీ అల్లరి ప్రారంభించిరని, అంతట ఇతరస్త్రీలు పురుషులు చేరిరని కొన్నివేలమంది నల్లవారుచేరిన ఆ జనసమూహమును చెదరగొట్టుటకు పోలీసువారు లాటీప్రయోగముచేసిరని, అల్లరిమూకలు సోడాబుడ్లను సారాయిబుడ్లను పోలీసువారిపైన విసిరికొట్టిరని, కొన్నిమోటారుకారులు తగులబెట్టిరని, 25 ఇండ్లకు నిప్పుఅంటించిరని, పోలీసువారు తుపాకులుకాల్చగా ముగ్గురు మరణించిరని కొందరు గాయపడిరని దక్షిణాఫ్రికాపత్రికలలోను ఇంగ్లాండులోని వార్తాపత్రికలలోను 19వ తేదీన ప్రకటింపబడినది.

నిరాయుధులైననల్ల జాతిస్త్రీలు వంగియుండగా పోలీసువారు వారివీపుల పైన బేటను లను పొట్టిలాటీలతో కొట్టుచున్నదృశ్యముగల ఫొటోగ్రాపులు ఇంగ్లాండుపత్రికలలో ప్రకటింపబడెను. ఇది ఇంగ్లాండులో గొప్పసంచలనము కలిగించెను. ఈ కల్లోలకారణములను వివరములను తెలిసికొనుటకు ప్రజలకు కుతూహలముకలిగెను. గాని వివరములు ప్రకటింపబడలేదు.

కేటోమేనర్ వీధులు పగిలినసీసాల గాజుపెంకులతోను తగులబడిన కారులతోను కూలిన ఇంటిభాగములతోను ఒక యుద్ధభూమివలెనున్నదని ఆ పరిసరములలో పోలీసువారు కాపలాకాయుచున్నారని జాగ్రత్తకొరకు మూడు అర్మర్డుకారు లను ఫిరంగిబండ్లకొరకు కబురుచేసినారని ప్రకటించిరి. పోలీసువారి తుపాకిగుండ్లదెబ్బలవలన నలుగురునల్లవారు చనిపోయినారని, ఆసుపత్రిలో తుపాకిగుండుగాయములతోనున్న పదముగ్గురునల్లవారిలో నలుగురు స్త్రీ లున్నారనియు తెలిసినది.

ఈ అల్లరి జరిగిన మరునాడు డర్బన్‌లోమధ్యనున్న ఇండియన్ మార్కెట్టుదగ్గరలోనున్న ఒక బీరుసారా కొట్టుదగ్గర స్త్రీలఅసమ్మతి ప్రదర్శనము జరుగుచుండగా నల్లవారు గుంపుగాచేరిరి. వారిని చెదరగొట్టుటకు పోలీసువారు అగ్నినివారకయంత్రముయొక్క నీటిగొట్టముతో నీటినిచిమ్మిరి. దర్బనులో నల్లవారిపేటలలో అల్లరిచేయుచున్నారని 50 మంది నల్లజాతి స్త్రీలను పోలీసువారు అరెస్టుచేసిరి.

దర్బనునగరము ప్రశాంతముగనేయున్నదనియు, పరిస్థితులు అదుపులోనేయున్నవనియు, ముందు అల్లరులు జరుగకుండా తగిన బందోబస్తులు

చేయబడుచున్నవనియు దక్షిణాఫ్రికా న్యాయశాఖామంత్రి స్వార్టుగారు కేపుట వునుశాసనసభలో 19వ తేదీన చెప్పిరి. శాంతిభద్రతలను అమలుజరుపుటకు కఠినచర్యలను తీసికొందుమనిరి. నిన్నటిఅల్లరులలో 25 భవనములకు నిప్పు అంటించిరని, పోలీసువారు తుపాకీలు కాల్చవలసివచ్చినదని, ముగ్గురు ఆఫ్రికావారిని కాల్చిచంపిరని,ఎంతమందిగాయపడినది చెప్పుటకువీలులేదనిరి. లూటీచేసిననేరమునకు నలుగురు నల్లవారిని అరెస్టుచేసినారనిరి. ఈ అల్లరులకు కారణము మునిసిపాలిటీవారు బీరు సారాయి విక్రయించుటను ప్రతిఘటించుచు అనుమతిలేకుండా సారావిక్రయముచేయు నల్లజాతిస్త్రీలేయని పోలీసువారు చెప్పుచున్నారని మంత్రిగా రనిరి.

జూన్ 20వతేదీన డర్బనుకు 10మైళ్ళదూరముననున్న లామాంటువిల్లి అను నల్లవారిగ్రామములో బీరుసారాయిఅంగడిదగ్గర అల్లరిజరిగెను. మునిసిపాలిటీవారి సారావిక్రయమునకు వ్యతిరేకులగు నల్లజాతిస్త్రీలు అక్కడ ఆందోళనము ప్రారంభించిరని ఇతరస్త్రీలను తమతోచేరవలసినదని నిర్బంధించిరని చెప్పుచు శాంతినిస్థాపించుటకని ఎనుబదిమంది పోలీసువా రక్కడకు పరుగెత్తుకొనివెళ్ళిరి. ఒక బాంటూపాఠశాలకు ఎవరో నిప్పంటించుటకు ప్రయత్నించగా అక్కడి కావలివాడు కేకలువేసినందున ఆ ప్రయత్నము విఫలమైనదని ప్రకటించిరి.

ఫ్రెంచికాంగోరిపబ్లికు రాజధాని బ్రజ్జవిల్లిలో జరిగిన ఎన్నికలందు 14-6-59వ తేదీన అబేపుల్ బర్టు యూవోలౌగారు విజయమునొందగానే ఆయనపక్షమువారికిని ఆయనకువ్యతిరేకపక్షమువారికినిమధ్య కొట్లాటలు ప్రారంభమై మూడుదినములు అల్లరులుసాగినవని, ఆ కొట్లాటలో 150మందికి దెబ్బలుతగిలినవని, ముగ్గురు చనిపోయినారని ప్రకటించిరి. దీని ఫలితముగా సూర్యాస్తమయమునుండి సూర్యోదయమువరకును ఎవ్వరును వీధులలో తిరుగరాదను నిషేధాజ్ఞ జారీచేయబడినది.

ఎన్నికలలో అబెయూవోలౌగారు జయముపొందినట్లు తెలియగానే అల్లరిప్రారంభమైనదని ఆఫ్రికావారి హక్కులరక్షణకొరకు స్థాపింపబడిన ప్రజాప్రభుత్వసంఘము అనుపేరుగల అబేపుల్ బర్టుయూవోలౌగారిపక్షమువారికిని పన్నులసమ్మెనుచేసి ఎన్నికలనుబహిష్కరించిన మట్సుయానిస్టు

అను నొక మతసంఘీయులపక్షమువారికిని జరిగిన సంఘర్షమువలన బ్రజ్జ విల్లీలో అల్లరులు ప్రారంభమై, ఇండ్లను దోచుకొనుట తగులబెట్టుట మొద లైన దౌర్జన్యములు జరిగినవని, మూడుదినము లిట్లు అల్లరులుసాగెనని 150 మంది గాయపడిరని ముగ్గురు చనిపోయినారని అధికారప్రకటనము చేయ బడినది. మట్సుయానిస్టులు శాసనోల్లంఘనముచేసినందువలననే దొమ్మినేర ములు జరిగినవని ప్రధానమంత్రి అబేయూవోతౌగారు 18వ తేదీరాత్రి ప్రక టించిరి.

ఇట్లు దక్షిణాఫ్రికాలోగాని ఫ్రెంచికాంగోరిపబ్లికులోగాని బెల్జియన్ కాంగోలోగాని కెన్యాలోగాని రొడీశియాలోగాని మరియెక్కడనైనగాని జరి గిన కల్లోలములనుగూర్చి అక్కడిమంత్రులు అధికారులు పైకికనబడిన నైమిత్తికకారణములనే చెప్పుచుందురుగాని, అసలు దీనికంతకుగల మూల కారణమునుచెప్పరు. గతజనవరినెలలో బెల్జియన్ కాంగోరాజధాని లియోపాల్టు విల్లీలో జరిగిన కల్లోలమునుగూర్చి విచారించుటకు నియమింపబడిన పార్ల మెంటరీకమిషన్‌వారు ఆఫ్రికాలోని కల్లోలములు జరుగుటకుగల నిజమైన కారణమును వివరించియున్నారు. నల్లవారిని చూచిన తెల్లవారికి అసహ్య మనియు, ఈ రెండుజాతులవారియొక్క జీవనసౌఖ్యప్రమాణములందును చాలా తారతమ్యమున్నదనియు, అందువలన నల్లవారిమనస్సులలో అసం తృప్తి వృద్ధియైనదని, ప్రతివిషయమునను తమకు అన్యాయము జరుగుచున్న దని రోషావేశపరులై యున్నారనియు ఈ విచారణసంఘమువారు దీనికంత కునుగల మూలకారణమును వెల్లడించియున్నారు.

"ఈ అల్లరులుజరుగుటకు నైమిత్తికకారణములేవైనను ఉన్నను, లక్షలకొలది నల్లజాతిప్రజలకును కొన్నివేలమంది తెల్లజాతివారికినిమధ్యగల రాజకీయార్థికసాంఘికసంబంధములలోని తారతమ్యములే వానికి ప్రధానకార ణములనుటకు సందేహములేదు, గత డిశంబరులో స్వతంత్రఘనరాజ్యమున జరిగిన అఖిల ఆఫ్రికాప్రజల విమోచనమహాసభకార్యక్రమముకూడా నల్ల వారిలో నొకవిధమైన సంచలనము కలిగించినదనుటకు సదేహములేదు. నల్లజాతిస్త్రీలుకూడా ఎక్కడికిపోయినను గుఱుతుపత్రములను తీసికొని వెళ్ళవలెనని దక్షిణాఫ్రికాప్రభుత్వమువారు చేసిన నిబంధనలకు తమఅసమ్మ

తిని తెలుపుటకు ఆఫ్రికాదేశీయస్త్రీలు గత అక్టోబరునెలనుండి "ప్రొటెస్టు మార్చెస్" అను పేరుతో దళములుగా బయలుదేరిపోవుచు అనుమతిప్రదర్శనములు జరుపుచున్నారనియు, అట్టిపరిదర్శనమును పోలీసువారు ఆపుచేయుటకు ప్రయత్నించినందువల్లనే జూన్18వతేదీన కేటోమేనర్ దగ్గర అల్లరులు జరిగినవనియు, కొంతమంది నల్లజాతిపురుషులుకూడా తరువాత నీ స్త్రీలగుంపులో వచ్చిచేరిరనుమాట నిజమేయనియు, డర్బన్‌నగరపాలక సంఘాధ్యక్షులగు డబ్లియు. ఈ. షాగారు ఆమరునాడే ఆసంఘమువారికి చెప్పిరి. అందువలన దీనికంతకుమూలకారణమైన వర్ణభేద జాతిద్వేషవిధానములు పోయి, సర్వజనహితైక ప్రజాప్రభుత్వవిధానము స్థాపింపబడువరకు నీ విప్లవాగ్ని చల్లారదనుట నిశ్చయము.

జూన్ 22వ తేదీననే డర్బన్‌నగరమునకు 15మైళ్ళదూరమునగల క్లేర్‌మాంట్ అను నల్లవారిగూడెముదగ్గర పదివేలమంది నల్లజాతివారు బస్సులనెక్కుటకు నిరాకరించి సత్యాగ్రహముచేసిరి. 23వతేదీన 250మంది ఆఫ్రికాస్త్రీలు డర్బన్‌నగరమధ్యభాగమున నొక అసమ్మతి ప్రదర్శనముగావించిరి. అగ్నినివారకదళమువారును పోలీసువారు నక్కడ హాజరుగనే యుండిరి.

# పరిశిష్టము

నేషనలిస్టుపక్షమువారు తలపెట్టిన వర్ణభేద జాతివిభజనవిధానమును అమలుజరుపుటలో వారవలంబించినపద్ధతులు, చేయతలపెట్టిన శాసనవిధులును, ఐరోపా అమెరికాదేశములలోనేగాక నాగరిక ప్రపంచములోని అన్ని రాజ్యములలోని రాజ్యనీతిజ్ఞులకును ప్రజాప్రభుత్వమునందు విశ్వాసముగల తెల్లవారందరికిని అసహ్యముకలిగించినవి. దీనినిగూర్చి చాలామంది గట్టిగా విమర్శించియున్నారు. నేషనలిస్టుపక్షములోని కొందరుసభ్యులకుకూడా ఇవి అన్యాయములని తోచినను రాజకీయపక్షక్రమశిక్షణయొక్క కట్టుబాటులకు లోబడి వారు తమయభిప్రాయములను వెల్లడింపలేదు.

ఇటీవల జాప్ బెస్సన్‌గారను నేషనలిస్టు సభ్యుడు బాంటూస్వపరిపాలనబిల్లు రెండవసారి చర్చకువచ్చినప్పుడు 19-5-59 తేదీన తన మనస్సులోనున్న సంగతిని స్పష్టముగా వెల్లడించి, అసెంబ్లీసభవారందరికి ఆశ్చర్యముకలిగించినాడు.

ఈ బిల్లును అతడు ప్రతిఘటించుచు "ఈ చిత్తుచట్టము తలపెట్టినట్లు ఆఫ్రికావారందరికిని ఎన్నికహక్కులుతీసివేయుటవలన ఇదివరకే మనకు కలిగిన అపకీర్తి ద్విగుణీకృతముకాగలదు." అని ఆయన చెప్పి, అంతర్జాతీయవ్యవహారములందు ప్రాముఖ్యతగల నైఋతిఆఫ్రికాప్రతినిధిగా తాను మాటలాడుచున్నాననియు, ఒకపక్షముయొక్కరాజకీయహక్కులను పూర్తిగా తీసివేయుటవలన పార్లమెంటుయొక్క స్థిరత్వమునకే ముప్పువాటిల్లగలదని చెప్పెను. ఈబిల్లును రెండవసారి చదువుటకు తన కభ్యంతరములేదనియు,ఈ నిబంధనకుమాత్రము తా నంగీకరింపననియు అతడనెను. తనను నేషనలిస్టుపక్షమునుండి తొలగింపదలచినచో తన నియోజకవర్గముతో సంప్రదించిన పిమ్మట కర్తవ్యమునాలోచించెదననెను.నేషనలిస్టుపక్షములోనివాడే వారి అపార్తీడ్ విధానమును విమర్శించుట ఇదివరకు జరుగలేదు, అందరు నాశ్చర్యపడిరి.

బ్రిటీషు కామన్వెల్తులో భాగముగనున్న రొడీశియా న్యాసాలాండు ఫెడరేషనుయొక్క విస్తీర్ణము 4,87,640 చదరపుమైళ్ళు. జనసంఖ్య 72,60,000 (1956).

ఇందులో నీ క్రిందిరాజ్యములు చేరియున్నవి :

దక్షిణ రొడీశియా: ( స్వపరిపాలనముగల రాజ్యము ) విస్తీర్ణము 1,50,333 చ. మైళ్ళు. జనసంఖ్య 24,80,000.

ఉత్తర రొడీశియా (ప్రొటెక్టరేటు) విస్తీర్ణము 2,88,130. చ.మై. జనసంఖ్య 21,80,000.

న్యాసాలాండు (ప్రొటెక్టరేటు) విస్తీర్ణము 49,177 చ. మైళ్ళు. జనసంఖ్య 26,00,000.

## ఇంగ్లాండుక్రింది డిపెండెన్సీలు

### తూర్పు మధ్య ఆఫ్రికా

సోమాలిలాండు రక్షితరాజ్యము: విస్తీర్ణము 68,000 చ. మైళ్ళు. జనసంఖ్య 6,40,000. ముఖ్యపట్టణము హర్జెయిస.

కెన్యా: విస్తీర్ణము 2,24,960 చ మైళ్ళు, జనసంఖ్య 61,50,000, ముఖ్యపట్టణము నైరోబి.

ఉగండా: విస్తీర్ణము 93,98[illegible] చ. మైళ్ళు, జనసంఖ్య 55,93,000. ముఖ్యపట్టణము ఎంటెబె.

టంగనీయిక: విస్తీర్ణము 3,62,688 చ. మైళ్ళు, జనసంఖ్య 55,93,000, ముఖ్యపట్టణము డారెస్‌సలాం

జాంజిబారు (ఫ్రెంచి) విస్తీర్ణము 1,020 చ. మైళ్ళు, జనసంఖ్య 2,77,000, ముఖ్యపట్టణము జాంజిబారు.

ఉత్తర రొడీశియా: విస్తీర్ణము 2,88,130 చ. మైళ్ళు. జనసంఖ్య 21,80,000, ముఖ్యపట్టణము లుసక.

న్యాసాలాండ్: విస్తీర్ణము 49,177చ.మైళ్ళు. జనసంఖ్య 26,00,000 ముఖ్యపట్టణము జంబ.

### పశ్చిమ ఆఫ్రికా

గంబియ: విస్తీర్ణము 4,003 చ.మైళ్ళు. జనసంఖ్య3,00.00, ముఖ్య పట్టణము బాతర్‌స్టు.

నైజీరియా ఫెడరేషన్ (ధర్మకర్తృత్వ కెమెరూన్సుసహా) విస్తీర్ణము 3,73,260 చ.మైళ్ళు. జనసంఖ్య 3,33,63,000, ముఖ్యపట్టణము లాగోస్.

ఉత్తరప్రాంతము (ఉత్తర కెమెరూన్సుసహా) విస్తీర్ణము 2,81,782 చ. మైళ్ళు, జనసంఖ్య 18,28,000, ముఖ్యపట్టణము కడున.

తూర్పుప్రాంతము విస్తీర్ణము 29,484 చ. మై. జనసంఖ్య 76,40,000, ముఖ్యపట్టణము ఎనుగు.

లాగోస్ ఫెడర్ (ముఖ్యపట్టణము) విస్తీర్ణం 27 చ. మైళ్ళు. జనసంఖ్య 3,12,000.

దక్షిణ కెమెరూన్సు: విస్తీర్ణం 16,581 చ. మైళ్ళు. జనసంఖ్య 7,96,000, ముఖ్యపట్టణము బ్యుయియ.

సీరాలియోన్: విస్తీర్ణము: 27,925 చ. మైళ్ళు, జనసంఖ్య 20,00,000, ముఖ్యపట్టణము ఫ్రీటవున్.

## ఫ్రెంచి పశ్చిమ ఆఫ్రికారాజ్యము

ఇందులో నీక్రింది ఏడుదేశములు చేరియున్నవి. దీని విస్తీర్ణము 18,15,768 చదరపుమైళ్ళు. జనసంఖ్య 1,59,96,000. ముఖ్యపట్టణము డాకర్.

1. ఫ్రెంచిగినీ: విస్తీర్ణము 89,436 చ. మైళ్ళు. ముఖ్యపట్టణము కొనక్రి.

2. ఐవరీకోస్టు విస్తీర్ణము 1,16,558 చ. మైళ్ళు. ముఖ్యపట్టణము అబిడ్ జాన్.

3. డాహోమె: విస్తీర్ణము 43,232 చ. మైళ్ళు. ముఖ్యపట్టణము పోర్టోనోవో.

4. ఫ్రెంచిసూడాను. విస్తీర్ణము 5,90,966 చ. మైళ్ళు, ముఖ్య పట్టణము బమాకో.

5. మౌరిటేనియా: విస్తీర్ణము 3,23,310 చ. మైళ్ళు.

6. నైగరు: విస్తీర్ణము 4,99,410 చ. మైళ్ళు.

7. అప్పర్ వోల్టా: విస్తీర్ణము 1,09,940చ. మైళ్ళు, ముఖ్యపట్టణము ఒగాడౌగౌ.